# శ్రీమద్రామాయణ కల్పవృక్షము

## యుద్ధకాండము

విశ్వనాథ సత్యనారాయణ

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము

## యుద్ధకాండము

### సంశయ ఖండము

క. శ్రీకనకకాంతి పత్రా!
ప్రాకటరాజత శుభాంగ! బ్రహ్మపదార్థ
వ్యాకృతభూతతనూ! హం
సాకారా! పరమహంస! హర! విశ్వేశా!

శా. యాదోజంతుచయంబు భీతిమెయిఁ జుట్టాగోడ నిర్మించెనా!
తే దాసాకారము దేవతావితతి రాలేదంట కీ గోడపై
నేదో పూర్వయుగాల సంస్కృతి భయం బీ దైత్యు లోగుండెలోఁ
బాదుల్ కట్టుక కూయుచున్న యది యీ ప్రాకారరూపంబునన్. 1

శా. గోలాంగూలబలంబు దూఁకఁగలదున్ గోటం దువాళించుచున్
హేలాలంఘన మాచరింపఁగలదున్ హేరాళమై వార్నిధిన్
రాతే రా యుగ మన్నచోఁ గపిభుజాప్రస్తంబు రావచ్చునున్
జాలన్ గారణకార్యయుగ్మము యదృచ్ఛాబంధ సంబంధమై. 2

ఉ. తోఁకలమీద నిల్చి యతిదూరము చూచుచు నున్నయట్టి ద
ర్వీకరరాజిచేత నతిభీకరమైన యనంతకోటి వ
ల్మీకములట్లు దైత్యుని యళిందమునం గనిపించె వానరా
నీకిని దా వసాంత ధరణీగత నిస్తురుకృత్తధారుణిన్. 3

ఉ. లే వరదంబులుం గరులు లేవు మహాయుధరాజి లేదు సే
నావలి యెత్తి వచ్చినది హాస్యరసాంబుధిఫేనపంక్తినా
నానల దైత్యు లీ పృతన నారసి భీతి వహించు హేతువుం
గానలె నింత హాస్యరసకంఠియు రౌద్రరసాబ్ధియై చనెన్. 4

సీ. పృతనాసమాచారమతి రావణునిచేత
శుకసారణులు రాక్షసులు నొకిద్ద
అంపింపఁబడి వానరానీకినిన్ వాన
రాకారములఁ నాడు చరయుచుంటఁ
వడి విభీషణుఁడు గుర్తిడి రాఘవ పదాబ్జ
పీఠమంమున సమర్పింపఁబడిన
మందహాసుఁడు రామచంద్రిభుం. డిద్దఱి
వంచితాత్ముల విడిపించినంత

వసుగుదెంచి రాక్షసరాజు సవసరంబు
వేచి కనిపించికొని ప్రశ్నవీక్షణంబు
పొలుచు దైత్యేశు ముందర మోకరించి
యాడి రీగతి వారు బద్ధాంజలు లయి. 5

క. ఒకప్రూట పట్టలే దది
సకల మహాదితిజలోక సమ్రాట్టా! వా
రికి మమ్ము గుర్తుపట్టుట,
యకటా! జల్లింపఁబడితి మసురులుగాఁగన్ 6

చ. అది యొక సేనకాదు సకలావని భూధరవార్ధి వానరుల్
గుములుగవచ్చి యేర్పడిన కూటమి, వేరికి వారె వానరుల్
పది పదివందలా వివిధ వానరజాతులు, వారిలక్షణా
లొదుగవు పేరియందు నెదియో యొక జాతిని బోలిపోవఁగన్ 7

సీ. ఆసేనలోపల నా యనీకినిపతి
వా రెవ్వరనఁ జమూపతులు పృతన
దముదారులకుఁ జూవ దముదారులును వాహి
నీనాథులకును గాన్పించి రంత
గణనాథు లందు లెక్కకు రాకపోయిన
గుల్మనాథుల కంటికొసల పదును
సేనాముఖేశులలోనఁ దొందరఁ జేసి
పత్తీశులును వారు వారు తొలఁగ

బట్టబయలైన మమ్మును బట్టికొంచుఁ
జెలఁగి మోకాళ్ళపోట్లు మోచేతిపోట్లు
గాగఁ గడబట్టు ప్రాణాలు కలుగు మమ్మ
శ్రీవిభీషణు లచట రక్షించినారు. 8

మఱి పరిదీనమూర్తి యొక మానవుముందర మమ్ముఁజూపి యి
ద్దఱ మము, వీరలిద్దఱును దైత్యకులేశ్వరు గూఢచారు లీ
యిరువుర కొక్కశిక్ష విధియింపుమునా నహి తోఁక నిల్చి సే
త్రెఱఁ గనులందుఁ బొల్చె నొక ఠీవియుఁ గన్పొచు భోగిభోగమై. 9

చ. గజగజలాడిపోయితిమి కన్గొని యాతని నంతలోన నీ
రజరిపునోలెఁ జల్లపడి రాముఁడు మమ్మును గొంచుఁబోయి చే
రజములులేక యెల్ల వివరంబులు వీరికిఁ జెప్పడంచు న
క్కజముగ దైత్యరా జెఱుఁగుగా వుత మాతనిభావి యంచనెన్. 10

ఆ. అతఁడు యుద్ధవేళ నతి భీకరుండును
హానుమ వట్టియప్ప డమితసాధు
వొక్కఁ డొక్క డగ్గి పుక్కిలించుచునుండి
రందుఁ గపులు వేలు వందలగును. 11

వ. అచట యోగ్యవేళాతీవ్రు లిద్దఱే, హనుమయు శ్రీరాముండును, తక్కిన యందఱు నిత్యప్రళయమూర్తు లని సేనాసర్వవార్త లాడి పతత్పతఙ్గుండైన దైత్యనాయకునినుండి వెనుకవెనుకగా నడచి వారు నిర్గమించిన 12

క. అది రవ్వయొ మాణిక్యమొ
మొదలిడి చిఱుబింబమట్లు ఫుల్లప్రాచీ
మృదుఫాలలంబి తరణియుఁ
బొదలించిన యెఱ్ఱపసుఁగు పూసెఁగడలికిఁ 13

సీ. రవ్వల వెలుఁగులు రావణుం డావేళ
ప్రాతస్సమాయాతపవనవీచి
కాసమీహాను సౌధకర్ణికోపరిభాగ
సింహముఖాసనాసీనుఁడైన
మాణిక్యకాంతులు తామ్రనుతాపతి కోట్ట
బహిరవనీధరోపరితలాన
సౌధకర్ణికయెత్తు సమమైనయెడ సమ
గ్రీవుండు నాదృతగ్రాహుఁడైన

అసురయురమున సుగ్రీవు నాననమున
మిలమిలల్ ధగధగలుగా మెఱసినంత
నొకరొకరు చూచుకొనిరి పస్యుత్సుకులయి
యొక రొకరివంక జరఠప్రత్యూషమతులు. 14

ఉ. రావణుఁ జూచినంతఁ గపిరాజున కాతని దుష్టచేష్టితం
బావిరిపొంగఁ గ్రాఁగు జలమట్లుగఁ జిత్తము పొంగులెత్తి క్రో
ధావిలదృష్టి నా దనుజు నారయుచుండియె రామునితోడ న
న్నా! విగతాసువున్ దనుజు నాతనిఁ జూచితె యంచు నాడుచుఁ 15

చ. అనుకొనకుండ దూఁకి చనె నంబరమార్గమునన్ సురారి యుం
డిన భవనాగ్రదేశ మకనింబలె నాతనిముందు వ్రాలి గో
ళ్ళను మొగముల్ విదల్చుచుఁ దలల్ పది త్రొమ్ముడుఁబాడలాగి ఱొ
మ్ము నుదరఁదాఁచె హారగతముల్ రవకాంతులు బీరువోవఁగన్ 16

చ. అరయ హఠాత్సమాగతము నందున నివ్వెఱపొందు నొక్క డ
బ్బురమును బొందఁ డొక్కరుఁడు, పూర్ణమహస్కుఁడు దైవతారి ని
వ్వెఱ తొలిచార జాఱఁ గపివీరుని వింశతి ఘోరబాహుపం
జరమున సింహశాబకము చాడ్పునఁ గ్రిక్కిఱియించె దట్టుఁడై. 17

చ. అది యొక చిత్రపూ కెలస మామృగరాజు సపంజరంబుగాఁ
గదలి వియత్పదంబుచనెఁ గ్రమ్మఱి తద్భవనోపరిప్రపా
తదశను బట్టుపీడి కపిదానవు లిద్దఱు బాహుయుద్ధసం
పద మెఱయంగ నయ్యసుర మై వ్రణముల్ కపిమై మహోశనుల్. 18

క. తుద కొక్క తన్ను దన్నుచుఁ
గదలి కపీశ్వరుఁడు వచ్చె గగనాధ్వమునన్
సొదఁ గణకణలాడెన యి
ర్వదికనుల ననింధనాగ్నివలె రావణుఁడున్ 19

గీ. ఎక్కువెట్టిన ధనువున నెక్కుడించి
రాఘవుం డనంగీకృతిప్రమదసూతృ్మ
భావములు తోఁప సుగ్రీవుఁ బలికె నిట్లు
ఇంక నీ కిట్టి సాహస మెపుడు వలదు. 20

క. మన మైత్రిభావమున కీ
పనివలెనొ? ప్లవంగరాజ్యపతి యీగతి చే
యనురాద! యనినఁ గపిపతి
కనులందునఁ జిన్నతనముగా నిట్లనియెన్. 21

చ. దురితపుఁ గొండయైన దనుజు తోఁచినయంతట నీయుపస్సునం
దుమువడిఁ బొంగులై పొడుచుచుండిన హృద్గత తీవ్రకోపని
ర్ఝరమును నేను బట్టికొనఁ జాలకపోయితినంచు నాఁడ, సం
బరమున సూర్యుఁడుం బయికిఁబైకి వియత్తున నేగె సంతటన్. 22

వ. అంత మహాయుద్ధంబులోని సముద్రంబునకును సముద్రంబులోని
మహాయుద్ధంబునకును నడుమనున్న శ్రీరామచంద్రమూర్తి పశ్చిమ
సంధ్యోపాసనాంతమున నొక్క శిలాతలంబున నాసీనుండై సంజ
యొజ్జదనమ్ములు చివళ్ళ నదిమిన సాగరవీచీకాంతిపరిణతరాజహంస
కుడికంటిమలపుల మెలపులుగాఁ జూచి, 23

చ. ఎదకును గంటివెల్గునకు నించిన మూరితి గొన్నయంచకున్
బదనగు జానకీవిరహవహ్నికి నెఱ్ఱదనాలపంజకున్
సుదతికి సీత కేమి యగు చుట్టరికంబు లెసంగునో మదిం
గుదిగొని రామచంద్రుఁడును గోరిక తా నడుగన్ మరాళమున్. 24

చ. కడపటిసంజయెఱ్ఱనలు క్రమ్మిన క్రుమ్మిన వింతవెల్గువై
కడలికరళ్ళలోన నెసకంబున నేటికి నీదుచున్నదో
విడివడి హంస మెల్ల రఘువీరుని కన్గొనలం దువాళియై
బడలి శయించు నవ్విరహభావము మేల్కొలుపన్ సమర్థమై 25

మ. బరువౌ కాలములోని యే తెలివి శోభాపూర్ణమై పశ్చిమాం
బరసంధ్యాశబలాభిరామమయి శ్యామస్వర్ణ పీతాంశు సం
భరితాంభోమహనీయరాశివయి హేమశ్రీ గరుచ్ఛ్రీ ప్రభా
హార హంసాకృతి గోచరించుటకు నేత్రాపాంగలీనాంగమై. 26

చ. ముడిచిన తెక్కలై నిలువఁ బోలిక శంఖముతోడ సూటిగాఁ
గడలిపయిం బ్రయాణమును గట్టిన ముమ్మొనవాలు పీచిన

ట్లాడుపునఁ బల్లటీల్గొన మహోదధి కాహ్మాయిఘల్ విదల్చిన
ట్లాడఘుఁడు సర్వహంసలకు నొప్పె దృగంచలవిద్యుదాకృతిన్. 27

శా. ముక్కుం జెక్కులతోడి తెల్లనగు నిప్పంబోలెనా హంస మి
న్నెక్కున్ గంటికి సూటిగాఁదిరుగు వార్ధింద్రాంబువీచీతతిం
జుక్కల్ చుక్కలుగాఁగఁ గాల విదలించున్ మూఁదలించున్ దిశా
ప్రక్కాంతుల్ విలసజ్జపాంశుక గరుచ్ఛాయార్ద్రి చంద్రాంశునై. 28

శా. లంకాపట్టణ దీర్ఘికావిహరణాలంకారమో! హంస, మీ
నాంకప్రాణహరానలోజ్జ్వల శిఖాహంకార సౌందర్య రే
ఖాంకంబై కనిపించుచున్నయది యాహా! మిశ్రభావంబుగా
సంకేతింపగ వచ్చునో రఘుకులస్వచ్ఛేందు దేవేరికిన్. 29

వ. రఘుకులరాజహంసమగు శ్రీరామచంద్రున కీ కనిపించు రాజ
హంసము తన వియోగభావనాజనితవాంఛాస్వరూపమో, తన
కన్ను చెదరుటయో, యథార్థమైన హంసయో, బహిరాకృతి
కలదియో, యేమియుఁ దెలియక తెలియమియుం దాక విలక్షణాను
భవలాలస కలిమి నిట్లనియె. 30

శా. స్వామీ! హంసకులావతంసమ! ధరాజాతావియోగవ్యథన్
నామై యెంత కృశించెనో కనవె, సంధ్యాకాల నాట్యక్రియా
సామీచీన్య మనోజ్ఞ పాదయుగళీ సంలగ్న హేమచ్ఛవీ!
ప్రేమన్ నిల్చియొకింత నా మనవి దారింబూని పాలింపవే! 31

గీ. కపివృషాకపి భూకన్యకాప్రవృత్తి
తెలిసికొనివచ్చి కడచెను నెలకుఁబైని
నయ్యశోకవనంబున యందుఁ గలదొ
శోకవనమునఁ జొచ్చెనో సుదతి యెఱుఁగ. 32

మ. అసుహృత్పద్మదళాంతవర్తి విని హంసాధ్యక్షి! తచ్ఛుభ్ర మా
నససంచారివి, పోవఁగాఁదగవె మింటం గంటఁ గన్నీరు వె
క్కసమై జాఱుచు నుండియుండు జనకక్ష్మాజాత, నే నింత వా
ర్ధి సతింగూఱిచి దాటివచ్చుటయుగాఁ దెల్పంగదే చానకున్. 33

గీ. పొడుచుకొనివచ్చు బాణము పోల్కిఁ గాఁగ
ముక్కుదీపింప మిక్కిలి యెక్కువెట్టు
శార్ఙ్గమొ పినాకమో నాఁగఁ జాచినట్టి
ఱెక్కదోయిగ మింటఁ జరింపఁబోవె. 34

ఉ. తామర లన్న నీవలపుదారికి దారియుఁదెన్ను లేదు పొం
దామర యామెమోము తెలితామర యాయమకన్నుదోయి చెం
దామర యామెకేలుగవ తామరలన్ మఱలన్ జయించుఁ గాం
తామరవాహినీ వికచతామరసంబులు నామె కన్‌జిగుల్. 35

ఉ. వి ప్పొసలారు మోముపయి వేలుపువాహిని యెఱ్ఱగొండుబో
ట్టొప్పగ స్నానమున్ సలిపి యొడ్డున నట్టిటు తిర్గుచున్ జరీ
కుప్పడమంచు ధోవతిని గొంగులువారఁగ నారఁబట్టు నే
గొప్పద్విజుండ నొక్కయిటకుం జనుదెంచితి మత్సఖుండనై. 36

చ. తనయొఱడాలుచేత జలదంబులయంచులు ముద్రితంబులై
చన నిరువైపులందు మలుసంజయినుం డరుణాభిరామమో
హాన వదనుండుగాఁ జనినయట్టులు వచ్చితి వెందునుండి నా
జనకజ శోక్కవార్త హరుసంబు ఘటిల్లగఁ జెప్పిపెట్టవే. 37

ఉ. బంగరునీరువోలిన కృపారసమున్ బయినుండి క్రిందికిం
బొంగులువారి జారివడిపోవు తెఱంగున ఱెక్కలంచులం
దుంగరముల్ ఘటించికొనియున్నది యాభవదీయరూప మా
త్రిం గొని యున్నవారి నరుదెండని పిల్చుచు నున్న వైఖరిన్. 38

శా. కార్యార్థిం గలిపించి చెప్పుడు ననంగాఁ గాదు మున్నెప్పుడో
భార్యాయుక్తనుగాఁగ నిన్ బరిచరింపం గన్నయట్లొప్పెడున్
మర్యాదాప్రియమైన నా యెడఁద హంసా! యెప్పుడేనీ హిమా
హార్యప్రాంతమ్మునుండి యేగుచు నయోధ్యాప్రాంతమందాగితే. 39

చ. ఎఱ మలుసంజవెల్గు లవి యెక్కిన మై సగమైన నీవ యి
ద్దఱివలెఁగానిపింతువుగదా యఱమైఁ బ్రియురాలు క్రుమ్మనాస్
గరితకు వార్త పుచ్చుటకుఁగాని భవాదృశుఁగంటయున్న న
బ్బురమునకంటె నబ్బురము పొందిన సంగతి రాజహంసమా! 40

మ. నలనొప్పన్ దుదిఱెక్కమల్పులుగ నీపై నుండి యేతెంచుగా
లులు కర్పూరపరిమళాంబువులలో లోలంబులై వచ్చిన
ట్టులు మైతాఁకెడు వేళ గుప్పు మను, గండూషించితో యట్టి నీ
ళ్ళులు లేదా యభిషేక మార్చితివొ స్వర్లోకాగుడుస్రోతసిన్ 41

క. ఓయయ్య హంసరాజా!
డాయఁగవచ్చిన వశిష్ఠుఁడవు కావుగదా!
నా యెదలో నొకమధురిమ
యాయన డగ్గరిన యప్పు డైనట్లయ్యెన్ 42

శా. నా కాఠిన్యము నామె మెత్తనయు నో నాళీకనాళాద! యీ
నీకున్ నీవు వశిష్ఠుఁడైన యెడలన్ నిక్కం బెఱుంగంగనౌ
నే కాదా, జలరాశి సేనఁగొని నా యీ రాళ వాక్రువ్వనౌ
లేకున్నన్ సతి యేమియౌనో మఱి రాలేదంచు నీపాటికిన్

ఉ. ఇమ్మగఁ జూడలేదు నిను నెప్పుడు వే దిగినావొ యంతరి
క్షమ్ముననుండిచూచు నిముసంబునఁ దోచితి బొండుమల్లిపు
వ్వమ్మన నొక్కఁడే తొలుతజూచిన ఱెక్కవిదల్చి తంతలో
ముమ్మరమాచుఁ దెల్లవిసెపూ విడఁజారిన రేకవోలికన్. 44

చ. నగసుతవంటి జానకికి నాథుఁడనయ్యును భూమిజాత హాం
సగమనయంచు నేను ననఁజాలను నిన్నును జూచినంత హాం
సగమనయాత్మలక్షణ వశంవదవృత్తి నటంచు నెంచెదన్
నొగములకంఁజిగుల్ గలుగు తొయ్యలి నాదగు వార్త చెప్పవే! 45

ఉ. ఈ జగదేకమోహనము హేశ్వరసుందరరూప మెంత యు
త్తేజితభావనాపటిమఁ దెచ్చితి వబ్బురమయ్యె నేత్రనీ
రాజనభూత మైనది. ధరాసుతకంటికి శాంతి తేవె! యు
ద్వేజితమయ్యెఁ దన్నయనదీప్తి మృషామృగదర్శనంబుచే. 46

శా. నిన్నే తాదృశ శుభ్రహాంసము గనన్ నీ రేజపత్రాక్షి సం
పన్నంబుల్ గుణరాశి చెప్పటకునున్ వా క్కాడకుండెన్ సుధా
స్విన్నాకాయని నిన్నుఁగాంచి ప్రమద శ్రీ పొందుటో! యీ సమా
సన్నంబై చను దుఃఖసంగతిఁ బ్రియా సందేశమున్ విన్చుటో! 47

మ. నగముల్ వెన్నెల లార సాగరతటీసౌందర్యతాత్పర్య మొ
ప్పగ వాహ్యాళి చరింప వచ్చితివో! యీ వార్తాహరత్వంబు నేఁ
దగిలింపన్ బెకలించుకోకుము, కృపాతాత్పర్య మేపార మె
చ్చుగ నెవ్వాఁడిల వేళ కక్కఱకు వచ్చున్ వాఁడెచుట్టంబగున్. 48

ఉ. పోలగ నీకు నాదరము పుట్టగ శ్రీమిథిలాపురీంద్రభూ
పాలురగేహసంతతిని భామిని పేరిమియాఁడుబిడ్డయం
చా లలనామణిం గుఱిచి యాడెద, నాడెద లోన బ్రహ్మవి
చ్ఛీలముచేతనే నను వశీకృతునిం బొనరించుకొన్నదిన్. 49

ఉ. సఖ్యము లోకమందునను సాప్తపదీన మటందు రార్తిమ
త్ప్రఖ్యుని నన్ను స్వీకృతికిఁ బట్టుము స్వాకృతి యోగ్యమైనటుల్
ముఖ్యముగాఁగ నొక్కటియె పోయి వచింపవలెన్ మదాగతిన్
శేఖ్యముగాఁగఁ బంపునది లేదొక పెద్దగ వేఱయేమియున్. 50

ఉ. సాగెను వెన్నెలల్ రుచి విశాలము లార్ద్రసుధాప్రవాహముల్
భోగిమహేంద్రమౌళిమణిపుంజవినిర్గతకాంతిపుంజముల్
మూఁగిన గాంగవారి చిఱుబోదెలు చేలకు నుళ్ళినట్లు హం
సీ గరుదంతచాలనవిచిత్రముగా సుషమా పరంపరల్ 51

ఉ. రింగులుగాఁగ హంస విహరించెను మింటను బల్లటీలుగా
బంగరుపూలు తాపినది పళ్ళెము వెండిది త్రిప్పినట్లుగా
నింగికిఁ గ్రొత్తయందమును నింపుచుఁ బోయినయంత నేరయున్
గంగయుఁ గ్రొత్తహాయ యొసకంబుగఁ దీయుచు నుస్సొలెత్తుచున్ 52

గీ. దూరమునకు నేదైన నాకారమునను
స్వల్పమై కానిపించు హంసప్రభుండు
దూరసామీప్యముల కొక్క తీరుగాఁగ
నవఘళించె నేకాకారమగుచు నెదకు. 53

ఉ. నిక్కపు వెండిచేఁతయును నిర్మితచంచువు కెంపుముక్కయున్
జెక్కలపైడిపూఁత యమరించిన చొక్కపు హంసబొమ్మ తా
నొక్కఁడు ప్రాణవంతమయి యుప్పరమందున నేగుచుండె న
మ్మక్క యటంచుఁ జూచిరి మహాసురసౌధగతల్ లతాతనుల్ 54

శా. ఆవేళన్ దశకంధరుండు నిజసౌధాగ్రంబునన్ వార్ధి వీ
చీ వాయుప్రియభావనామతి తటస్థించెన్ గపీశానదం
ష్ట్రా విష్వఙ్నఖఘాతసంగత శరీర స్వల్పబాధావనో
దావిర్భూతమనస్కుఁ డౌచుఁ గృతసంధ్యాశ్రీజపాంతంబునన్ 55

ఉ. మిక్కిలి యెత్తు స్వీయమగు మేడ తదగ్రమునందు నిల్చినన్
తక్కువ యెత్తులోఁ గలుగు దారలమేడల మీఁది కామినుల్
చిత్తములందు వ్యగ్రతను జెందుచు నేదియొ చూచుచున్న వా
రత్తఱి ముందుఁ దోచిరి మహాసురధారుణి చక్రవర్తికిన్ 56

మ. చెలువల్ చూచుచునున్న యక్కలనఁజూచెన్ మింట హంసన్ సము
జ్జ్వల చంద్రాతపవాహినీసువిలసత్స్వచ్ఛారవిందంబునాన్
జలజాతాన్వయ రాఘవేశ్వర తపస్సాఫల్య సంజాత మం
జుల పూర్ణామృతకుంభ మాకసమునం జూపట్టునా నత్తఱిన్ 57

చ. నలువుగఁ బైడికత్తుగల నాఁగలి వెండిదిపూని సన్నమి
న్నులనువుచేను దున్నకొనునో నను వెన్నెలకాఁపునాగ, ము
క్కలుగను నేలగడ్డ విఱుగన్ దెలిమన్ను వెలారినట్లు మ
బ్బులపొర లొప్పఁగా గగనభూమిని హంస చరింపనయ్యెడిన్. 58

చ. మునుకొని యాకసంబనెడి బూడిదగుమ్మడిపాదు దిక్కులం
దునఁ గొనసాగి పూ వదలెనో పువురేక తుదళ్లఁ దేంట్లు నె
త్తిని మధు వల్ల తెక్కలను త్రొమ్మగ త్రావిలి చరించుచుండఁగా
ననఁగను హంస మింటఁబడయాడఁగ దైత్యమహేంద్రుఁ డుగ్రతన్. 59

గీ. సురవిరోధి నిదానించి చూచి చూచి
యవునుగాదని మది నిర్ణయంబు లేక
కేవలము కోపగుణసమాకృష్టుఁడగుచు
దాని లో నమ్మఁజాలక తన్నుఁదాను. 60

ఉ. యత్నముచేతఁ బ్రాంతభవనాగ్రవిహారిణి నొక్కకామినీ
రత్నముఁ దర్శనిం బిలచి రాజతహంస మతెందునుండి యీ
నూత్నపురాకనా నది కనుంగొని వానరరాట్చమూదిశన్
రత్నకరాంగుళీయకభరంబుగఁ దర్జని వంచి చూపినన్ 61

శా. ఈర్ష్యాక్రోధవశంవదుం డసురలోకేశుండు సోపానముల్
వర్షాంభోదము లీల డిగ్గి చని దేవాగారమున్ బ్రహ్మబ్ర
హ్మర్షిశ్రేణితస్థి నెతు వానిఁ గానకయ మూర్ధాకంప మేపార సా
మర్షాస్యంబున కోపనిర్మితసభామధ్యంబునం దేగఁగాన్. 62

వ. రావణుండును నిముస మందుఁ గూర్చుండి తద్గృహద్వార సగస్థ్యుండును మహామాయావియు నైన విద్యున్మాలివంక రెండు నిమేషము లేకాగ్రదృష్టితోఁ జూచి యేదో నిర్ణయించికొని వానితో నేను సీతాదర్శనమునకై పోవుచున్నాను, రామలక్ష్మణు లిద్దఱును వధింపఁ బడిరి, వారి శిరస్సులును వారి ధనుస్సులును దీసికొని రమ్మని యశోకవనం బేగి, యచట సుఖంబంతయు నిరవధి కానంద భరితంబుగాఁ జేసికొని వేత్రహస్తుని వేత్రంబు గైకొని దాసిని దక్షిణకక్షయందుంచి వ్రాలి వ్యత్యస్తపాదుండు సీతతో నిట్లనియె. 63

శా. సీతా! నీకొకమాట చెప్పుటకు వచ్చెన్ రావణుండంబుజ
స్మితాంతచ్ఛవిమద్దృశాంత, సుషమాబిబ్బోక వారాన్నినీ!
పాతివ్రత్యహిమాచలా, జటి, భవద్భర్త్రాఖ్యుఁ డీ సాగర
స్రోతోమార్గము లెల్ల దాఁటి కపివీరుల్ తాను నేతెంచెనే. 64

ఉ. కోఁతులు వేలు లక్షలును గొట్లును దానిట నిప్పువెట్టి నా
కోఁతియుఁ దోడవచ్చెఁజుమి కోఁతియటంచును జూపి విడ్చితిన్
దూతయటన్న వ్యాజ మిడి తోఁకొని రావలె వానినంచుఁ దా
నాతనిఁదెచ్చె నే దలచినట్లుగ దైవము మెచ్చునట్లుగన్ 65

ఉ. కోఁతుల తోఁకపట్టుకొని గోలగ నీ పతి వార్ధి యీఁది యా
కోఁతులతోడ నాదయిన కోటను ముట్టడివేసెనే సతీ!
యా తెలి వేమి చెప్పవలె? నక్కట తామరతూండ్లతోడ మై
పోతర మేచు మత్తగజమున్ గొనసెంచిన తెల్వి జూసకే! 66

ఉ. కోఁతులు తాండవింతు మనుకొంచును వేసెను గుప్పిగంతులల
బ్రీతిని బొంది మా యసురవీరులు నవ్వుచుఁ జూచుచుండఁగాఁ
గోఁతులు రాలు రువ్వి రది గొప్ప మహాహవ మన్నయట్లుగన్
బ్రీతిగ నల్లె వారి బులిపించిరి దైత్యులు యుద్ధమట్లుగాన్ 67

ఉ. కోఁతుల పేశి యుత్తి పరుగుంబలెఁ జేదయి యుప్పుకారముల్
చేతను షడ్రసంబులను జే దొకఁడౌ గద రుచ్యమంచు ద
ర్వ్యాతతి వడ్డనన్ బెరిగెఁ బెట్టిన మాంసపు టూరగాయ ని
ర్ఘాతము పుట్టె వానరనికాయమునందున రాము పేరుగన్ 68

మ. అకటా! దానికి నేమిలే, విమలపద్మాంతస్థమారందబిం
దుకసంతానమనోజ్ఞబాష్పజలబిందూ! లేళ్ల వేటాడఁజె
క్కక బాణంబులు కానఁ ద్రుంచికొనిపోఁ గాలమ్ము కాకేమి పా
తికపిరుం డిటఁ గోట లగ్గలకు నెత్తెన్ వచ్చి దుర్బుద్ధియై 69

ఉ. కోడిగమైనటుల్ పొగడికోలగు నాదగు పెద్దబిడ్డ యు
న్నాఁ డత, డింద్రజిత్తతని నామము, వాఁడు మహేంద్రు నాజి వే
టాడెను, బిక్కచూపిన బలారిని రెక్కలుగట్టి బండికిం
గాడిని గట్టి తోలెఁ గుఱిగాఁ గొరడా విడి మోము చిట్లగన్ 70

మ. తనయెత్తున్ దివిషద్విరోధుల ద్విషత్సంతాన మెత్తుం గనుం
గొనకే యేమిది యెత్తివచ్చుట మఱిం గోతుల్ బలం బెన్న నా
కును నీ భర్తయటంచు జాలి మది గల్గుం, గల్గదా? యింద్రజి
త్తున కే మున్నది? యుద్ధరంగముల మృత్యుక్రూరుఁ డా వీరుఁడై 71

ఉ. కేళి మహోహవంబనినఁ గేవల మాతనియందె నిక్కమా
గోళము లాటబంతులుగ గూటు వియత్తునయందు సర్వ పా
తాళభుజంగరాజు లసుదారగ వానికి నస్త్రసంతతుల్
గేలికి నైరి, నీ మఱఁదికిం బతికిన్ దుది వచ్చినంతటన్ 72

వ. మహానాగాస్త్రముల వారిని దీర్ఘనిద్రపుచ్చి యే మనవలె
నని, విద్యున్మాలి వంకఁ గాంచి, యవి తెచ్చి చూపింపు మనిన నతఁడు
మాయానిర్మితములు రక్తప్లావితములు తచ్ఛిరశ్శర శరాసనములు

తెచ్చి సీత ముందిడిన నామె యావులించి సద్యోమూర్ఛితయయి
కొంతసేపటికిఁ దెలివిదెచ్చికొని మొదల్కదలించి. 73

క. ఇది యొక సంవత్సరమై
నది నాకీ మాయక్రమ్మునాళ్ళు మొదలై
మది కదియించుక యొంతగ
విదలించినఁ దిరిగి తిరిగి విరియించికొనెన్ 74

మ. ఇది మాయాపరికల్పితం బవున, వాఁడెవ్వాఁడు తానింద్రజి
త్పదనాచ్యుండు రఘుప్రవీరుల ధనుర్బాణంబులం బుచ్చికో ?
నిది ముల్లోకము బూదికాదుగద, వాఁడెవ్వాఁడు క్రొవ్వాడిగా
ప్రదరంబుల్ పరగించి రాఘవుల నీ ప్రాంతానికిం దేరఁగా 75

ఉ. నేరను దీని నమ్మఁగను నీ రిగురంగను లేద యగ్గి చ
ల్లారద గాలి యాగద మహాసురసంతతి ప్రాణవంత మిం
పారెడు నాదు ప్రాణములు నాడెడు శ్రీరఘుపుంగవుల్ మహా
వీరుల కిద్దిపట్టి కలిపించిన యాపద, వేఱ యెట్లగున్ 76

క. అయ్యో ! నా కన్నీరిది
ముయ్యేఱునకైన నెండిపోవుట కలదుఁగా
వ్రయ్యం ద్రవ్విన నగముల
గొయ్యి యయిన నిగిరి యావిగొని మిన్నరుగున్ 77

శా. అగ్రం బందున బంధువుల్ నిలచినట్లై తోఁచినన్ సీత వ్యా
త్యాగ్రంబందున జెక్కలార్చికొని హంసాధ్యక్షుఁ జేతెంచి వి
వ్యగ్రాగాత్కుల జానకీముఖదిదృక్షాపూర్తిఁ గూర్చుండె శ్రీ
దృగ్గమ్యాంశువు లారఁ గాంచెను ధరిత్రీజాత హంసాధిపున్. 78

గీ. కూడి మున్ను హనుమ కూర్చున్న చోటనే
కోరి హంస వచ్చి కూరుచుండె
హంసఁ గాంచినంత నవనీజ గుండెలో
నమృతకుల్య యుబ్బినట్లు తోఁచె. 79

మ. తన మోదమ్మునందుఁ దోఁచెనన మోదంబెంత? తానంచునెం
చిన యే వస్తువొ చెట్టుకొమ్మపయి తోఁచెన్నా మహానంద మొ
ప్పెను వృక్షంబున హంసనాయకుడు కన్పింపన్ ధరాజాత మె
చ్చిన చిత్రాబ్జము వందరేకులను విచ్చెన్ మాధుబిందుచ్యుతిన్ 80

మ. విమలం బౌ పరిమోదమై నుదురుపై వ్రేలాడు రత్నంబు ర
త్నముక్రిందం దనచిత్కళంబొలుచు ముక్తామూర్తియై తాన్ రఘూ
త్తముడౌ ఫాలమనోజ్ఞ కాంతికి సహాధ్యాయంబుగాఁ బొల్చు చి
త్తముతోఁ జానకి పొల్చె హంసచలితోద్యన్మాత్న చైతన్యయై 81

మ. జనకక్ష్మాపతికూఁతు చిత్తమున హంసం గాంచుచో, హంస వ
చ్చెను శ్రీరాఘువువద్దనుండి యని, తెచ్చెన్ వార్తయం చూహఁతో
చెను భావంబున, నూహతో సరిగఁదోఁచెన్ సర్వవార్తానిరూ
పణమున్ మోహనశబ్ద సంఘటన సంబంధామృతాసారమై 82

ఉ. నూతనపారిజాతకతనూ! కపిరాజచమూసమేతుఁడై
బ్రాఁతిగ సాగరాంబు పరివాహసమూహముదాఁటి వచ్చితిన్
క్రోఁతులు కారు వీ రసురకోటి మహాసునవాంగణాతిథి
వ్రాతఘణుల్ పరాక్రమ పరాభవ దత్యయకాలవార్నిధుల్ 83

ఉ. ఓ గరితా! పరాక్రమ పయోనిధి వానరరాజు దక్షిణా
సాగరలంఘనోన్నత విశాల పరాక్రమ వారిరాశి క
ల్పాగము వచ్చి నీ దయిన వార్తను దెచ్చెను నేను వచ్చితిన్
సాగసుఁడైన రక్కసుని ప్రాణములందునఁ గూరుచుండితిన్ 84

ఉ. ఓ మెలఁతా! త్రివిక్రమమహోమహిమాన్వితుఁడైన యట్టి శా
ఖామృగవీరసంచయశిఖాపరిదీప్రుఁడు వాయుసూతి చూ
డామణి యిచ్చెఁ గన్నులకడారపు వెల్గులతోడ వచ్చితిన్
క్షేమము కోలుపోవఁగ మషీకృతబుద్ధికి దైత్యవృద్ధికిన్ 85

ఉ. ఓ జనకక్ష్మాపతిక్రతూర్వీసముద్భవమైన రత్నమా!
భ్రాజిత కల్పభూజుఁ డపరాజితతేజుఁడు వాఁడు బాష్పధా
రాజితవార్ధి నీ యసుభరంబగు దుస్థితి చెప్పె, వచ్చితిన్
దేజము వెన్కపట్టినయదిన్ సకలాసురవీరకోటికిన్ 86

ఉ. ఈ విరహాగ్నిచేతఁ గృశియించిన దేహముతోడ వచ్చితిన్
ద్రోవయలేని నీ దయినదుఃఖము ముందర నా వియోగ బా
ధావహనంబు లాడుటయుఁ దప్పని దోసము, నేను వచ్చితిన్
ద్రోవయు విచ్చికొన్నయది దుఃఖపుఁగాలము పోయెనే సఖీ! 87

చ. తడఁబడి దొంగసొమ్ము మఱి దాఁచఁగనేరక చేయిజారి పో
యెడుతఱి దుర్జనుండు తనకెట్లును దక్కఁడు, సొంతదారుడున్
జెడుగతిఁ బాడువెట్టుటకుఁ జేయుఁ బ్రయత్నములన్, హృషీకముల్
కడుకొని బిగ్గపట్టుకొనఁగావలె నుగ్గము కట్టినట్లుగన్ 88

గీ. అప్పుడు కపిరాజపరమేశుఁ డిప్పుడు హంస
ప్రాపణము గాంచఁగఁ బరస్పరప్రవృత్తి
ఇంత శుభహేతు వుండునటే లతాంగి
కపివృషాకపు లటు నిటుఁ గాంచియుంట. 89

వ. అంత విద్యున్మాలికృతమాయాశిరశ్శరశరాసనములు నియతవేళాతీతంబుగాఁ బెట్టినచోటునం దంతర్ధానంబు పొందుట రావణుండును జూచెను. సీతయుఁ గాంచెను. మఱియు రావణుండు వికవికా నగి యిట్లనియె. 90

శా. మాయంబోల్చెను మాయమయ్యెను మరిన్మస్తంబులున్ విండ్లునున్
దోర్యేజాంచిత చాపపత్రసుమమూర్ధాః కంపితాకేకరా !
నీ యచ్చోటిది ప్రేమలోఁతు తెలియన్ నేఁజేసితిన్ నిశ్చయం
బాయెన్ దానిస్వరూప మంత తనుమధ్యా ! ప్రేమరథ్యామతీ! 91

చ. నిజముగఁ బ్రేమ వానియెడ నీకును గల్గెనయేని, కృత్తమై
గజిబిజి యైన వానిదగు కంఠము మస్తము చూచి మాయయో
నిజమొయటన్న యూహయుజనించునొ చూచినయంతఁబ్రాణముల్
విజయముచేయుఁగాక సురపిఘులకున్ మధురాంగమంజరీ ! 92

మ. తొలుతన్ మూర్ఛను గన్న హేతువునఁ జేతోవీథి నవ్వానిపైఁ
గలదం చెంచితిఁ గొంతప్రేమ, మఱలం గైకొన్న తెల్విన్ ధరా
తలజీవావలి శేషభోగపరిభోక్తల్ ప్రాణమున్ దేహాపీ
ఘుల మళ్ళించఁ దలంతు రాస్యవిజితేందూ! స్పష్టమై పొల్చెడిన్. 93

శా. ఈమాత్రంబగు భోగవాంఛ కలదేని యుద్ధరంగంబునన్
రాముం జంపెద నీవు నావశమునన్ రా, నాత్మలో నున్న నీ
కామక్లిన్నము జీవలక్షణపరిష్కారంబు పర్యాప్తమా
రాముం జంపెడు నిశ్చయంబు సుఖధారాబుద్ధిఁ గల్పించుచున్. 94

ఉ. మానసమందు లజ్జవడి తొమ్మసుత చూచెను హంసదిక్కునన్
జానకిలో నదొక్క నిముసంబున గాఢసమాధి పొల్చినన్
దా నల యీశ్వరేశ్వరియుఁ దాను సనాతని యంచుఁ దోచినన్
జానకిదేవి క్రీఁబెదవి చాయలఁ జిర్నగ వంకురించినన్. 95

ఉ. ఆ చిఱునవ్వు న వ్వనినయట్టులు లేదతిలోక మోహనం
బై చెలువారు మోహనత యన్న దలౌకికమై సురారిదృ
గ్రోచులు మందగించినవి, గుండియ యాగినయట్టులై త్రియా
మాచరసార్వభౌమునకు మానస మంతయుఁ గోపమై చనెన్ 96

ఉ. అంతకు నైన కారణము హంసగఁ దోఁచెను వానిబుద్ధికిన్
బ్రాంతకుజాగ్రశాఖపయి వ్రాలిన హంసము నెంచి దుఃఖిత
స్వాంతుఁడు కోపవంతుడును బట్టఁగరాని నిగూఢభక్తిసం
క్రాంతిబహిఃక్రుధాపరిసరంబుగ నూహ ఘానర్చె నీగతిన్. 97

ఆ. తనకుఁబోలెఁ దలలు తఱిగియిచ్చినవాఁడు
సృష్టిమొదలు మొదలు చివరిదాఁక
కానరాఁడు, తన్నుఁ గాదని యెవనినో
తన్నుఁబోలుజోగి నెన్నుకొనియె. 98

ఆ. అయినవారి కేమొ యాకులయందునఁ
గానివారి కైనఁ గంచములను
ఇంటిలోనఁ దించు నింటివాసంబుల
లెక్కపెట్టునట్టి లెక్కగాఁగ. 99

శా. ప్రాగల్భ్యం బెసలార రత్నమువలెన్ రాజోపచారంబుగా
సాగింపన్ సుఖమొప్పగా ననుభవించన్ లేక మిన్నేగి భై
రాగిం బోలుచుఁ దొంటిలక్షణము మారంబోద బంగారమున్
మైఁగప్పన్ దొడుగంచు లోపలి శిలామాలిన్య మెం దేగడిన్. 100

గీ. మఱియు నేమి యెఱుంగని మాదిరిగనె
యరిగి కూర్చుండుఁ బూజాగృహంబునందు
తల తఱిగి యీయఁ దలఁక డుత్తమము లింగ
కాయ బెల్లము కొట్టిన రాయి వోలె. 101

శా. నాకంబెక్క మునుపైన భక్తుఁడటె యీ నాళీకబంధ్వన్వయుం
డాఁకొన్నాడు శివుండు దంపతులమధ్యక్క వార్త లందింపఁగా
తన్మేకన్యాపతి యింతదాఁకను బహిశ్శత్రుండె యీనాటి కిం
దాఁకక్క వచ్చినయంతెఁ గన్పడియె నంతశ్శత్రుతాస్థానమై, 102

వ. ఆర్పఁబడి నిర్గతధూమంబులైన కాగడాలవలె నిర్గతనిద్రములై కన్నులతో రావణుండు నిశయాంతయుఁ గడపి స్నానంబుచేసి శి పూజచేసి యున్నంత నెలనాళ్ళక్రింద హనూమంతునిచే వధింపఁ బడిన తనకొడుకక్షునికుమారుండై దేండ్లవానిని వానితల్లి చంక నెత్తికొని వచ్చి వానిచేతిలోని రాజతహంసంబు మామగారి కిప్పించి. 103

గీ. నిన్నఁ బిల్లవాఁడు నిభృతక్రియుండయి
పూజయింటిలోనఁ బోయి తెచ్చెఁ
దాతగారు కోపధారియంచుం జెప్పి
తిరిగి యిమ్మనంగఁ దెచ్చె ననియె. 104

మ. తనప్రాణంబులు లేచివచ్చినవి దైత్యస్వామికిన్ ముద్దుమ
న్మని వే చంకను గొంచుఁ జుంబనవిధామత్తుండు తా హంస ని
చ్చెను గ్రీడామయమైన వస్తువుగ నా చిన్నారిపొన్నారికిన్
మనుమండుం దన తాత ముద్దిడుకొనెన్ మత్తానన్దార్థుఁడై 105

వ. అంత లంకాకోట్టప్రాకార మధ్యస్థితము స్తంభాకృతియు మహోన్నతంబు నయిన పర్వతంబు నధిరోహించి రావణుండు దుర్గ దక్షిణ పశ్చిమ ప్రాగ్దిశలయందుఁ దిలకించి కనుచూపుమేర దాఁటియున్న వానరసేనం గాంచి ప్రక్కనున్న సారణునితో నీసేన పరిమాణం బెంత యనిన సారణుఁడు శతసహస్రములశతము కోటి, కోటి సహస్రములశతము శంఖము, శంఖసహస్రముల శతము మహాశంఖము, తచ్ఛతము బృందము, తచ్ఛతము మహాబృందము, మహాబృంద సహస్రశతము పద్మము, తచ్ఛతము మహాపద్మము, తచ్ఛతము ఖర్వము, తచ్ఛతము మహాఖర్వము, తచ్ఛతము సముద్రము. మఱల సముద్రసహస్రశతము ఓఘము. మఱల నాలెక్కనే మహౌఘము, కోటిసహస్రశతశంఖములు ఒకమహాశంఖసహస్రము బృంద

శతము మహాబృందసహస్రము పద్మశతము మహాపద్మసహస్రము
ఖర్వశతము సముద్రశతము నొక్కమహౌఘము. ఇట్టి కోటి
మహౌఘము లీసేన యనిన రావణుండు. 106

చ. తెలిచినయట్లు లుత్తరపుదిక్కున వారిధి యెంతయుండెనో
తెలిచినయట్లు దక్షిణపు దిక్కున వాహిని యంతయుండెఁబో
విలుచుక తిన్న నైనఁ గపివీరుల నెందఱిఁ దిందు రాశరుల్
పలుచుకయుండె నింత కపివాహిని చంపనురానియట్లుగా 107

మ. తనరన్ దివ్యమహాస్త్రసంతతులచేతన్ దీని దగ్ధంబు చే
సినఁ గాకీ కపిసేన సేనయుగ నిర్జింపంగ సాధ్యంబు గా
దని రక్షఃపతి సారణుంగని దురూహాంబైన యీ లెక్కవా
రినిగా కిందున లెక్కపెట్టఁగలవారిం జెప్పుమా నావుడున్ 108

మధ్యాక్కఱలు :-

మందారుణచ్ఛవిను త్తమాలకమహీజంబు నెడనుఁ
గ్రింద నొక్కరుఁడు కూర్చుండి కెలన వంగి గొలుకండు వాడు
మైందుండు ద్వివిదుఁ డిద్దఱును మఱియు బహ్మప్రాప్తవరులు
నిందు రేఖామృతప్రాశు లెసఁగు శౌర్యేందిరాఖనులు. 109

అమర నా యిద్దఱ ప్రక్క నాసీనులై యున్నవారు
సుముఖుండు నసుముఖుం డనియు శూరు లక్షోభ్యవిక్రములు
యమసుతుల్ వారు దుర్దాంతమైన కోపావర్తమతులు
యముఁడు వారికిని దోడౌచు నాడెడు ననవరతమ్ము 110

పెద్దగుమ్మము నెట్టయెదుటి భీషణవిగ్రహుం డతఁడు
మద్దినా నిలచినవాఁడు మహితనామమున నీలుండు
తద్ద కట్టుక చేతులు మినుదాఁట్టు సత్త్వము గలవాఁడు
గద్దింపుతో శత్రుకోటి కాలాగగా నీనివాఁడు. 111

అంగదుఁ డా ప్రక్క నిల్చినట్టి తాలాభదేహుండు
చుంగుతో జూలును గోల్పుచువ్వ మైసొబగును నింగి
ముంగిటఁ బెట్టిన కంబముంబోని పొడుగరి యతఁడు
సంగత కీశసేనాప్రచాలనసర్వాధిపతియు. 112

అక్కటా! వాలితనూజుఁ డాతఁ డహంకారమూర్తి
యుక్కివుండును వాలి ముక్కునుండి తా నూడిపడె ననఁ
బొక్కక నాలుగుసంద్రములందు మునకలు వెట్ట
నొక్క జామునఁ జాలువాడు సుగ్రబాహుఁడు నిర్భయుండు. 113

నెక్కొని పినతండ్రిమీఁద నిక్కిన నెయ్యమ్ముకాక
చిక్కని శ్రీరాముమేనిచెలువు వశీకృతికాద
దక్కియుండదు గాదె కీశధాత్రియుఁ దరణిసూనునకు
నొక్కఁడు వాఁడు దిక్కుల మహోగ్రుఁ డంహోదళనుండు. 114

ఆరఁగా నాతని కెడము నందున్న యాతఁడే నళుఁడు
ధారుణీధ్రములు తత్కరము తాఁకినఁ దప్పలై పోవు
నీరధిపైఁ దేలు సేతునిర్మితినిపుణుఁ డాతండు
కోలుపోవు బరువు గిరులు కూల్పఁగా ఘోరశత్రువుల. 115

కుముదుఁ డన్నాతఁ డా కెలన గోమతీకూలంబులందు
నమరు సంకోచనపర్వతాగ్రమహారణ్యసమితి
నమరు వానరజాతిరాజు నాపర్వతారణ్యములును
ప్రభమదనేకానేకపముల పట్టు దుర్భావ్యంపుగట్టు. 116

కుముదుఁడు పదివేల యేనుగున్నల గుంపుగాఁ గట్టి
యమరంగ నీడ్వఁగాఁ గలిగినంత బాహాబలాంభోధి
కమరిన నల్లని మొగము కను లగ్నిఖండముల్ కోపి
యముఁ డెట్టయెదురుగా నిల్చినట్టుండు నాతనిఁ గనిన. 117

కెరలి వింజము సహ్యకృష్ణగిరులను గ్రీడించు ఘోర
తర వానరానీకినికి నతండు నేతయుఁ జేరు రంభు
డురుతర బాహుశాలియు భుజోర్వీధరోపత్యకాభుఁ
డరయ లంకాపురీదాహ మగ్నులా నఖులవాఁడు. 118

చెవులు మాటికి బూరటిల్లఁ జేసెడుఁ జిన్నవిచేయు
నవుర పెన్మత్తుచే నెల్లయప్పుడు నావులించెడిని
తవులగ సాల్వేయపర్వతంబు నిత్యనివాసభూమి
యవువాడు శరభుఁ డన్వాడు హరిలోకహర్యక్షమూర్తి 119

బలిసి విహరు లక్ష యూథపశ్రేణి వాని నిచ్చలును
గొలుచుచుందురు లయకాలఘోరాంతకులు వారు గాని
కలఁచును శరభుండు కుంభకర్ణునిగతి రిపుల
మెలఁకువ నిచ్చలు కలఁడు మృత్యువు మేల్కొన్నయట్లు. 120

మిన్నులందున శ్రావణమున మేఘమ్ము మిగిలినయట్టి
తెన్నున నాకృతిచేత దీప్తవర్ధితగర్జచేతఁ
గన్నుకు పనసుఁ డన్వాఁడు గంధోగ్రగజరాజమూర్తి
మన్నిడు పారియాత్రగిరి మాద్యద్భిమత్కపితతికి. 121

అల తోఁచు వినతుఁడు కడలియంతటి యతి బలశాలి
యల క్రోధనుండును గవయుఁ డాప్రక్క నాప్రక్కవారు
నలసి యిందఱు నొక్కకోటక్కై యెత్త నవసరంబు
బలి యొక్కఁడొక్కఁడు చాలు వాఁడును వాడును వాఁడు. 122

హరుఁడును ధూమ్రుండు నన్నయట్టివా రా ఋక్షపతులు
గిరులు చైతన్యమ్ము తాల్చు క్రీడాప్రకృష్టదోర్బలులు

పఱగించుమీఁ దృష్టి తేనెపట్టులు పట్టె నాకసము
ధర వ్రాలునన్నట్లు ఋక్షతతి సముద్రమునోలెఁ దోఁచు. 123

జటిలుఁడౌ ధూమ్రమునకు ననుజాతుఁడౌ జాంబవంతుండు
కటికబలమువాఁడు కృతయుగంబునఁ గడగిన యసుర
ఘటలయు సురబలములయు కయ్యాన ఘటలపై గికులు
ఘటియించి చంపినవాఁడు కదల దుర్గమహాహవముల. 124

అతని జయింపనురాద యతనిని హరియింపరాద
జతనుగాఁ దప్పకపోక స్వప్రాణసంత్రాణపథము
అతని మోఁకాట మున్నొక్క యద్రి ముల్లై తూరి విరిగె
గతి మందగించె నిప్పటికి గగనచంక్రమణంబు సేయు. 125

మును వామనుఁడు మేను పెంచి ముల్లోకములు నాక్రమింప
ననిచి యీతఁడు మూఁడు చేసిన ప్రదక్షిణములుగాఁ దిరిగె
నని చెప్పుదురు మించివచ్చినప్పుడే యీతఁడు కదలు
నని వాఁడు కదలిన నచటి కచ్చట నాజిపోవుటయె. 126

ఆతల నున్న కీశచము వారయు మతఁడు దంభుం డు
పేతపక్షునినోలె సతము విహరించు వియదగ్రమందు
భూతలంబునయందుఁ దిరుగఁబోవఁడు పురుహూతసఖుఁడు
యాత మాయాతమ్ము నిరత మతనికి నాకలోకమ్ము. 127

ఎన్ని వేనిని నదేపనిగ వీక్షింతో యీావు దైత్యేశ
సన్నాదుఁ డనువాఁడు వాఁడు చండదోశ్శాలి దుశ్శీలి
మిన్నున ధర యోజనంబుమేర గ్రుమ్మిన యొక్కయంగ
యన్నిర్భరాతివేగునకు నద్భుతాహవదోహలునకు. 128

ఒక్క-గంధర్వికి నగ్ని కుదయించె సుమబాహు వితఁడు
దిక్కుంభికుంభాగ్ర నఖవిదీర్ణ మహాక్తికవిలోచనుఁడు
మొక్కలుం డీతనితోఁ బోడిచి గెల్వఁగానండు శక్రుఁ
డక్కడ దేవదానవమహాయుద్ధ మప్పటివాఁడు. 129

క్రోధనుండును బ్రమాథియును గోస గవాక్షుండు మువ్వురును
ప్రోథమ్ము లెత్తి మిన్నెల్ల మూర్కొను పోలిక గలర
సాధువిక్రము లొక్కఁడొకఁడు చండకీశపృతనాపతులు
సాధింప వచ్చి రిట జలజాప్తవంశవధువు కొఱకు 30

ఆయన కేసరి శాంతమైనట్టి యాకార మెంత
యాయెనో పైకిని లోన నంత వీరావేశమూర్తి
యాయన హనుమంతుతండ్రి హనుమంతుఁ డన మన యూర
వే యగ్గిమంటలు పెట్టి విరియించి వెళ్ళినవాఁడు. 131

ఆయన రాజ్య మైనట్టి యద్రియం దతిశాంతిపరులు
శ్రీయుతుల్ మానిరాజి నివసింతురు సిద్ధులు వ్రతులు
నాయెడ శంబసాదనసమాఖ్య దైత్యస్వామి యగడు
చేయగా నీయన బూదిచేసెను జెట్టను వాని. 132

శతవలి యనువాఁడు కీశశతకోటిసైన్యాగ్రయాయి
వితతసూర్యోపాసనా నసీనధీవిభవ దోశ్శాలి
అతనిది యుత్తరపర్వతాగ్ర ఘనారణ్యసమితి
సతతవాసము సేన యన నుషస్సుబ్ధోచ్ఛలశిఖాపటలి. 133

ఈ. కోరిన స్వర్గదేశమును గూఁకటివ్రేళ్ళను బెల్లగింపగా
నేరుతు రీ కపిప్రతతి నేరరు వైష్ణవభావభావులై
వీరులు వీరలందఱు త్రివిష్టపసఖ్యులు లంకముంగిటం
జేరిరి నీక్స్వతం బగుచుఁ జెందిన మ్మితుఁడు కోరునట్టుగన్ 134

ఉ. కుశలులు గాఁగ బ్రాల్ప్ముఖకొండలమధ్యను దక్షిణోత్తరా
దిశలయు మధ్యనున్ నిఖిలదేశములందలి కేశరాజి క
ర్కశులయి సూర్యసూతి కరిగాపులు, తా నిక సూర్యసూతి క
ర్కశతమబాహుసంగతపరాక్రమ మేమని చెప్పవచ్చునో. 135

గీ. అతని కర్ణాయ్యమని తోఁచినపుడు వాని
మొడలు వానికిఁ దెలియద యుగ్రమూర్తి
అప్పు డతని వేఁడు చేసెడు నదియు లేదు
అతఁడు చిరజీవి పరమరామాభిమాని 136

గీ. ఇంద ఉకయొత్తు, తానొక్కఁ డింటిగుట్టు
లంకకుం జే టఁటన్న దీ లా గనంగ
బలముచే బుద్ధిబలముచేఁ బ్రబలుఁడై వి
భీషణుఁడు వారిదిక్కునఁ జేర్చినాఁడు. 137

సీ. ఓమహారాజ ! యాసౌమిత్రివంక ని
దానించి పరికించినాను గాని
యతని స్వరూపంబె యవగతి కాలేద
వ్యర్థంబుగా మాటలాడఁ డొకఁడు
కనులతో వెలిఁజూచుఁ గరవాలములు వేయి
ధగధగలాడిన పగిది నుండు
కనులు లోన మలంచుఁ గాలాహు లొకవేయి
పడగలు ముడిచిన పగిది నుండు

నాతఁ డన్నగారి కస్త్రశస్త్రములందు
బ్రేలెఁ డట్టు నిట్టు వెలయునంద్రు
ఒక్కసారి నన్ను నూఁగి కన్గొనినాఁడు
నాకు మేన నవాలు బ్రాఁకినట్లు 138

వ. తక్కినవార లిద్దఱు హనూమంతుండును రామచంద్రుఁడు నని
యూరకుండిన రావణుండు సారణునిఁ బంపించి కపిసేనాపతులయు
సేనలయు నాలోచనం బడి. 139

చ. గెలుచుట యెట్లునుం గృతయుగీనుల దుర్ఘటకార్య పరాన గా
సిలి వధియించు టెట్లు చిరజీవుల వారిని, వారి గడ్డుపో
రుల నలయించి దూరముగఁ ద్రోలను వచ్చున యింతసేన లం
కలఁబడి యేమిమేయుఁ బయిఁగాలిన డొక్కల నావటిల్లెడున్. 140

శా. గడ్డుల్ గ్రోఁతులు వచ్చె ముట్టడికి లంకాకోట్టమండై యుద
న్వడ్డిండీరము మేయునో నదుల శైవాలంబు ఖాదించునో
చెడన్ యుద్ధమునందు రాఘవులు, దాసేరుల్ కపిశ్రేణి యీ
గడ్డంబట్టుక వ్రేలుచుండునొకొ రక్షశ్శ్రేణిఖాద్యంబులై 141

చ. పరమశివుండు వీనికయి భామకు మాటను జెప్పె వేలొకో
యరయ నితండు మానిసియొ యంతకు మించి యెవండొ యానొ ని
ర్భరము తపంబు చేసెనొ పురాబహుజన్మములందుఁ జంద్రశే
ఖరుని గుఱించి యట్లయినఁ గానలు రాఁడు నిరీశ్వరత్వమై 142

ఉ. ఇంద్రజి మాయయుద్ధమున నిద్దఱి నిద్దుర ముంప తేపటన్
సాంద్రనవారుణప్రభలు సాగిన తూరుపువేళ వానరుల్
సంద్రమునందు దూఁకెదరొ చత్తురొ కట్టినవంతెనం బడిన్
మంద్రవినిస్స్వనంబులను ప్రమందెదరో పెఱయొడ్డు చేరకన్ 143

ఉ. నాపని నేను బోయి రఘునాయక నీయెలనాగఁ దెచ్చితిన్
నాపొరపాటు సైపుమనినన్ రఘువంశనవామృతాంశుచూ
డాపరముండు నన్నును గటాక్షమునం గనునంట, లేనిచో
నాపయి యగ్గియంపరలు నాఱెడు వాఱెడుగడ్డిపోలికన్ 144

మ. తనపేరన్ గపిలోకమంతయును దగ్గం బైన నీ కట్టువం
తైన తానొక్క పతాకగా నిలుచు కీర్తిస్ఫారకం బైనటుల్
వనితల్ లేరె జగాన వేఱొకరు? తావచ్చెన్ మహాసేన, వ
చ్చిన యీసేన కపుల్, నృపుల్ వినినచో సిగ్గాటయుం దోచదో 145

మ. ఎవఁడో భార్యను దొంగిలించి చనె, వాఁడెవ్వాఁడో మూర్ఖుండు కా
కవనీచారిచమూసమేతుఁడు మహాకంధిన్ శిలాబంధనో
గ్రవిధిన్ జాన గ్రహింప వచ్చెడిని, వర్షం బన్యగేహస్థితన్
నవలాఁ గైకొనిపోయి యుంచికొను నింటన్ గంటఁగన్నీరుగా 146

మ. అతఁ డీ రావణు గెల్చినా డనెడి కీర్త్యాశాసమాసన్నదు
ర్మతి యీ హైహయుఁ జంపె భార్గవుఁడు నా రామున్ మఱి రాముఁ డూ
ర్జితుఁడై యుద్ధముకాని యుద్ధమున గెల్చెన్ హైహయుం డైన దో
ర్గతి నన్మించెను వీఁడు మించుననుకొరా! లెక్కగాడెంతయున్. 147

ఉ. హైహయుఁ డైన యర్జునుని యంతిపురంబున నొక్కచిత్రహా
మోహముచేతఁ గట్టుబడిపోయితి నాయతి లేక బుద్ధిలో
బాహుబలంబుచేతఁ గొఱనడ్డటు వాడుకపుట్టె దానికై
యీ హరిసేన తెచ్చికొనె సీతఁడు వాడుకమాట మోసమై 148

చ. వరగ నెనండో నేన భగవంతుడఁ బుట్టితి నంచుఁ జెప్పు న
బ్బురముగ నెందఱో చెదలుపుట్ట సదా భజనల్ పొనర్చుచుం
దురు, దురుపాఘ వానికిని దోచును దా భగవంతుఁ డైనటుల్
హరహర! లోక మెంత తనయంతటఁ దాఁ గికురించుకో నగున్. 149

చ. తనకును దిక్కులేద యవతారము తాల్చెనుబో హరింపఁగా
దనుజుల, నేనుగా మొదలిద్వారమునందలి యిన్పగుబ్బలం
దునఁ బెను చంద్రహాసమున దూసిన పాసినచెక్కసందులం
గనుగొని గోచిగాండ్రు భయకంపితు లైనది యేమియైనదో. 150

ఉ. మెల్లముగాఁగ నో విజయమంబలెఁ గోఁతులుచేరి యూరిలో
నల్లరి చేయుఁగాన జతురంతకవాటములందుఁ గాపుగా
మల్లడిలేమి చూచికొని మానవనాయకబాలకద్వయిం
గిల్లనఁ దేలిపోవు నిది గేలిగ ముట్టడికాని ముట్టడే. 151

వ. అంత రావణుండు మంత్రులతో మంత్రంబు నెఱపి తనకోట యొక్క ప్రాగ్ద్వారంబునఁ బ్రహస్తుని దక్షిణద్వారంబున మహాపార్శ్వమహోదరులను బశ్చిమద్వారంబున మహామాయావియు లంకానగరసర్వవీరకార్యభారవాహియు నైన యింద్రజిత్తును రక్షకులుగా నియమించి. 1 51

క. ఉత్తరమున నే నున్నా
నత్తాపసి కలఁడు సాగరావలితవృష
న్నృత్తాయఃకింకిణీరవ
మత్తత కలదంచు ధైర్యసుందరగిరియై. 153

క. ఈ మూఁగిన కపిసైన్యం
బామకొనిన యొక్క పగటియాహవముది, రే
పేమో మోముల గోముల
రాముల సోములను రాహు గ్రమ్మినయదియున్. 154

వ. అంత విభీణసచివసమానీత లంకానగరకోట్ట చతుర్ద్వార దృఢపరిరక్షానిబంధశ్రవణసంజాత ఘాటీసమాటీకనాన్యగ్రబుద్ధి యయిన శ్రీరామచంద్రుండు తానుగాక మువ్వురిం దసంత వారిని నీలాంగదహనూమంతులను బ్రాగ్దక్షిణ పశ్చిమ ద్వారభేదన చమూసమూహపతులుగా నిర్ణయించి. 155

క. ఉత్తరమున నే నున్నా
నత్తరణీహర్త గలఁడ యంబుధి నుడుపులే

మిత్తి వెకలినవ్వులగమి
పొత్తులుపొత్తులుగ మింటఁబోవుత మంచున్. 156

ఉ. చిత్తజు ప్రావుపొత్తులను జిక్కిన మేనున దైత్యబాణపుం
బొత్తుల నెంచి యూరకయ పొంగిన మేనున ధర్మరూపమా
చిత్తముతోడ రాఘవుఁడు శ్రీవహితాకృతి దైత్యుపాలికిం
బుత్త మటంచు నెంచెఁ గపిపుంగవు నంగదు రాయబారిగన్. 157

శా. తత్కాలాన సమంత్రియై సభను దైత్యస్వామి తీర్వంగనై
సీత్కారంబున మింటినుండి దిగి కొంచెమ్మైన దూరాన బా
హూత్కుచుండయియుంగదుండుచనివారొక్కండునొక్కండు చం
చత్కోపానను లై కనుంగొన నుదంచన్మూర్తియై యిట్లనెన్. 158

క. దైతేయేశ్వర ! రఘుపతి
దూతను నా నామ మంగదుఁడు రఘుపతియున్
నీతోఁజెప్పగ సంగర
నీతి ననుసరించి పంచె నీదెస నన్నున్. 159

ఉ. దొంగతనంబుగా నిటకు దొయ్యలిఁ దెచ్చిన నీకు నెంచగా
సంగరనీతిపద్ధతికిఁ జాలినయోగ్యత లేదుగాని యీ
ముంగిలి నిల్చి దుర్గమును ముట్టడి వేసిన నాకు యుద్ధనీ
తిం గొని నీకుఁ గార్యపుగతిన్ వచియించుట ధర్మమైచనున్. 160

మ. ఎగచెన్ నన్నును నావిభీషణునికై యిచ్చెన్ ధరారాజ్య మన్
బెగడుం బొందుచుఁ గర్మ సాగుతటి నీ ప్రేతంబు దుఃఖింపకుం
డగ నాలింపుము, దైత్యరాజ్యరమ సానాథ్యంబు తానొందుఁ బొం
దుగ ధర్మాభిరతిన్ విభీషణునియందున్ మద్వచఃకౢప్తిచే. 161

శా. త్వాదృగ్దుర్జనశేఖరుండు హితముం బాలింప డట్లయ్యు వ్యా
పాదింపంగ సపుత్రబాంధవముగా నై నిన్ను నేతెంచి నే
నీదృఙ్నీతిపథంబు సేయమియుఁ గాదే నిట్టులై సేఁత మ
ర్యాదామార్గములందు రక్షణముసేయన్ ధర్మమైయొప్పుటన్. 162

ఉ. ఇప్పుడు వచ్చి నీసతి నిచ్చెద నన్ను క్షమింపు మంచునుం
జెప్పిన నేను బోరు విరచించక ముట్టడి నెత్తివేసి పో
నొప్పుదు నంచుఁ జెప్పుటయు నూరక చెప్పుట, నీవు రావు, రా
నప్పుడు రావటం చెఱఁగి యాడుట యూరక నాల్కయాడుటే. 163

క. దైవాధీనము విజయము
దైవం బన వేఱలేదు ధర్మము న్యాయం
బేవో పూజలఁ దనిసెడి
దైవం బొక ధర్మబుద్ధి తాల్పించుటకై. 164

మ. ఇవి రామోక్తులు నింతదూరముగ నే నేతెంచి యేమైనఁ జె
ప్పవలెన్ వాయుసుతుండు నాగుసువు చెప్పం జేయఁగా నేర్పె నీ
యవివేకంబున కబ్బురం బొదవు దైత్యా! తల్లికిం దండ్రికిన్
వ్యవధానంబు ఘటించినాఁడవు గదయ్యా యొక్క యేడాదిగన్. 165

ఉ. కాదని నీ వెఱుంగు దనఁగల్గిన లక్షణ ముండె నీకు మం
డోదరివంటి దేవికి ననుంగుమగండవు భర్తృసువ్రతా
పాదకలక్షణంబులను బ్రత్యహముం గనుచుండి నేర వన్
వాదన నెట్లు చేయనలెఁ బండితుఁడై మొఱకైన యట్లుగన్ 166

ఉ నీవలనన్ విభీషణుఁడు నిర్గతుఁడై రఘురాముఁ జేరె సు
గ్రీవుఁడు నన్నగారిని హరించెను రెండును లోకదృష్టికిన్
గానలమైన పాపములుగాఁ గనిపించును గాని ప్రాపకం
బై వెలయున్ రఘూత్తముఁ డటన్నది తా నఘహారియౌఁజుమీ 167

ఉ. నీ వది చేసినా వనుచు నీ విది చేసి తటంచు గొప్పకా
నీ, వెస నేగుదెంచిన కపీంద్రులయందు నొకండొకండు నీ
ప్రేవులు తీసికొంచు మెడ ప్రేలను వేసికొనంగలండుసూ
రావణ! నే నెఱుంగ రఘురాముఁ డదేటికొ యింతసేయుటల్. 168

ఆ. వినుచు రావణుండు వీనితండ్రిని జంప
వాఁడు నాకు సాధ్యపడనె లేదు
వానిబదులు వీని వధియింతు నంచును
నతనిఁ జంప భటుల కాజ్ఞ యిచ్చె 169

ఉ. క్రచ్చఱ నంగదుఁడు భయకంపితుఁడైనటు వారిఁ బట్టుకో
నిచ్చి సభాబహిష్పథము నీడిచి యంత వియత్ప్రదేశ వే
గోచ్చలదాత్మదేహుఁ డయి యుప్పరమందున వారికంఠముల్
వ్రచ్చి ధరంబడన్ విసరి వార్షికఘోరవలాహకక్రియన్. 170

ఆ. ఉఱిమి నే నెవండ నోరివంకిగళా! క
పీశ్వరుండు వాలి యింద్రసుతుఁడు
నీ వెఱింగినట్టి నిర్భరబలశాలి
యతని యాత్మజుండ నది యెఱుఁగవా? 171

మ. అరరే! నేనెవడన్ బలాధికబలుండౌ వాలిసూనుండఁ దా
నరరే! నేనెవఁడన్ మరుత్సుతజవుండౌ హన్మ శిష్యుండ న
న్నురబంధింపఁ దలంతు నీవు నొకతన్నుందన్ని ప్రాసాదశే
ఖరమున్ గూల్తును నీదు మస్తకమునుం గా రామబాణంబుచే 172

వ. అంత హిమధవళశిఖరంబైన ప్రాసాదశేఖరంబు ఫెళఫెళార్భటులతో నేలఁ గూలినఁ దదుద్ధూతమహాధూళిపరిపూరితవింశతినేత్రంబులు వింశతిహస్తంబుల నులుముకొంచున్న రావణున కిట్లు వినిపించె. 173

ఆ. హనుమబదులు నేన యరుదెంచియుండిన
వార్ధి దాఁటి తల్లి వార్తఁ దెలియ
నేమి యయ్యెడిదియొ యింత కీ నెలనాళ్ళు
నాయువుండె రాక్షసావళికిని 174

ఆ. ఎఱ్ఱవడిన కనుల యొఱుపులు శమియించి
మెఱుము లాగి శైత్యమృదునవీన
విరచితోపచారవిధులచే రావణు
కనులు మఱలఁ జూపు గనినయంత

సీ. సింహాసంహాతులు గర్జించినయట్టులు
పెద్దపులుల్ బొబ్బవెట్టినట్లు
భల్లూకములు దిశల్ పగుల దగ్గినయట్లు
చిఱుతలు గురగురల్ సేసినట్లు
ఇబ్బృందిగాంఢ్రము నెగ్గెత్తి యేడ్చినయట్లు
పెను సివంగులనవ్వ పేర్చినట్లు
ఘోణీసంతానంబు ఘుర్ఘురించినయట్లు
వాహద్విషంబులు వనవినట్లు

కపిమహావాహినీ మహోగ్రస్వనములు
వీరసంరావరూపముల్ వెడలి నంత
నాకసము బీటులిచ్చిన నసురదార
విస్తృతహృదంతరంబులు బీటు లీయ.

శా. సౌధాగ్రంబున నేగి రావణుఁ డుదంచద్వానరానీకినీ
వీధిక్రోధమహార్చి రుజ్జ్వల శిఖావీచీప్రతానైకసం
బాధంబై చను నాకసంబు గని తత్రుప్తక్ష్వేడనాభీలలం
ఘాధూస్సంయత మాకసంబు గని ధీగత్యూహాధారామతిన్ 177

క. సోదరపక్షపర్యాప్తం
బీ దుష్కపిసేనకాద యిచ్చట లంకన్
బా దగలఁ గ్రుమ్మవిడిచెదఁ
గాదన నీ సేన నెల్లఁగా మాయింపన్ 178

చ. ఇటఁ గల రాక్షసాళికిఁ బదింతలు నిర్వదియింతలున్ సము
త్కటకపిసేన యుండఁగల కాయలు పండ్లు నాకులెల్ల ని
ష్కుటములు వృక్షషండములు కూఁకటి వ్రేళ్లఁ బెల్లగించు న
ప్పటికి నిశాటకోటి తినుపాటికి నాల్గిననుప్వు దక్కెడున్ 179

మ. మఱి సుగ్రీవుఁడు సంగమించును హనూమంతుండునున్ వారు దా
శరథుల్ చచ్చినయంతటన్ మగిడి స్వేచ్ఛావృత్తులై యేల పో
దురు చంపందగినట్టివారలును గాదున్ వారు సైతమ్ము నా
ఇరిగా నెంచను జేసె శూర్పణఖ, మారీచోక్తి సత్యంబగున్. 180

గీ. ఏడుగడియలు బ్రహ్మాస్త్ర మెవనిఁబట్టు
వాని మెడఁ గోయవలయు నాపట్టునందు
నాతనిది వజ్రకాయమై యతనిగళము
కత్తివాదరఁ దెగనిది కాను వచ్చు. 181

ఉ. ఇంతకు రామలక్ష్మణులు నెట్టిరొ సంగర మాడకుండ వృ
త్తాంతము లేమియుం దెలియ వచ్చెడు దుర్ఘట మైనయట్టి వృ
త్తాంత మెఱింగియున్ ఫలమునం దది చాలదటంచు నవ్వి యీ
యింతటిచిక్కుఁ గూర్పు వెలయించిన వారిజనాభు మెచ్చుచున్. 182

చ. తన దగు పట్టణం బరసి దానవసంతతి యిన్నియేండ్లుగాఁ
దనదగు బాహువిక్రమపతాకము నీడన యెన్నియెన్ని దు
ర్జనతలు సంతరించి రవి సాగెను సాగిన యన్నినాళ్లు నం
చును దలపోసె రావణుఁడు సూర్యనవాంశుపరీతదేహుఁడై. 183

శా. సూర్యుండప్పుడునూత్ననూత్నమహిమాంశుల్ చేర్చికొంచుండె, గీ
ర్ధుర్యుండై రఘురామచంద్రుఁడును జేతోవీథి ధ్యానక్రియా
పర్యాప్తం బగు బుద్ధి సర్వవిజయప్రాప్త్యగ్రసంకల్పతన్
సూర్యోపాస్తి యొనర్చుచుండెన యగస్త్యుం డెద్ది శాసించెనో. 184

ఉ. నా డుదయంబునందు రఘునాథుఁడు స్నానము చేసియుండఁగాఁ
బోఁడిమిఁ గుంభసంభవుఁడు పల్కె రఘూద్వహా! దైత్యశిక్షకై
పాడి ఘటిల్ల సూర్యుని నుపాసన చేయఁగ నౌ నటంచుఁ దా
నాడినయట్లుగా రఘుకులాంబుధిచంద్రుఁడు ధ్యానమగ్నుఁడై. 185

మ. ఉదయాహార్యదరీ నిరంతరతమో వ్యూహాచ్ఛటాసంఛిదా
భిదురక్రూరగభస్తిసంచయ మహాభీషూజ్జ్వలత్సారథీ!
మృదురాజీవ జగత్ప్రబోధనకళా మృష్టోదయత్సర్వలో
క దరోన్మీలక శక్తిగర్భ మధురాగ్నాయీ మహోవారిధీ. 186

ఉ. ఎక్కడ నీవు తోఁచెదవొ యేర్పడుచున్నది సువ్వె యద్ది ప్రా
గ్దిక్కుగఁ బంచనయ్యెఁ బెఱదిక్కులునుం దదపేక్షఁ జేసి నీ
వొక్కఁడు సర్వదేశమతి కూతగ నిల్చితికాక భావనా
స్పృక్కమనీయబుద్ధి నిబిరీసహరిత్ప్రవిభాగహేతువై. 187

మ. అరయన్ లిప్త నిమేషమున్ గడియయున్ యామమ్మహస్సున్ విభా
వరి మాసంబును నేడునున్ యుగము కల్పం బీ మహాకాలని
ర్భరనిర్మాణ నిరంతసంచరణ ధారాజ్యోతిరాకారకా!
ధరణీ స్వర్గ భుజంగనామక జగద్రాజీవకోన్మేషణా! 188

మ. అనయం బూరక వేదవాక్కు వసురుద్రాదిత్యలోకంబులం
చును వైరాజములంచు స్వర్గములటంచుం జెప్పునే కాని పే
రునకున్ మానవకర్మసంచయసమారూఢంబు లాయెల్ల, వృ
త్తి ననేకంబుల యుష్మదీయములు జ్యోతిర్మండలీకౢప్తముల్. 189

మ. తత మోంకారవినిర్గతప్రథమవాక్త్వం బగ్ని మీళే పురో
హిత మన్నట్టిది సర్వకర్మచయమున్ హేలాజగత్ప్రాణనో
ద్ధతమున్ సర్వనియామకంబయిన విద్యుద్వహ్ని వీవై యనా
రత మీస్పృక్ప్రతిభాసుపేశలవికారానేకమూర్త్యంతరా! 190

మ. గతినిశ్చ్రాయకులైన ద్రష్టలు కృతఘ్నఘ్నాయ దేవాయ య
న్నుతికిన్ నీవాకకుండ యష్వాఁడని ఛందోవీథిఁ బాలింతు రే
కృతముం జంపనురాద పర్వకృత మర్పింపంబడెన్ నీ మహా
కృతిఁ దీవ్రార్చిరభీషు భీషణపరిక్రీడాకడారచ్ఛవీ! 191

చ. ఋతువులుగాగ నీవు వెలయించిన నీ కిరణాల పేర్మి య
ద్భుతము మనోహరంబును ప్రభూతమహస్కము సర్వదేవతా
తతియును నీవ, నీవెలుగుతాలుపు లీ పదునాల్గులోకముల్
ఋతమున కీ వాకండవ సుమీ యనలంబము సర్వభాస్కరా! 192

ఉ. నీయుదరంబులో నిలచి నిద్దురవోవఁడు శంఖ చక్రి నా
రాయణమూర్తి సాంగదుఁడు హారి కిరీటి గదాధరుండు నా
రాయణుఁ డంట యూరకయ, యగ్నులనుండి జనించె వారి నీ
వాయతనంబ వగ్నులకు నంబులకున్ గగనానిలాకృతీ. 193

శా. అంచున్ భావనసేయు రామునకుఁ దాదాత్మ్యప్రకర్షంబు సి
ద్ధించెన్ శ్రీపతితో వికుంఠపురవీధీగారుడాశ్మప్రభో
దంచత్సౌధసభానిషణ్ణుఁడు జగత్సంతానరక్షాకృపా
సించద్వారిదమూర్తితో విహగరాట్సేవాధురావంతుతో. 194

వ. అంత నా తాదాత్మ్యవిశేషానుభూతి శ్రీరామచంద్రునకు విలక్ష
ణంబుగా భాసించె. తాను రామచంద్రుఁడు రామచంద్రుఁడే,
మఱల శ్రీమన్నారాయణుండు, తా నున్న లోకంబులు జ్యోతి

ర్మయంబులా! మహిమనచ్ఛబ్దస్ఫురితంబులా! స్వమహిమో
ద్గారిశబ్దంబులా యన్నట్లుండ. 195

ఉ. దేవతలై రమానుదవతీవ్రతతీ మధుకృత్కుమారకా!
దైవతలోకకార్యచరితవ్రత! నిత్యదశావతారధా
రావిదితాఖిలోత్తమపురాణకథాకమనీయమూర్తి! లో
కావలికంటకాపనయనా! రఘువంశమణిప్రదీపకా! 196

వ. అని స్తోత్రంబులు నెఱపుచుండ శార్ఙ్గం బిట్లనియె 197

శా. నీచే మన్నన మిక్కిలిం గలిగెఁ బో నీరేజపత్రేక్షణా!
ప్రాచీనంబు పినాకసామ్యము గడింపంగల్గె నా కిప్డు తో
డై చక్రంబు స్మరింప నీకు మునుముందై నన్ను మున్నీదు గ్రా
హాచాతుర్యసుఖంబు గాంతు రఘురామా! జానకీనాయకా! 198

వ. మఱియు నొక్కయజ్ఞంబులోని ముగ్గు ప్రాణవంతమై లేచినట్లు
నొకమహామంత్రాక్షరంబులు వికారమ్ము గాంచి రూపంబు
పొందినట్లు కనిపించిన గరుడి యిట్లనియె. 199

శా. ఱెక్కఁకం గొనఁజాలెఁ బో మఘువుఁడున్ శ్రీనాథ! నీదా కృపా
స్పృక్కాంతిచ్ఛదఁ జేసి నాదుదెస మత్పృష్ఠాన నీకాలిగో
ర్నొక్కుం గన్గొని మింటనున్న యఱచంద్రుం డల్పపున్ లజ్జచే
నక్కున్ ధూర్జటిపాళినున్న తనకన్నన్ నొక్కు శోభించుటన్ 200

శా. నిన్నున్నన్ విడిగాఁ దలంపకు ప్రభూ! నీయందు నన్నుం సమా
సన్నంగా నిరతంబు నెంచు మినవంశస్వచ్ఛహైమద్యుతీ!
నన్నున్ సంస్మరియించినంత నెదలోనన్ వారివాహాలపై
మిన్నంగోసలఁ గొంచు నీవలచు నేనే ల్సేతు నా మేల్నగా. 201

ఉ. అంత సమాధినుండి బహిరాగమనంబయి లిప్తలోన వి
క్రాంతి వహించియున్న కపిరాజులు తోఁకల నిల్పుచున్ ద్వారా
వంతులు కోటముట్టడికి స్వామియనుజ్ఞఁ బ్రతీక్షచేయు సం
భ్రాంతిని గంచు రాఘవుఁడు బంధురముష్టినిబద్ధదృష్టియై 202

శా. కోటిం గూర్చిన యల్లెత్రాడుగను గైకో లస్తకం బందునన్
జ్యాటంకారము చేసె రాముఁడు దిశసంతానతంతన్యమా
నాటద్ఘోరరవాభిసర్పణముగా నానాక్రియామాచరుల్
బీటల్ విచ్చిన కర్ణరంధ్రములుగా భీతిల్లి రంతస్సులన్ 203

చ. ఇది తొలిసారి రాఘవకులేశుఁడు సాగర మీతలన్ ధురా
పదమున వింటిలస్తకము వంచియు వంచక యల్లెత్రాడునం
గదలిక ప్రక్కగాఁ జెదరగా నొక నేసుపుమీటు మీటఁ గ్ర
క్కదలిన రావముల్ వియదగారవిభేదనమై చరించుటన్ 204

చ. ఇవియును నల్లెత్రాట నుదయించిన మ్రోఁతలో సాగరంబులో
నవిసిన నీటిపెళ్ళలు వియద్విధురంబుగ లేచి పెద్ద యు
ద్భవ మయినట్టి ఘోరనినదంబులో వానరలోకకంఠసం
భవమృగరాజరావములో బ్రద్దలుగాఁగ దిశాళి విచ్చెడున్ 205

ఉ. నా డెపుడో సముద్రమథనంబు దశాశలు విచ్చిపోవఁగా
పేకులు రేగగా గగనభిత్తిక భీకరఘోరగర్జన
క్రీడ తరంగరంగములు రింగులు రింగులు వార మ్రోఁగెబో
నే డిదియేమి యే మథన నెక్కొనె దిక్కులు స్రుక్కిపోవఁగన్. 206

ఆ. వరగ బుద్ధియందుఁ బ్రత్యగ్రమై యున్న
శార్ఙ్గకంఠరవము సంతరించి

మృదులరీతి వీణ మీఁటినయట్లుగా
నార్చె రామచంద్రుఁ డల్లెత్రాఁడు. 207

మ. అరయన్ మున్నెఱుఁగంగ నగ్రజు ధనుర్జ్యానిస్వనంబుల్ దిశాం
బర నానాణు విభేదనోద్ధురవినిస్వానంబు సౌమిత్రి యీ
పరమోద్యన్నవరావమున్ విని ప్రభుప్రావీణ్యధారానిరం
తరనూత్నత్వమునందుఁ గాంచె దశకంఠచ్ఛేదనారంభమున్ 208

చ. బిరబిర ముందు సాఁగెను గపివ్రజ మాశరకోటవైపునన్
విరిసిన ఱెక్కలై గరుడి వింటఁ జరించినయట్లుగాఁగ దా
శరథియు వ్యూహశీర్షమున జ్యారవసంతతమూర్తియై సము
ద్ధురగమనుండు లక్ష్మణునితో మునుసాఁగెను సూర్యసూతితో. 209

శా. తత్సేనావినతాతనూభవగరుత్సాకారనిర్మాణ మం
చత్సౌధాగ్రము నెక్కి చూచి దితివంశస్వామి కల్లంతలో
హృత్సంతోషములోఁ గొఱంత సమకూరెన్ స్వీయమహా సేన స
ర్వత్సర్వాకృతిమ న్నిరంతరవినిర్మాణంబు సిద్ధంబుగాన్ 210

వ. వెంబడి నతండు సేనాపతులఁ బిలిచి ప్రహస్తమహాపార్శ్వ మహాకాయులను మేఘనాదుని తత్తన్నియమితద్వారరక్షణమునన్ నియోగించి రథగజతురగపదాతిచమూసర్వసన్నాహంబు సేసి తానుత్తరద్వారంబుకడ నుండి. 211

శా. మ్రోయింపించెను భేరికాతతులు మార్మ్రోయన్ దిశాసంహతుల్
వేయింపించెను గోటకొమ్ములవయిన్ విస్ఫార ఢక్కాతతిన్
వాయింపించెను వాద్యసంతతి రణప్రారంభణోత్సాహిగా
భూయోభూయ ఉదీర్ణ వీరనినదాంభోదారవశ్లిష్టిగా. 212

ఉ. చుట్టు నగడ్త లేనియెడఁ జొచ్చిన క్రోఁతులఁ జొచ్చినట్టుగా
మట్టును బెట్టవచ్చును ప్రమాణము మాలిన తాలత్రోవుచే
నిట్టె యగడ్తలో దుమికి యీఁదెడు క్రోఁతులమీఁద నశ్మముల్
నెట్టగ లక్ష్యశుద్ధి హానణించ దటంచుఁ దలంప రాక్షసుల్ 213

ఉ. కాని యొకండల న్నడుముగా నొకభావము తాండవించుచున్
దానవు లల్లెత్రాటినినదంబు లుదారమనోజ్ఞగీతికా
స్వానముపోలె వచ్చుచును బ్రాణములందునఁ దేలిపోవున
ల్లైనను యుద్ధయత్నములయందు రమింతుర యైదుకెట్లుగన్ 214

చ. రఘువరు జ్యానినాదమధురధ్వనులన్ వినుచుం గపివ్రజం
బఘుతతిముక్త నిర్మలిత ప్రాణులపోలిక నచ్చశౌర్యభా
వఘనమనోవినోద తనుబంధురయష్టులు పోవుచున్ మహో
వఘనగిరీంద్రముల్ జ్వలితవహ్నులు దీపితదైవతాకృతుల్ 215

వ. వానరసైన్యంబు ప్రాకారంబు చేరి శ్రీరామచంద్రధనుష్టంకారంబు
విరామంబు గాంచినంత నుభయపక్షంబులు స్వభావంబుపొంది
వీ రగడిత నీదను వారు తాలు దొర్లించను వీరు కోటగోడ నెగఁ
బ్రాకను వారు దీర్ఘకాష్ఠంబులతో బల్లెములతోఁ ద్రోయను గపి
సేనకు సాధ్యంబుగాక. 216

శా. గోలాంగూలమహేశ్వరుల్ గగనదిక్కూటంబులన్ లంఘనా
హేలాసృత్వరులైనవా ర్పరిఖలో నీదంగ నేలంచుఁ దా
మాలోచించి వియత్పదం బెగిరి కుడ్యంబందునం జేరి యు
ద్వేలుల్ వారును వీరు ఘోరసమరావిర్భూతరోషోగ్రులై 217

చ. ప్రచురగదాసికుంతముల రాక్షససంతతియున్ శిలాతరు
ప్రచయముచేత వానరులు వారిని వీరిని వీరు వారు ను

త్కచులయి తాఁకుచున్ దనువిఘట్టనలం బొనరించుచుం గచా
కచి నఖదంష్ట్రిలన్ విద్రువగా నతిభీషణమై చెలంగఁగా 218

శా. ప్రాకారాగ్రమునందు నీ జరుగు ఘోరం బైన పో రూరిలో
దాఁకం జేరకయుండునట్లు దనుజుల్ దగ్ధోద్ధతుల్ సాయుధుల్
నై కాస్కందనదక్షులున్ నిలిచి రుద్యల్లోహకుడ్యంబు లెం
దాఁకన్ మింటనువచ్చు వానరుల మింటం దాఁకగా నేర్పరుల్. 219

ఉ. గోడలపైన నొక్కొకరి గుంజుచు రుంజుచుఁ ద్రోయుచున్ మఱిం
గాడగనేయుచుణ్ బెనఁగఁగాఁ దుదియంచుననుండి క్రిందికిన్
గోడిగఁద్రోయుచుణ్ మఱియు గోళ్ళులరక్కుచు గోడనొక్కుచున్
వాడిగఁ జూచుచున్ భ్రుకుటిబద్ధముగాఁగ సధూనువహ్నినాన్ 220

సీ. లంఘించుటకు లేదు లాఘవంబున వెన్క
దుముకుటకును లేదు తూగి యెగిరి
దిగుట కెడము లేదు దెప్పరమై రాలు
రప్పలు చెట్లు నుగ్రములు లేదు
కడు విహారాహవకౌశలంబున సమా
విగ్భ్రాతి పచరింప వెసులు లేదు
గోళ్ళతో రక్కఁగా గోఱలఁ గండలు
తీయఁగా నెంతని తెమలఁగలదు,

మల్లయుద్ధంబు వేఱు నిర్మథనకృతియు
వేఱుగా నయి చెడిన కపివ్రజంబు
కుంతఖడ్గాదులకుఁ దాళుకొనను లేక
డిల్లవోయిరి గుములయి వల్లటిలిరి. 221

చ. వెనుకను లక్ష్మణుండు కరవిస్తృతచాపవినిర్గతంబుగా
వినిచిన బాణసంతతుల నిర్భరవృత్తిని గోటగోడపై
దనుజులు నీల్గుచుండినను దైత్యునివెంట మఱొక్కదైత్యుఁడై
కనుకని గోడపై నెడము గల్గదు వేఱొకరుండు నిల్వఁగా. 222

చ. భుజములమీఁద దానవచమూపతు లుగ్రధనుర్వినిర్గతి
స్ఫురణము కల్గఁగాఁ బరిఖ ముంగలి వానరులం గలంచగా
వెరవరి లక్ష్మణుండు తనవింటికొసన్ వెలలించు నమ్ములన్
భుజములమీఁది బాణచయమున్ శమియింపఁగఁ జేయుచుండగన్. 223

మ. ఎవఁడో వానరుఁ డుప్పరం బెగసి తా నేపారి యేదుష్టదా
నవువక్షంబునొ తన్ని వే తిరిగి యంతన్ వచ్చుచో దూరదా
నవచాపంబుననుండి రివ్వుమని బాణంబొండు తద్దేహమున్
విస్పృతంబుం బొనరించు దానిఁ గపియున్ విచ్చున్ మఱొక్కప్పుడున్ 224

చ. ఒక రొక రాక్రమించుచు మహోగ్రులు దానవవానరుల్ ద్రుశా
వికృతులు గోడయంచునను వీడియు వీడని కాలిపట్టు పా
యక పలురీతులం బెనఁగులాడుచు నిద్దఱు మూటకట్టుగా
నొకనిముసంబులోఁ బడుదు రుగ్రపు నీటియగడ్తలోపలన్. 225

శా. ఆరంభించిన దెప్పుడో ప్రథమయీమారంభమై ప్రొద్దు వా
టారంజొచ్చినవేళ యయ్యెఁ గపిసైన్యం బింత ముల్లంత ప్రా
కారంబందున నేర యంచును సమాక్రాంతమ్ము కాకున్న ను
ర్వారన్ వానరు లెందఱో మడిసి దైన్యం బంత శౌర్యంబుగా. 226

క. తెగినంతమంది దానవు
లు గళిత దేహు లనుమాటలో నేముండెన్
తెగిన కపిసేన బ్రదుకుట
యగునా యొక కోపతృప్తి యన్నది కాకన్. 227

శా. ఎచ్చో మారుతి వార్ధి దాఁటునెడ భూభృద్రాజు భూగర్భముం
జొచ్చెన్ వార్ధిజలంబు పోసికొని యచ్చోఁ బూడ్చి దైత్యవ్రజం
బుచ్చైఃకుడ్యము కట్టి తీవ్రపరిరక్షోద్యోగులై యుండగా
నచ్చోఁ బట్టినపట్టుగాఁ గపిచమూవ్యాపార మేపారగన్. 228

ఉ. అచ్చట విచ్చిపోవలయు నాశరకోట్టము లేదయేని తా
మచ్చటఁ జచ్చిపోవలయు నంతయు వానరసేన యంచు దై
త్యోచ్చయతీవ్రయత్నము లహో ఫలమింతయు లేనియట్లుగాఁ
బుచ్చిన యూర్పులేక దితిపుత్రులు రక్షణదుర్భరంబుగా. 229

ఉ. అచ్చటి దైత్యసైన్యపతు లాశరరాజునకున్ వచించి రా
గచ్చును సున్నమున్ బిగియగా నయినట్టిది వేళ లేక యీ
క్రొచ్చెడు క్రోఁతిసేన పెనుగుండులు కొండలు రువ్వుచుండగా
వ్రచ్చుట యెప్పుడో తెలియఁ బట్టదటంచును దీననేత్రులై. 230

వ. అహఃప్రమాణం బెంత మిగిలిన దని యడిగి దివావేళ యూను
శేషంబుగా నున్నదని తెలిసికొని రావణుం డుత్సాహమతి
మంతుండు రథంబుపై నింద్రజిద్గృహంబు సేరి సమర్హణం
బంది కొడుకుతో నిట్లనియె. 231

చ. బయటికి రండటంచుఁ బరిపంథులు పిల్చిన వెళ్ళియుందునే
రయమునఁ గోటముట్టడికిఁ బ్రారభమాణదురూహ మాచు ని
ర్భయమయి పొల్చునట్టి కపివాహిని నచ్చట నచ్చటే వధిం
చి యమునిమందిరమ్మునకుఁ జేరిచి రమ్ము పరాక్రమాంబుధీ. 232

చ. మఱియును నన్నదమ్ములను మానవు లిద్దఱ ఘోరబాణపం
జరములఁ గ్రూరనాగపరిషన్మహోగ్రవిషాభిదూషితో
ద్ధురతనుయష్టిమంతులుగఁ దూల్చెను ధారుణి మద్దిదుంగలై
దొరలుచు రాత్రియెప్పటికో దూసుకపోవ నసుప్రతానముల్. 233

ఉ. ఆరయ నింతలోపలన యామినియుం జనుదెంచుఁ బ్రొద్దు వా
టూరుచు నున్న దాహవమహోమతివై తెఱపించి యుత్తర
ద్వారము వారికిన్ మన కుదారముగా నిడియుద్ధమైన సం
ధ్యాసుధిరాంశువుల్ సెలఁగు నంబరదిక్తతి పిక్కటిల్లగన్. 234

మ. ఇది నీకుం గొనగోటిమీఁదిపని నీ వీ సుంతయున్ జేయ రే
పుదయం బిద్దఱ నెత్రుముద్దలుగ మున్నూహించి యవ్వానరుల్
తుద కింతై తమ తెల్వితక్కువకు సంతోషింతు గా కట్టిన
ట్టిది ఊవంతెనఁ బట్టిపోవుచును ధాటీన్యస్త్రపాబుద్ధులై. 235

క. కవచ శిరోఽంగుళిత్రాణ శరశరాసన కిరీటమణికుండలా
ద్యాలంకరణంబులఁ దాన కట్టాయితంబు సేసి కొడుకును 236

మ. నురువుల్ గ్రక్కెడునట్టి గుఱ్ఱములు మున్నుంగాఁగ మేఘధ్వని
స్ఫురణం బొల్చెడి యంత్రలగ్నకరథంబున్ మేఘనాదుండు ని
ర్భయుఁడై యెక్కి చనంగఁ దండ్రియు దృశాపర్యంతమున్ బోవున
ట్టి రథంబుం గనెఁ బుత్త్రు పంపుటకు ధాటీన్యస్త్రపాబుద్ధియై. 237

వ. అంతలో నుత్తరద్వారంబు వివృతంబై దానవచమూచమూ
పతులు నిర్ధూతకపిసేనాసమూహంబుగా రథంబులు గజము లశ్వం
బులు పతాకలు కొమ్ముబూరాలు తప్పెటలు శంఖంబులుగా
సముద్రమువోలె విరిసివచ్చిన నీశాన్యగత నూత్ననిర్మిత ప్రాకార
భాగంబున నున్న కపుల దానవు లోయ్యోయి కపులార!
ప్రాకారభేదనవృథాశ్రమం బేల పొండని తోలిన నిరుకతులకుఁ
దొలుత దొమ్మియై పిదప ద్వంద్వయుద్ధ మారంభమై, 238

మధ్యాక్కఱలు

సంపాతి యన్ గపీశ్వరుఁ బ్రజంఘురాక్షసుఁ డెదిరించి
యంపవానను ముంప వానరాధీశుఁ డావాన నైన
రొంపిలో నీదుచుఁ బోయి రోషోగ్రరూక్షాక్షములను
దంపనాగలిఁబోలె నసురతండ ముద్ధతుఁడయి దున్నె 239

మఱియుఁ బ్రజంఘుండు వాన మానక ములయించుచుండఁ
దొరగక సంపాతి బొట్టు తుడవక దున్నపై వాన
కురిసినయట్టులు పోయి కూడి రక్షోవీరుబండి
యిగ సూడఁదీసిన నొరిగి యిట్టట్టు లెగిరె దానవుఁడు 240

చ. ఉరుభుజశాలి నన్ గరువ మొప్పెడు దైత్యుఁడు జంబుమాలి తా
నెఱిఁగి యొఱంగి దూరమున నేగెడు మారుతిఁగాంచి వానిపైఁ
బరగఁగఁ జేసెఁ దీవ్రమగు బాణపరంపర వాయుసూతి య
బ్బురముగ వానిఁగాంచి మఱిపోవఁగఁ జొచ్చె నిరాదరంబుగన్. 241

ఉ. వంచనచేసి దూతుఁడయి వచ్చి ప్రహాస్యముగాఁగఁ గొంప లం
టించుటకాదు యుద్ధము నటించుటకాదు యథార్థమైన పో
రంచును జంబుమాలి రథ మాతనివెంబడిఁ దోలి నిప్పు ము
ట్టించినయట్లు నమ్ము నిగిడించిన మారుతి కక్కసించుచున్. 242

ఆ. బండి బండిగాఁగఁ బైకెత్తి సారథి
యశ్వములును రథియు నడ్డయిరుసు
పోలు కాడి తడక పొడిగాగ నేలను
వేసి చమరె హనుమ త్రాసకముగ 243

మధ్యాక్కఱ

ప్రతపనుం డన్నట్టి పెద్దరక్కసి ప్రబలుఁడై నళుని
వెతపెట్టి కాఱించె బాణవితతిఁ గ్రువ్విన మేను గాఁగ
మఱి మండి వానిపై దూఁకి మఱియును మఱి గోళ్ళ రక్కి
యతని కన్నులు పీకె నలుఁడు నతఁడు హాహాకృతుల్ సేయ. 244

ఉ. ఆవిలకోపుఁడై ప్రఘసు డన్వనురక్కసి దీర్ఘదీర్ఘబా
హావివృతత్వమున్ గ్రహణ మాస్యబిలంబునఁ గ్రుక్కికొంటగాఁ
దీవర మూనఁ గ్రోతులకు దెప్పరమైనను వానిఁజూచి సు
గ్రీవుఁడు నొక్కి వానిదగు గ్రీవము చంపెను వాని నుగ్రుఁడై. 245

వ. అగ్నికేతువు రశ్మికేతువు సుప్తఘ్నుఁడు యజ్ఞకోపుఁ డన్న నల్వురు దైత్యులు నాల్గువైపులనుండి శ్రీరామచంద్రునిఁ దాఁకి యతని సంహరించి దైత్యరాజుదయ పొందవలెనని నిశితతీవ్రబాణములు పరగింప రాముండు నొక్కసారి నలుదిక్కులఁ బ్రసరింపించిన నాల్గుబాణములతో వారిని సంహరించె. 246

మ. అది దూరంబుననుండి కన్గొనియె దైత్యాధీశుసూనుండు స
మ్మదనేత్రంబుల మేఘనాదుఁడును రామస్వామి విల్నారు పొ
ప్పిదమై కంటఁ దళుక్కుమం చనగ నిర్వీరుండు చాలున్ గ్రుధా
గ్రహదుఁడై యీగతి లంకపై విడువగానంచుం దలంచెన్ మదిన్. 247

ఆ. అల తళుక్కుమనుట యాతని విద్దియ
నేర్పు యతని మేనికూర్పు తెలియ
నాడుచున్న యుద్ధ మది త్యజింపనురామి
యింద్రజిత్తు మనసు నేమరించె 248

మైందుండు వజ్రముష్టి యను మత్తుండు మహితరాక్షసుఁడు
కంది యన్యోన్యంబు ముష్టిఘాతముల్ గా యుద్ధమాడ
మైందుని నొక తన్ను తన్నె మత్తిల్లుమాట దానవుఁడు
మైందుండు వానినిఁబట్టి మస్తంబు మలయించి చంపె. 249

నిగిడి నికుంభుఁ డన్వాఁడు నీలుని నీలాంజనోగ్ర
నగనిభదేహునిఁ దీవ్రనారాచనద్ధాంగుఁ జేసి
నగి యిట్టులనె నోరియోరి నల్లని నల్లని కోతి
యొగచుచున్నది నీదు మేన నెఱ్ఱని యెఱ్ఱని నెత్రు. 250

కోఁతులు రాజ్యాలు పోల్ల కోటలకున్ ముట్టడులును
చేతులు గోళ్ళులు కాళ్ళు శితశరాక్షీణసంతతులు
మీ తెల్వి యేమిరా యంచు మేలమ్ము మెలచి నికుంభుఁ
డాతతాయితనంబు నీలు నందు దుష్టాకృతి చూచి. 251

మఱిమఱి బాణముల్ పుచ్చె మత్తిల్లి మతిలేని యసుర
విఱుచుక పడినట్టి కొండ విధమున విరిసి నీలుండు
పసవెత్తి యాతనిబండిపైఁ బడి బండిముక్కలుగ
విఱిచి చక్రముతోడ వాని విద్ధు నుర్వీగతుఁ జేసె. 252

అశనిప్రభుం డన్నయట్టి యసుర యాహవమత్తవృత్తి
విశిఖప్రతానంబు చేసి ద్వివిదుని విద్ధాంగుఁ జేయ
యశనిఘోరాకృతి ద్వివిదుఁ డతితర మైనట్టి పర్వ
తశిఖరముం బుచ్చి వానిగర్వంబు తఱుఁగఁగాఁ జేసె. 253

మ. ఒగి మాయాసకలాగమాంబునిధి విద్యున్మాలియున్ బండిము
న్నుగ యుద్ధార్థము వచ్చుచుండిన సుషేణుం గాంచి యోకోతి! నీ

పోగరుం దించెద నంచుఁ జిక్కనిశరంబుల్ వానిపైనింపఁదా
నుగ్రక్రోధారుణఘూర్ణితాక్షుఁడుసుషేణుండుగ్రరుద్రాకృతిన్. 254

మ. ఒనరన్ గొండ నొకండు పై విసరి విద్యున్మాలిబండిన్ తునా
తునుకల్ సేసినఁ బ్రక్కగా దుమికి విద్యున్మాలియున్ లాఘవం
బునఁ దోడ్తోఁ బరగించెఁ బెల్లుగ శరంబుల్ నెత్తురుంగాల్వ ముం
చినయట్లయ్యె సుషేణుదేహమును బూచెన్ బెద్దతంగేడునాన్. 255

మ. తిరుగన్ వేఱొక పెద్దబండ గొని యుద్వృత్తిన్ సుషేణుండు తీ
వర మేపారగ వానిపై విసరఁబోవన్ వాఁడు నీలోపలన్
శరమున్ వజ్రసమంబు నాటెఁ గపివర్యుంబందు నాబాణమున్
సరకున్ సేయక వానరుండు శిలతోఁ జంపెన్ సురారాతినిన్. 256

ఉ. ఎంచఁగఁ జిత్ర మీ జగతి నిట్లుగఁ జేతు రఘుంబు నిట్ల సి
ద్ధించు ఫలంబు కొందఱకు దెవ్వరమై రఘురామసోదరో
దంచితమస్తకంబులు ధరాత్మజనుం గికురింప నిన్నఁ జూ
పించెను వాఁడు వానితల పిప్పిగ నయ్యెను నేడు వెంటనే. 257

ఉ. ఎంచగ దూరమం దరుగు నింద్రజి నింద్రజి వాఁడె యంచుఁ జూ
పించెను మారుతాత్మజుఁడు భీషణమూర్తికి వాలిసూతికిన్
వంచన బ్రహ్మమంత్రమున బంధితుఁ జేసెను పావమాని వీఁ
డంచును కోప మంగదున కాతఁడు నింద్రజి పైకి దూఁకుచో. 258

ఉ. ఆతని నావఁ జూచెఁ బవనాత్మజుఁ డాతనితోడ నేలయం
చాతనిఁ జూపుమం చడిగి తందుకుఁ జూపితి నన్న మాటతో
నాతఁడు మారుతాత్మజుని యాడిన మాటలు లెక్కసేయకన్
ఘాతవిచిత్రదంతముల తళ్కుల నింద్రజిఁ జేరి యిట్లనెన్ 259

మ. అరరే మద్గురు నంజనీసుతుని బ్రహ్మాస్త్రంబు సంధించి య
బ్బుర మేపారఁగఁ గట్టివేసితివటే భూమీజ దర్శింప నా
గరమున్ దాఁకి రమేశుదూతయయి రాఁగా నేను నాపైన నా
శరముందూయుమురా మఱేమియొసరించంజూచెనో నిన్నిటన్ 260

క. అని వాని బండిగుఱ్ఱము
లను గళ్ళెములందుఁ ద్రాళ్ళులన్ లాగుచు ని
ల్చిన నింద్రజి నవ్వుచు మఱి
వినిపింపుము నీదు పేరు విందు ననంగన్ 261

మ. పదిగొంతుల్ గుఱువెట్ట నువ్వుజలముల్ పాథోధు లేడింట దో
ర్మదవృత్తిం గుదియించి పట్టికొనుచుం ద్రావించెనే వీఁడె
యది యావీరుని పేరెఱుంగుదువ నే నావీరు సూనుండ దు
ర్మదుఁడై యట్టులసేత యెవ్వఁడనిరా మాహేశ్వరున్ మారుతిన్ 262

గీ. ఇంద్రజియుఁ బిల్ల కాకికి నేమి తెలియు
రయ్య యుండేలు దెబ్బని యంతవాని
కొడుకవై యింతగాఁ జెప్పికొనుట తగున
పగ్గములు వీడి నిలువుంచుఁ బలుకుచుండ 263

చ. వెలయుచు సూర్యరశ్ములను విద్రుమకాంతులు చిందులాడఁగా
జలనిధినీర మెల్లఁ గపిసైన్యముగాఁ గనిపించి దానవా
వలికిని గుండెలన్ బెదురు వచ్చెను వెచ్చనినెత్తు రొప్పి దై
త్యుల మనిపించినంతఁ బరితోషము చెందిరి యుద్ధబుద్ధులై 264

చ. చినిగిన ప్రేవులై చన నశించినయట్టి దివాశగీరవున్
దిని పెనుకాలము న్నసురి నెత్తురు ద్రావిన నోట నావులిం
చిన దన నొప్పె రోదసి నిశీథిని వచ్చిన దానిదైన ను
త్తును వదలించు టెట్టులనొ తోచదు తూచదు వెల్గులేకయున్. 265

ఉ. పల్లనిబావ్రుటా లసురనాథుల వన్నియు నెఱ్ఱకాంతి సం
ధిల్లఁగఁ గావినన్న హవణించిన వానరకోటి యాత్మనై
నోల్లపనం బటంచు మఱియున్ దితిజాతుల తీవ్రహా శరా
పేల్లితదేహులై తెలిసి వెక్కసపాటు భజింతు రెంతయున్ 266

చ. రణమున వానరుల్ వినరు రా ల్పెనుమాంసపుముద్ద లంచుఁ జి
క్కణమతులైన రాక్షసులు ఘట్టితదేహు లెఱుంగునంతలోఁ
గణతలు తాఁకి ప్రాణములు కాలునివట్టణవీథు లేగునో
ఘణఘణ మ్రోఁతలై హరిశతారనిపాతము లట్లు లేచునో. 267

క. ఒర దూసిన కరవాలము
లరి నఱుకకయుండ నెత్తురై కనిపింపన్
సురరిపులును శుభశకున
స్ఫురణంబుల ముద్దుగొంచుఁ జొత్తురు పోరన్. 268

ఉ. శ్రీరఘురామచంద్రుని శరీర మదేదియొ పుణ్యవృక్షశా
ఖాసుచిరాంశుకోన్నతశిఖాకకిసాలయగుచ్ఛమట్లు లిం
పారినఁ జూచు చ య్యుభయపక్షములున్ మధురభ్రమోహధా
రారసితాత్ములై తెలియరాక నిమేషము తల్లడిల్లుచున్. 269

మ. తనయన్నం గని లక్ష్మణుం డతనిసౌందర్యంబు తా నింతక
న్నను ము న్నింతగఁ గన్నులం దలఁచియున్న ట్లింతయున్ లేక వి
చ్చిన వైకుంఠకవాటతోరణసుమశ్రీమంజుకింజల్కరం
జనదాగ్రోత్తగవచ్చెస్వామియనుచున్ సంభ్రాంతుఁడై చొక్కగన్

మ ధ్యా క్క ఱ ఱు

ఏ గదచేత మున్ను రిపు లెందఱో యెందఱో చచ్చి
రో గదన్ దానిని విసరె రోషనిరూఢి నింద్రజియు

వేగమై యంగదుమీఁద విసరిన విస్ఫారగదయు
నే గిరినైనఁ జేసెడిన యింతలు నింతముక్కలుగ. 271

అంగదుఁ డా దెబ్బను దిని యడుగొక్కఁడైనఁ గదల్చ
దంగారకములు కణకణలాడిన ట్లక్షులు తోఁచఁ
బొంగి యింద్రజి బండిమీఁదఁ బోయి యబ్బురపాటు కలుగ
నింగికి నెత్తి యాడించి నేలపై నిడివిగా విసరె. 272

చ. రథము మఱల్చె యశ్వములు రావణి చక్రయుగంబు పోలు సా
రథియును నున్న దున్నటుల రాణవహించెను పెద్దమల్లుఁడు
త్పథమున వేఱ మల్లు విద్రువన్ గిరికీలుగ మింట నొప్పి వేఁ
బృథివికి డిగ్గినట్లు కనిసించిన మాయగఁ దోఁచె నెంతయున్. 273

చ. అలయక యన్ని వేళలను నన్నిస్థలంబుల నిండి యుండఁగా
వలయున వెల్గు, వెల్గుల స్వభావము నట్టిద, దానిశక్తిలోఁ
దొలఁగుట, నిండుటన్నయది తోఁచని వస్తు నదేదో, పంచపం
చలఁ బడి, యడ్డువచ్చినఁ బ్రసారము లేమియె చిత్రమయ్యెడిన్. 274

ఉ. అక్కట! యెచ్చటం బడిన నచ్చట నుండగనైన వెల్గు లా
యెక్కడినుండియో మఱియు నెచ్చటికో చనుదెంచు టేమి? యా
యెక్కఁడు దానికడ్డమయి యుండఁగఁ జాలుటయేమి? చీఁకటుల్
పిక్కటిలంగ నైనదగు బెట్ట యిదేటికి లోకమందునన్ 275

ఉ. ఆవెలుఁగుల్ సమస్తమునయందున నుండఁగ మున్న చీఁకటుల్
ద్రోవలుకొట్టి దవ్వులకుఁ దోలెను గావలె వెల్గురేకలన్
గైవస మావరించికొని కానలు కొండలు వెన్కపీటిగాఁ
గావలుఁ డేగుదెంచి యెసకంబుగ నెంతయునైనఁ జేసెడిన్ 276

చ. తనదగు జన్మ సంశయగతంబగు పేనిక్, నట్టివానిజీ
వన మిటులుండు, నెప్పుడును బ్రహ్మవిరోధి యతండు సత్పదా
ర్థనిరతభావదూషణపరాక్రమబుద్ధి మఱింగుజాతియై
చని తనజన్మహేతువగు జాతికి నిత్యపరోక్షశత్రువై. 283

చ. మెరవడి నట్టిచీఁకటి సమీపము రాఁగని మేఘనాదుఁడు
ద్ధురతరహాస చంక్రమణఘూర్ణవహుఁ డంగదుమీఁది కేఁగ ని
ర్భరమతి వానరాళియునరాజు క్రుధావరిదీప్తవహ్ని జ
జ్జ్వలితశిఖాకలాపవిధురక్రియ బాహులు తాండవింపఁగా. 284

ఉ. ఆతని బండిపైకిఁ జని యశ్వచతుష్టయకంఠముల్ ధురా
స్ఫీతిగ ఫెళ్ళునన్ విఱిచి సింహముపోలిక దూఁకి సారథిన్
వే తలఁ బూని వాఁడు పలవింప మెడన్ మలయించి త్రిప్పి ని
ర్ధూతిగ వాని నేలపయిఁ దూలిచి బండిని మింటికెత్తుచున్. 285

గీ. కడఁగి యూగించి పడవైచి కాలఁ జమరి
యూఁగి ముక్కలు ముక్కలుగా గాఁగఁ జేసెఁ
బరమలాఘవుఁ డయిన రావణియు నంత
మింటికెగిరె యచ్చటఁ జంక్రమించుచుండె. 286

ఉ. ఇంద్రజి కిట్లుగా జయగు లెన్నఁడు లేనిది దైత్యసైన్యముల్
సాంద్రఘృణాసమర్పితదృశాపరివిహ్వలు లౌచుఁ జూడగాఁ
జంద్రమతుల్, కపుల్ ప్రహసితప్రముదానను లౌచు నార్చ్చ నం
తం ద్రపమాలి కోపమున దైత్యులు వానరకోటిఁ దాఁకు చో. 237

సీ. శరదాంతరవశక్షుజలధరం బొక్కండు
దూదిపింజియపోలె దూఁకుచుండ
కోటియోజనదూరకుట్టనోగ్రగనిగూపి
తము తార మిన్కు మిన్కు మనుచుండ

ఒకదిశాదారువు పెకలి పేడెత్తిన
మినువన్నెమబ్బొండు మెసలుచుండ
తారకాకాంతి సంధ్యారాగమమతచే
నించుమించుగ సంచరించుచుండ

నిర్మలం బనిపించెడు నింగియందుఁ
జూచుచునె వానకాఱుపెచ్చు లనఁ బొల్చు
చిఱుతమబ్బులు పిల్లలఁ జేసినట్లు
మూసికొని వచ్చె నాకసమున భృశంబు. 288

ఉ. వింతలు చీఁకటుల్ విరిసె విచ్చిన మబ్బుల చేతఁగానివిన్
సంతతతారకాసుమము సాఁగఁగనీనివి దగ్గరల్ సమా
క్రాంతము లౌచు నొక్కొకరిఁ గానఁగనీనివి దైత్యమాయ దృ
ష్టాంతములైనవై విరచితాఖిలదిక్ప్రతిషేధభావముల్. 289

మ. మఱియున్ వార్షుకకృష్ణపక్షనిశలన్ మత్తాంబుదానేకముల్
విరియంగా సందులనుండి తారకల యే వెల్గో బహుస్వల్పమై
పొగయున్ దృష్టికి నందుచున్నయటులం బోలంగ నీ వింతరా
నిరులే వస్తువుకాద సందులని యుం దేర్పాటుగా నొప్పఁగన్. 290

ఉ. గాటపుఁ బెల్లుచీఁకటిని గట్టిగఁ గన్నులు మూయఁ గన్బొమల్
మీటిన ఫాలభాగమున మెల్లన తెల్లని వెల్గు తోఁచు నే
చోటటిదియో హృదంతరవిశుద్ధము దర్శనశక్తి యేమొ యీ
గాటపుఁ జీఁకటుల్ వెలికిఁ గానివి లోనికినైనఁ గానివిన్. 291

గీ. వీఁడు కపియంచుఁ దెలియక వీఁడు దైత్యుఁ
డంచుఁ దెలియక వానిపై నంపవాన
నింపగా వానిపై శిలానిచయ మెల్లఁ
బంపఁగాఁ గంటివెల్గుల పాటు లేక. 292

సీ. నేను విద్యున్మాలినిర మహాకాయుఁడా
కొండంతదెబ్బను గొట్టినావు
ఓరి రుండీ నేనురోయి మహాదంష్ట్రుఁ
డను నంత దెబ్బ కొట్టకుము నన్ను
అయ్యో నీ వా తీవ్రమైన బాణముచేత
గుండియ వ్రచ్చితి కుటిలదంష్ట్రి
వీఁడెవ్వఁడో కపివీరుండు కావలెఁ
దెలియకుండఁగ వచ్చి కలఁచె నన్ను

నంచు దైతేయసైన్యంబు లటమటించి
మునిగి మిన్నంటు నాక్రోశముం బొనర్పఁ
గపిచముపు లున్నచోటఁ జీఁకట్లు సుంత
విరిసి కపు లల్లనల్లఁ గన్పించుచుండ 293

శా. సింహాస్వానవిదీర్ణదిక్కుహరదాక్షిణ్యేతరాహంక్రియా,
బంహిష్ఠోగ్రపరాక్రమోచ్చలితదుర్వాగ్వావదూకక్రియా
రంహుల్ దైత్యులు కానిపించు కపివారంబందు నారాచపా
తాంహఃప్రక్రియఁ బొల్చి రాహవనయవ్యాపారదూరీకృతుల్. 294

చ. వనరుచునున్న వానరులు వచ్చిన బాణపు సూటిగాఁగ దూఁ
కిన మఱి దూఁకినట్టియెడఁ గృత్రిముఁడౌ దనుజాతు బంశియేఁ
గనఁబడదైన స్వీయకపికాండము నిల్చినచోటు కన్పడున్
జనుటకునైన వెన్దిరిగి సాగిన యూహగ సంతసించుచున్. 295

మ. ఎవఁడో మూర్ఖుఁడు దానవుండు రణతీవ్రోద్యోగమున్ బట్టికో
నవు నేర్పేది రథంబు వానరులమధ్యం దోలినన్ సర్వదా
నవసంహారము వానికొక్కనికె సంధానించుఁ గీశవ్రజం
బవురా! చీఁకటిమీఁద నైన కసితోడై వడ్డిగాఁ దీర్చుచున్ 296

మ. ఒకయాశ్చర్యముఁ గాంగఁ దోఁచినది దైత్యుల్ చూడఁగాఁ జూడ నెం
త కపుల్ బాణము లగ్లి గ్రుచ్చికొని మేనన్ సందలున్ వేలు తా
నొకఁడుం జావడు నేలపైఁ బడఁడు తీవ్రోత్సాహియై క్రోధియై
పెకలించున్ శరముల్ గటారమువలెన్ వీచున్ రిపుశ్రేణిపై. 297

క. ఒకదాడిలోఁ గసితే
రక పశువులమంద తోలి ఝాల్గుప్పినటుల్
చకితులయి శరవ్యులు కా
మికిఁ గొంపలు కోఁతు లిడులు మేలని చొఱఁగన్. 298

మ. అకటా! చీఁకటితో నభేదమతులై యా దైత్యులున్ రామభ
ల్లుకముల్ కానల నంధకారమున నాలోకింపఁగాఁ గల్గు వా
డుకయై దానవసేనఁ జొచ్చి పెనుదండుల్ బెండులం జేయ నూ
రక వీక్షింతురు చీఁకటుల్ తమరిపై రానైన వ్యత్యాసమున్. 299

గీ. బాణములు వాన యగుటనో భల్లుకముల
పైనిఁ బనిచేయకుండెను భల్లుకములు
ముట్టె ముంగాళ్ళలో నిడి చుట్టగాఁగ
దొరలి చూర్ణంబు సేయ దైత్యులబలంబు. 300

గీ. అప్రమత్తులై యుండుఁడీ యఖిలకీశ
చములారా! యటంచును స్వామి చెప్పె
శింజినీరుతి మేళిపించి గళరవము
'బ్రహ్మదత్తవరుండు రావణి' యటంచు. 301

శా. మాయాయుద్ధవిశారదుం డయి త్రియామా వేళ ప్రాపింపఁగా
నీయాంధ్యమ్ము సృజించె వానరభుజాహేలాతిరస్కారిగా
నా యే మిన్ననుండి బాణతతి తా నేతెంచు నా మిన్న కం
దోయిం గన్పడకుండ ధూర్తరణపాథోరాశినిర్మాతయై. 302

మ. అనుచుండన్ వినిపించె మిన్నున నమోఘారావమేఘారవం
బునఁ జెంజీఁకటి చీల్చుకొంచు వచనంబుల్ దర్పపాథోనిధుల్.
ఘనపంకావిలమైన యేఱునఁ బొరల్గా వచ్చు నీటింబలెన్
విషమచ్ఛిద్రభుజంగదంష్ట్రిలఁబడిన్ విచ్చేయు ధారంబలెన్. 303

ఉ. తేలికగాఁగ వారిజలధిం దరియించితి రింద్రజిద్భుజో
ద్వేలపరాక్రమాంబుధికిఁ బెట్టుదు మాతము రాలవంతెనన్
దూలినయట్టి ప్రాణములతోఁ దలమున్కలు పుక్కిలింతలై
తేలఁగవేయుచుం గనులు తెట్టెలు కట్టుచుఁ గొండలంచులన్. 304

ఉ. కట్టిన దిండ్ల విండ్లఁ బెనఁగం జనుదెంచి పెద్దనేర్చుచున్
జుట్టిన పాఁపచుట్టలయి చూడిన బొమ్మలఁ బూఁతతంగెడుల్
కట్టిన కట్లుగా నోడలు కాళ్లను జేతులు నాడకుండఁగాఁ
బట్టినదారిగా యమునిపట్టణవీధికిఁ జేరవచ్చుచున్. 305

క. కనిపించిన దవ్వునఁ బ
ట్టను వచ్చును రోదసీకటాహమునందున్
వినిపించిన దవ్వునఁ గొ
ట్టను వచ్చును రోదసీకటాహము పగులన్. 306

చ. వెలుఁగులె లెక్కపెట్టెదరు వెట్టులు వేల్పులు సంతతంబు నె
ట్టులయిన మానవుల్ మఱియిరుల్ కనిపింపఁగనీని పెందరుల్
తెలియగలేరు ప్రాణములు తీసెడిచోటులు వానిలోపలన్
మెలఁగఁగ, లేనిచో వెలుఁగు నేలిమి యెప్పుడు నున్నదే కదా 307

శా. సీతం దెచ్చెను తండ్రి నేనయినచో శ్రీరాఘవుం దెచ్చెదన్
సీతం దెచ్చిన రాఘవుం డిటకువచ్చెం గోపియై చాపియై
సీతాదేవియు రాద రాఘవునిఁదెచ్చె న్నాఁగఁ, దావచ్చినన్
సీతాదేవియుఁ బ్రార్థనావివశదాసీభూతయై యుండెడున్. 308

గీ. అన్ని విద్యలు బ్రాహ్మణులందె లేవు
కొన్ని క్షత్రియులందునఁ గొన్ని దైత్యు
లందు నున్నవి తెలియ రన్యోన్య మవియు
దానవుల గెల్వఁగారాదు మానవులకు 309

శా. లేసంబై చను చోటి చీఁకటులపై లేదింతయున్ శక్తి ప్ర
జ్ఞానార్చిఃపటలప్రభాసితతి కజ్ఞానానికిన్ దాని వి
ద్యానైపుణ్యము దాని కున్నవియుఁ దానై కొన్నిచోట్లన్ సమ
స్తాసన్ దక్షము, తద్వ్యయంబు ప్రళయాంతంబైనచో నొప్పునో. 310

మ. ఇవిగో కన్పడరాక యుద్ధజ మహాహిక్రూరనారాచర
జ్జువులం గట్టెద నంగుళాంగుళము మైఁ జూడింతుఁ గాడింతు మూ
ర్ఛపడన్ రేనడిజామునన్ విడిచిపోఁ బ్రాణంబు లూనంబులై
రవి రే పవ్వలఁ దీయ రాఘవశిరశ్శరానుపుష్పంబులన్. 311

గీ. అంత రామచంద్రుఁ డతనిని దనచేతి
మీఁదుగా వధింపఁగా దయార్ద్ర
హృదయుఁ డగుచు నిర్ణయించెఁ జేయ నటంచు
నంత మింట వచ్చె నంపవాన. 312

సీ. అప్రత్యభిజ్ఞాతమహా దిశాయాతముల్
శరపరంపరలచే విరిసి విరిసి
అశనిప్రరోహబాలిశము లరుంతుదం
బులు బాణములచేతఁ బొక్కి పొక్కి
ప్రతిభాముఖంబు లప్రతిసమాధేయమ్ము
లగు వృషత్కములచే నలసియలసి
అప్రతర్క్యత్వరాహంకార ఝుంకార
పాతిత నారాచపటలిఁ బెటిలి

ఒడ్డుకొను-చోటఁ గొట్టగాఁబడ్డ మేన
తప్పికొను-చోట శరపాత మొప్పె మేన
వీగికొను-చోట ముల్కి గ్రువ్వినది మేన
రాఘవశరీరములు శరారామమయ్యె.

సీ. మిన్నువంకను జూచుచున్నఁగానీ కన్ను
వ్రాలినమేర బాణాలెగాని
వచ్చుబాణము తీయ నెచ్చుఁగానీ వ్రేళ్ళ
గ్రుచ్చుచుండిన యంపకోలగాని
తిరుగ బాణమ్ము సంధించుఁగానీ దాని
పరగించునెడ నేటుపడదుగాని
తన యమ్ము గొనఁ బ్రయత్నమ్ముగానీ కక్ష
భాగతాడనకలాపమ్ము గాని

కాల్కదుప వీలులేదును గై కదల్ప
వీలులేదును పంజరవిధముగాఁగఁ
బంజరంబైనఁ గాని లోపలఁ జరింప
సుంత యెడ యున్నయట్లు తోఁచను నిజంబు. 314

సీ. పడినప్డు దంభోళిపాతఘాతములయ్యెఁ
గలితదంష్ట్రాభుజంగములు చుట్ట
లై చుట్టికొనెడు బాహాదండములయందు
నల గగురా దేహయష్టులందు
కదలనీయవు కాళ్లు మెదలనీయవు మేను
లంతట మంత్రించినట్లు గాఁగ
మెసలనీయవు సుంత మసలనీయ వాకింత
నంగనుల్ జంత్రించి నట్లు గాఁగ

తనువు ఛాయయి పక్షపాతంబు వచ్చి
యల్లి పెంబేదలయిన సింహములనోలె
నన్నదమ్ములు కదలిక యఱి విలోచ
నాంతముల దేవతామూర్తు లగుచు నిలువ. 315

ఉ. మున్ను కబంధదానవుఁడు ముట్టినయప్పుడు కూడ ధైర్యపుం
దెన్నున వీగిపోని రణధీరుఁడు రాముఁడు కన్నులందునం
గ్రన్నన జాలి యూట కొనఁ గన్గొని తమ్ముని, పేఁడొకండు న
న్నన్నని గూని వెంటఁబడి నూల్కొనె నీగతికైు తగుల్కొనన్.

వ. అనుకొంచు సుషేణ నీలాంగద శరభ వినత జాంబవదృషభులను చుక్కలతోవ వానియిక్క యెక్కడనో త్రొక్కిరమ్మని పలు దిక్కుల వారి నొక్కనొక్కనిఁ బంపిన వారు మిన్నెల్లఁ దిరిగిన వారెగాని, వాని కలచోటు నెఱిఁగినవారు గాక వాని గ్రుచ్చిన యమ్ములచే నేదుపంఁదులనోలెఁ దిరిగివచ్చిన. 317

మ. తన జ్యానిస్వనగీతికారవముచే దైత్యున్ విమోహింపఁజే
యను వాంఛించెను స్వామి, యేమియగుఁ జేయూఁడంగ రాకుండినన్
దనకుం దమ్మునకున్ దనూయుగమునం దంగేడులై ప్రూచెఁ బూ
చిన తంగేడులు నెఱ్ఱతేన లొలికించె న్నాఁగఁ గన్పించుచున్ 318

గీ. ఇంద్రగోపచ్ఛటాసమావృతము లయిన
వార్షుకములు నీలానీలపల్లవములు
తరుణనవతమాలారగ్వధములవోలె
నెఱి చెడి రఘూద్వహులు శయనించినారు. 319

క. తా మేనిబాధ వదలఁగ
స్వామి సమాధిగతుఁడయ్యె సౌమిత్రికిఁ దా

నేమో తెలియను రాముని
నేమో యేమో తలంచు నేర్పడరాకన్ 320

చ. మరియును బ్రాణముల్ కలవు మానవనాయకు లిద్దఱుం జలిం
పరు కనులెత్తి చూడరును బ్రాణము లున్నవనంగ వీలుతే
దొరిగి శయించి ధాత్రిపయి నుండిరి ముక్కున బ్రేళ్ళుపెట్ట నూ
పిరియును నాడునట్లు కనిపించదు వానను లానటిల్ల గన్ 321

వ. అంత నింద్రజిత్తు సర్వకపిసేనాపతులను సమంతమదములయిన బాణమ్ముల గాడనేసి యందఱుం జదికిలబడి నిస్సహాయులై యుండగా నమ్ముల బరగించు టాపి మింటినుండి జ్యామహానిస్వానమ్ముతోc బాటు వికటాట్టహాసంబు నేసి యిట్లనియె. 322

క. ఈ కట్లు విప్పవాc డీ
లోకంబున లేcడ యింతలో శవిపొడుచుం
గాకుత్స్థుల ప్రాణంబులు
కోశాల్లలు మహిమ రాట్కకుత్థ్సంబులుగా. 323

శా. ఓహో దానవులార మీరుడుగుడీ యుద్ధంబు, స్వీయంబులౌ
గేహంబుల్ చని యాత్మయావతము కోcగిళ్ళందు నిద్రించుcడీ
మాహాత్మ్యం బఱి మానవద్వయము నస్మద్బాణసంపాతసం
దేహాత్ముల్ శయనించి రాహవధరిత్రిన్ రక్తపిండంబులై 324

ఉ. వాసుకితత్కాదు లహీవల్లభు లూర్జితు లస్మదీయబా
హాశరమూర్తు లుగ్రవిషు లంగములం బిగియించి రిద్దఱన్
బాసిరి తెల్వి యెల్లc గడcబట్టెను బ్రాణచయంబు రేపు ప్రా
చీసతి పైటయం దెఱుపు చెక్కను భానుcడు పైడినాక్కలన్. 325

సీ. కపిసైన్యమింత చీఁకటి నెత్తినన్ వేసి
కొని తెల్లవారించుకొనును దాను
పదఁడా గృహంబులు కదలి యీకపిసేన
శే వంబురాశి తరించిపోవు
నున్న దిగడ కట్టికొన్నట్టి వంతెన
తెల్వితక్కువఁగ ధాత్రిం గలట్టి
యడవులు గుట్టలు నడ్డకట్టను గట్టఁ
బెకలించుకొన్నారు వెళ్ళి మఱల

బొరియలందుననిద్దురపోవలయును
మన్నుతినవలెఁ బోయి, మీ మత్తకాశి
నీసమాజంబు చెక్కిళ్ళ నిద్రపోండు
బెడఁద వాసెను గ్రోఁతులపిండువలన. 326

వ. అంత దానవు లెల్లరు బండ్లు మళ్ళించుకొని పురప్రవేశంబు సేసి ద్వారంబులు బంధించుకొని, క్రమ్మిన మాయాంధకారంబు విరిగి పోయి చుక్క లొక్కొక్కండు తోఁచిన. 327

గీ. మేఘనాదుండు తండ్రిసమీప మేగి
జగదసాధ్యమహాకార్యసాధనప్ర
వీణతాసూచిమంథరవీక్షణములఁ
బ్రౌఢశూరతనూముగ్ధభంగిమముల. 328

మ. శరధారాంతము పెల్లగించితి మనశ్శల్యంబు నీ వింక సు
స్థిరుఁ డౌచున్ దివిషత్సపత్నకధరిత్రీసార్వభౌముండ వం
బురుహాప్తుం డుదయించుదాఁక శశి యంభోరాశిఁ బొంగించుదాఁ
క రమామూర్తివి యేలుకొమ్ము త్రిజగత్కామాంకుశాకారుఁడై.

క. ఏ కట్లు కట్టినాఁడనో
యాకట్లను విప్పఁగలుగు నాతఁడు లేఁ డీ
లోకంబందున, రేఁపటి
దాఁకన్ గాకుత్థ్సు లసువథావ నిలువకున్. 330

శా. నీచుల్ కోఁతులు వడ్డగాఘువులపొం జెన్ గొంతు కాఁప్పుండి నా
రాచంబుల్ వరగింప నేను గనులన్ రక్షించుకొంచుండి దం
ష్ట్రాచంద్రాతపమందు మద్వైశిఖధారాధాళధళ్యంబు భీ
వైచిత్ర్యంబు ఘటింప బిక్క మొగముల్ వడ్డారయా! మిత్రా! 331

గీ. ఎఱిఁగి యెఱిఁగి నీయూరిపై నెత్తివచ్చి
నట్టి బిడ్డలు చెడి మొగమందు వ్రేల
నైన కపిజాతి పెట్టినయట్టి నంతె
నంబడి యుమస్సునఁ బలాయనము పఠించు. 332

వ. అనిన రావణుండు 'అవునోయి నాయనా! నే నిట్లే యను
కొంటిని. నీ విట్లే చేసితి' వని కొడుకును గౌఁగిలించుకొని వదలి
పెట్టగా. 333

క. పసిపిల్లవాని పోలిక
నిసిరింతలు వార మింట నెగుచుచు నేగెన్
మిసిమింతుఁడు కానట్టుల
నసురేశసుతుండు వికటహాసాననుఁడై 334

క. నిస్సంశయాత్ముఁడై ర
తుస్సమ్రాట్టంత గండసంక్రాంతదృశాం
తస్సంవలితాంశు వమృత
భిస్సారి విచిత్ర మూహ పెంపెసలారన్ 335

వ. కాగడాలతో నడపకత్రియలతోఁ జామరగ్రాహిణులతో వర్ష
ధరులతో సువిదపిండుతో మైఁ జంగులువారు పట్టుపుట్టములతో
ముంజేవ్రాలు రత్నకంకణములతో దండకడెములతోఁ బది వ్రేళ్ళఁ
బచ్చలయుంగరములతోఁ బుస్తీలతోఁ గలిపి పువ్విన మీసలతో
నశోకవని కేగి రత్నాసనాసీనుండై యిట్లనియె. 336

శా. ఓసీ! మైథిలి! నీమఱంది పతియున్ యుద్ధంబు గావించి తీ
వ్రాసువ్రాతమునందునన్ దొలఁచిరే యానందరేఖామతీ!
నీ సాన్నిధ్యము చేరవచ్చితినిసూ నేఁ బ్రేతమూర్తిన్ దిదృ
క్షాసంపాదన చేసికో దితిజవంశస్వామి దేహంబుసన్ 337

ఆ. ఓసి పిచ్చిదాన! యుగ్రాహవంబందు
నింద్రజి త్తొకండు నిద్దఱికిని
బ్రాణపంచకంబు పట్టించె యమపురి
పథము మత్సకలవిపక్షపథము. 338

ఆ. తరుణి! చివరిచూపు దక్కించుకోనైన
నిపుడు పోయి చూడ నెసఁగు నీకుఁ
జివరి కేనుగాని చెప్పలేదంచును
గూరి యెడఁద నెంచికోను వచ్చు. 339

వ. మొన్న నా నెఱపిన మాయారామలక్ష్మణ శిరోనాటకంబున
నమ్మనేర వయ్యెదవుగాక పుష్పకంబు సిద్ధపఱచితి పోయిచూచి
రమ్మని, త్రిజట యున్నదికదా నీపక్షముది, దానిని బంపింపుమని
త్రిజటను బయలుదేరించి పంపించి 340

మ. సుదతీ! యింక నతండె నీకుఁ బతియంచుం గూకుచుంటేనిఁ దా
నది యుండెంగద వానివంటిపతిచే నగ్నిప్రవేశంబు త

ప్పుడ నీ కేటికిఁ జూపఁగాఁ బలయునే బాలేందుఫాలస్థలీ!
మదకుంభీనసనత్ఫణాసదృశసమ్యగ్జ్ఞానికాలోచనా! 341

మ. అవి యైరావణకోటిఘోరఫణిరాజాహంక్రియాసారభూ
త విషాకారక మంత్రనిర్మిత మహాస్త్రవ్రాత రజ్జుక్రియా
నవబంధంబులు విప్పఁ గోనవి తనూనాళంబులం జిక్కిన
ట్టి విషం బంతటఁ బ్రాణముల్ దొలఁచుఁ బోటీరార్ద్రగండస్థలీ! 342

ఆ. అనిన సీత యిట్టులనియె నేటికిఁ బంపఁ
ద్రిజట సాక్ష్య మేమి తెచ్చెఁ జెప్పను
బాణబద్ధుఁ డగుచుఁ బడియుండె నచ్చోను
రాముఁ డట్లు తలఁచె నేమొ యిపుడు. 343

క. మున్ను విరాధుఁడు తన్నున్
మిన్నంటు బుజానఁ గొంచు మొలఁగిన దవ్వై
చన్నాఁడు నన్నుఁ గనుచు నె
యున్నాఁ డయ్యసుర బ్రదికియున్నది లేదే! 344

క. కనుకని రాముం డట్లె
నను ముల్లోకంబులుండునా? యున్నవి, నీ
యునికియు లేదప్పుడు, నా
యునికియు లేదపుడు, బ్రదికియున్నాముగదా! 345

గీ. అంత మన్నించెనేమొ నీయాత్మజాతు
నింతదూరముగాఁగ రానిచ్చుటకును
మూఁడులోకమ్ములకును బ్రభున్ భుజంగ
బంధములు కట్టినను జేతుపడని మాట. 346

సీ. నీవు తలఁచినదే నీవు నిక్కమంచు
నెంచు నప్పటికిని నేమి మించిపోయె?
బూర్వగిరిపైని భానుండు పొడుచులోన
బ్రతుకఁబోఁడుగదా చూచవమ్మ నపుడు. 347

సీ. గగనమునుండి యమ్మలఁ గట్టివేసి
చచ్చినా రనుకొని యేల వచ్చె నతఁడు
చచ్చిరో లేదొ దిగిచూచి చక్క నద్ది
నిజము చేసుక రాలేదు నీదుకొడుకు. 348

వ. అనిన రావణుం డీమె యింతది యని నా కేఁడాది తెలియలేదు. ఆనాడు లక్ష్మణుండు మాటాడినట్లు మాటాడుచున్నది, అతనియం దీమెకు గల ప్రత్యయములోఁతునకు సముద్రములు చాలవు. ఎత్తునకుఁ బర్వతములు చాలవు. వేగమునకు నదులు చాలవు. ఇంత ప్రశ్రయము విశ్లేషీకరింప శివుఁ డొక్కడే దయచూడ వలెనని. 349

ఆ. సంశయాత్ముఁ డగుచుఁ జనుదెంచె నింటికి
నాత్మరథపతాక మందుఁ దోచె
ముర్వగముల యులివు మునిఁగిపోయిన శబ్ద
మునకుఁ బ్రాణములను బోసినట్లు. 350

వ. అంతఁ బుష్పకావరూఢయై తిరిగివచ్చిన త్రిజటను గాంచి జానకీదేవి ప్రాణమ్ము లన్నియుఁ గన్నులలోఁ బెట్టికొని యుబికివచ్చు దుఃఖమ్ము గొంతులో నొక్కికొని నెలలతరబడిగాఁ గూర్చున్న వైఖరి మాని ప్రతీతొపరమార్థమూర్తి యూరకుండినఁ ద్రిజట యిట్లనియె. 351

ఉ. మేదిని నున్న మానవుల మేనుల సంగుళిమైన నీరయున్
లే దరియమ్ము క్రమ్మనిది లిప్తము కాని దనృక్చయంబునన్
లే దొకయింతయున్ స్మృతి, చలింపవు కాలును జేతు లూరుపున్
లేమ, మొగాలుమాత్ర మమలీకృతపార్వణచంద్రబింబముల్. 352

ఉ. గ్రుచ్చుకయున్న బెట్టిదపుఁగోలలు మేనికి బాధ యంచునుం
బుచ్చుక ప్రాణభీతిమెయిఁ బిచ్చిన వచ్చనికంటివెల్లుగా
వెచ్చని యూర్పులన్ మఱియు విచ్చినగుండెలఁ గూరుచుండి లోఁ
జొచ్చిన యాత్మలై కపులు చుట్టున నుండిరి మానమూర్తులై. 353

గీ. కొన్ని కోఁతులు, పండి లోగుంజు వెలుఁగు
చిమ్మఁ బగిలిన సీతాఫలమ్ము లట్లు
దంతములు బాహిరించి హస్తములయందు
నొవ్వు చెక్కిళ్లు గాఁగఁ గూర్చుండినారు. 354

మ. అనినం జానకి యిట్లుగా ననియె నీయాలాపముల్ విన్న రా
మున కేయాపద లేనియట్లుగనె యంభోజాక్షి యూహింతు వం
చనిపించున్, నిజమా? యటన్న, నిజమా! యానేను కన్నట్టి చి
క్కనిస్వప్నంబులు వ్యర్థమై చనునటే కాశ్మీరగండస్థలా! 355

వ. నేను లేనప్పుడు పెద్దతండ్రి నీతో నేమేమి యనెను? నీవేమేమి చెప్పితి
వనిన జానకి యంతయు నుడువగా, నంతయు నట్టిదియ, నీకుఁ బెఱ
యూహ లెట్లువచ్చునని త్రిజటయన, సీత యిట్లనుకొంచుండ. 356

చ. ఇది యొక త్రొక్కు. త్రొక్కుదన, యెవ్వరు నెప్పుడు గాని త్రొక్కన
ట్టిది యిది, నేను సామి పొగకొక్కెము పెద్దముదాసు సాక్షిరై
పాదలఁగఁ బెండ్లియాడితిమి, మోహనరూపుఁడు రాఘవుండు నా
పద యిది దాఁటినన్ త్రిదశవంద్యున కాహుతి నొందు నగ్నికిన్. 357

వ. నాకీ యవమానఁ గల్పించిన రావణుని సుఖముగా స్వీకరించి యాతనికి నమస్కరించెద. 358

మ. ప్రాణత్యాగంబున సేర్పరించి చితి నే నగ్నిప్రవేశంబు సే
సెద, నీ కొక్కెడు మొక్కితిన్ హుతవహా! శ్రీరామచంద్రుండు నా
యెడలో నుండిన దీప మారమికి నీ వీ కోర్కె పాలించినన్
పడకుంభీనసమూర్తి లక్ష్మణునకున్ మన్నించిన ప్రాణముల్. 359

వ. అట్లు పుష్పకంబు వచ్చుటయుఁ బోవుటయు నం దెవ్వారో స్త్రీలుండుటయుఁ గాంచి రావణుని రాణివాసమో, రావణి పెండ్లమో యని సుగ్రీవుండు దుఃఖంబులో నుండి పొంగివచ్చు కోపంబున నిట్లనియె. 360

ఉ. చేతులు కట్టికొంచు సరసీరుహబంధుసుతుండు నిల్చుచున్
మాటిమాటికిఁ జించి రాఘవు లమోఘశరంబుల నిట్టు లైరటం
చాతత మోదమ్ముం గనెడు నాశరసంతతి రాక్షసావలిం
గోతులఁ బాడ్చి పెట్టెద నొకొక్కని కొక్కఁడుగాఁగఁ ద్రవ్వుచున్

క. వధియించెద రాక్షసులను
మథియించెద లంక యెల్ల మఱి రావణుఁ బె
ట్టి ధరిత్రిఁ గాలరాచెద
నధముల, నిల్లుకఁ బండు వైనదె చెప్పుమా. 362

శా. ముంగాళ్ళన్ విదలించు చర్మనిచయంబుల్ చేతు లాడించుకొం
చుం గిష్కింధకుఁ బోరు వానరులు రక్షోజాతి ఖండించి ర
క్తాంగుల్ లంక యటన్న పేరు వినరాన ట్లాచరింపంగఁ బో
నుంగా నైన జనంబు పోయెదరు గండూషి[illegible]న్ నెత్తురుల్. 363

మ. పొగ లెక్కింపఁగ వేల్పు సాకిరిగ సంభోజాక్షుఁ డీ రాముఁ డం
తగ నాతోడను గట్టి చెల్మి యనఁగా దైతేయదుర్జాతి నే
మిగులం జేయుటకా? యొకొక్కని మహామృత్యూగ్రవక్త్రాగ్రగ
ర్తగఁ గల్పించినఁగాని పోఁ డిచట సుగ్రీవుం డపగ్రీవుఁడై. 364

క. ఈహనుమచేత లంకా
దాహము చేయించి మఱలఁ దద్వాహ్నులలో
నే హరి నాతోఁ దూకునొ
యాహరిపతితోడ రాఘవానుగుఁ డేదున్ 365

ఉ. అంతఁ బ్రచండవేగచలితాద్భుతవాయుతరంగసంహతిన్
సంతతఘూతవార్ధిఫివృషత్పరిపత్రపిచాలసంకులన్
వింతగఁ జూచుచుట్టి కపివీరుల కన్నులు కందళింపఁగన్
జెంతఁ బసున్న రాఘవుల చిక్కనిముంగుసు లల్లలాడగన్. 366

క. హనుమంతుఁ డంద యుండెను
ననిచిన వార్ధిని దాఁటు నిర్భరుఁ డేనఁడో
యనిపించె బక్షసంహతి
పనిధూతపయస్తరంగవిభ్రాంతముగా. 367

శా. తా నిల్లై గగనంబునం జన సముద్రం బింత ఘోషించునా
నా నెంచెన్ హనుమంతుఁ డంబుధివృషత్కూతాక్షికోణంబుగా
గానన్ రాని మహానుభావుఁ డెవఁడో కంపించు నాకాశనా
నాఙ్బ్రాతము లోనలోన గుడుసుళ్లై పైన సుళ్లై చనన్. 368

ఉ. ఈపెనుండి వచ్చునని యెంచఁగరాదు మహోఖసంభ్రమం
బై దరిఁగొన్న యంబుధియు నంబరముం గదలాడిపోవు సం
పాదితపక్షమారుతజవంబున వచ్చిన వైనతేయుఁడుం
గాఁదగుఁగాక యిట్లగుట కల్లవు భౌమము లైన వేగముల్. 369

వ. అంత నవగ్రహతేజంబు సన్నిహితంబగుడు నొడళ్ళఁ బాములు
ప్రాకుచున్నట్లున్న వానరానీకినికిఁ దనూనిర్వాణంబు సంఘటిల్లె.
శ్రీరామలక్ష్మణుల దేహంబుల బాణంబులు విరిసె. వ్రణంబు
లంతరితంబులయ్యె. మేనులఁ జలనంబు సమకూరె. వారొరిగి
శయనింపఁ గపిసైన్యంబులకు మనస్సులలో మనస్సులుండె.
శ్రీరామచంద్రున కిట్లు వినిపింపం దొడంగె. 370

శా. స్వామీ! వాసుకితక్షకాదిభుజగాంశస్థాను లీ యస్త్రముల్
నా ముందాగవు త్రోటిపక్షనిహతిన్ నాగాళి భోగాళి పెం
పేమో నిల్వదు మంత్రపూతమగు నాపేరే భుజంగాధిప
గ్రామాభీలవిధూననోగ్రము రమాగ్రైవేయబాహాలతా! 371

గీ. సర్వమంత్రశక్తి సంభవిల్లినచోటు
నీవుగాన నన్ను నీవు తలఁచ
సృష్టి మొదట నాకు సిద్ధించినబలంబు
నేడు సంఘటిల్లె నీరజాక్ష. 372

శా. ఈలోకంబుల కెల్ల నుత్తరముగా నేపారు వైకుంఠమై
యీలోకంబుల కెల్ల దక్షిణముగా నేపారు పాతాళమై
శ్రీలీలామదనాభిరామతను! అక్షీణత్వరావాంక్రియా
హేలాయానము సేయగల్గుదును నే నిచ్చోటి కచ్చోటికిన్. 373

శా. త్వాదృక్శక్త్యమతుల్ సనాతనబుషుల్ త్రైలోక్యసంసారసం
పాదుల్ సంస్మరియింత్రు, మీస్మరణచేఁ బాలింపఁబడటి మే
మాద్రిశ్రీ మహితాక్షరాకృతులమై యాకల్ప మీసృష్టి సం
పాదింపం దొరకొంట నీస్మరణచే మన్నాను హృన్నాయకా! 374

మ. సతతాంతస్తపమున్ బహిర్ముఖముగా సంధించి నీ వక్షరా
కృతి నాదంబు వికారముండగను దచ్ఛిన్నాదనానాత్వసం
గతి నే మీ గతి తైజసాకృతులమై కాలంబు పాలింతు మూ
ర్జిత మోంకారమునుండి సల్పితివి సృష్టిన్ సర్వతత్త్వాకృతీ! 375

వ. అంత విశ్లేషమానసమాధిద్వితీయదశాగతుం డగు స్వామి కిట్లు
వినిపింప నారంభించె. 376

ఉ. పచ్చని నీదు మైజిగులు ప్రన్నని తేనెలు జాలువారుటో
విచ్చిన తమ్మిపూవయిన విశ్వమునందు బడిన్ బరీమళా
భ్యుచ్ఛ్రయమూర్తి లక్ష్మియయి పొల్చిన నీకును మత్త్వసంపదన్
మెచ్చిన బంభరాళులము మేము, మముం గృపచూడవే హరీ! 377

ఉ. త్రచ్చిన పాలవెల్లి నడుదారగఁ జిక్కన. తేలిపోవఁగా
ప్రుచ్చిరపోవు సుందరము మూలమునందున నీవు డిప్పఁగాఁ
జొచ్చి సముద్ధరించితివిసూ! తొలినాఁడు సురాళి నెల్ల నీ
విచ్చినదైన యాచనవె యిప్పుడు నీనుతి వాంఛఁ గొల్పెడున్. 378

ఉ. అచ్చపుఁ జల్లనౌ కరుణ యూరక యూరక యూర దిద్ది గో
ర్వెచ్చని కంటినీరు ప్రసరించిన మా యెదలోని బెట్ట నీ
పచ్చనిమేని క్రొమ్మొయిలు పట్టిననీడలయందు మా యెదల్
విచ్చగ నీయుమయ్య రఘువీర! జపాకుసుమాభిరామముల్ 379

ఉ. ఎచ్చటొ దవ్వునం దయిన యిచ్చకపుం బలు కర్థమెంచి లోఁ
జొచ్చిన జాలిగుండె యయి చూచెదు, దానవజాతి యెట్టిదో
మచ్చను జల్లి దొంగిలెడు మాయలమాగిది, నీవుగాని య
ట్లిచ్చటఁ జేయకే రఘుకులేశ్వర! భూమిసుతాహృదీశ్వరా! 380

వ. ఇట్లు క్రమప్రాప్తసానుచంద్రాకస్తోదయుఁడగు ప్రభువుతోఁబాటు సౌమి
త్రియు లబ్ధప్రత్యభిజ్ఞానుండయి స్వామి నిలుచుండి యల్లెత్రాడు
ప్రయోగించిన. 381

శా. లంకాంతఃపురకామినీకుచయుగీలావణ్యవిస్తీర్ణతా
సంకోచంబులు దైత్యనాయకశ్రవస్సంచారరేఖాసమా
తంకంబుల్ దితిజాతసైనికమనోధైర్యాద్రికూటాశవ
జ్రాంకంబుల్ పతి యల్లెత్రాటి నినదవ్యాహారముల్ పొల్చినన్ 382

గీ. అంత లంకామహానగరాంతరమున
నొక్కసారిగాఁ దెలవారె దిక్కుఁదోఁగక
యెఱిఁగి జ్యాధ్వని యంచును నెఱుఁగరాక
మూఁగ లగుచు గుబ్బిసలాడి పోయినారు 383

గీ. ప్రాచీ బడబద్రోలి నేడుగుఱ్ఱాల ముట్టె
నునుపు తెట్టెల తుంపురుల్ విఱిచె నిరుల
తరణి యరదంపుఁ బడగపై విరియు మువ్వ
లులివువలెఁ దోఁచెఁ బక్షులకలకలంబు. 384

సీ. పశ్యతోహరణభావసమృద్ధి జలబిందు
సంగ్రహణోగ్రకౌశలము లయిన
తపనవేగసమాకృష్టప్రాణదానవి
ఘాతిరేఖాగ్రనైపుణము లయిన
జాగ్రదవస్థాప్రసాదనప్రావీణ్య
లలితరేఖాజటాలమ్ము లయిన
నిత్యమంచదేహాఖ్యదైత్యమర్దనకళా
నఖరాగ్రలీలాయణంబు లయిన

చంద్రబింబప్రసాదనచణము లయిన
స్వర్గధామప్రవేశభాస్వరము లయిన
అఖిలలోకవికాసపర్యాప్త మయిన
పద్మబాంధవకిరణముల్ బయలుదేరె. 385

సీ. నలినకాంతాసమానతగండభాగానఁ
జిటిక వేసెనొ నవ్వు చెఱగిపోసె
ముద్దుమందారమ్ము బుగ్గపై నొక్కెనో
కసులిపోయినయట్లు కందిపోయె
లలితపారిజాతమ్ము గిలిగింత పెట్టెనో
తూఁగాడు కొమ్మనే తూలిపోయె
రాదంచు మోటుపరాచిక మాడెనో
ముగుదకల్వయు మోము ముడుచుకొనియె

రుద్రజట ముక్తకంచుకాగూఢ యయ్యె
చంద్రకాంతమ్ము చిఱునవ్వు సంతరించె
నొక్కఁ డొకఁడు స్వభావంబు పిక్కటిల్ల
నబ్జబంధుని శాసనలైన పూలు. 386

గీ. నిన్న రవితోడఁ బడమటి తెన్ను తిరిగి
భూమిలోఁ దూఱి పాతాళముఖముగాఁగఁ
జెరిఁ యుదయించుచుండగాఁ దరణి చీల్చి
భూమిఁ దా వచ్చెనో ప్రొద్దుపొడుపుఁ బూవు. 387

ఆ. పరమపౌరుషంబు ప్రభవ మాస్థానంబు
చండమూర్తి తమ్మిసంగడీఁడు
నొక్క స్త్రీత్వరేఖ యొప్పి గోరంటాకు
కూర్చికొనియె నేమొ గోళ్ళయందు. 388

మ. తన యుద్యానవనాన రావణుఁడు ప్రాతఃకాలవేళావిహా
త్వవశాంచద్వ్యము మించి కోపమున నిద్రాహీనమై లోచనా
రుణిమం గన్గొనుమంత విశ్వజిదయై సక్రోధాగ్రకోలాహల
స్వనముల్ మర్కటవాటపాటనకళాప్రారంభసంరంభముల్. 389

వ. మహాకాంతారమ్మునఁ గోటికోటి సింహవ్యాఘ్రభల్లూకవరాహం
బులు గర్జాఘుర్ఘురంబు లొక్కపెట్ట చేసినట్లు వినిపించిన నిది
యేమి యని యడిగిన జ్యానిస్వానభయంకరులయిన రామలక్ష్మణ
పురస్సరంబుగా వానరసైన్యంబు విజృంభించుచున్నదని విని నిలు
చున్నవాఁడు నిలుచున్నట్లు ప్రమాస్పడి, తేఱి, కొంతసేపటికి నేకాం
తంబున. 390

ఉ. విల్లనఁ జెప్పరానిదియు వెక్కసమై చను నేరు పుండఁగాఁ
జెల్లన, యగ్నివాయువరసీకుహనూతిముఖాస్త్రవిద్యయుం
జెల్లన, తక్షకాగినరిపించిత వాంతవిషానలాస్త్రవి
ద్యోల్లసనంబు తా నెటుల నుండెనొ యీతనిపద్దఁ జిత్రమై. 391

శా. ఎన్నో యేండ్లు భుజంగలోకమున భోగీంద్రాళి బంధుత్వమై
కన్నాఁ డీ పటుశక్తి యింద్రజి తిరస్కారంబుగా శత్రురా
జిన్నిల్పోప ననన్యసాధ్యముగ, నీ శ్రీరాముఁ డేకేళిగాఁ
బన్నాగంబులు వన్నె సిల్లు విదలింప న్నాగబంధంబులన్ 392

ఉ. ఆనతచారుతార్క్ష్యకమహావిభవోజ్జ్వలవావదూకతన్
జానకి యట్టులాడినది, సౌర్యుఁ డితండు భుజంగరాజమం
త్రానతబంధముల్ దులిచె నద్భుతమై చన, రెండు రెండు నా
కైనను దాఁచియుంపఁ బడినట్టుల నిట్టలమైన దీక్షతో 393

# కుంభకర్ణ ఖండము



క. శ్రీపరమసూక్ష్మతత్త్వా
దీపితశైలాంతరప్రతిష్ఠితవిభవా!
కాపురుషనిరాకరణ
వ్యాపారశ్లక్ష్ణ గూపపనిరాసు! శివా!

ఆ. అపుడు రావణుండు సంతఃపురం బేగి
పట్టమహిషిఁ గాంచి భామినీజ
గచ్ఛిరోమణీ, జగన్మహాశ్చర్యంబు
వింటివటనె నీవు విమలశీల! 1

మ. పరమాత్ముండవె కట్టినాఁడు కపలిన్ నాళీకపత్రేక్షణా!
అరనే నమ్మఁగనేరనయ్యో దనుసూ, అస్త్రాస్త్రాసం బింద్రజి
త్పరగస్త్రూరశరప్రబంధకలితవ్యూహంబు నిర్మించ స
త్వరుఁడై దానిని విప్పకోఁ గలిగనే పారాశిపీవ్యుఁకా! 2

క. నీ వేమందు పనంగను
మీ వైఖరి మీకె తెలియు మీమన్ మీమన్
రావణుఁడును రాముఁడు మా
కా విషయము తెలియ దనిన నబ్జాక్షి వగన్ 3

శా. నీ కిష్టమ్మది కానియ ల్లెటుఁగుదున్ నీరేజపత్రేక్షణా!
నీ కిష్టమ్మట నెట్లుగాఁ గలుగునే నీరజపత్రేక్షణా!
నాకున్ రాముఁడు వార్ధి దాఁటె ననినంతన్ గుండెలో బన్నగాఁ
జీకాంతైనది భార మెక్కువఁగ దోఁచెన్ దీనితో నంగనా! 4

శా. గుండెల్ తీసిన బంట్లఁ బాపితిని రక్షోసేనలన్ వార్ధిపై
బెండై తేలుచు వచ్చినాయతనిఁ జిప్పింజేసి దమ్మించు రా
ముండున్ రాత్రిఁ జపించుచుం గనులన్ మోడ్పించు నింతైన లే
కుండం గడ్పితి వాఁడు చావఁడును నాకున్ దెప్పలున్ బ్రాలెడున్. 5

చ. సుకముగ నిద్రపోవుటకు సుందరి! నీదగు సేవకాక వే
ళాకరయెడ నెలతేనుగడె నొక్కఁడు నొక్కఁడు వచ్చి నాదు ప్రా
ణికములు తీసి పోయెద రనాథులు, రాముని గాని వానరా
ధికతరవీరు నొక్కని వధించితినం చను వారు లేరిటన్ 6

మ. అకటా! హానిసి చంప నేస్తు గిరి రక్షాంతాశయున్ లేద, యే
లికనై చాసను లేన పోయెదనె లేలించానుగ? నీమేడ నీ
వొకమాత్రంబుగఁ గూర్చిపోయెను, సుహాయుద్ధోర్వి నారాముఁ జం
పక యే తప్పటంచుఁ గో చెడెని, చంపన్ న్యాయమై పోల్చునో! 7

చ. అతితరమైన మూర్ఛిత ఖనాదులఁ జంపెను వాని చావఁ దె
చ్చితి, సరిపోయె, నేడు గడచెన్, గడచెం జలరాశి, నేను మె
చ్చితిఁ, జనువెంచినట్టి డపు 'ప్రసిద్ధిగ నాయెలనాగ నీవె యూ
ర్జితభుజశౌర్య' యుంచడుఁగఁ జెల్లిన, యప్పటి కిచ్చియుందునో! 8

మ. అతఁడుం గొంచెము నిద్రపోవుటకునై యాశించెనా! యవ్యవ
స్థితచిత్తున్ సుఖనిద్ర పొందుననె? వచ్చిరాని కన్మూతలై
యతఁడున్ నిద్దుర పోయినట్లుగను బోనట్లాచు నుండన్ సమ
ర్పితకీవృత్తిఁ జలించె నాహవమహావృత్తంబె ధారాగతిన్. 9

చ. అపుడు ప్రహస్తుఁడై పలిచి యాశరనాయక! యింతదవ్వు నే
డుపుఁ బచరించినావు వకట! రుద్రుఁడు వచ్చినయట్టి వాఁకిటం
గపులను దెచ్చినావు భయకంపితచిత్తముతోడ నట్టివే
ళుపులును గాని వాఁకిటను, లోఁకువవైరి సమస్తదానవుల్. 10

మ. చెడఁ గొండంతటి నిన్ను గుజ్జుగను జేసెన్ వాఁడు గో! ఆ మను
ష్యుఁడు గోరంతటివాఁడు కొండయయి పొల్చెన్ గాముమ్మత్తంబు నే
ర్చెడి యాత్రిప్పట వేఁడొ సజ్జనుఁడ నేర్చెన్. వేఁడు పాలింపఁగా
నాశయం డింద్రియపంచకంబునను గా మోహాశి బాసేకుఁడై. 11

శా. ఉప్పన్నీ యది తించు నుంటి కాని నీయుష్ఠాలలోఁ జస్థ మో
యప్పా! జీవుఁడు సర్వకాలము గతప్రాణుండు కానోప డీ
యప్పం బోలిన జీవితంబునకు మా ప్రాణంబు లర్పించి నీ
యప్పం బేర్చెద మింతఁ దృప్తిపడు, వైత్యానికీనీప్రాణితా! 12

గీ. అటు తిరిగి పండుకొన్న వాఁ డిటుల దిరిగి
నిదురలోపలఁ బండుకొనెన్ సురారి,
కొంత నిద్దుర స్వప్నమ్ము కొంతగాఁగఁ
గలలు జాగ్రత్తకంటె జాగ్రత్తగాఁగ. 13

మ. మఱియుం జూడుము నన్ను నీకరణి ధూమ్రాక్షుండ నో దానవే
శ్వర! రామున్ వధియింపు మంచు ననుఁ బంపన్ గుండె నా కొంచలే
దరయం దానుగ చేయునాదకృతమాయావాగురం జీల్చి న
బ్బురమై నేనును నాదు సేన దరియంబోఁ బశ్చిమద్వారమున్. 14

చ. అట హనుమంతుఁ డుండె నతఁ డగ్గిని బెట్టెను నాదుకొంపనన్
బటుతరవైర మూనితిని వానిని జంపుద మంచు నేను న
చ్చొటు చన నాదు సైన్యమును శూకులు నొచ్చుచు నేగుచుండగాఁ
దటుకున నంత నారణపథంబునఁ దోచెను దుర్నిమిత్తముల్. 15

సీ. ప్రబ్బికొన్న శరత్తు మబ్బులేని వియత్తు
బెబ్బులిరవములై పిడుగులొత్తు
గబ్బినీలహారిత్తు ప్రబ్బి యెఱ్ఱవృషత్తు
జబ్బిచ్చి నెత్తుటిజడులు మొత్తు

శా. పెల్చన్ దాఁచును రాచెడున్ జమరెడున్ బీడించు గాడించు నే
ఱు ల్చిందించును నెత్రు, పేరెములువారున్ జాలు ద్రొల్లించు బం
డ ల్చెట్లున్ విసరున్ మెడల్ కొరికి కండ ల్త్రియు అక్కున్ విద
ల్పు ల్చెర్లాటలు వానిముందు దనుజుల్ ప్రాణాకలై కూఁకలై. 19

క. ఓయయ్య దానవేశ్వర !
నా యంతటి సేవ మిగిలెనా? గ్యొకఁడైనన్
నాయేయు వాదరమ్ముల
పాయని జడి దున్న పోతుపై వర్షముగా. 20

క. నాడులలో నెత్తు రుడికి
బాడిదగాఁ జెక్కునట్టి బాణంబుల నే
గాడించితి వానితనువు
వేడించుచు వాఁడు పెద్దగిరిఁ గొని వేసెన్. 21

గీ. వానిసూటియు వాఁడును బగిలిపోను
నారథము గుఱ్ఱములును చూర్ణమ్ములయ్యె
నేను సులువుగఁ దప్పికొన్నానుగాని
లేకపోయిన నిదియైన లేకపోదు. 22

చ. ఒడుపునఁ బ్రక్కదాటు కొని యుజ్జ్వలహాగన మృత్యుజిహ్వలా
బొడుపులు గల్గినట్టిదియు మువ్వల గంటల నార్చునట్టిదిన్
విడివడి మున్ను నాకముల వేల్పుల మారిమసంగినట్టిదిన్
విడిచితి వానిఱొమ్ముపయి విచ్చిన చిమ్మనఁగ్రోవి నెత్రుగా. 23

క. త్రాళ్ళుకొనఁగ నద్ది మహా
కాళ్ళేఁడు కావలయు, నిజముగా వాఁడు మహా
కాళ్ళేఁడు, వేఱొక గిరి నా
మ్రోళ్ళి విసరునట్లు నాకు మనసునఁ దోచెన్ 24

వ. నాకుఁ దెలియ దెంప వచ్చితిని. నీకోఁ జెప్పుచుంటి నన రావ
ణుండు పెడవైపు తిరిగి పండుకొనియె, 25

శా. నన్నుం జూచెనె వజ్రదంష్ట్రుఁడ సమున్నత్యుగ్రజ్వాలదంష్ట్రుఁడన్
నన్నున్ రామునిఁ జంపుమంచు నని నన్నా డంతఁ త్రే డంచు నేఁ
జన్నన్ నన్నును బోవ నిచ్చిరె భుజాచండాలు రావానరుల్
దున్నల్ ఖడ్గమృగంబులేనుఁగులుపందుల్ వ్యాఘ్రముల్ సింహాముల్

శా. పీలుం జాలును లేని దేహము తనాబీముండకో డ్కుండెనే
యోలిన్ వాలి యటంచుఁ జెప్పెదను నిన్నాగించి యోడో సము
ద్రాలన్ ముంచుచుముంచుచుమప్పుజలముల్ త్రావించెనం చందు రా
వాలిన్ మించిన వాఁడు వానికొడుకబ్బా! యంగదాఖ్యుం డగున్. 27

క. అన్నట్టుగ మఱచితి నా
మొన్న నెదో వాయుబారనుగ వచ్చి యొకే
తన్నుం దన్నిన గోపుర
మన్నది విఱుచుకొని పడియె నవనీస్థలిపై. 28

గీ. వాఁడు నను నిల్వ నిచ్చెనా వానితోనె
యాడినట్టి యుద్ధం బెల్ల నాడుటయ్యె
వానిఁ దప్పించుకొని పోవవలయు నన్న
నతఁ డడుగు నన్నుఁ గదలనీయఁడు గదయ్య. 29

శా. నాసేనల్ మఱి యెట్లు చేయునని కన్నా నవ్వడ పిట్టల
ట్లాసన్నంబగు చిన్నపోరులను దైత్యశ్రేణి కీశాళి కా
యాసంబౌ గతిఁ జేయఁజాలరును వా రావానరుల్ దీవ్రబా
హాసంపన్నులు దీప్తతేజులును నుగ్రాకారులున్ బోరులన్: 30

క. మన మేమో రాక్షసులము
మనకున్ రాక్షసులుగాఁగ మసలెదరు కపుల్
దనుజుఁ డనిన శబ్దార్థము
తనదై చను భయదశక్తి తెలిగినయట్టుల్. 31

క. మన మేయు బాణసంతతి
పనిచేయదు వారిపైని నాకేమో రు
వ్విన ఱాలు చెట్లు కత్తులు
మనలం జంపుఁ బరమాధమము యుద్ధంబై. 32

మ. అవు నభ్యాసము చేసి కత్తులు కటార్లాస్కందనక్షోణిలో
నవురా ! వాఁడెడు విద్య నేర్చినది దైత్యశ్రేణి, యీ యాయుధ
ప్రవరంబుల్ మనమండి లాగికొని యభ్యాసంబు లేకుండ వా
రు వెసన్ వాడెడు నేర్పు చూచినను విద్రోహంబగున్ విద్యకున్. 33

ఉ. ఇంతగ నేను జెప్పఁటయు నేలనఁ జచ్చినయట్టి దానవుల్
చెంతల నున్నవా గదలచేఁ బరిఘంబులచేఁ గటార్లచే
వింతగఁ జేసెఁ బోరు కపివీరుఁడు వాయుతనూజుఁ డెంతయో
దొంతరలైన బాణములతోఁ గుల కాతని నే నెదారిగన్. 34

శా. నాకున్ జ్ఞప్తియ లేదు ఆ విసరెనో నాపైని ఖడ్గంబునన్
నా కంఠంబునయందు వేసెనొ యెటెసన్ నిన్నుఁ గన్నాసయా!
నాకస్త్రీపరిభోగమంజులతనూ ! నాళీకనేత్రాసుమ
శ్రీకోదండ! నతాంగపర్వమధురాకృత్యుజ్జ్వలత్సేవధీ! 35

గీ. కదలి రావణుండు కనుమూఁత మెలఁకువ
వీర లింత యింత వీరు లగుచు
హనుమచేత సరియె నంగదుచేఁ గూడ
మడిసి రేమి రామమహిమ యంచు. 36

మ. అనుకొంచుండఁగఁ గూరుకై మఱల నంతంతన్ మఱిన్ వచ్చి ని
ల్చెను వేఱొక్కఁ డకంపనుం డనఁగ నక్షీస్విన్నరూపంబుతోఁ
గనుఁగొంచుం దశకంధరుం డితఁడునుం గాయంబునం బాసెఁబో
యనుకొంచుండఁగ దీననేత్రుఁడయి వాఁ డాలోచనావంతమై. 37

శా. రామున్ లక్ష్మణుఁ జంపవచ్చును సుమీ రక్షోజగన్నాయకా!
సామీరిన్ గెలువంగరా దురుభుజాసంవర్తకాలుండు వాఁ
డేమై వాని సమాశ్రయించెదరు కీశేశుల్ మఱిన్ వాఁడు తీ
వ్రామిత్రాసుభుజంగమంబు మఱి బాహాశేషభోగీంద్రుఁడున్. 38

గీ. అతనితో యుద్ధమాడుట యనియ లేదు
చఱచుటయు దానితో వైరిచచ్చుటయును
నింతలో నెక్కు యేనుఁగు నింతలోన
నింతలోఁ గాంచ మేరుగిరీంద్రమంత. 39

శా. నేనుం బోయితి నాసుహోగ్రశరపంక్తిన్ గోఁతులం గోతులం
దే నిక్కంబుగఁబూడ్చిపెట్టితిని గుండేళ్ళట్లు దూపిల్ల రో
షానన్ మున్ను త్రిమార్గగాజలము శస్త్రశ్రేణి నెద్దాన ర
క్తానన్ ముంచితి వానిచేతఁ గపికాంతారమ్ము మండించితిన్. 40

క. కాళ్ళలఁ గైకొని చీల్చుచు
ఫెళ్లున వెన్నెముకలందు విఱుచుచు మెడలన్
మళ్ళించి త్రిప్పుచును గు
గ్గిళ్ళంబలె నమలినారు కీశుల దైత్యుల్. 41

గీ. నళుఁడు కుముదుండు మఱియు మైందద్వివిదులు
వికలితము కపిసైన్య మాదుకొనినారు
కీశులకు దానవులు నెంతచేసినారొ
చెలఁగి వారును మన కంత చేసినారు. 42

గీ. అకట! యఱికాలిమంట నెత్తికిని వచ్చె
నాకు నా సంబరం జేసినాను చూడు
రొండినిం జేతు లిడికొని రోదనముల
నొంటిచే నేల నాన్చుకొం చుఱికినారు. 43

మ. అకటా! పోయి యటుల్ రఘూత్తముల సంహారంబు గావించు కో
రిక యున్ విచ్చుచు నున్న క్రోధితచమువుం గ్రీడాగతిన్ సోదెలో
నికి రాకుండగఁ జేయు వాంఛయును నిర్ణీతంబు కానట్టి వే
ళకు వార్నల్వురు తోడి తెచ్చిరట హేలాధూర్జటిన్ మారుతిన్. 44

క. అది యేమి చేసెనో తెలి
యదు మద్భావము భవత్పదాశ్రిత మగుటన్
గదలి యిట వచ్చె జీవుం
డదీనుఁడును దీనుఁ డగుచు నా వేదింపన్ 45

శా. సీ! యీనిద్దుర యేమి నిద్దురవి యెంచెన్ లేచి కూర్చుండె దై
తేయప్రాజిత తెప్పలొత్తి కనులుం దెచ్చెన్ మొగుడ్వంత దృ
ష్ట్యాయత్తంబగు భావమం దొకరుఁడై యాగ్నిధ్రుఁడై యొప్పె సు
శ్రీయోగ్యాననుఁ డుగ్రతేజుఁడును దాక్షిణ్యప్రభానేత్రుఁడున్. 46

చ. అతఁడు ప్రహస్తుఁడం చెఱిఁగె నాశరనాథుఁడు వానికన్నులన్
హుతములుగాగనున్నయవి యూహలు పూర్వులయందుఁబోలె స్ప
ష్టత మఱి వీనిమేనున నెసంగదు కన్నుల నంతకంటె స్ప
ష్టత గనిపింపఁజొచ్చినది సంస్కృతి యొండుపాకాల్చునట్లుగన్. 47

గీ. ఇట్లు భాసించె రావణు హృదయమందు
నతఁ డెదిం జెప్పకయ చెప్పినట్లుగాఁగ
నక్షిదీక్షితిభావ మన్యోన్య మంత
యల్లుకొనియుంట సృష్టిరహస్య మేమొ! 48

క. నాకొడుకులఁ జంపించితి
నీకొడుకు కగు నక్షుతోడ నేటికి నన్నా
యే కోఁతిరో నీలుండట
నాకున్ మరణంబు దనుజనాథా! చేసెన్. 49

ఉ. రామునిచేతిలో మృతియు రాఁదగనంతటి ఘోరపాప మే
నేమి యొనర్చినాడ నది యెప్పుడు నీకును నమ్ముడైతి ల
క్ష్మీమహితాకృతిన్ సతిని మేదినికన్యక తే నధర్మమం
చామెయిఁ జెప్పియుంటి నదియప్పుడు కావలె దానవేశ్వరా! 50

శా. తానై దానవమంత్రిముఖ్యాళియు నంతర్ధానముం బొందఁగా
లేనవ్వే దశకంధరుండు తలఁచెన్ లీనాఘదుర్జీవులై
యేనోలక్షణ మిట్టిదం చెఱుఁగ రా యీ ప్రాణు లాచారధా
రానిష్ణాతులు జ్ఞానహీనులు కృతాగంభుల్ సను స్తంబునన్. 51

గీ. తమకుఁ గలిగిన వగు నాపదలకు మొఱకు
తెగ మఱెవ్వరో హేతువులుగఁ దలంచు
నీ యనంతసంసారమం దెట్టిజీవి
యెట్టి కర్మను జేసెనో యెవ్వఁ డెఱుఁగు? 52

గీ. మేలుకొన్నంతలోన నమేయమైన
కోపము సముద్భవించె రక్షోవిభునకుఁ
దెరపడును లోకమునకు నిద్రించుతఱిఁ దె
రవడియెను మేలుకొన్నంత రావణునకు. 53

క. నే నిదురపోవు వేళను
దానవవీరులను జంపెఁ దా నొక మొనగాఁ
డై నిదుర మేలుకొంటిన
యీ నరమాత్రుం డెవండొ యెఱిఁగెద నింకన్ 54

మ. ఎలనాగన్ గొనివచ్చినంతఁ దరనే యీచేఁత? లక్షోపల
క్షులు కాంతల్; శిలలన్ బిగించి కడలిన్ సర్వాసురాసువ్రజం
బులు వైవస్వతుమందిరంబునకుఁ బంపున్, సృష్టిఁ దా నొక్కఁడే
విలు పట్టంగలవాఁడు, హేమధరణీభృచ్చాపుఁ డేమయ్యెడున్. 55

మ. అలుపంపున్ సురవైరినాయకులపై నాకోఁతి యాకోఁతి గా
ఖ్ములు రువ్వన్ సరియా? దశాస్యుఁడు ద్విషల్లుంటాకుఁ జేతెంచుఁ దా
నొలికించుం గపిజాతినెత్తురులు నట్టూరించుఁ [illegible] రాణికా
ళ్ళులతోడన్ విజయేందిరారమణి చాళ్ళంగాఁ బ్రచారించెనాన్. 56

శా. ఉగ్రాకారుఁడ నౌచు మారుతిని దోర్యుద్ధంబునన్ గాఢము
ష్టిగ్రంథిస్ఫుటఘాతపాతముగ మూర్ఛిల్లంగ సైరించెదన్
సుగ్రీవుండును గోళ్ళ అక్కిఁ చనియెన్ శూరుండు మద్బాహుపా
శగ్రైవేయుని నన్నగారిఁ గనుగో సాగింతు యామ్యాశకున్. 57

ఉ. ఒట్టుగ రామలక్ష్మణుల నొక్కని బిట్టుగ మట్టిసెజ్జపైఁ
బెట్టక కోటకుం దిరిగి పేఁ డనుదేరఁడు రావణుండు, నే
డిట్టలమైన కోపము దహించెను, నే ననిపించకుండఁగాఁ
బెట్టిన వింటికొప్పు విడిపించను నేడు రణాంగణంబునన్ 58

శా. నాకున్ మండుచునున్న దీ కడిఁదినుంటల్ వానరానీకినీ
శోకాధానవిదానముల్ పరిణమించున్ జ్వాలలై నూలలై
నా కీదృక్ప్రళయక్రుధానలశిఖానద్ధంబు చిత్తంబు కా
దే కొంచెమ్మును బూర్వమెప్పుడును, దా రేసాదుగో? గాఘువుల్.

క. నే నౌచు నెత్తిపోవుదుఁ
గానీ పను లెత్తిరాక కలుగదు లంకా
శ్రీనిభృతకోట్టమందున
దీనికిఁ దుదిచూచెదన మతిప్రౌఢిగతిన్. 60

ఉ. ఎంచి సురారిలోకపరమేశ్వరుఁ డెక్కిన బండి నిప్పు జ
ల్లించిన భగ్గుభగ్గున జ్వలించెడు నిప్పుల నూకతోడ ని
ర్మించినయట్లు సూర్యకరమిశ్రణ మోర్వక యాకసంబు ము
ట్టించెడునట్టి వేఁడిమి కడిందిగ డిందిః దిక్కులై చనన్. 61

ఉ. కట్టిన నాలుగశ్వముల కర్ణములంబడి నాసలంబడిన్
బుట్టిన జ్వాల లంతములఁ బొల్చిన ధూమము లంధకారముల్
చుట్టిన చుట్టలై నెగసి చూపఱ కన్నుల మిన్ను లంటుకొ
న్నట్టులఁ జేరరాని భయదాకృతి బెట్టిద మూచుఁ బొల్చుచున్. 62

ఉ. సారసబంధుకాంతి పరిసర్పణ దర్పిత హేమరత్నకే
యూరములుం గిరీటము మహోన్నతవక్షము మీఁది వర్మమున్
హారిచిరత్నకుండలము లంగదకంకణహారసంతతుల్
ఘోరమహాగ్నివంశ మదిగో చనుదెంచు నటన్నయట్టులన్. 63

ఉ. మండితశోణరత్నచయమంజులదీధితిలంబమానకో
దండము లస్త్రకచ్ఛవివితాననిరంతశరాభివర్షణో
ద్దండమహాభ్రమప్రదము దర్పితబాహువివర్తనక్రియా
చండము భూవియత్పరిలసద్విషువత్పరిణామమో యనన్. 64

చ. అరదముమీఁద నిల్పిన మహాయుధసంతతి వేల్పుపీటిగో
పురములు తూలఁగొట్టిన ప్రభూతశితంబులు నుగ్రముల్ ద్విష
త్పురములు కొల్లపుచ్చికొను ధూర్వహతాభయదంబు లల్ల ము
ప్పురములు కాల్చు సామివగు బొమ్మలరంగులచేఁ బ్రచండముల్ 65

చ. విలులితవార్ధిఘోషములు భేరులు ఘోరపిశాచరావకా
హాళములునున్ లయాంబుదమహారవఘోరము లైన దుందుభుల్
కలితసురారిలోక పరికల్పిత దేశి విదారి భీషణా
విలవిధురస్వరాకులిత విస్ఫుటగీతము లాలపింపఁగాన్ 66

ఉ. వేలుపువీటియంగడుల వెట్టిన చూఱలు వేల్పుకామినీ
జాలము నీలువుల్ దోలఁచు చంక్రమణోగ్రదురంతకామముల్
తూలిచినట్టి పూనుల క్రతువ్రతముల్ బిరుదాళిఁ గట్టి గీ
తాలు లిఖించి బట్టులు ప్రతాపకథాకథనంబు చేయఁగన్ 67

చ. వికృతములైన యానముల వీఱిడిత్రిప్పట లైన చేష్టలన్
గొక్కిబికిపాన్నకఱ్ఱలను గుత్తులు ప్రేలుచునున్న మువ్వలున్
జకితముగాఁ గదల్చుచు హసాదులు చెప్పు చసాధుదానవుల్
వికృతము లైనయట్టి రణవేషము లూనుచు ముందుసాఁగఁగన్ 68

చ. పురపురలాడు నయ్యరదపుంబడగన్ హరినీలరత్న ని
ర్భరతరవర్ణ నిర్మితిధురావరిభాసితగర్ధభాకృతి
స్ఫురణము తన్ముఖోద్గిరదపూర్వమహాగ్ని శిఖాజటాలమై
వెఱపు ఘటించెడున్ గగనవీథుల దవ్వునఁ జూచువారికిన్. 69

చ. తనయొదయందు నాగరకతాపరిహీణ మసాధుశీలమున్
తనదగు సంఘలక్షణము దైత్యము నీమము లేనియట్టిదిన్
ధనము ప్రభుత్వముం గలిగి దర్పితమై చను జాతి యుద్ధవే
శను సయితంబు మిశ్రమగు లక్షణవంతముగాఁ గనంబడున్. 70

క. ఒక్కొక్కఁడు దిక్కుంభియ
సృక్కంధులు వాజఁజేయు సేనాపతులై
రక్కసు లరిగిరి యెనిమిది
దిక్కుల యధిపతుల చేవ దించినబంటుల్. 71

చ. ప్రళయము గాఁగనై సబడబాగ్నిగ వెన్క పయోధినుండి రా
వలసినయట్టి యుప్పెన నవంబు పురస్థము దుర్గసీమలో
వెలువడి వచ్చుచుంటఁ గని వీకఁడు రాముఁ డనంతదోరనా
విలమతి పృచ్ఛసేసెను విభీషణుఁ దద్వివరం బెఱుంగఁగన్. 72

శ్లో ౭

మూర్ధ్వమ్ముగ్రదంతినుం డలిపతి
ప్రోన్నమ్ముగ మూర్తి యుగ్రదంతిప్ర
ష్ఠమ్మురత్న హారము సాగ నగ్నిబం
ధుద్యుతి న్నకంపనుండు రాఘవా! 73

పెద్దకోఱ లొప్ప భీమచాపుఁడై
యెద్దువోలెఁ గన్ను లింతలింతలై
హద్దులేనివీరుఁ డాతఁడే సుమీ
బిద్దవిక్రముఁ డింద్రజిత్తు రాఘవా! 74

క్రమాయరాని వర్మముం ధరించి చాం
పేయ కేతు వొప్ప వీరమాళిదు
ర్జేయవిక్రముండు శ్రీధృతిన్ మహా
కాయుఁ డెంతయున్ మగండు రాఘవా! 75

చక్షుముగ్రతా మ్రచండకాంతియై
పక్షిరాజువోలె బద్ధవేగుఁడై
దీక్ష మానివచ్చుఁ దీవ్రమూర్తియై
రూక్షుఁడో మహోదరుండు రాఘవా! 76

మండజాలలగ్నరూక్షరోములుఁ డు
ద్దండప్రాసఖడ్గధారి ఘంటికా
చండనాదయానజాల్ముఁడై త్రిశీ
ర్షుండు వాఁడె పాలసుండు రాఘవా! 77

ప్రేంఖిత త్రిశూల నిశ్శితనిశ్చటా
ఘాత కేశపాళి దుష్టపన్నగీ
కేతనుండు బాహుకేళిఁ జేయఁబో
యాతనిన్ నిశుంభుఁ డంద్రు రాఘవా! 78

ఘోరతాపయోధి హాలహస్తుఁడై
ఘోరనరా పిశాచకోటినేతయై
పాఱుదెంచువాఁడు వహ్నినేత్రుఁడై
క్రూరుఁడే నరాంతకుండు రాఘవా! 79

వ. మహోగ్రరథంబున నున్న నీలాంజనగిరి రాక్షసాధముం డని విభీష
ణుండు పేర్కొన శ్రీరామచంద్రుండు. 80

శా. ఓహో ప్రేఁగగుచుండెఁ గన్నులకు దైత్యోర్వీను హేంశానుఁ డే
దేహం బుగ్రమయూఖతీవ్రకరదీధిత్యంతరశ్యామవ
న్నేహోగాఢవివర్తమై చనియెనో! యీతేజు నున్నప్పు నా
యూహం దట్టగఁబోనియంత బరువై గొప్పాయె విప్పారుచున్ 81

గీ. హనుమ యితనిఁగూర్చి యాశ్చర్యపడె నన్న
నబ్బురంబె కొల్వునందుఁ గాంచి
శైవశాద్రదీప్తిసంయోగ మొలసిన
యట్లు తోఁచు నాహవార్థి యగుట. 82

చ. కన్నుల కింతబిట్టుగను గన్పడు నీతనిమూర్తి యింతతే
జున్నది యింతచేవకల దుర్వ్విని శక్తిగలాఁడు కోర్కులం
దున్నెడు మంటిత్రోవఁబడి, తూలునె? లేదవె మింటిత్రోవ? నే
నెన్నకమున్నె వింటిపయి కేగెడు మత్కర మో విభీషణా! 83

మ. అనుచుండన్ దశకంధరుండు తనసైన్యంబున్ విభాగించి పెం
పెసయన్ దుర్గకవాటరక్షణకునై యేర్పాటు గావించి దై
త్యానీకాయంబును నాల్గుపాయలుగఁ గీశాధీశసైన్యంబుపై
నసిచెన్ దానుగ నేతయై నడిమిపాయన్ భీకరాకారుఁడై 84

క. ఇప్పటికిఁ దెలిసివచ్చెను
విప్పిఁకనుత్తి నని సకలకపిజగత్ప్రాతి క
న్నిప్పుల మంటలు గాంచుచు
నప్పటికిని క్రోధరంజితాస్యుం డగుచున్ 85

క. క్రమ్మెను కంచెలమంటలఁ
గొమ్మలతో మోఁది యూర్పుకొన్నట్లు నవృ
క్షమ్మయి చను పార్శ్వమహీ
ధ్రమ్మున శృంగమ్ము విసరె దానవుమీఁదన్. 86

ఉ. వచ్చెడు కొండకొమ్ము శితభల్లములన్ జిద్రుపల్ ఘటించి లో
గ్రుచ్చ ప్రహస్తు చంపె నను కోపపు హాలహాలంబుపై శిఖల్
పిచ్చునటుల్ నిగిడ్చిన శిలీముఖసంతతి ఱొమ్ముగాఁడఁగాఁ
బుచ్చెను మూర్ఛపుచ్చె హరిపుంగవుఁ డంతట నేలపైఁ బడెన్. 87

వ. ఇట్టి తమప్రభుపాటుఁ జూచి మేనులుపెంచి గవయుండును గవా
క్షుండును సుదంష్ట్రుండును ఋషభుండును జ్యోతిర్ముఖుండును
కొండకొమ్ములు పెకల్చి రావణునిం దాకిన. 88

క. వక్రంబును తీవ్రంబు న
తిక్రాంతాకాశ మైన దీప్తాగ్నిశిఖా
చక్రంబు వోలెఁ దిరుగుచు
సక్రోధుఁడు రావణుండు చండాకృతియై 89

క. గుమసులు పడియెడు నట్టులు
కడుకొని కాల్సేతు లాడగా నేర్వని య
ట్లుడిగిన కనుకాంతులుగాఁ
బడనేసెను వారి భల్లభల్లంబునకున్. 90

క. అంతట హాహాకారని
రంతరముఖమైన వానరానీకిని రా
మాంతికముఁ జొచ్చె దిక్కని
యంతట నదియొకఁడె భద్రమగుచో టనఁగన్ 91

సీ. రఘుకులస్వామి దీర్ఘభుజావిలంబమా
నోగ్రధనుర్లస్తకోపగరిగత
వామహస్తుండుగా, సౌమిత్రి వీక్షించి
తొంగలి ఱెప్పల దోయిలించి
యన్న ! యెంతకును బర్యాప్తుండ వీవాదు
దితిజాతు నన్ను వధింపనిమ్ము
నా రాఘవుం డనె నాకారి బహ్మాస్త్ర
కోవిదుండును భుజాకుంఠబలుఁడు

కంట వింట రెంటఁ గడుజాగరూకత
మెలఁగవలయు నన సుమిత్రబిడ్డ
యసురతోడికలని కాయత్తపడుచుండె
నచటఁ గీశసైన్య మటమటింప. 92

గీ. అటులఁ గపిలోకపతియు సైన్యాధిపతులు
దనుజబాణవిదారితతనువు లగుచు
బడలుపడిపోవఁ గనుచుండి పావమాని
పరమక్రోధాగ్నిమయమైన భావ మూని. 93

క. యముఁడు వడ్డఁబెగిలించిన యట్లుగాఁగఁ
బిడికిలిం బూని దానవోత్తముకడకుఁ
బోయి కన్నుల నింగలంబులు గురియుచు
ననియె గ్రీష్మాంతమేఘగర్జాభముగను. 94

ఉ. ఆ విధి నీ లలాటమునయందునఁ గోఁకులపిండు చేతిలోఁ
జావును వ్రాసె వేల్పుగమి చాలదు, గారుడయక్షరాద్భుజం
గావళి చాల దిప్డు కను మస్మదమోఘము ముష్టిఘాతమై
నీ విట నావులించెదవు నెత్తురు గ్రక్కుచుఁ జావు ముందరన్. 95

మ. అనినన్ రావణుఁ డేది గ్రుద్దుము త్వదీయంబైన దోశ్శక్తి చూ
తు నటన్ మారుతి క్రొత్తనూచెదవు నా దోశ్శక్తి నీబిడ్డ య
క్షుని శీర్షం బవి రెండుగాఁ బగిలె నా గ్రుద్దుంబడి న్నాఁగ రా
నను మత్ఖస్మృతిశాయుతాడితము కోపజ్వాల మిన్నంటగా. 96

చ. అమరిచి యాంజనేయుని మహాచలసానుతలంబునోని వ
క్షమువయిఁ జాచి గ్రుద్దెను నిశాచరనాథుఁ డనంతవేగుఁడై
భ్రమయుచు డిల్లవోయి నిలువంగను జాలక యాంజనేయుఁడున్
దెమలిచికొంచు వేగపరిధీకృతఘోరమహాశనిం బలెన్. 97

ఉ. గ్రుద్దెను వక్షమం దసురకోటి దిగాలుపడన్ దశాస్యుఁ డా
పద్దశ నందినట్లు కనుపట్టగ రావణుఁ డంతఁ బ్రాణముల్
దద్దరిలంగ ధాత్రిఁబడుదానికి సిద్ధముగాఁగనై యసుల్
తద్దయుఁ జిక్కఁబట్టుకొని తా ననియెం బవమానసూనుతో. 98

చ. అగు నతి విక్రమంబు కల నన్నను మారుతి యేమివిక్రమం
బౌనె మఱియింకనుం బ్రదికియుంటివి నీవన, రావణుండు పె
ద్దగ నొకయార్పు తీసికొని తా బలమంతయుఁ దెచ్చికొంచు హె
చ్చుగ దృఢముష్టితోఁ బవనసూనుని ఱొమ్మునయందుఁ బొడ్చినన్.

సీ. తట్టుకొనలేక మారుతి ధరణియందుఁ
బడియె స్మృతితప్పి యంత రావణుఁడు పెఱల
విల్లు నమ్ములు గొని కపివీరులందు
శరపరంపర నిగుడింప దొరకొనంగ. 100

ఉ. కోపముచేత నుబ్బఁ గనుగ్రుడ్డులు వానరలోకసర్వసే
నాపతి యగ్నిసూనుఁడు ఘనంబుగ వాచ్చుచు నీలుఁ డంత యా
క్షేపముచేసె నొక్క గిరిశృంగము రావణుమీఁద వాఁడు సం
క్షేపముచేసి దానిని విశీర్ణముగా శితభల్లసంతతిన్. 101

క. శరపంజరకుడ్యంబులు
విరియించుచు నిరకటానఁ బెట్టెను నీలున్
గిరిశృంగమ్ములు తరువులు
వెరికి విసరునట్టి సేఁత పీల్పడకుండన్. 102

ఆ. మఱియుఁ దాఁకుచోట మండించుబాణాలు
వేసి యతని నెంతొ వేధపెట్టెఁ
గోపి యాతఁడును సమాపన్నకానుగా
పంబుతోడ నుంటిపైఁ జరించి. 103

చ. దితిసుతుబండికిం బడగ తీర్చిన యష్టినిఁ జేరకొంచుఁ జా
లితపటు వేగుఁ డౌచుఁ గుదిలించుచు నుండె రథంబు తూల వి
స్మితులయి చూచుచుండ స్మృతిచెందిన హన్మగవాక్షముఖ్యసై
రతతియు సజ్యకార్ముకులు రాముఁడు లక్ష్మణుఁ డబ్బురంపడన్. 104

చ. కణకణలాడు నిప్పులవు కన్నుల నుప్పరమందుఁ జూచి రా
వణుఁ డనెఁ గామరూపవినిబద్ధము లాఘవలంఘనోత్థనై
పుణి యిది యల్పశక్తి తుదిపొందిన విద్దియకాదు నిన్నద
క్షిణముగ దించెదన్ ధరణికిన్ బ్రదుకో మఱిచావొ చూచుకో. 105

క. అని యాగ్నేయము మంత్రము
నినిచినబాణమునఁ గొట్టె నీలుని వాఁడుం
దనతండ్రిమహిమచేతను
తనమహిమను జావలేదు ధాత్రిం బడియెన్. 106

శా. సౌమిత్రిం గన రావణుం డెదుర దీర్ఘానిశ్చలభ్రూలతా
స్థేమున్ హేమధరాభతనునిన్ దీవ్యజ్జటాజూటరే
ఖాముక్తాహిఫణాగ్రనీలమణిసంకాశప్రభావంతునిన్
ధీమల్లోకశిరస్థహీరమణి సందీప్తైందునేత్రచ్ఛవిన్. 107

క. మారీచుఁడు చెప్పినదియు
మారీచునిగూర్చి యితఁడు మాటాడినదిన్
వే రావణునెదఁ దిరిగెను
తా రామునిరక్ష యింత తార్కాణముగన్. 108

చ. విరహముచేత రాముఁ డటవీస్థలి చావని సేవ చేసి వా
నరపతియుం బరాక్రమసనాథుఁడు మారుతియొక్కయున్ సుహృ
త్వరమణచేసి యింతవగ పట్టెను వీఁ డది యెందుచేతనో
తరుణిని సైతమున్ విడిచి తా వనసీమకు వచ్చు టెందుకో. 109

మ. అనుకొంచుం దివిజారిలోకపతి యిట్లన్నాఁడు సౌమిత్రితో
నినుఁగంటి న్నినుగంటిఁ జంపెదనుసూ నిన్నున్ మదీయాస్త్రసం
జనితాగ్నిచ్ఛట మండఁబెట్టెదను నీ సౌమిత్ర్యమున్ నాశముం
బొనరింతున్ మఱిరాముఁడంతట వృథాభూపాభుఁడౌ ధాత్రికిన్ 110

వ. అనిన లక్ష్మణుండు, 111

ఉ. దిగ్వ్యవహార మయ్యె భవదీయపరాక్రమమున్ బ్రశస్తియున్
వాగ్వ్యయ మేల చేసికొన బాణము లున్నవి చాపమందె స
మ్యగ్వ్యవసాయ మొక్కఁడు శతాధికమాను బరాక్రమోక్తికిన్
వాగ్వ్యతిరేక మైనదియు వాగ్విదు లెల్లను మెచ్చునట్టిదిన్. 112

మ. అనినన్ దైత్యకులాధినేత పటునానాస్త్రంబులున్ శస్త్రముల్
నినిచెన్ లక్షణుదిక్కు లక్ష్మణుఁడు వానిన్ ఛిన్నభిన్నంబులం
బొనరించెన్ మఱి యాతఁ డల్పములతోఁ బోఁడంచు దేవారి పు
చ్చెను బాణంబు విధాతృదత్తము సునాసీరీయవజ్రాభమున్. 113

గీ. విద్ధుఁడై లక్ష్మణుం డంత విహ్వలించి
యొక్క నిమిసంబులో నిల్వఁద్రొక్కికొంచు
దైత్యపతి చేతిలోపలి ధనువు రెండు
ముక్కలుగఁ గొట్టె దెసలందు మోదికొనఁగ 114

క. వేఱొకచాపమ్ము మఱియు
వేఱొకచాపమ్ము మఱియు వేఱొకచాపం
బారావణుండు గొనుటయు
నీరామునితమ్ముచే నికృత్త మగుటయున్

క. వడి నిల్వఁబెట్టి కొట్టిన
వడువునఁ గోదండహీను బాణంబులతోఁ
నెడపెడఁ దాడించెను మఱి
యుడుగక శిక్షించినట్టు లోకద్రోహి నహో. 116

గీ. ఇంతకోపమ్ము వచ్చిన దింతకోప
మనుచు రాలేదనుచు లేద యసురపతికి
వీనిఁ జంపనె వలయు దర్వీకరాభుఁ
గాటుపైఁ గాటు వేసెడుగాదె యనుచు 117

చ. అప్పుడు స్వయంభుదత్తము మహాశనికల్పము సర్వదేవతా
రిపువు హుతాశనాంశునిభకీసము ఘూర్జరమైనదిన్ మహా
ప్రస్తుపుఁ బడనైన శక్తిని భరంబగుదాని నిగిడ్చె రాము త
మ్ముపయిఁ బ్రవేగవంతము నమోఘము పూర్వమహాహవంబులన్

ఉ. పత్రిగతిన్ శరత్రితయవారిత మయ్యు నధృష్య మహాచు సౌ
మిత్రిని దాఁకె శక్తి విషమించిన చేతనశక్తిగా మహా
వత్రప నంది చేతనము వాసి ధరం బడె నంతలోన సౌ
మిత్రియు వైష్ణవంబు తన మిక్కిలి తేజము సంస్మరించుచున్. 119

మ. కపిసైన్యంబు విభీతి నందగను రక్షస్సైన్య మానందభ
క్తిపరంబై మునివృత్తి నుండఁ గడఁకన్ కీర్ణాలకుండౌచు న
ప్రవలోకేశుఁడు బండినుండి దిగుచున్ సౌమిత్రినిం జేరి నే
లపయిం బడ్డతనిం గ్రహించుకొని లీలం గొంచుఁబో నెంచుచున్.

ఉ. చేతుల నెత్తఁబోయి తనచేవయుఁ జాలమి తోఁచి బిగ్గగా
నాతని లేవనెత్తుటకు యత్నము చేసి సమస్తదేహని
ర్యాతము స్వేదమై కనులయం దరుణత్వము గల్గ నూర్పులై
యాతనిఁ గొంచుఁబో వలయునన్న మహాశ పరిత్యజించకన్. 121

ఉ. దూరమునుండి రావణుని దుర్వ్యవసాయము నెల్లఁ గాంచుచున్
మారుతి చేరదూఁకి పవమాని జవంబుగ దైత్యరాజు వి
స్ఫారతరోరువక్షమును బంధురముష్టిని వ్రేయగా నప
స్మారముపొందె రావణుఁడు మాసిన మాయని తెల్వియై చనన్. 122

క. కనులు కనుపించుచున్నవి
మనసును మఱి యాడుచుండె మఱి చేతులు కా
ళ్లును కదలవు తలయాడదు
కనుఱెప్పలు మూఁతపడవు కడు దైత్యునకున్

చ. అనిలసుతుండు లక్ష్మణు భుజాగ్రమునందునఁ జేర్చికొంచుఁ బో
వను గని పంక్తికంధరుఁడు భావమునందున, వీనిఁబొక్క చా
లినతన మేమి? యే నితని లేవగనెత్త నటంచు నెంచుచో
ననిలతనూజుఁ డాతని రయంబునఁ జేరిచె రామసన్నిధిన్. 124

గీ. అంతలోన నమూర్ఛుఁడై యసురరాజు
రూక్షమతి యయి చని రథారూఢుఁ డగుచు
విల్లు నమ్ములు గొని కపివీరచయము
పరవఁ ద్రోల నారంభించెఁ బట్టువిడక. 125

గీ. మూర్ఛ నందిన తమ్ముని మోము చూచి
అర్దితంబైన కీశసైన్యంబు చూచి
తనస్వరూపంబు దైత్యరాజునకుఁ దెలియఁ
జేయ వాంఛించె రాఘవశేఖరుండు. 126

వ. కోదండియై బయలుదేరుచుండ హనూమంతుం డిట్లనియె. 127

ఉ. సన్నని యీఁకలొప్ప మృదుసంస్తరణంబుగ నొప్పు వైనతే
యోన్నతపృష్ఠదేశ మిదియున్ మఱి నా భుజపీఠ రోమరా
జి న్నునుపై యెసంగు నృపశేఖర! నీ విచటున్ భజించి దై
త్యు న్నిలువంగ నెంచుము సమోన్నతదేశశరప్రవర్షివై. 128

ఉ. నీ రథమైన నన్నెవఁడు నేమి పతాకల కాడిపోలులన్
నేరఁడు భగ్నముం బఱుప నీవుగ నా బుజమందు నెక్కవే!
నీ రథ మేన సారథియు నేన యనంగను స్వామి, మారుతి
శ్రీరుచిమద్భుజం బధివసించె నిమిత్తశుభోహవంతుఁడై. 129

గీ. నాఁడు తొలినాఁడు సుగ్రీవుతోడి చెలిమి
యితని బుజమెక్కియే నిర్వహించి కొనియె
నేఁడు తొలిసారి రావణుతోడి కలను
నితని బుజ మెక్కియే నిర్వహింప నెంచి. 130

చ. ప్రకటిత బాహువేగమున రాముఁడు చేసిన వింటిత్రాఁటిమ్రోఁ
తకు నకుతోభయం బగుచుఁ దత్కపిసైన్యము లెల్ల నిల్చి వె
న్కకు మఱలెన్ మహాదితిజకాండము నంతట నిల్చె, రాక్షసుల్
సకలమనస్కులై రవము వించు నిలంబడి యెల్ల చోటులన్. 131

వ. అంత హనూమంతుడు శ్రీరామచంద్రుని దైత్యేశ్వరపురః ప్రదేశంబునకుఁ దేగా రాముం డిట్లనియె

పద్మనాభము

ఔరా! మహారాక్షసా నీవు నాకెంత
యూ నప్రియంబున్ బొనర్పంగనైతో
ధీరుండవై నిల్చి తప్పించుకో నీకుఁ
దెర్వింత లేదింత త్రైలోక్య మందున్ 132

వారింపఁగా లేరు సౌరాంబుచూడుండు
వైశ్రావణుండుం బయోజాతగర్భుం
డౌరౌర నా నుండి మోక్షంబు పొందంగ
నన్యంబుగా వేఱ లేదన్న నీకున్ 133

ఎవ్వాని శక్తిం బ్రయోగించి చంపంగ
నీరీతి సంకల్పముం జేసినావో
యవ్వాఁడు నీదారపుత్త్రాది సంహార
మక్రూరుఁడై సేయఁగా నౌను సుమ్మా

అన్వాఁడు రక్షశ్చమూశ్రీ పదిన్నాలు
గా వే ల్తపోవంతము న్నిర్దహించెన్
గ్రావ్యాడి నారాచపుంఖాంతమందున్ గ
వ తీవ్రదుర్ధర్ష వేగాంత మందున్. 134

చ. అది యొక దుష్టమైన వ్యవహారము వేఁ డపకార మందునో
పదిఁబదిగాఁగ నీవలన వాఁడును గోపము నంది నీదు దు
ష్కృతకృతి యుగ్గడించెడిని, మాటయుఁ బల్కను లేక నీవు సు
ర్వా ప్రదుఁడయి యక్కటా! మఱియు నెంతువు కీడుఁపానచ్చెనుదిన్

చ. ఎగుడుదిగుళ్ళుగా నగున హెచ్చును తగ్గు రథంబు ధాత్రియెం
చఁగఁ బవమానసూనుని భుజాస్థితుఁడై చన రామమూర్తి సుం
తగ నగు నక్కటంతచనె దైత్యుఁడు కోపమునంది హన్మ బి
ట్టుగఁ బ్రహరించె నిప్పులు కడుంగడు మండెడునట్టి యమ్ములన్ 136

మ. తొడలందున్ మొగమందు బాహువులయందున్ వక్షమందుం గడుం
గడు మండించెడు నంపవాదరలఁ దత్కాయంబు వేధించె దై
త్యుఁడు తా బండిగనైన మారుతి పయిం దూకంగ లేకుండె నె
క్కుడు వారింపను లేక, బాధపడియెం గ్రోధంబు దీపింపగన్. 137

చ. అదియును జిత్రమౌ చలనమై చన రాముని యూనా వెంట నా
ప్పిదముగఁ జంక్రమించుచుఁ గపిప్రభుఁ డాసురరాజుబండి మూ
లదెసల సంచరింపఁగను లాఘవమొప్పఁగ రామచంద్రుఁడున్
గదలిచె నమ్ములన్ దివిజకాండవిరోధి రథంబునందున్ 138

చ. అదివర కెన్నఁడుం దెలియట్టి విచిత్ర శరప్రయోగ మూ
చు దితిజరాజు బండిదెసఁ జూచెను బాణము వెంట బాణముం
గదురఁగ బండి ఘూర్ణిలెడుఁ గంపము నొందెడుఁ దాకినట్టి చో
టది విరియున్ మహాభవనమందున నిట్టిక యూడునట్లుగన్ 139

చ. కడువడి రామమూర్తి రథకారుని శిల్పరహస్యవేత్తయో
కెడపుచు బండిమేకులు బిగించినచోటులు వ్రీలఁగొట్టెడున్
జడుఁడయి కూరుచుండె రథసారథి ధాత్రిపయిం దురంగముల్
మెడలకు నుచ్చ్వాసికొని మేదినియందున విహ్వాలింపఁగన్. 140

శా. ఛిన్నాత్మీయరథుండు తా నెచట నాసీనుండొ దైత్యేంద్రుఁ డా
సన్నం దోఁచకయున్న రావణుని వక్షస్సీమయందేసె ను
త్పన్నంబైన ధరాధరేంద్ర వినిపాతంబైన వేగంబుతో
డ న్నారాచ మొకండు రాఘవుఁడు క్రీడామూర్తియై పొల్చుచున్

మ. తనవక్షంబున బాణము న్ననిచెఁ గోదండంబు ఛిన్నంబు చే
సెన యీ రెండును యౌగపద్యముగఁ జేసెన్ బాణమొక్కండు ను
గ్రనగేంద్రాభముగాఁగ రెండవది ఖడ్గప్రౌఢధారంబుగాఁ
గ నెటుల్ చేసెనొ చిత్రమైనయది రక్షస్స్వామి చిత్తంబునన్. 142

ఉ. ఇంద్రుని వజ్రపాతమయి యింత యెఱుంగదు ఱొమ్ము స్వీయశ
క్తిం ద్రపయయ్యె దైత్యపతికిం ధను వింక నొకండు లేని య
ట్లుం ద్రసరేణుభూతమయి లోఁగె రథస్థ మహాయుధంబులున్
స్వేంద్రియముల్ వశం బఱె నగేంద్రము ఱెక్కలు పాసినట్లుగన్ 143

ఉ. వాని కిరీట మంత ధరపైఁ బడనేసెను రామమూర్తి ఘం
టానినదంబుతోడ మకుటంబు ధరం దొరఁగెన్ మణివ్రజం
బూనిన గూళ్ళలం దురలి యుర్విని సూర్యునివెల్గు కాల్వల
గ్రానతధారలై పడియ కట్టినయట్లుగఁ గానిపింపఁగన్. 144

చ. ఒక దిశిబొమ్మ నా నిలచియుండెను దానవచక్రవర్తి సూ
ర్యకులుఁడు రామచంద్రుఁడు కటాక్షసుధాప్రసరంబుగాగ వి
ప్పైకనుల పావమాని మెయిఁబూనిన బాణపు గంట్లు చూచి వీ
తకలుషభావుఁడై యనిమె దానవనాథుని మోము చూచుచున్ 145

ఉ. ఇంటికిఁ బొమ్ము డస్సితివి యెంతయు మారుతి ముష్టిఘాతమై
వింత శరాళి లక్ష్మణునివిన్ నినుఁ గాఁచియ వెట్టె నోర! యా
వెంటనె నేను గొట్టితిని వెక్కసమైనది నీకుఁ బోయి యా
గంటుల మందు వేసికొని క్రమ్మఱి రానగు సేదదేఱుచున్. 146

చ. అటనట డస్సి నాకడకు నాహవమాడఁగ రాకు మెప్డు మి
క్కుటముగ నింతవాఁడ ననుకొంచును యుద్ధము చేయఁబోకు, దోః
పటుతరశక్తి యస్త్రముల పట్టును ధారణచేసి రమ్ము, నెం
తటిరిపుశక్తి యెప్పుడును దక్కువసేయఁగ రాదెఱుంగకన్. 147

వ. నాకుం బనియున్నది. కీశేశ్వరుల మేనుల నీవుగ్రుచ్చిన నారాచం
బులు పెకలింపించను సౌమిత్రిని సేదదేర్చను వలయుఁ బొమ్మని
శ్రీరాముం డాంజనేయునితోఁ దిరిగిపోగా, రావణుండు. 148

గీ. ఎట్లుఁ దన పురిలోనికి నేఁగవలయు
నెట్లు తన పురిలోనికి నేఁగవలయు
పాదచారియై యర్ధశవంబువోలె
నిపుడు తన పురిలోనికి నేఁగవలయు. 149

మ. తనవంకం బెను లజ్జచేఁ గనఁగ దైత్యశ్రేణి దూరంబునన్
దనవంకం జెనుభీతిచేఁ గనఁగ దైత్యశ్రేణి దూరంబునన్
మనుజుం డొక్కఁడు కోతిపై నిలచి యీ మాద్రిం బొనర్పంగ రా
వణుఁడై తానుగఁ బాదచారియయి పోవన్ స్వీయరాజ్యంబునన్.

ఉ. రావణుఁ డేగుచుండ నసురవ్రజ మొక్కఁడొకండు భీతిమైఁ
గ్రేవల కేగి నిల్చిరి పురీగతరాజపథాంతరంబునన్
రావణుఁ డేగియేగి తన రాజమహాభవనంబులోన లో
రా వలదంచు నెవ్వరిని రాజతపీఠమున న్నిషణ్ణుఁడై 151

చ. మకుటమె తీసెనో మఱియు మస్తకమే తొలగించెనేమొ? మ
స్తకమును ద్రుంచినం దిరిగి తా నటు వచ్చును దేహసీమకుం
జికిలి మెఱుంగుబుద్ధి యతసీకుమాభుఁడు వాఁడు చేసెఁ బూ
నికఁ దలయుండి లేనటుల, నేర్పనిపించనియట్టి నేర్పుతో. 152

ఉ. ఈగతిఁ జేయఁగల్గినన నెంతగఁ జూచినఁ జాపవిద్యలో
భాగముకాద పూర్వప్రతిభామతి కాని సమస్తచాప వి
ద్యాగురుఁడట్లు తాను, పరమాల్పుఁడ నైనటు నేను, పైకి ధ
ర్మాగతి, యింతకంటె నవమానము సేయుట యెట్లు శత్రువున్ 153

ఉ. మానిసు లల్పశక్తులని మానితిఁ గోరఁగ వారినుండియున్
రానటులన్ మృతిన్ మృతియు రానగుచున్నది వారినుండియే
తానుగఁ దాత తండ్రి యపుదానికి దానికి నద్దియే మఱిన్
నే నఖిలాధికుం డగుట నిక్కము కోరఁడు సృష్టికర్తయై. 154

శా. నా సేవించు శివుండుకాని శివుఁ డున్నాఁ డొక్కఁ డచ్చంపుఁదే
జై సంవ్యాప్తజగత్త్రియంబుగను వాఁ డల్పీయసుండై సునా
యాసం బొప్ప మహీయసుండగున తా నా తేజు వ్యాపించదే
లా సన్నంబగుట్టి మానిసులయం దా నిండు కన్పింపఁగన్. 155

చ. మఱియును నెంత తేజయిన మానవదేహ ముపాధి స్వల్పమై
పరగిన దానిఁ దెచ్చికొను స్వల్పపులక్షణమెట్లు పోవు? సా
గరమున వంతెనన్ నిలుప గడ్డితినెన్ మఱి వారిపేరియ
క్కఱఁగనియెన్ బళీ! కపులుకాక మఱొక్కరు లేనియక్కఱన్. 156

చ. ఇతఁడును నన్నుఁగాని హరియింపను సృష్టిని జేసెనేనియున్
దితిజు లనేకు లుండి రతితీవ్రభుజాపరిణద్ధతేజు లీ
యతఁడును మొన్న నింద్రజి మహాహిశరంబులచేతఁ గాలి త
క్కు తెలివి చచ్చినాడ యనుకొంటిమి గాదె యదెట్లొ తప్పెనన్ 157

శా. నన్నుంగాని యతండు చంపుననుకొన్నన్ నాకు విశ్వాస మ
న్న న్నన్వంతగఁ గల్గినన్ బలముకానన్ రాద లోనెంచుకొ
న్న న్నేనప్పుడు డస్సిపోయితిని నానాస్త్రంబులున్ బుద్ధిలో
న న్నిల్వగరాకపోయినవి తన్నవ్యక్రియాశ్చర్యమై. 158

చ. మరియును జాపవిద్యను సమానులె యిద్దఱటన్న మాటతోఁ
బొరవడినాఁడ వానిఁ బొలివుచ్చితి నీతఁడు సాధ్యుఁడన్న గ
ర్వరమను బొంది యించుక పరాకుగ నుంటిని, దానిచేత నా
దొర పయిచేయి యైనయది, దోసము నాయది వాని శక్తిగా.159

ఉ. మారుతిమీఁది కోపమున మానితి రాముని, వానిపై శరా
సారము నింపితిన్ గపికిఁ జాలదటంచును విక్రమింపగా
నేరఁడటంచు నింక నతనిన్ మది నెంచన, వాని తమ్ము దో
స్సార మెఱింగితిన్ మిగులఁజాలఁడ యీతఁడు నంచు నెంచుచున్.

చ. అమరఁగఁ జాపవిద్యఁగలయట్టి మెఱుంగులు చూచుచున్ వినో
దము గనుచుంటి నాతఁడును దానిని స్వీయధనుఃకళాప్రభా
వ మనుచు నెంచెఁగావలయు వాఁడది శౌర్యమటంచు నెంచెనో
బ్రమసితి నేను, నద్ది యవురా! యవమానము గాగ మాఱెఁబో161

చ. వెరవఱి వేఁడుగాని పరవీరుని యుద్ధము నేర్పు చూచి ని
వ్వెఱఁ గను వాఁ డొకండగు నవీరుఁ డనాహవయోగ్యుఁ డట్టి దు
శ్చరితుఁడు వేఱ చూపఁగల సాహస మింతయుఁబాటి లేదు త
క్కొఱుఁ దధముండు తాన యధికుండగు నోచితి నేరకుండినన్.162

శా. శక్తిన్ దమ్ముని మూర్ఛపుచ్చెనని దీక్షన్ క్రోధియై వచ్చె నా
సక్తిన్ బంటు బుజంబునెక్కి మఱి కక్షన్ వానిఁ దాడింప ను
ద్రిక్తుండయ్యె నతండు శత్రుమతి యుద్రేకంబు పొందింప కీ
యుక్తిన్ వాఁడు నడంగి యున్నపుడె నీ పూహింపనోఁ దద్వ్యధన్

క. మనచే నపకృతి పొందిన
మనుజుఁడు తొలిసారి యురిసి మన మీఁదికి వ
చ్చిన యప్పటి జిగి, సమయము
చనినకొలఁది పలుచఁబడును సాహస మురలున్. 164

మ. ఇవి నాచేసిన రెండు దోసములు పోనీ! యింక నేన్ వాని లా
ఘవముం గన్గొని యబ్బురంపడుట కల్గంబోద యేనాటికిన్
బవరంబుల్ మఱియింక నెన్నికలనో వాఁడున్ తగన్నేన్ ధను
ర్వ్యవసాయంబునఁ బట్టి చూచికొనఁగా నైనట్టి వొక్కొక్కరిన్.

గీ. ఒక్క యాప్రశ్న యట్టులే యున్న దితఁడు
న న్వధించుటకా యటన్నది యదింత
సంశయగ్రస్త మైన దాసంశయంబు
వీఁడు సమసిన నావిర్భవింపఁబోద. 166

చ. అలుపపుజంతువుల్ మనుజులం చనుకొన్నది నేను, వారలన్
వెలియిడి కోరినట్టిదియు నే, నితరుల్ గల కుగ్రరాక్షసుల్
చలమున వారిచే నితనిఁ జంపఁగఁ జేసిన సంశయంబుగా
నిలచియపోవు సంశయము, నీరజగర్భుని తెల్వి తెల్విగా. 167

చ. మా కెటువంటిదైన యవమానము చేసెనో వాఁడు, వానికిం
జేకొని దానికిన్ మిగిలి చేయఁగనౌ నవమాన ముగ్రదో
శ్నీకుని సర్వవేళల నరిందము పూర్వమహాహవోగ్రచం
డాకృతిఁ బంపఁగావలయు నాతనిపై విధి యాట కట్టఁగన్. 168

మ. అకటా! నాపరు వెల్లఁ బోయినది రాజ్యంబందునన్ రాజధా
నికి నేఁ గాల్నడ వచ్చునట్టి పగిదిన్ నిర్మించు, నాపైని ము
త్తకిరీటంబుగ, నే ప్రతిక్రియయు యోగ్యంబే యగున్ జువ్వె వా
నికిఁ గాళ్ళేతుఁబు కట్టి బొమ్మవలె వానిన్ పీకులం ద్రిప్పనా: 169

ఉ. కొండలఱెక్క లింద్రుఁడెయి కొట్టిన నాతని ఱెక్క లీభుజా
చండుఁడు కొట్టె వాఁడొకఁడు చాలును ముజ్జగమున్ గ్రసింప వాఁ
డుండఁగ నాకు నేమిభయ మున్నది? చాపము నీప మంచు నో
ర్వం డొక పంటిక్రిందకును రాఁ డితఁ డూరక మ్రింగుచుండఁగన్.

గీ. నీవు కొట్టెడివాఁడవు నీవు కొట్టు
చుండు నాతండునుం దినుచున్నవాఁడు
తినుమనుండున యమ్ము లేదును ధనుస్సు
లేదు కొండలు విసరుట లేదు పైన. 171

మ. అతనిం బోలిన యట్టి యబ్బురము లే దాకల్పకల్పంబు నూ
ర్జితుఁడౌ నాతఁడు పుట్టినప్పటి కథావృత్తాంతమున్ లోకవి
స్మితికిన్ హేతువు వాఁడొకండె దితిజశ్రీమూలభూతుండు వే
ని తరం బాతనిఁ జంపఁగా? మొదట వానిం గెల్చుటే లేదనన్. 172

చ. పదములపంచభూతపరిపన్మయమై చను సృష్టి సాగుచో
మొదలివికారమై చనిన పూర్ణగుణంబు లొకండొకండు తా
నదియదియే ప్రపూర్ణముగ నందె శరీరుల బాహుశక్తి సం
పద సకలంబునుం బడసె వానిని గొండనుబోని మేనితో. 173

క. పిడుగులు పడుచున్నను వాఁ
డేడియుఁడు గిరిరాజమైన నిడియునుబో యూఁ
తఁడు యుద్ధము చేయఁడు నం
తిడి శత్రుల మొదలుపెట్టి తినుచుండుటయే. 174

ఉ. ఆతఁడు పుట్టినంతనె మహాక్షుధచే సురయక్షదైత్యులం
జేతులఁ బూని దంతములఁ జీల్చి యూరక మ్రింగుచుండగా
భూతలమందునన్ వెలితి పుట్టిన యెందున కందుఁ బల్లమై
భీతిని జీవకోటి చని విన్నపముల్ పొనరింప బ్రహ్మకున్. 175

శా. స్వామీ! యేమిది తెచ్చిపెట్టితివి మాజన్మంబులున్ మృత్యువుల్
గా ముందేదియొ వెన్క నేదియొ యెఱుంగ నేర మన్నన్ దయా
శ్రీమంతుం డయి బ్రహ్మ వానిఁ బిలిపించెన్ వచ్చె నాతండు మ
ధ్యేమార్గంబున విన్నవించు జనులం దించున్ బుభుక్షావిధిన్. 176

శా. బమ్మం గాంచుచుఁ గుంభకర్ణుఁడును శుంభజ్జిహ్వ సారింపఁగా
గ్రక్కెన్ భీతి పయోజయోనికి మనఃకంజాతమందున్ నిమే
షమ్మం దాటకయుండ నాతని శపించంబూని వాచించికొం
చు మోహాఘోతగమైన నిద్ర కనుమంచు మ్మాటలై వచ్చినన్. 177

ఉ. తా నొకపెద్దకొండవలె ధాత్రిపయిం బడి వాఁడు నిద్రపో
గా నిగిడించు నూర్పుల గాలులఁ దూలుచు సత్యలోకపుం
గోనలు తాకుమారయినఁ గోపముచే విసువంది బ్రహ్మయున్
వీనిని గొంచుఁబొం డనియె వీఁ డెటుపుట్టె నటంచుఁ దీవ్రుఁడై. 178

క. అడుగడుగున మోసెడి వా
ర్వడిపోవఁగ వేయుచుండి పట్టుక రాఁగాఁ
గడపించి సత్యలోకపు
గడపను తెచ్చితిమి వానిఁ గ్రమ్మఱ నిటకున్ 179

మ. పృథివీభూతము లెల్ల ము న్నిలువఁగా వీల్లేని వానిన్ మహా
యుధమున్ గాఁగను జూచినాఁడను భుజాయుక్తిం ద్రిలోకీజయ
ప్రథ వాంఛించిన నేను నాకు మితిమీఱన్ వీఁడుగా నెంచుచుం
బ్రథితంబై చను భక్తి నవ్విధిని సంప్రార్థించితిన్ దీనుఁడై. 180

చ. బ్రతికినయంత కాలమును బంధురనిద్రను గూరియున్నచో
బ్రతుకను నేల? దానికిని ఆయియ మేలగుఁగాదె! బ్రహ్మసం
తతియయి ఆయియై మనుట న్యాయమె? నీకృప, యింతవట్టు ని
ర్గతమయి సృష్టి నీ వెఱుఁగకన్ బహిరాగత మైన దున్నదే. 181

చ. ఒకనికిఁ బట్టరాని తెలివుండును వేదములన్ స్మరించు, వే
ఱొకనికిఁ బట్టరానిబల ముండును లోకములం జయించు, నిం
కొకనికిఁ బట్టరానిక్షుధ యుండును భూతములం గ్రసించు నీ
కొకని కనాదిగా ప్రభుత యున్నది సృష్టినిఁ జేతు లోకముల్. 182

క. ఈతం డెవ్వం డనఁగ వి
ధాతృని మనుమం డితండు దైత్యుఁడొ శిలయో?
యీతం డెవ్వం డనఁగ వి
ధాతృనిమనుమం డితండు దైత్యుఁడు శిలయున్. 183

చ. సరసిజగర్భుఁ డిట్లనియెఁ జాలున, యేమనె దీవు జంతువుల్
మరియును వృద్ధిపొందెడు ప్రమాణము మీఱిన తిండి తిన్నచో
జరుగుట యెట్లు లోకము లసాధుబుభుక్షువు వాఁడు నన్ను నే
బిరబిర చూచుచున్న పులి వేయఁగ నెంచెనుగాదె యత్తఱిన్. 184

మ. ఒడి బంధుత్వము నింతకట్టుక నిరుద్యోగంబుగా నింటిలో
నిడి పోషించెద నన్న, గుండిగను నీ వెన్నాళ్ళు పూరింతు? వాఁ
డడుగన్ లేదను మొక్కసారి, యకటా! యర్థాశనాయాప్రచం
డుఁడు నిన్నే గ్రసియించు, ధర్మ మది నిందున్ బంధుతాసాధువై.

ఉ. ఊగి జగంబులం దినుచునుండిన వాఁడును వానిపోషణన్
సాగిన నీవు, రెండును నిజంబుగ నొక్కటియే గదా, బుభు
క్షాగతి నాతఁ డూరక జగంబులు మ్రింగును, వానిపోషణం
గాఁగలదేమి? నీవును జగంబులు పెట్టెదు త్రవ్వి పోయుచున్. 186

ఉ. తమ్ముఁ డటన్న యీ మమత తాల్పకు మన్నను, నేను తాత! నే
హమ్మున నున్న మొద్దును నిరంతము తమ్మునిఁగాఁగఁ జూచుకొం
చు మ్మనుమన్నఁ జేతనగు చుట్టరికమ్మున నేమి చెప్పనోఁ
గ్రమ్మిన నైజలక్షణముగాక మనఃకృతదోష మున్నదే? 187

మ. సిలుగౌ నిక్కము వాని నిచ్చలును బోషింపగ, నీ వన్నయ
ట్టులు లోకశ్రుతి చేయఁగా వలసియుండున్, నేను సద్భావ నీ
పలుకై వచ్చినదానిలోని నిజముం భావించిన ట్లొప్ప నా
పలుకున్ ముద్దుగఁజేసి నట్టిదగు నప్పాటం గటాక్షింపవే. 188

శా. ఏ రెన్నాళ్లలో వాఁడు మేలుకొనఁగా నేడాదికిం జేయవే
యా రెన్నాళ్లలు రెండుసార్లుగను జేయన్ మాకు సంతోషమా
నా రెన్నాళ్ళలు వాని కెప్పు డశనాయాపూర్తి కావించెదన్
మా రాజ్యంబున నందఱుం దినెడివౌ మాంసాదులే పెట్టుచున్.

క. వాని బుభుక్షార్థము లో
కానికి నొక నేగి లేనిగతిఁ జేసెద వా
గ్దానము, నను మన్నింపవె
తా ననుఁబం డన్న వాఁడు తా నున్నటులన్. 190

మ. అనిసన్ బ్రహ్మయునన్నుఁ గాంచుచు సరేయన్నాడు క్రొన్నవ్వుతో
దనుజాధీశుఁడు కుంభకర్ణుఁడు తనంతన్ మేలుకొన్నన్ సరే
పని యేదైనను గల్గి మేలుకొలుపన్ వాంఛింతు నేనిన్ మరే
మననౌ నాపనిలోన నుండిన యసాధ్యత్వంబు సాధ్యత్వమున్. 191

చ. నెలలుమూఁడు దాఁటకయ నిక్కముమేల్కొనుటేయసాధ్యమా
నెలలవి మూఁడుదాఁటినను నిర్భరశక్తిని మేలుకొల్పనౌ
నెలలను బూర్తి కానగుచు నిండఁగఁ బోయెడు వేళఁ గొద్దిలో
పల దితిజేంద్రు మేలుకొలుపన్ సులభంబగుఁ గొంతమేరకున్. 192

చ. సహజముగాఁగ మేల్కనిన శౌర్యము వానిది సర్వలోకదు
స్సహమగు, వానిమేల్కొలుపశౌర్యము కొంచెముతగ్గునాఁ బయో
రుహభవుఁ డన్నయట్టు లెవరో యని, రయ్యది నేనెఱుంగ దూ
ర్వహమగు వానిశక్తికి రవంతకొఱంత దురంతమే యగున్. 193

క. నెల యైనను మిగులద యూ
ర్నెలలను సగమైన లేద నెలలోపల నా
ర్నెలలందునఁ దొమ్మిదిదిన
ములు మిగిలిన మాత్ర మునిగిపోయెనె చెపుమా!

చ. నిలచి తనంత తానుగను నిద్దుర మేల్కనుదాఁక నాగఁగాఁ
దలఁచిన వాఁడు చేసిన విధంబది తొమ్మిదినాళ్ళ గుండెలో
పల భరియించు టెట్లు? పగపట్టుక యిట్టులె ప్రొద్దుక్రుంకులో
పల నతఁడేమిచేసె నది వానికిఁ జేయక శౌర్యమున్నదే? 195

ఉ. తొమ్మిదినాళ్ళు తక్కువఁగ దుష్టుఁడు రాముఁడు నన్ను నమ్మలం
గ్రుమ్మఁగ నేలకల్గినది? క్రూరులు రాక్షసు లింక లేరటే
యిమ్ముగ నేగి వాని వధియించెడి వారలు కుంభకర్ణునిం
బొమ్మన నేటికిన్ నిదురపోయెడివానిని లేప నేటికిన్. 196

తే. నూటయెన్బదినాళ్ళలో నూటడెబ్బ
దొకటి గడచినయది యదియొక్క కొఱఁత
యగునె? శంకించునది మన సన్న దినుసు
కాక, నిశ్చయ మని లేని లేకి దినుసు. 197

మ. ఒకఁడే ప్రశ్న యతండు నాయురమునం దొక్కమ్మ నాటెన్ నిర
స్తకుభృద్భారము నట్టిదైన శరవర్షం బాగుచున్ లెక్కసే
యక యవ్వానినిఁ బోయి పట్టుకొని బాహాకృష్టి తనూర్ధదే
శకమాంసాస్థిని వ్రక్కలించఁగలఁ డా చండోగ్రదోశ్శక్తిచే. 198

చ. దిగధిపు లందఱుం గలసి దీప్తమహాస్త్రము లేయుచుండగా
నగభిదమోఘవ్రజము ఘనంబుగ నెత్తిన మొత్తుచుండఁగా
ఖగచరసేను లందఱును గత్తులఁ గ్రుమ్ముచు నుండ నేకధా
రగఁ జని లెక్కసేయ కమరావతి గోపుర మూడఁ దన్నఁగా. 199

శా. క్షుభ్యన్నీలము వారిరాశినివతత్సుగ్రీవ మాశాచల
ద్బిభ్యద్వాయుసుతంబు విహ్వలదసువ్రీడార్ద్రవల్లక్ష్మణం
బభ్యామర్దితసర్వఋక్షకపిసైన్యంబున్ విలోకించి దో
రభ్యాశంబుగ మోర మోదికొనుచున్ రావణుండునుం జచ్చెడున్.

వ. ఇట్లు నిశ్చయించి మిగిలినమంత్రులను బిలిపించి వారితో రాముని
దుర్నయమును దనయౌదాసీన్యముగానిరూపించి కుంభకర్ణుని యప్ర
తార్యత్వము ప్రాస్తావికముగా నగ్గడించి,యతని నిద్రలేపుట వారిచే
ననిపించి, వారియొత్తిడికిఁ దా నంగీకరించినట్లు నటించి వారిని
దత్కార్యమున నియోగించిన. 201

సీ. కొండంత మాంస మ్మకూపార మంత మ
ద్యంబును వెస సమాయత్తపఱచి
కుంభకర్ణుఁడు నిద్ర కూరినదగు గుహా
ముఖమునఁ జేరి తన్ముఖవినిర్గ
తంబైన గాలిచేఁ దాడితదేహులై
పాదస్ఖలన మంది పార్శ్వగముల
నినుపకమ్ముల నూని యేగి లోనికి వాని
తలవైపునందు భద్రముగ నిలచి

పటహములు ప్రాసశూలముల్ పట్టిసములు
గర్దభాశ్వగజంబులు కాహళములు
కడఁగి నెమ్మది నెమ్మదిగాఁగ నొక్కఁ
డొకఁడు లోనికిఁ జేర్పించి యుత్సుకులయి. 202

ప్రహరణ కలిత

పటుతరగదలన్ బహుళపరిఘలన్
బటువు గుదియలన్ బలుగు బరిసెలన్

పటపట భటులున్ బడలి పొడిచినన్
నిటలపు ముడియున్ నిగుడ దతనికిన్. 203

తుటుము పదనుకత్తులను గురిసినన్
చటుల నిశితప్రాసములు విసరినన్
నటదనలపుబాణములు సుడిసినన్
నిటలపు ముడియున్ నిగుడ దతనికిన్. 204

రటదశనిమహోర్భటిమదుదితదు
ర్ఘటపటుతరముద్గరము లద్రువఁగన్
జటిలపటుపరశ్వధము లడచినన్
నిటలపు ముడియున్ నిగుడ దతనికిన్. 205

అశ్వగతి

భాసురశూలవినర్తితబంధురకర్ణనటత్
రాసభఘోరవిరావతురంగమదుర్భరహే
షాసముదీర్ణరవంబు లెసంగిన నిశ్వసనో
చ్ఛ్వాసములందు సమానత పాయుటె కన్పడకన్. 206

గజవిలసితము :

జేగురుభూతి యొప్ప సివ మెసఁగి సురల యూ
రేగిన ఘంట లొప్ప నిభసమితి పరవఁగన్
జోగిన కన్నుమ్రోత సురరిపువు తెరవఁడే
యీఁగలు వ్రాలిన ట్లయిన శరము విసరఁడున్ 207

క్రోవులఁ జిమ్మి నీళ్లు కుటిలదశనఖనన
గ్రావముగాఁగఁ గ్రుమ్మి ఖరచరణయుగములన్
జేఁనగఁ ద్రొక్కి త్రొక్కి సిలుగుపఱచి చనినన్
గ్రీవ కదల్చి డొత్తిగిలఁడు కదలఁడు ధరన్ 208

తీరక పోట్లు ఘుంకృతి చటులము గిరిదెసల్
గీరెడు వప్రకేళికృతి నఱుము చఱుమఁగన్
మారణకుష్టచంక్రమణరమణ మసల ని
ద్రారతి సుంతగాఁ గదలి కనులు తెరువకే. 209

క. నన్నేల నిదుర లేపెద
రన్నాకముబాధ మున్న యణఁగినదికదా
యన్నాఁడు, మఱల నిద్దుర
కన్నాఁ డసురేశ్వరుండు కన్నులముంపై 210

గీ. ఉన్నచీఁకటి యుండక యొక్కదివ్వె
వచ్చి వెంబడి నారిన పగిది వాని
కలుగు మెలఁకువ పదిమడుంగులుగఁ బోయి
యంతటను బునఃపాకప్రయత్న మయ్యె. 211

నవ్కటము

మునుకొని వేయికాహాళల మ్రోఁతలు సేసిరిపో
కనుకని వందఢక్క లధికంబుగ వేసిరిపో
వెనుకొని వేలువందలును భేరులు మ్రోసిరిపో
కనుగొన సుంతలాభమును కల్గక యూగిరిపో. 212

### తురగము

తవిలి శ్రవణములను ముఖములను తార్చి మండెడు శూలముల్
జవనవితతి ఖరసముదయ ముఖజాతభీషణరావమై
చెవుడు వడఁగ దెస లఖిలము పరిశీర్ణ చలద్వియత్
భవమగు ప్రతిరవము గుహా నిలుచుపాటి లేక విదీర్ణమై 213

### అశ్వలలిత

ఇరుదెసలందు రజ్జువులుకట్టి యిట్టటుల లాగునట్టి వెరవై
తురగచయంబు ఘోరఖరరాజి తోలఁగను ద్రాళ్ళ ప్రీలి చనినన్
ఖరతురంగంబులు క్రమముగ నేగిగాఢముగ గోడలందుఁ దునుఁగన్
తిరిగి సురారిబాహువులుగాని దేహమునుగాని సుంత చెడదున్.214

### కరిబృంహితము

గ్రావనిభములు దంతినిచయము క్రమ్మి యురమునఁ గ్రుమ్మినన్
త్రోవ యెఱుఁగక. వానిపెనుచెవి రూక్షముగ రొదచేసినన్
మావులును ఖరదంతులును పెనుమార్గమో యన నేగినన్
దేవరిపుమెయి వాని కిసుమును దెల్వి కలుగకయుండినన్. 215

### ద్విపద

సీసంబు కరగించి చెవులలోఁ బోసి
ప్రాసనంతతి గ్రుచ్చి పండగాఁ గాల్చి
మీసముల్ పటుకార్ల మెలచి లాగించి
రోసముల్ మివులంగ రూక్షదానవులు. 216

వ. గత్యంతరములేక తీవ్రతక్షురంబులు ముక్కులలోఁ జొనిపిన నతఁడు చేతుల విదలించి మఱల మఱల నల్లెచేయఁ దీవ్రతక్షతంబుల లేచి

కూర్చుండి వారి నాహారింపఁ బోఁగా మాంసమద్యంబు లందించి
యతఁడు తృప్తిపడి ప్రశాంతుఁడై ప్రసన్నుండైన. 217

ఉ. సమ్ముఖమందుఁ జేరి భయసంగతవృత్తిఁ బునఃపునఃప్రణా
మమ్ములు చేయుచున్ దితిజమండలనాయక! యన్న వారు, తా
నమ్మహనీయమూర్తి నను నంగద లేపితి రేల యన్న వా
రిమ్మగ రావణాజ్ఞ వచియించిరి సాధువులైన మాటలన్. 218

వ. అంతఁ గుంభకర్ణుఁడు తన్ను మేల్కొలుప వచ్చిన రాక్షసభటులను గజాశ్వాదుల నందఱిని బంపించి తనమంత్రులైన యూపాక్ష మహోదరులతో నిట్లనియె. 219

శా. రాముం డెవ్వఁడు లక్ష్మణుం డెవఁ డొరా! మానిసుల్ కాని సు
త్రాముండున్ యముఁడంచుఁ గారుగద, పారావార మె ట్లీదినా
రీ మీ యందఱ కింత భీ కలుగఁగా నెట్లాచరింపంగ నై
రే మా రామున కింతమానుషము? దైత్యేంద్రుండె కంపింపఁగా.

చ. మన దితిజాతసంతతికి మానవజాతికి భేద మున్న దా
మనుజులు స్వీయధారుణీరమాపరితృప్తులు, సత్యధర్మపా
లనపరమార్థచేతసు, లిలాసకలార్థరమానుభోగవాం
ఛను మన ముందు నేటికిని సాధువు రాఘవుఁ డెత్తివచ్చెనో? 221

గీ. అంతవఱకైన సర్వరామాయణంబు
తెలియఁజెప్పిరి మంత్రులు దితిజపతికిఁ
గుంభకర్ణుఁ డాలోచనాఘూర్ణితాక్షు
డెల్ల విషయంబు నూహించి యిట్టు లనియె. 222

చ. కృతమతి నేను నార్నెలల క్రిందట మేల్కనినప్డు వింటి భూ
సుతఁ గొని తెచ్చెనంచు, నది శూరుఁడు రామునకున్ వలీముఖ
ప్రతతికి మైత్రి కల్గుటయు, రాముని పంపునఁ గోఁతి, రాక్షసుల్
కుతలపడంగ నగ్గి దరికొల్పుట రెండును రెండు చిత్రముల్. 223

గీ. ఱాళ్ళు లవి తేలెనా సాగరంబుపైన
రావణునిగుండె వ్రస్సెనా! రామశరము
తాఁకి, యెయ్యది యింద్రు శతారమునకు
చెక్కు చెదరదొ, యయ్యది చిత్ర మనుము 224

ఉ. రావణుఁ గెల్వఁగా వలయు రాముఁడు, చిత్రము, వాలిఁ జంపి సు
గ్రీవునితోడ నేస్త మమరించికొనెన్ మతి కందరాదు, సు
గ్రీవుఁడు చూచినన్ సకలకీశధరాపతి, యాంజనేయ సు
గ్రీవులు మంత్రి రాజు, నెవరిం బయికెత్తుటయో యెఱుంగకన్. 225

క. ఈమారుతి కేవ రధికమొ
రాముఁడో సుగ్రీవుఁడో ధురామతి రాముం
డేమి మదిఁ గోరి యీతని
తో మైత్రింగట్టె? సుంత తోఁచదు నాకున్. 226

చ. ఒకఁడొకఁడున్ విచిత్రముగ నున్నది వంకరటింక రేడుతా
ళ్ళకు నొకయమ్ము, నంతటిబలంబు కలానికిఁ గీశరాజు వా
లికి నొకయమ్ము, ప్రహాదినికి లేఖపసేతికి నాగు ధైత్యుగుం
డెకు నొకయమ్ము, తద్విశిఖనిర్భరభావ మచింత్య మయ్యెడున్ 227

వ. అనుచు నమ్మంత్రులను మీరు పొండు, నే నింతలో వత్తునని
మహారాజుతోఁ జెప్పు డని, వారిని బంపించి, కృతస్నానుఁడై రాజ
దర్శనయోగ్య వేషధారణంబు సేయుచు. 228

మధ్యాక్కఱలు

నూటయెన్బదియేండ్లు జరుగ నూలుకొనున్ నాకు నొక్క
యేటి మేల్కనుట బ్రహ్మ నచియించె, నిదేటిజీవితము?
చేటూ మేల్కనియున్నయంతసేపు కుక్షింభరిత్వంబె
పాటిగా నిహాపరలోకపాలనాభావంబె లేదు. 229

కొండంత యీదేహ మేలొకో మేలుకో లేని మేను
గండఁ డౌ దశకంఠు నండగా నుండగా నేమొ మేను
ఖండ మిా జాగ్రత్త పాయగా నీయఁగా లేదు రావ
ణుం డందుచేతఁ దద్రక్షనుం జేయనుంగాక లేదొ. 230

కళలు రెండే కల్గువానిఁ గల్వారకాంతునిఁ దాల్చుఁ
దలపై నుమాజాని నాకుఁ దనరారుఁ దగ రెండునాళ్ళ
తెలివి యేఁడాదికిఁ బోల్కి తెచ్చినఁ దెచ్చుఁ బాలింప
వెలుఁగు లెచ్చట నున్నఁ బ్రోవువెట్టెడు విభుఁ డేల తేఁడు? 231

కసవైన పనికాక మఱలఁ గలిగెడి కంఠముల్ కోసి
యొసఁగుట యని వందయేనియును నాదు నొక్కకంఠమ్ము
పసిగాపు, నీవలెఁగాక సర్వంకషమ్ముగా సర్వ
మసువులు, నై వేద్య మల్పమైన భయ మ్మేల కాదు? 232

శివునియంతటివాఁడు కాక శివధనుశ్ఛేత్త యెట్లగును
శివునిశిష్యునిదైన వింటిచేవ వంచించుట యెట్లు
శవురయ్య కంఠముల్ తెగినయప్పుడు ప్రాణముల్పోవు
నవి తెగి ప్రాణముల్ పోనియపుడు భయం బేల వలయు? 233

చిత్తమున విభీషణుండు చెడ్డ మంచిని నేర్పరించుఁ
దత్తరంపడి వాఁడు నేగెఁ దరణి సంతానంబు చేర

హత్తుఁ గొందఱకు భవిష్యదర్థంబు లాత్మలయందు
చిత్తమ్ము శాంతమై మఱి సుశీలమ్ము చెందువారలకు. 234

బుజమునయందుండి కత్తి పూనుచుఁ బూన్చుట యెట్లు
బుజము ఖండింపంగ నేమిబుజ మది భూభృన్నిభంబు
రజనిచరుండు వాఁడా విరాధుండు గ్రావసన్నిభుఁడు
గజిబిజిగాఁగఁ నాలో సగంబైనఁ గలఁ డనుకొందు. 235

వ. సతారాచంద్రసూర్యంబు సప్రత్యంతపర్వతంబు నీలాంజనగిరి కదలుచున్న దనఁ గుంభకర్ణుండు లంకాపట్టణధాత్రి దద్దరిల్లగా రాజభవనంబు చేరి రావణునిచేతఁ బ్రత్యుద్యాతుండయి సౌదర్యంబు నెఱపఁబడిన తరువాత రాజిట్లనియె. 236

క. నిను లేపవలసి వచ్చెను
మనలంకాపురికి నిపుడు మసలినయది యొ
క్కనివలన మనుజువలనను
ఘన మాపత్తి, సకపిప్రకాండునివలనన్. 237

శా. నూలోక్క బాధయు నీకుఁ గల్గుననుకొందున్ నే నెదో యుండగా
నల్కన్ గైకొని యంపకట్ట యొకఁడాహా! నాయెడం దూసెఁబో
కీలోక్క నెక్కువబాధగా మనసునం గీశవ్రజం బన్న కా
కులూక్కసెన్ దెలవారె నంచు మదిఁ గాకుత్స్థుండు భావించెనో 238

చ. ఒకరొకరున్ శరప్రతతి యుద్ధములాడెడువేళ నంతే, దా
నికిఁ బనిలేదు, వానికిని నిక్కడి యెంత? ధరిత్రిఁ గూల్చె నా
మకుటము, దైత్యశూరజనమండలి కంతకు సిగ్గు గూర్చె దా
నికి, మఱి వాని ప్రాణములు నిండుగఁ దీసెడు నట్టిదానికిన్. 239

ఉ. ఆ పని కీవొకండవు సమర్థుఁడ వింకొకరుండు లేఁడు సం
క్షేపముగాఁగ మంత్రులును జెప్పియయుందు రిదంతయున్ మదా
జ్ఞాపరిబద్ధబుద్ధినయి చండము శూలము తాల్చి పొమ్ము ని
న్నోర్చెడువాఁడు మింటిపయి నున్నది లే దిట నున్నె మంటిపై. 240

క. ఆపాపిఁ జంపి తినకుము
చూపఱు వెఱఁగంద జేపు సూర్యోదయమా
లోపున వానిశవంబును
జూపింపుము నాకు నయనసుందరశవమున్. 241

శా. ఏ మాలోచన చేయుచుంటి వన, నాదే మున్న? దేమైన నీ
రాముం డిచ్చుటి కేల రావలయు? సుత్రామున్ జయింపంగ స్వ
ర్ధామం బందలి సర్వభోగములు హస్తప్రాప్తముల్ గాఁగ, స్వ
ర్ధామశ్రీ కధికంబు లే దనుచు వేదంబుల్ ప్రశంసింపఁగన్. 242

చ. సచివులతోడఁ జెప్పవలె సఖ్యమొ వైరమొ వారిమాటలం
దుచితముఁగామి బియ్యమును నూఁకయు నట్టుల నేర్పరించి యం
దుచితము చేయఁగావలయు నుర్విపుఁ, డాతని రాజ్యలక్ష్మి కూ
రుచుఁ బ్రియురాలునౌ, సమనురోపితుఁ జేయు రహస్సుఖంబులన్.

చ. మఱియును జీవులందఱు ప్రమాణము కల్గియ యుందు రన్నిటం
బెఱలకు మించి యొక్కనికిఁ బెద్దయుఁ గల్గనయేని శక్తి యే
డ్తెఱ నది యంతలో నపరిధీకృత మంచని యెంచరాద, యే
మఱకయ దాని కుండిన ప్రమాణము దానికి నుండు నెప్పుడున్.

ఉ. అట్టులుకాక నాల్గు పురుషార్థములై చను నాల్గుగుఱ్ఱముల్
కట్టిన బండియున్ సమముగాఁ జన యాత్ర సుఖంబుగా నగున్
కట్టిన గుఱ్ఱ మొక్కఁ డధికంబుగ నేగిన దారి వీడి యే
చెట్టునఁ దాఁకునో? శిలను జెందునొ? గర్తమునందు జాఱునో? 245

చ. తెలిసిన యోగమార్గములు తెల్వికి నీతికిఁ గాక యింతగాఁ
దెలిసితి నన్న గర్వమును దెచ్చిన దానికి నైన నేమియుఁ
దెలివియు వేఱలేదు తనతీర్చినతీరుపు, చేయు నేఁతయే
తెలివి యటన్న శాస్త్రములఁ దేలికపుచ్చుటయే యగుంగదా!

ఉ. ప్రెగ్గడలందు రెండయినరీతులు కల్గు నొకండు తానిలో
ముగ్గిన చెట్టకోర్కులకు ముంతపోగన్ ఘటియించు వేఱొకం
డగ్గని దవ్వుఁ ద్రోసి యిదియైన నసేవ్యమటంచుఁ జెప్పు, నే
ప్రెగ్గడ మాటలందుఁ బృథివీపతి దుర్మతి మొగ్గుసూపెడున్. 247

ఉ. నేరము పంచభూతముల నిల్చిన చేతనతాస్వరూప మా
కారవిశేషభేదములు కాంచుట కల్గును గాని, యాంతర
స్ఫారవివేకలక్షణము చాల నెఱుంగఁగ, మూర్తిపెద్దదై
సారము చిన్న, పెద్దదయి సారము మూర్తి చిన్నగాఁ జనున్. 248

మ. తన యుత్తాలగుణంబు సత్ఫలము పొందన్ రాక యుండంగఁ బె
ల్చిన కల్పించును బ్రహ్మ, యొక్కఁడు రిరంసాబుద్ధి జీవుండు పో
వును వ్యామోహము వెంబడిం దనకుఁగాఁ బోనైన మేల్త్రోవ నెం
చనునైనం గనకుండ నక్కట! యధస్తాదధ్వముం బట్టుచున్. 249

చ. అన దశకంధరుండు తన యక్షులఁ దీవ్రత గోచరింప ని
ట్లనియెను నిద్రలేపు టదియన్నను నిన్నును నాకు మంచిచె
ప్పను నిరతంబు మేల్కనెడు వారలు ధారుణియందులేరటం
చనుకొనెదన్ మహాగమ సదాధ్యయనం బొనరించు పండితుల్.

శా. నీముం దాగడు నీరజాసనుఁడు నీ నిద్రాజడత్వంబు లే
కా మై వేదము లాగమాళి నిరతాభ్యాసంబు కావింప నం
చేమో యిట్టులఁజేసె నెప్పుడును నీ వీ మెట్టవేదాంతముల్
నా ముం దాడవు, నిద్రలోఁ గఱచి తన్నా! యెన్ని శాస్త్రంబులన్.

శా. ఆ రెన్నాళ్ళు మెలంకువన్ విధిని సంప్రార్థించి తేకున్నచో
నారా! దేహము తిండిలేక యెప్పుడో యానిద్రలో నిద్రలో
నే రాజీవహితాత్మజాతునిపురం బేగం బ్రయాణించి యుం
డా రమ్యానుభవంబు లేనటుల నేనై సేత తప్పైనదో. 253

ఉ. తద్దయు నీకు నున్నవికదా సుతి తొమ్మిదినాళ్ళు లింక బ
ల్విద్దురమత్తు తా వదలలే దది నీకును బోయి నిద్రపో!
మొద్దువిధంబునన్ నిదురపోవుచునుండఁగ వాఁడు వచ్చి యా
మొద్దును గాళ్ళు చేతులును ముక్కలు ముక్కలుగాఁగ వ్రేల్చెడున్

గీ. వానిఁ జంపఁగలిగి వానిని జంపక
వానిచేత నిదురలోనఁ జత్తె
యేమి చెప్పఁజొచ్చి దింతటి నీతులు
గోయి మొద్దునందుఁ గూయుచుండి. 254

ఉ. నన్నెదిరించి వాఁడుచనినా ఢొకఁ డట్టులె నీవు నైనచోఁ
జన్ననుబో వికుంఠమున సందడి గల్గఁగ మీకుఁగాని తా
నన్నరునందుఁ బ్రేమ గుఱునందుఁ దిరస్కృతి యేమి చెప్పనో
నన్నను నేను మీ బ్రదుకునంతయు భోగమయంబు చేసితిన్. 255

చ. అణువులు కుంభకర్ణుఁ డెవఁ డన్న విభీషణుఁ డెవ్వఁడన్న రా
వణు ననుజన్ము లన్నదియె వ్యక్తిత లే దది మీకు నేను కా
రణముగ సర్వమీ దితిజరాజ్యము కల్గెను మత్కృతంబు మీ
గుణజనితప్రభావ మిదిగో కను దాని ఫలంబు సర్వమున్. 256

గీ. గునిసి కుండెఁడు నీళ్ళులు క్రుమ్మరించి
నట్టు లయ్యెను రావణు నగ్రవీథిఁ
గనుల నీ ర్త్రోసికొని కుంభకర్ణుఁ డనియె
రావణుండు దృశాసమార్ద్రిముగఁ జూడ, 257

చ. వెరవరిమాట చెప్పనటది వేఱును శత్రువుతోడి సంగతిన్
వెర వఱి చేయఁబోవు టది వేఱును నేనునుగాని ప్రేమ్యుఁడై
దొరకు హితంబు సెప్పు టది మాన్యమె యైనను దమ్ముఁడైన యి
త్తఱి చనవూని చెప్పితిని దానికి నింతగఁ గోపగింతు రే? 258

ఉ. నీవయి నెత్తివచ్చిన మనీషి రఘూద్వహుఁ డల్ల తండ్రిదా
నావలు కాదరించుచు సమాగతుఁడయ్యె వనాంతవీథికిన్
నీవయి సర్వజీవితము నిల్పిన నేనును గాని యన్నవో
నీవలు కాదరించుచు మనీషను దద్వ్యథ మూచరించెదన్. 259

చ. అతఁడు విభీషణుండు కల నాఁడెడు నేసుపు లేనివాఁడు ధీ
చ్యుతుఁ డయి రామునిన్ శరణు చొచ్చెను నాదగు చేతిలో నసు
చ్యుతుఁడగునేని రాఘవుఁడు మూఁకుము వాని జనుర్విభూతి క
ర్మతతి యెఱుంగదా జనపరంపర భావన యిట్లె చేసెడున్. 260

చ. ఇటుల ననాదిధర్మ మగునేని మఱిం బితృవాక్యపాలనం
బఱు లధికంబుగా నగున, యగ్రజు వాక్యము పాలనంబుచే
యుట యది నేను చేసెదన, యుద్ధమునం దెవ రోడిపోదురో?
యటమటయా సహస్రసమ లాఁకలి నాయది దీని కాఁగునే? 261

ఉ. మండితబుద్ధి తండ్రిదగు మాటకుఁ గానకు వచ్చె భార్య వి
ప్రుం డొకఁడోచు నెత్తికొనిపోయిన నింకొకచానఁ దేను నే
రండటె, యెత్తివచ్చె రఘురాముని నెత్తు రదెంత తియ్యఁగా
నుండునొ? త్రావఁగా వదన మూరుచునున్నది రాక్షసేశ్వరా! 262

శా. నాశూలంబును వేయిపుట్లు యిను మన్నా! తూఁచి చేయించినా
వా శూరుండగు రాము మేని బరు వన్నా! పుట్టెఁడే నుండునా?
నాశూలంబును బాఱవేసి యతని న్నా చేతులం బిండి నీ
ధీశూలం బగు వాని నీదుకడకుం దెత్తున్ గటాక్షింపవే. 263

మ. అనినన్ రావణుఁ డంతఁ దమ్ముని యుద్ధార్థాలాపముల్ వించుఁ బూ
నిన సంతోసము చేతఁ గన్నుగొసలన్ నిండారి ప్రేమంబు వా
నిని యుద్ధారము వేషధారణము పూనింపంగ మాటాడు లో
నన తన్మంత్రి మహోదరుం డనియెఁ గంఠవ్యగ్రభీభావుఁడై. 264

శా. గండూషించిన యగ్గి నీటి జలధుల్ గాఁ బుష్కలావర్తకా
భుండయ్యుం దొర కుంభకర్ణుఁ డొకఁడై యుద్ధానికింబోఁడు బ్ర
హ్మాండం బంతటి పోరు పైకి మఱి తోడై నేనుగా నాకుఁ దో
డుండన్ దక్కినమువ్వురున్ సచివు లీ యుద్ధానికిం బోవలెన్. 265

క. ఆరాము నట్టు లుంచిన
దూరా రా! యాక్రోఁతు లేమి యల్పులె? చాలున్
మారుతి యొకండె దురమున
వారిని మా చూచికోను వదలఁగవచ్చున్. 266

చ. తనపితృభక్తియే యెఱుఁగుఁ దానయి యాతఁడు మాయెడందలన్
నిలచిన రాజభక్తియును నేర్చి నెఱుంగఁగ నేడు, కుంభక
ర్ణునియెడలోన నన్నదెస నూల్కొను భక్తియు నేఁడెఱుంగు ల
క్ష్మణుదెసఁ బక్షపాత మది మానఁగఁ జాలెన యేని రాముఁడున్. 267

గీ. నిండుచెలిమిని గుంభకర్ణుండు పలికె
మీరు నాతోడ నేటికి మిత్రులార!
దారపుత్త్రులు గలిగినవారు మీరు
మఱియు నే నేకరథుఁడను మహితబలుఁడ. 268

సీ. నాకున్న నిద్రయు నాయన్నగారన్న
నాకున్న భక్తియు నన్నుఁ దోలఁచేఁ
గాకున్న స్వర్గమో లేకున్న ధాత్రియో
కడుసమాయత్త మయ్యెడిది నాకు

నాహృదంతర మునూనాథుండు పాలించు
నాదేహ మలుపాల నద్ధపడదు
నా రామమూర్తి నారాయణుండైనచో
నతనివిల్లును శార్ఙ్గ మైన యెడల

మనము భయపడవలయు సంశయమె యున్న
నన్నుఁ బంపఁడు సుమి దైత్యనాయకుండు
సర్వకాలజాగ్రద్ధ్యానసంయుతుండు
ననుజభావమర్యాదారహస్యవేత్త

గీ. ఆతఁ డాతండె యైనచో నమర మీకు
నను ననుసరించినను బ్రయోజనము లేద
యాతఁ డాతండు కానిచో నమరఁ దోడు
చనఁగ నేమియు నా కవసరము లేదు. 270

చ. పొలుపుగ నన్నియూహాలును బుట్టెడు పేమ, మనస్సు, సర్వజీ
వులకు మనస్సు నున్నయది, పుట్టెడు నందఱే కన్నియూహాలున్
గలిగిన నేమియున్ ఫలము కల్గదు, నీవిది యైన దానికై
వలసిన యూహాలే వలయు, వ్యర్థము తక్కిన యెల్లయూహాలున్.

ఆ. నీ పొలమ్ము కాని నేలపైఁ గల సస్య
వృద్ధిఁ గూర్చి యూహ యెంతఫలము
భూమినాథు కార్యముం గూర్చి ప్రేష్యున
కైన యట్టి యూహ యంతఫలము. 272

ఉ. సేవకుఁ డెప్పుడుం బ్రభువు చేసిన కార్యము వానికంటె నెం
తో వలనొప్పఁ జేసెద ననున్, మఱి సేయనురాదె! త్రిప్పి వీఁ
డావల రాజుగా నయినయప్పుడు రాజును బ్రేష్యుఁడైన న
ట్లే వచియించు, జీవి యిటులే పరధర్మనివిష్టబుద్ధియా. 273

చ. కనుక స్వధర్మమై చసిన కార్యము సేయుట యుత్తమంబు కా
దనినను రాజు సేవకుఁడు నన్నయుఁ దమ్ముఁడు తండ్రియున్ సుతుం
డునుగలహించుచుంబలమునూల్గొనువాఁడు జయించుచున్ జయిం
చినయతఁ డాచరించినది చెప్పుచు ధర్మమటంచు, నక్కటా! 274

మధ్యాక్కఱలు

ఆ కుంభకర్ణుఁ డిట్లాడ ననుకొనె నసురేశ్వరుండు
నీకను లెదుటన పెరిగి నీ కాతనింగూర్చి తెలియ
రాక యేమియు లేద యొక్కరాచకార్యము పుట్టినంత
నీకు వానికి నెంతదవ్వు నీది వానిది యూహ వేఱె. 275

నీ వెఱింగినయది వాఁడు నేను పూనిన నేను దాని
తో వాఁడు నీ వెదుగుటలు తొలినాళ్ళఁ దొలినాళ్ళ వాఁడు
జీవుఁడై యన్యభావములు సేకరించినది నీ వెఱుఁగ
వా వంక నివ్వెఱపోదు వట్టికాదా యేమి నీవు. 276

వ. అంతటఁ గుంభకర్ణుండు సెలవు తీసికొందునని లేచి స్వగృహంబు
చేరి ధగద్ధగాయమాన జాంబూనదవర్మంబును దానిపైనిఁ దాళ
ఫలప్రమాణమరకతమాణిక్యహారంబులు సజీవసింహశిరఃప్రమాణం
బులై మాణిక్యవదనంబు మరకతనేత్రంబులు కల సింహశీర్ష
వత్కంకణంబులు బంగారపు టవిసెపూలవ్రాని కుండలంబులు
నవరత్నఖచితమైన మహాకిరీటంబును చుట్టలు చుట్టికొని పడగ
విప్పిన వాసుకివంటి కాలిపెండారంబులును ధట్టియును జరీపట్టు
ధోవతి యుత్తరీయములును ధరించి, తన మహాశూలంబు చేఁబూని,
ధనుశ్శతపరీణాహమ్ము షట్శతధనుస్సముచ్ఛ్రితమైన దేహం
బుతో నగరంబు సొచ్చి తనమంత్రులయిన మహోదరుఁడును
ద్విజిహ్వుండును సంహ్రాదియు వితర్దనుఁడును దమ రథంబులమీఁద

లంకామర్గద్వారంబు వెలువడిపోఁగాఁ దాను దుర్గప్రాకారంబు
మీఁదినుండి పాదంబు బయటఁబెట్టి దాఁటి నిలుచున్న. 277

## హరనర్తనము

పర్వతానికి శీర్షముల్ పదబాహుద్వంద్వము కల్గినన్
గర్వితాంబుద ముగ్ర మొక్కఁడు పైఁ బార్శ్వకలితాకృతిం
బర్వినట్లు గను లగ్నులున్ వదనంబున్ సర్పఫణాగతిన్
ఘూర్వహం బయి పొల్చినన్ దురితాకారోద్ధుర మన్నటుల్. 278

దక్షిణేశుఁడు క్రూరుఁడై తను నింతింతై తనరారునాన్
దీక్ష పూనుచుఁ గాళరాత్రి ప్రమాకారాదృతి వచ్చెనాన్
ఏ క్షుధాగతశక్తియో కృతలోకాస్వాహృతికాంక్షమైఁ
గుక్షి పెంచుక వచ్చెనాన్ గుటిలోగ్రాస్యాకుల నేత్రమై. 279

ధాత్రి నిత్యవిఘాతి గుప్తమునౌ గర్భస్థము ఘోరమహా
గోత్రభీకరరూపమున్ గుదిలింపై పొంగుగఁ ద్రోసెనో
కృత్రిమం బగు నాశశక్తి కపిశ్రేణిం గెడపన్ మహా
చిత్ర మాకృతి పూనివచ్చెనొ ప్రాణాల్ మ్రుచ్చిలు నేనితో. 280

వ. ఆ మహాభయంరాకృతిఁ గాంచి వానరసేనలు దిశాభిద్రవణంబు
చేసిరి. వృక్షంబు లధిరోహించిరి. పర్వతంబు లెక్కిరి. కొందఱు
కెవ్వున నఱచిరి. మఱికొందఱు మూర్ఛపోయిరి. కుంభకర్ణునికథ
విభీషణుండు శ్రీరామచంద్రునితోఁ జెప్పుచుండగా వినిన యంగ
దుండు వారి నోదార్చుచు భయమ్ము తీర్చుచు ధైర్యమ్ము చెప్పుచుఁ
బరిహాసము చేయుచు విదలించుచుఁ దాను ముందాచు నిట్లనియె.

మధ్యాక్కఱలు

కొండలు వృక్షమ్ము లెక్కుడు నందుకో వీలు వాఁడు
బండిచక్రమ్ములు కనులపైని కన్పడును దవ్వునకు
రండు దగ్గఱ కిట్టివాఁడు రాక్షసరాజో మఱేదొ
దండిబొమ్మను చేసి యిట్లు తార్చెనో దానవరాజు. 282

శిలలను విసరుడు పెద్దచెట్లను జిమ్ముడు మఱియు
తెలియు నవ్వాడు మీకు వీఁడు దితిజుఁడో దిష్టిబొమ్మొ, శి
లలు తాకి కదలక యున్నలా! యున్నలాగైన మీకుఁ
దెలియును బడఁద్రోసి బొమ్మఁ దెరలించి త్రిప్పను వచ్చు. 283

ఆదిగా నసురుండు చేయునట్టి మాయకు హద్దుపద్దు
లేదుగా మన కెందుఁ గ్రొత్త లేదుగా, లేదుగా భయము
వాదుగా మనమేల తెలిసి పాఱిపోవలయు రక్కసు తె
గాదిగఁ గనుఁగొనుటాదిగా, రువ్వగా తాలుపూని. 284

కడలినిగట్టి దండెత్తి కదలిన కపిజాతి నేడు
కడలిలోఁ బడి చావఁగనుటకంటెను గడుసిగ్గు కలదె
కడలి దాఁటినయప్డు మీలు కపిజాతి గౌరవించినవి
కడలిలోఁ బడినప్డు నేడు కమ్మగాఁ గమ్మగాఁ దినెడు. 285

మ. కపిసేనాపతు లెల్లఁ జూచిరి మహాకాయున్ జగద్భీకరున్
విపులాశాపరిణాహు ఘోరవదనున్ విత్రాసహేతున్ మహా
ప్రపుఁ డీతండు వధింపగాఁ బడునె భూధ్రశ్రేణి వర్షింప వీ
నిపయిన్, వీనికి సేగియుండునె కుజానీకంబు వర్షించియున్. 286

గీ. నిలచియుండిన సాగరానికిని బైని
వనువుగా నైనయదియు వంతెనను గట్ట

నిన్ను ద్రుంగగను వచ్చెడు నీరధికిని
వంతెనను గట్ట నెంచు టెవ్వాని కగును? 287

వ. ఆ మహాపతిణాహవంతునిం గాంచి హనుమ యిట్లనుకొనియె. 288

శా. అద్రిప్రోన్నతమూర్తి యీతఁ డెవఁడో యానాటి నిద్రామహా
ముద్రాముద్రిత మైనయట్టి భవనంపుం గేస్తు నై యుండెడిన్
నిద్రన్ మేల్కొని కీశకాననము మండించున్ మఱిన్ వీఁడునాన్
హృద్రాజీవము చెప్పె నా కిదియు ము న్నేనాటి క్రొవ్వెన్నెలన్.

క. ము న్నేటికిఁ బంపించఁడు
న న్నొక్కనిఁ? గాదయేని నా బుజములపై
నన్నాదమ్ములు వచ్చిన
ని న్నాశము లేదుగా! కపీశానులకున్. 290

వ. అంత సమస్తగోలాంగూలజగత్పతి యిట్లు భావించె. 291

ఉ. ఇట్టివి యొండు రెండయిన యెక్కటి యాయుధశక్తిచేతఁ దా
నిట్టులు చేయు రావణుఁడు, సీతఁ డొకండును మేఘనాదుఁ డా
దిట్టరి యొక్కఁడున్ సమదధీబలశాలులు కాలుసేతులై
నట్టిది, వీఁడు నిట్టగిరి, యాతఁడు దుర్మనుమంతుఁడున్ మఱిన్.292

ఉ. వీఁడొకరుండు దుందుభికి వేయిమడుంగులయట్టిఁ డైన యా
మ్రేడితమూర్తి, వీని నెదిరించిన వాలి యదెట్టులుండెడిన్
గోడిగఁబెట్టి వీనిపయిఁ గొండలు కూల్చి ఫలంబులేద యా
కూడలి గుప్పిలై యురము క్రుమ్మిన నంతకు మున్నె లేదునాన్293

గీ. పులిని వెన్నాడి లేచుకుక్కలును బ్రదికి
యున్నదానిని గొఱుకుక తిన్నయటులఁ
బండ్లఁ జిద్రుపలుగాఁ జేయవలయు వేఱ
ద్రోవ కనిపించ దీ దురాత్ముని వధింప. 294

ఉ. వాఁడు విరాధుఁ డొక్కరుఁడు వానిని గత్తులఁ గ్రుమ్మి గోతిలోఁ
బూడిచిపెట్ట నయ్యెనట, పూర్తిగఁ బ్రాణము పోదు వీరికిన్
వాఁడిశరానికో యసికో వాదర ధైర్యము చాల దింత కొం
డాడఁగనైన వీరలమెడల్ నఱకుంబడ నొక్కదెబ్బకున్. 295

ఉ. అంపపుఁగోతఁగా శరపరంపర దూసెడు నేర్పుతోడ నై
లింపవిరోధి నేనఁ దెగులింపఁగనై యనువాయువుల్ కటా
క్షింపవలెన్ రఘూత్తముఁడు, చేసిన పాపము లేదు వీఁడు ని
ద్రింపఁగ నెల్లకాలమును, దీరని యీయనుజత్వమున్ వినా. 296

వ. అంత సర్వసేనాపతులును సమావేశమై యిట్లాలోచించిరి. 297

మ. జ్వాలదగ్నుల్ చిరజీవులైన కపులున్ శౌర్యాంబుధుల్ దేవతాం
శల జన్మించిన యట్టి వానరులు రక్షస్స్వామి పైకేగి యి
మ్ములఁ జెట్లన్ నఖదంతదారణములన్ ముష్టిప్రఘాతంబులన్
శిలలన్ మొత్తుడు చేసినన్ మనల మూర్ఛిల్లంగఁ జేయున్ మఱిన్.

చ. పెఱలగు కీశపికులును భీషణమూర్తులు దవ్వునుండియే
దురమును జేయఁగావలయుఁ దూల్చుచు ఱాల వియత్పదంబునన్
దిరుగవలెన్ సురారిముఖదేశము పట్టక వెన్కదూఁకి ని
ష్ఠురశిలలన్ మఱిన్ విసరఁజూడుఁడు ముచ్చిలిగుంట మూడునన్. 299

ఉ. చచ్చినవార లొక్కదెసఁ జచ్చుచునుండినఁ జావనట్టి వా
ర్గ్రిచ్చవలెన్ నఖంబులను గ్రూరశిలాతతి దంతసంహతిన్

గచ్చెగ కోటికుందిపడి గాయములం బొనరింప మేనునన్
విచ్చినగండ్లుగాఁ దుదకు వీఱిడి చచ్చినవైనఁ జచ్చెదున్. 300

శా. అంతన్ వానరసేన దోర్బలమహాహంకారభూభృచ్ఛిఖల్
వంతుల్ వంతులుగాఁగ నాతనిపయిన్ వర్షింపఁ గర్షింపఁబ
డ్డం తైనం గనరాక వాఁడు జగదాద్యంబైన న్యగ్రోధశా
ఖాంతంబుల్ కదలాడినట్లు కను చిట్టాలోచనం జేసెడున్. 301

క. ఆఁకలి తాత్కాలికముగ
నాకున్ శాంతింపంజేసె నక్తంచరరా
జీ కపికాండమ్ము బుభు
క్షాకాండము గాఁగ నాకు సంకల్పించెన్. 302

ఉ. ఈ కపిజాతిదా నెఱచి యెంతో యసేవ్యముగాఁగ నై బుభు
క్షాకృతి వారిజాసనుఁడు సల్పెను, నాకు వివక్ష లేనిదా
నాఁకలి, క్షుద్రవానరులు నక్కట నాపయి కేల వత్తురో
యీ కపిజాతిఁ దిన్న నొకటే తినకున్నను నొక్కటే కదా! 303

ఉ. ఈపని చేయు బ్రాహ్మణుఁడు నియ్యది కాదని యున్నదే బుభు
క్షాపతితుండు మాదృశుని సల్పుట యుత్తమమై విచిత్రవే
శాపరిణామమూర్తి కలి లాగున జేయుదు రన్య లక్కటా!
యోపిన ధర్మదేవతను నూపిరిపట్టులఁ బట్టి నొక్కుచున్. 304

ఉ. ఏనునుగాని నీవు రచియించిన కార్యము లెస్సకాదుసూ!
యేనయి పోయి రాఘవకులేశ్వరు పక్షము చేర నందుచేఁ
గాని, త్వదీయపక్షమునఁ గయ్యము చేయ నటంచుఁ జెప్పినన్
దానయి నన్నుఁజంపునుగదా! యధికారము లెంతదుష్టముల్. 305

చ. ప్రదరములట్టి శైలశిఖరంబులు నువ్వుచు నున్నదై ననుం
గదలనియట్టి దానవునిఁ గన్గొని కీశచమూసమూహ మె
ప్పిదముగ నిద్దియంతయును వట్టిబిభీషిక యంచు నెంచి ఘో
రదృషదనంతరాజి విసరన్ విరమించుచు నిల్చిచూచుచున్. 306

శా. భ్రాంతిన్ వారలు దైత్యనాథుని సమీపక్షోణిఁ బోఁబో ధురా
వంతుం డంగదుఁ డెల్ల కీశచమువున్ వారించి, వాఁడెంత దు
శ్చింతుండో తెలియంగరాదు సుమి మీచిత్తంబులన్ వాఁడు మీ
గొంతుల్ పూని కసిక్కనం గొఱుకునొక్కండొక్కఁడై యార్వగన్

ఉ. రావణుఁడున్ సురేంద్రనగరంబున గుళ్లును గోపురంబులుం
ద్రోవఁగఁజాలె నన్నఁ బెనుద్రోవలఁ జేతులఁగాళ్ళ గ్రుమ్మటే
కావలుఁ డీతఁ డీతనికిఁ గాస్ప్లలు చేతులవద్ద కక్కటా
పోవుటయేమి? వానిగద పూనిన లక్షసహస్రమృత్యువుల్. 308

క. తొలిదెబ్బ తగులుకున్నను
మలిదెబ్బయు బాధపెట్టు మానదు వృక్షం
బులు శిలలు విసరమానకుఁ
డలఘువు మీచేవ హాని కది తెలియనగున్. 309

మ. అనినం గీశులు శైలముల్ గొనుచు వృక్షానీకముల్ గొంచుఁ గ్రు
మ్మిన గ్రుమ్మల్ రఘురాముబాణములసామీప్యంబుగా వాడిమిన్
దనుజాధీశుఁడు కోపభావమున నేత్రద్దుటకీలాళి న
న్ననుబ్రోత్సాహముగాతుధావనయనన్మ్యాల్లోల్పవం చెంచుచున్

చ. అతని విజృంభమాణచటులాహవసంహననంబునం దనూ
చ్యుతులయి కృత్తకంఠులయి యుద్గతబాహుపదోరుమధ్యులై
మతి మతిలేక యాహవమొ మారణమో తెలియంగరాక ప్రా
ణతతిని రామపాదనలినంబులఁ జేర్చుట యొక్కయూహయై. 311

శా. పాదాఘాతములన్ బ్రచండతరదోఃపాతంబులన్ ఘోరదం
ష్ట్రాదగ్రోజ్జ్వల పేషణంబుల సహస్రం బొక్కమారైన వ్యా
పాదంబై చను స్థూలశూలవిధుతిప్రారంభవేగంబులం
బాదుల్ పెల్లగిల్లంగనై కపులు సంభ్రాంతు ల్వరిభ్రాంతులున్. 312

ఆ. మింటికెగిరి యొక్క మేల్నేర్పు గల క్రోఁతి
వాని వెనుకవీటి వదలకుండ
గ్రుచ్చుచుండ వాని ముచ్చిలిగుంటను
కుంభకర్ణు మెడయుఁ గొండచఱియ 313

మ. మరియున్ దానవు పృష్ఠదేశమునఁ దన్మంత్రుల్ మహోత్రాణని
ర్భరులై ఖడ్గములన్ మహోగ్రశరధారాశ్రేణి హింసింప, వా
నరులున్ గీశజగద్విరోధి దగు కంఠాగ్రస్థదేశంబు నే
రరు చేరన్ యువరాజు మాటలను వ్యర్థత్వంబు దీపింపఁగన్. 314

క. ఒక లక్షవరాహంబులు
నొకవేయి మదేభములును నుగ్రములై యూ
రక గగ్గోలుగఁ జేయఁగ
యకటా! యిట్లుండునే రణాంగణ మనఁగన్. 315

చ. వెనుకను బ్రాలుచున్న కపివీరుల నొక్కని వీపుమీఁదఁ బ్రాఁ
కిన క్రిమి నొక్కటిన్ వెనుక కేలుగఁ గైకొని వ్రేళ్ళమొక్కసం
దున నలుపంగ నా జరుగు దూషితమృత్యువుఁ గాంచి వానరుల్
కనుచునె మూర్ఛవోయి రిది కన్నది విన్నది కాకయుండగన్. 316

క. పదులును నిర్వదులును ము
ప్పదులుగ గుప్పిళ్లు పట్టి వానరచయమున్
గదియించి దవడక్రిందను
కదలగ నస్థికల నుమిసి కసకస నమలున్. 317

చ. దవుడల నెత్రుచారికలు దంతములందునఁ గీకసంబులున్
దవిలి యురఃప్రదేశమున ధారలు కట్టుచునున్న నెత్తురుల్
కవిసినవై ససాకలితగంధవిదూషితకేశలోమఖం
డవ్రతిసనాథదేహవదనంబులుగా దనుజుండు పొల్చుచున్. 318

ఉ. ఊరక పెద్దజాతరగ నొప్పెను భీకరశైలరాజి యు
ర్వీరుహరాజి వేసినవి వేసినయట్లుగ నుండెఁ దద్వ్యధ
స్ఫారవిదారి సాగినది సాగినయట్టుల నుండెఁ గీశరా
ట్వీరులు పాలుపోవక నివిష్టవిలోచను లౌచు నుండగా. 319

చ. మణిశిలసన్నిధిం జనిన మాదిరి ఘోరమహాహిభీతులై
ధణధణవచ్చి మీఁదఁబడు దయ్యము దానవు నోర్వలేక ని
ర్గుణులును నిర్మనస్కులును గుప్తహృదంతశరణ్యభావులై
ప్రణతులుగా నెదుర్కొనిరి రాముని విశ్లథులైన వానరుల్. 320

శా. ఆ ఘోరంబును జూచి మారుతి క్రుధాహంకారహుంకారవా
చాఘుష్యద్దళభీకరంబుగ వియత్సంభ్రాంతిఁ గాలాంబుదా
మోఘక్లిష్టమహాశనిప్రచయదంభోళిప్రపాతంబు శై
లీఘోరాకృతిధారపిండు విసరెన్ గ్లేశాతిసంపాదిగా. 321

క. వానిమకుటంబు పగిలెను
వానిశిరోదేశ ముగ్రబాధాస్పదమై
వాని కొంక లిప్త తెలియదు
వాని మహోగ్నులగు కనులు బైరులు క్రమ్మెన్. 322

క. ఇసుమంతలోనఁ దెలిసెన
యసురేశుఁడు క్రోధమూర్ఛితాత్ముం డగుచున్
విసరెను గద మారుతియెద
విస్ఫురవక్షంబు హారిది విద్ధముకాఁగన్. 323

క. మాంసము తిందురు కోఁతుల
మాంసము తిందురటె పిల్లిమాంసము తినువిూ
ధ్వంస మ్మగు బుద్ధికిని జి
ఘాంసాబుద్ధికిని దినను గా దేది ధరన్.

ఉ. కొండలు నగ్నులుం గలిసి కూడిన గుప్పిలి నాది నీయురో
దండములోని పెన్నెముకతండము చేసెదఁ బిప్పిపిప్పిగాఁ
గొండకుఁ గాలుసేతులును కోసెను ప్రాణము పోసెఁ బట్టి ని
ల్చుండఁగఁ బెట్టి యుద్ధ మని చూపెడు రావణుఁ డెంత ద్రోహియో.

క. అని నీలుండును ద్రుతలం
ఘనచాతురి వానిగుండె కడ కెగిరి వినూ
తనవజ్రపాత మన ము
ష్టిని ద్రేసెను వానిగుండె చిడిముడి పడఁగన్. 332

ఉ. ఇంతటి సాహసుల్ మఱియు నింతటిధీరులు బుద్ధిమంతులుం
బంతము కల్గువారలును బాహుపరాక్రమశాలు లౌటచే
నింతటి దైన మెత్తుగడ మెత్తెను రాముఁడు కోఁతు లంచు దు
శ్చింతు లహో యగౌరవము చేయవలెఁ మఱియిట్టివారలన్. 333

క. అనుకొనుచుఁ గుంభకర్ణుఁడు
నిను మెత్తును ధైర్యమునకు నీబుద్ధికి నా
కును బుద్ధి చెప్పి యంతటఁ
జనినన్ నేనేమి చేయఁజాలకయుందున్. 334

క. ఇప్పుడు నాకును జేయక
తప్పదనుచు దానవుండు తనయఱచేతన్
జప్పట చఱచిన విధమునఁ
గప్పెను గపిగుండె నతఁడు ఠప్పు మూర్ఛపడన్. 335

ఉ. ఆ పరిభూతిఁ గన్గొనుచు నైదుగురైన వలీముఖేశసే
నాపతులందునన్ మిగులు నల్వురు క్రోధపరీతనేత్రులై
యీ పరమాసురేశ్వరుని నెక్కటికయ్యమునం దెదుర్పలే
మూపునఁ దాఁకఁగావలయు నుమ్మడిగా నని నిశ్చయించుచున్.

ఉ. నాలుగుపర్వతంబులు ఘనాఘనఘూర్జరముల్ మహీజశా
ఖాలులితానిలంబులను గజ్జెలు మ్రోసెడునట్టి పెన్గదన్
బోలె నురంబు నందునను మూర్ధమునందున రెండుబాహులన్
వ్రీలదు వజ్రపాతముగ వేసిన దానవుమేను బెత్తెడున్ 337

వ. అంత నమ్మహాసురుండు ఋషభ శరభ గవాక్ష గంధమాదను
లయిన యానల్వురను నాల్గు గ్రుద్దులతో మూర్ఛపుచ్చి. 338

క. మరియును మఱి పెరిగి మహా
సురుఁడును బేరెములు వారుచును గపిరాజిన్
విరియించుచు సురియించుచు
హరియించుచు నంజసావిహారము చేసెన్ 339

క. మఱియును మఱి పెరిగి మహా
సురుఁడును గనుపులను గొట్టుచుం గపిసేనల్
దరలించుచుఁ దెరలించుచు
మరలించుచుఁ జిత్రచిత్రమథనము చేసెన్. 340

ఉ. అంతట నంగదుండు నకటా యిది మారి యొసంగుఁబో వపు
ష్మంతముగాఁగ దీని నిట మానుపఁజాలుదు రిద్దఱే ధను
ష్మంతుఁడు స్వామికాని, హనుమంతుడు వీరుఁడుగాని, యాహనూ
మంతునిఁబోయి వేఁడు బతిమాలుదును? జేయఁడు లేకయున్న చో.

క. ఇంకం గల డొక్క నిరా
తంకుం డావైపు కోటద్వారముకడ నా
వంకఁ గల జాంబవంతుని
వంకం జన రసురు లిచట నల్లభుఁ డునికిన్. 342

క. అరయ నతఁడు పెకలించిన
ధరణీధరశిఖర మొక పదను గల దా భూ
ధరశిఖరమ్ము విసరిన వి
సరునన్ వానికరము చలచ్చక్రాకృతియై. 343

క. ఇది విష్ణుచక్రమో యనఁ
గదలిన భూధరము రాకఁ గాంచినయసురుల్
మదిభీతి పొంది రాగిరి
కదలిక నే యంచు కోయఁగడగునో యంచున్. 344

క. వాలిసుతుని చక్రకజం
ఘాలము పర్వతము కుంభకర్ణునితలపై
వ్రాలినదో మఱి కవ్వము
వ్రోలిక తిరిగినదో కుదురు పూన్చుకొనినదో. 345

చ. ఇతఁ డొకఁ డాంజనేయసముఁ డించుక తగ్గినఁ దగ్గునంచు సం
ధిత మయినట్టి తగ్గుదల నేర్పుమైఁ బరిపూర్తిచేయు నం
చలితరకోపవేగమున నంతకు మించిన బాధచే మహో
ద్ధతుఁ డయి చేతి శూలమును నంగదుపై విసరెన్ సురారియున్.

క. అది మొత్తిన నేలంబడి
చిదియుటయే నెత్రుబొట్టు చిందద యెమ్ముల్
వెదకిన దొరకవు, మఱి యం
గదుఁ డేమా నంచు భీతిఁ గదిసిరి కీశుల్. 347

గీ. తా నొకం డాంజనేయుండు తట్టుకొనియె
నన్యుఁ డెవ్వఁడు దానికి నాఁగలేఁడు
వాలితనయుండు బహులాఘవమున దాని
యాగమనమార్గమునుండి యపసరించె. 348

చ. తెరపి నొకింత యీయ కవధీరితమారుతవేగుఁడై ప్రస్ఫు
త్వరమగు ముష్టిపాతమున దానవుఁగుండియ తాఁచె నంగదుం
డరయఁగఁ గుంభకర్ణుఁడు తదాహతి నూహతిరోహితత్వముం
బొరసి నిమేషమందు స్మృతి పొందిన కోపమహోగ్రభావుఁడై. 349

ఉ. అంగదు బిట్టుగాఁ జఱచె నంగదుఁ డంతట నేల వ్రాలినన్
ముంగల నున్న వానరసమూహము మోహముమాలి చూచి కు
క్షింగల క్షుత్తు తగ్గుటయుఁ జిత్తమునం దలపోసి బుద్ధిలో
నం గల యూహ యింకనయినం బొనరింపఁగ నెంచుచున్ మదిన్

వ. తనప్రభువునకు నిత్యసమీపవర్తియై యతని నెదిరించుచున్న సర్వ
వానరసేనాపతుల నితఁ డితఁ డని వివరించి చెప్పుచున్న మహో
దరుఁడు కుంభకర్ణుని తాత్పర్య మెఱింగి సుగ్రీవుని నిర్దేశించి చూపఁగా
దానవుఁ డి ట్లనుకొనియె. 351

ఉ. ఆవల నాంజనేయుఁడును నంగదుఁ డిద్దఱు నందగాండ్రు, సు
గ్రీవుఁడు రాచకేవి కల కీశధరాపతి పేరుచేత సు
గ్రీవుఁ డటన్న దెంతయదికెన్ మెడ సుందరమున్ దృఢంబు త
ద్గ్రీవము చూచికాని తులకించద యందము నిర్ణయింపఁగన్. 352

శా. సుగ్రీవుండును గుంభకర్ణునిదెసం జూపించి నీ యీ మహా
పగ్రీవం బయినట్టి క్షుద్రకపిసంబాధాశనాయావధ
వ్యగ్రత్వం బిది యుద్ధనీతివిదు లెంతైనం బ్రశంసింప దో
రగ్రప్రాంచిత ఘోరశూలకృతమర్యాదానపేతంబుగన్. 353

గీ. పరమరాక్షసుఁడా! నీకు బ్రహ్మదేవుఁ
డింత నే నిచ్చినందుకు నింతబలము
నిచ్చినందుకు సంతోషమే, మఱింత
పిచ్చిబుద్ధి యిచ్చినందుకే పెద్దచింత.

మ. అని సుగ్రీవుఁడు పెద్దపర్వత మనంతాకాశవత్ఫుల్లపు
ష్పనికాయోజ్జ్వలమున్ సురారిపయిఁ దీవ్రప్రక్రియన్ వైవఁ గి
న్కను దచ్ఛైలము వాని గాయపఱుపంగా నైన, వానిం గద
ల్పను నైనన్ మఱి చాలకున్నఁ దన శూలం బూనె దేవారియున్.

గీ. కూడి మారుతి తా నోర్చికోఁ గలిగెను
కూడి యంగదుఁడును దప్పికోఁ గలిగెన
యోర్చికోఁ దప్పికో రెండు నోడుగకున్న
నేమి కావలె సుగ్రీవుఁ డింతలోన? 356

చ. సురరిపుఁడున్ గపిప్రభువుఁ జూచిన యప్పటినుండి లోచనాం
బుహాయుగంబు విచ్చి యెదిపుట్టునొ యంచును శ్రద్ధమై నిరం
తరముగఁ జూచు మారుతియు దానవుశూల మదెప్డు సాగె నం
బరమున నీతఁ డెప్డు చనె మధ్యమునం గ్రహించె శూలమున్.

క. ఆశూల మరుగు లేమీ!
యాశూలము రివ్వు నడుమ నాగుట యేమీ!
యే శూరుం డింత బల
శ్రీ శితవేగములు కలిగి చెలఁగెడు సృష్టిన్. 358

వ. అంత నాంజనేయుం డాశూలంబు మోఁకాటి కాన్చి రెండుగా
విఱిచి, పడిన సవ్వడి వినిపించనంతదవ్వున సాగరమున నా రెండు
ముక్కలును విసరి పాఱవేయగా, జనంబు నివ్వెఱపోయిరి. దుఃఖ

పడిరి. భయమందిరి. ఆనందముతో గంతులు వేసి రంతఁ గుంభకర్ణుం డిట్లనుకొనియె. 359

క. ఈశూలముతోఁ గొట్టితి
నీశూలముమీఁద గోప మీతనికిం దా
నీ శూలమ్మును విఱిచెను
గీశపతికి నింతదాసఁగు కీల్కొనకుండన్. 360

ఉ. గ్రావమొకండు వేరెవరుఁ గైకొనకలించను బూనరానిదిన్
గేవలలీలగాఁ గొనుచు గీశధరాధిపు నేసి నంత యు
ద్భావనియందు మూర్ఛపడె నాతఁడు, దానవుఁ డద్దిచూచి సం
భావితబుద్ధి తేనియవమానము తీరినదంచు నెంచుచున్. 361

ఉ. ఈ కలహప్రవర్తన మి దీతనిమూల మితండు లేనిచో
నీ కపిసేన లేదు జలధీశ్వరు కాల్వకుఁ గట్లులేవు తా
నా కపి శూలమున్ విఱుచునాతని కీతఁడు బిట్టుకూర్చు, ద
ర్పాకృతి వీని బాహుదలఁ బట్టుటకన్నను నీతియుండునే? 362

ఉ. ఈతఁడు లేని కీశచము వెత్తుకపోవును లంకనుండి తా
నీతఁడు లేక మారుతి యిలేశుఁడు మాలిన పెగ్గడె సనున్
జేతముమాలి రాఘవుఁడు చేసెడి దేమి? మరుత్సుతుండు తా
నీతనిబంటు మారుతిని నెవ్వఁడు పెట్టెడి యాతఁ డాజ్ఞలన్. 363

గీ. ఇతని విడిపించికోఁ గీశతతి యదెట్లు
చేయు మన్నను జేయును సీతమగఁడు
నేమి కావలెఁ దమకు? మఱెవ్వ రున్న
నాల్కఁ గోసికొందురు కొండనాల్క నమ్మి. 364

వ. అని కుంభకర్ణుండు మూర్ఛితుండయిన సుగ్రీవునిఁ దనమహాబాహు దండమ్ములనెత్తి ఱొమ్మునం దిడికొని లంకాదుర్గప్రధానద్వారాభిముఖుండై దానవుల జయజయనినాదనేదురితాకాశంబును జీల్చుకొంచుఁ బోవుచుండ. 365

గీ. కపిచమూపతు లంకఱు క్రమ్మియున్న
మూర్ఛలందునఁ బడి యద్దు పోవలేరు
మేలుకొనియున్న మారుతి మృదుపిశంగ
లోచనంబులు తెఱచుక చూచుచుండె. 366

చ. తనప్రభువున్ బుజాన నిడి దానవధూర్జటి కొంచుఁబోయెడున్
తనప్రభువున్ సురారికిని దక్కినఁ దక్కిన కార్యమేమియా?
నినకులసార్వభౌమునకు నిచ్చిన మెచ్చిన మాట యేమియౌఁ?
దనసచివత్వ మేమియగుఁ దాను ధరాత్మజఁ జూచి యేమియా. 367

చ. తనకుఁ బదింతలౌ తనువు తాలిచి యుండెను గుంభకర్ణుఁ డా
తని కధికంబుగాఁ దనువు తాలిచి వానిని సంహరించి తో
డన కపిధారుణీశ్వరుని డక్కఁగఁ గైకొని వచ్చునేనియున్
జనులకు విభ్రమం బొదవు సర్వకపుల్ భయభీతు లౌదురున్. 368

చ. ఇపు డితఁ డింతవాఁడయిన నెప్పుడు కాఁదగ దెంతవాఁడుగా?
కృపణుల మైన మ మ్మపహరించెడు శత్రులకత్తిపాలుగా
నపువు సురారిపట్టణము పట్టనియంతది తాల్చి యెల్లయు
ద్ధపుఁ బనిఁదీర్ప నెందులకుఁ దా ననుకూలతఁ దాల్చెఁడక్కటా! 369

గీ. కపిమహాసేన నొక్కఁడుఁ గాల్కఁదల్పఁ
డెందుకు వృథాప్రయాసమం చిగుకొంచు
నొడలు వెంచిన వంచినఁ గడు సులభము
యిద్ది మాప్రాణములు తీయు టేల యనుచు. 370

ఉ. వంచనకాదె రా శోకనివల్ల విముక్తినిఁ బొందె నన్నచోఁ
గొంచెపుబుద్ధితె చనిన కోఁతులు భూతలనాథుఁ బిన్న భా
వించెద రాతఁ డూర్జితుఁడు వేగరి మిక్కిలియూహశాలి త
ప్పించుకవచ్చు నేమియును భీతిపడం బనిలేద యంచునున్. 371

శా. జీవగ్రాహము గాఁగఁ దీసికొనివచ్చెం గుంభకర్ణుండు సు
గ్రీవున్ వానరసేన తేనికి సమర్పింపంబడెన్ గాళ్ళపై
నా వైదేశికుఁ డేమి చూఁ దిరిగిపో నా సేతు వుండెంగదా
గ్రావా సేతువు కట్టికొన్నది పోరిం గాళ్ళుచ్చుకొంచున్ మఱిన్ 372

సీ. సురవిరోధి విలాసభరవృషస్యంతికా
కబరీపరిమళాకాంక్షితములు
రూక్షదానవ వరారోహామదకవోష్ణ
ఫుల్లగల్లాభోగరల్లకములు
మహిత దేవారాతి మదమత్తకాశినీ
ప్రాంచత్పయోధరాస్ఫాలకములు
తరుణపూర్వామృతాంధశ్శూర పాణిగృ
హీతీ స్మితాంశు సాహిత్యకములు

నైన చందనమల్లికాసూనములును
పచ్చకప్పురసిరమును బల్లనైన
శీతలజలంబుతో నభిషించినారు
నఖిలకపిలోకపతిసమాహర్త నసుర. 373

చ. చెఱఁగి కపీంద్రకృత్త పరిశిష్ట విలంబిత దక్షిణాధరా
ధర పరిత స్స్రుతుంకురిత దర్పిత చందన బాలభూరుహో
పరి పరిసంస్పృశ త్పవనబాలక బాలకషాయగంధ సం
సరణము ప్రాణసంచయము చల్లని త్రోవలయందుఁ దీయఁగన్.

ఉ. రావణుఁ డేమొ పంపెఁ దను రామునిఁ జంపు మటంచుఁ దాను సు
గ్రీవునిఁ బట్టి తెచ్చెఁ దులకించదు ప్రాణము దైవతారికిన్
శ్రీవిలస త్సుషీమ గిరిశేఖరవాయువు నీటిజల్లు సు
గ్రీవుని మేనుచెంది తులకించెన యాతనివైన ప్రాణముల్. 375

చ. తెలిసినయంతలోనఁ దను దెచ్చె నటంచును లంకలోనికిం
దెలిసెను గుర్తుపెట్టుకొని దిక్కులు సాగరఘోషచేత న
వ్వలఁ బగఁబట్టి బుస్సుమని పైకిని లేచెడి త్రాచునాఁగ సం
కులముగఁ గుంభకర్ణుని ముకుం చెవులుం గొనె గావుపట్టుగన్. 376

మధ్యాక్కఱ

గలగల గిలగిలఁ గుభకర్ణుండు కడఁగి సుగ్రీవు
బలవంతముగ లాగి నేలఁ బడవైవ వాఁడును నోటఁ
గల ముక్కుతోఁ జేతులందుఁ గల చెవుల్గా నూడి వచ్చె
మలఁగి యసుర నేలఁ బెట్టి మట్టగింపఁగ వానిఁ దలఁచె. 377

ఉ. ఏనుగు మట్టగించినటు లీతని చేయఁగ నెంచి నేలపై
వానిని బెట్టి హస్తములు వాయఁగఁ బాదము వేయఁగా నెడం
బా నిసుమంతకాలమున నందిన సన్నని వీలుచూచి వే
గాన విదల్చి తప్పుకొని గంతిడి మిన్నున కేగె వెంబడిన్. 378

ఆ. క్రొత్తనీసు వచ్చి కొట్టుకపోయెను
బ్రాతనీ రటన్న పగిదిగాఁగ
ముక్కుచెవులు కొంచుఁ బోయె సుగ్రీవుండు
తాను రాము సన్నిధానమునకు. 379

గీ. కడఁగి స్వామి కుంభకర్ణుని ప్రాణాల
కొఱకుఁ గుదువపెట్టుకొన్నయట్లు

ముక్కు చెవులు కొంచుఁబోయె సుగ్రీవుండు
తాను రాము సన్నిధానమునకు. 380

చ. గణుతికి నెక్కు నేమి ఘనకార్యము చేసితినంచుఁ బోయి రా
వణునకుఁ గానిపించికొనుఁ బట్టక కోపము కుంభకర్ణుఁడున్
బణ మిడినట్లుగాఁ దనదు ప్రాణము లాహవభూమి కేగి ల
క్ష్మణుఁ డెట రాముఁ డెందనుచు మానస మంతయుఁదన్మయంబుగా.

ఉ. పోయిన యంతమేరను గపుల్ మరణింప సహస్రసంఖ్యగాఁ
బోయిన యంతమేరను జమూపతు లాతని త్రోవ వీడఁగాఁ
బోయిన మేర సూటిగను బోయెను రాముఁడు లక్ష్మణుండు దీ
క్షాయుతి వానిరాకకు నికామప్రతీక్షను జేయుచుండఁగన్. 382

ఆ. నడచి వచ్చుచున్న నక్తంచరునిఁ జూచి
లక్ష్మణుండు ధనువు లస్తకంబు
మస్తకంబు సూటి మన్నించి మున్నంచి
గాఁగ నేసెఁ దీవ్రకాండచయము 383

ఆ. నిగిడి లక్ష్మణుండు నిగిడించె శరములు
వానగాఁగఁ జూచి దానవుండు
సరగ ననియెఁ జాలు సామెత చెప్పిన
యట్టు లున్న దెఱుఁగ వైతి నన్ను. 384

చ. హరి హరియించితిం ద్రిదివమందున మందువకైనఁ గానియ
ట్లరయ దధీచి వెన్నెముక నారినయట్టి వసావిశుష్కతం
దరలఁగఁ జేసితిన్ దిగిభదంతములన్ మెలివెట్టితిన్ మెడల్
విరిచితి గంగనీ రిగురఁ బెట్టితి బెట్టితిసాస మొప్పఁగన్. 385

ఉ. గ్రీవమునందుఁ ద్రుంచెద నరిన్ హరివంచును గొంచుఁబోవ సు
గ్రీవుఁడు దొంగఁగా నవసరించుకవచ్చెను వాఁడుగాని నీ
పై వెలయుం గనుంగొనుము వానిని మించిన గ్రీవమో హయ
గ్రీవమొ యేమొ యన్నదిస రే, యతఁ డెచ్చటనోయి లక్ష్మణా!

మ. మరి నీలుండనువాఁడు నేనును హనూమంతుం బ్రతాడింపఁగా
నరరే! నీదగు నన్నగారికిని గోపావేశ మౌనట్లుగా
నఱచెన్ నిన్నునుగొట్ట నెంతవును? నీ యన్నన్న వాఁ డెచ్చటో
మరి చూపింపుము నాకు నే నతని నే మన్నించెదన్ సోదరా! 387

వ. అనిన మందహాససుందరవదనారవిందుండై సౌమిత్రి దూరాన నున్న శ్రీరామచంద్రునిఁ జూపించి యతఁడుగో. 388

ఉత్కళిక

నీలమేఘసుందరుండు నిఖిలదనుజమందరుండు
వాలిఁ గోలతోడ నేసె వానియనుజు నేలుకొఱకు
వానివలన దనుజభీతి, వానియొక్క తమ్ముఁ డేను
వానియందుఁ బ్రధనజయము, వాఁడుగో, రఘూత్తముండు. 389

చ. దనుజుఁడు రామచంద్రుఁ గని దానవనాథుఁడు నిన్నుఁ జంపకుం
డను గొనిర మ్మటం చొసఁగె నాకును నాజ్ఞను, నాకు నిన్నుఁ జూ
చినఁ గడు నాఁకలయ్యెడిని జిత్రము, సంధిగ నున్న దిద్ది న
న్నును దరిచేరని మ్మిదె కనుంగొను మప్పటి నాదు పోడిమిన్. 390

వ. అని దనుజుండు రామచంద్రునిమీఁది కుఱుకఁబోఁగా శ్రీరాముండు వానియురంబున రౌద్రాస్త్రంబు నేసినఁ గుంభకర్ణు చక్షుశ్శ్రోత్రనాసికావదనంబుల నుండి మహాగ్నిజ్వాల లుదయించివాఁడొక పెద్ద

కాఁగడావలెఁ గొఱవివలె మండుచుఁ గపిసేనాసమూహంబును ముట్టించుచు, సురసురఁగాల్చుచుఁ బొగమూలించుచు, మఱియు రామచంద్రునిపైకి రాఁ బ్రయత్నించుచు. 391

క. మిక్కిలి శ్రుతివిరహితముగ
నక్కట! బహుదూరవాసనాపేతముగన్
ముక్కులు చెవులును మొదటన
చెక్కుదురలె యేమి సజ్జ చేర్చితి రామా! 392

వ. అతండు రామచంద్రునిమీఁదికి రాకుండునట్లు లక్ష్మణాజ్ఞా ప్రవర్తమానమై యనంతకపు లతని నధిరోహించి యతనిని గదల కుండఁజేయ నతఁడు వారందఱను విదలించి మఱియు వచ్చెడివారి నదలించి, వచ్చినవారిని యమపురికిఁ గదలించి, మఱల మాట మెదలించి. 393

మ. మరియున్ వృక్షము చాటునుండి ప్రహరింపంగాఁ బనే లేదు స
త్వరతన్ బాహువుమీఁద నెక్కి యసితో వాలింపఁగా నైన య
క్కఱయుం గల్గదు, నే నెవండ? ఖరరక్షశ్శ్రేణికి న్నాకు సాం
పఱ సామ్యంబును బెట్టుకోకుము, నినుం బట్టంగ నేతెంచితిన్. 394

వ. సముద్గరపాణియై సముద్గతర క్తఘూర్ణియై క్షుధాసందహాత్ప్రాణియై పేరెములువాఱుచుఁ బ్రతిక్షణనిరుద్ధరాఘవసమీపదేశగమనుం డగుచు, నిరోధించు కపిసంతానంబుఁ దంతన్యమానకోపావేశంబున లేశంబును దక్కని మేనులుగాఁ జేయుచు, ప్రమానులుగాఁ బాదం బుల కడంబుగాఁ బడిన గోలాంగూలంబుల లాంగూలంబులు పూని సాగరంబున విసరివేయుచు. 395

క. మాయామహిషము చంపఁగ
మాయామహిషంబు చేయు మార్గణసమితిన్

దూయంగ వలసివచ్చెను
నాయెడ మాయలవి లేవు నారాచోగ్రా! 396

వ. అంత రామచంద్రుండు వాయవ్యాస్త్రంబు సంధించి వాని సముద్గరబాహువు వధించిన నాబాహువు కపిసైన్యంబునంబడి వేలమంది కపులను వధించిన, నత డెడమచేత నొకమహాపర్వతంబు రామునిపై విసరిన, రాఘవుండు దాని శకలీకృతంబు చేయఁ దచ్ఛకలతాడితు లయి యసంఖ్యాకులయిన కపిరాక్షసులు మడిసిన.

క. నా రాక్షసత్వ మిది నో
రూరెడు శోణోష్ణమైన రుధిరము త్రావన్
శ్రీరుచిరగుణసమూహము
లూరిన నీ తీయనైన రుధిరము త్రావన్. 398

వ. మఱియు రామచంద్రుం డైంద్రాస్త్రంబున వాని రెండవచేయి ఖండించిన వాఁడు మొండెమై ధాత్రి ద్రొక్కఁదలఁ ద్రొక్కుచుఁ బరువులు పెట్టుచుఁ దెరువులు తీయుచు, నుసువులు ద్రొక్కుచుఁబోయి నంతమేర నెత్తురుచెఱువులు కట్టించుచు, 399

క. ఇప్పుడు తెలిసినయది నా
కి ప్పలుగాకి కపిమూఁక యెందుకొ శరముం
జొప్పింప నెడము కలుగఁగ
నప్పా! కైకై పెనంగ నసమర్థుఁడవై. 400

వ. అంత శ్రీరాముండు రెండర్ధచంద్రబాణంబుల వాని పాదచ్ఛేదంబు చేయగా నాపాదంబులు సమీపపాదపంబులు విఱుచుచు దొరలి పోయి పోయినంతమేర మేరమీఱిన కపిసంహారంబు సేయఁగా నతండు నేలపైఁబడి దొరలుచు, దొరలుటలోఁ దొడుగీడ్చినట్లు

పాపటతోలినట్లు చట్టులాగినట్లు నూర్చిడి చేసినట్లు మహాఘోరంబుగాఁ జేయ, రాఘవుండు నవైంద్రాస్త్రంబున వాని శిరంబు ఖండించిన. 401

క. అదియును రావణు జాంబూ
నదసౌధము గోపురంబునం బడియెను స
ర్వదనుజ విదర్పలోచన
సదుఃఖ దర్శన సభీతి సకలోహముగన్. 402

గీ. పడిన శిరసును గాంచి రావణుఁడు జీవ
సహజదుఃఖమ్ము రాక పెల్చన విషణ్ణ
తయును బొందక నిశ్చేష్టుఁ డయి విగాహి
తాత్మమాత్రచైతన్యుఁడై యట్ల నిలచె. 403

వ. అంత శిరోమాత్రతఃకృతసంపరాయానంతరమ్మున మహాదుఃఖనది కొక్కరొుడ్డునఁ జేరి యేకాంతంబున. 404

గీ. రాఘవుండును బుద్ధిపూర్వకముగాఁగఁ
గుంభకర్ణునితల హేమకుంభసహిత
మన్మహాసౌధశిఖరంబుమఱుఁగఁ ద్రోసె
నిచటఁ బడునట్లుగా నది యెట్లు ద్రోసె? 405

ఉ. అమ్మన దేనినో నఱుక నయ్యది యిష్టమువచ్చినట్టి దే
శమ్మునయందుఁ బోయి పడుఁ జక్కగ నీతల యీతలన్ యథే
చ్ఛమ్ముగఁ బడ్డదా? మఱియుఁ జాపకళాగతమా విశేషమా?
యిమ్ముగఁ జాపవిద్యయును నిట్టిదియుండుట యంచు నెట్లగున్.

చ. ఇతని భుజాయుగంబు మఱి యీతనికంఠము పాదయుగ్మమున్
శితశర మెంత వేగియును ఛిన్నముచేయద, వేలువత్సరాల్

క్షితి దివి నిట్టి కార్యమును జేయఁగఁ జాలఁడ యెవ్వఁడున్ గ్రియా
తతినియమంబు నిశ్చితము దాఁటిన దీ పని యబ్బురంబుగా. 407

మ. కాని యా వేల్పుల తామసంబయిన శక్తుల్ పొల్చు నస్త్రంబులన్
దనరన్ శైవము వైష్ణవంబయిన యస్త్రవ్రాత మీదృక్క్రియా
చణమై బట్టుగఁ బారమేశ్వరమహాసత్త్వప్రధానంబులై
యనయంబున్ బెఱజీవులం దిది యసాధ్యం బెంత యోజించినన్ 408

ఉ. నెక్కొని గాధిరాట్సుతుఁడు నేర్పెను వీనికిఁ జెట్టమంత్రముల్
చక్కఁగ దానియం దొకటి చాలునొ యీపనికిన్ భృశంబుగన్
నిక్కముగాఁగ నల్లెయగు, నేరని యాతఁడు నేలపాలువాఁ
డెక్కఁడ వీఁ, డధోక్షజుఁ డదెక్కడ ధూర్జటిసామ్యసత్త్వఁడై. 409

ఉ. ఆయన వీనిఁ గానలకు నంపినయట్టిది పిన్నతల్లి కై
కేయి ధమఃకళావిభవకృత్రిమతావరివేత్త్రి నేర్పె నే
ద్రో యొకయిట్టిదా కిటుకు నొవ్వఁగఁ బండితలోకవంచనా
ధీయుతి యీతఁడే హరి వధించును నన్నను భ్రాంతి కల్గగన్. 410

చ. ఇది విడి కుంభకర్ణు వధియించుట యెంతయు సంశయంబు లే
నిది యగునైన వానిమరణించుటయున్ వ్యతిరేకలక్షణం
బొదిగిన దైన యాసరసిజోద్భవుమాటను లేద శైవచా
పదళనశక్తిమంతుఁ డవు బాల్యమునంద మఱింక జెట్టియే. 411

వ. అయ్యో! కుంభకర్ణా!

గీ. నామహాయుధంబు నలినసూతిప్ర
దత్త మగు చధైర్యదాయి వగుచుఁ
దమ్ముఁ డగుచు దుఃఖదాయివి నగుచును
జేతులార నిట్లు చేసికొంటి. 413

వ. అని మహాదుఃఖభయసాగరనిమగ్నుఁడై. 414

ఉ. వాయువు నింద్రుఁడాది సురవర్గము వేనిని గెల్వలేరొ సు
ధ్యేయము లౌచు వార లధిదేవతలై చనునట్టి యస్త్రముల్
మాయురె వాని నెప్పగిది మాయఁగఁ జేయను గల్గునో? మఱీ
కాయము, వాఁడు, వాని యధికారము రెండును రెండె యైనటుల్.

వ. బ్రహ్మ తాతయని బ్రహ్మాస్త్రము తాత కానేరద. అయ్యో! కుంభకర్ణా! నీవు శస్త్రాస్త్రములు రెంటికి నవధ్యుండ వనుకొంటినోయి నా తమ్ముఁడా! 416

ఖండాంతము

క. ఇది కుంభకర్ణ ఖండము
మదగజదారణవిచిత్రమహిమాబ్ధీ! నీ
యెదఁ గమణఁ గనుము ముక్తా
లధరాపతిఁ జంద్రహాళి లలితసితగుణున్. 417

ఉ. లెంకనటంచు నిన్నుఁ గములించెడు పాపము చేసినానొ ప
ర్యంకకృతాంబికోరుయుగ! రక్తపుబిందువు రక్తబిందువుల్
సంకువు లౌచు నీపరమశాంభవనామము లూదకుండ నీ
కింకరు నేటి కిట్టు లుడికింతువు మోసము లేని దైవమా! 418

వనమయూరము

నైక సుకృతాధ్వ పరిణాహ పరిణామ
వ్యాకృత మహాః పరమ భావమయమూర్తీ!
స్వీకృత శిలాతను నివిష్టసకలాను
వ్యాకలిత చేతన గుణాంబునిధిమూర్తీ! 419

## ఇంద్రజిత్ఖండము

క. శ్రీవైశ్వానరరూపా
ధీవిలసదుపస్కృతసమధికరూపా! కా
లావిష్కృతనిజతత్త్వా!
భావస్థిత! భావరూప! ప్రభు! విశ్వేశా!

చ. అమరికగల్గి ధారుణి నిహంబు పరంబును రెండు త్రాసుచం
దమున మెలంగు, దాన నొకదాని సమృద్ధి మఱొక్కదానిం జి
త్తమునకు హత్తనీ దొకఁడు, ధారుణి సంపదచేత సర్వనా
శము కని కాని చిత్తమును సాచి తలంపఁడు సాంపరాయమున్. 1

ఉ. ఆతఁడు కుంభకర్ణుఁడు మదగ్రజుఁ డాతనిచావు నాకునుం
జేతమునందు నొవ్వొసఁగఁ జేసె నసృగ్గుణానై జలక్షణం
బాతని కాయుధంబును మఱంతట నెంతటిబాధసేయు న
య్యో! తనచుట్టముల్ సచివు లుర్విని బాసిన నొవ్వగుంగదా! 2

చ. పృథివిని జీవికిం దనదు బిడ్డలు తానును ముఖ్య మాత్మజుల్
పృథివిని బాయ న్వ్యర్థ మనిపించును జీవిత మెల్ల యౌవనా
వధి యగు వానికిన్ వయసు వ్రాలుట చాలనివానికిన్ మద
వ్యథితమనస్సు లేని దగు వానికి సంస్కృతికల్గువానికిన్. 3

మ. అనినన్ లక్ష్మణుఁ డట్టివాఁ డగునటే యారావణుం డన్న నా
తని ధీసంపుటి యట్టిదే యగు, మఱిం త్రైలోక్యముం బుత్రులం
దున నర్పింపఁ దలంచువాఁ డతనిపుత్త్రుల్ చండశౌర్యాబ్ధులున్
ఘనశస్త్రాస్త్రవిదుల్ త్రయీవిదులు రక్షశ్శ్రేష్ఠు లాథర్వణుల్. 4

చ. వర మను కాంత జాణ యతిబంధురధీకము లోకమున్ మఱిన్
మరిఁ దనవైపు లాగికొన మానని యత్నము సేయుచుండుఁ బౌ

క్కుఁరిదెస బిట్టు దుఃఖ మను గోడకు వెన్క నివాసముండి బం
ధురమతి నేఁడొ కుడ్యమును దూఁకి తనుం గవయంగ నెంచుచున్

గీ. అఖిలజనులు కుడ్యము దాఁక నరుగుదెంచి
యాగిపోదురు, పుత్రదుఃఖాభిహతుఁడు
విపరిణతమతి దూఁకునంత పనిచేసి
యొక్క మోహానఁబడి వెన్కదిక్కు తిరుగు 6

గీ. అనిన సౌమిత్రి యంతియేనా యనియెను
నన విభీషణుఁ డంతియే యనియె మఱి సు
మిత్రబిడ్డ వరంబన్న మేలఁత మాట
యేమన, విభీషణుఁడు స్వామియే గతి యని, 7

వ. ఆయనకుఁ ద్రిశిరో నరాంతక దేవాంతక మత్తోన్మత్తప్రభృతు
లయిన పుత్రులు మహావీరులు కలరు. అతికుంభకర్ణుఁ డతికాయుఁడు
కలఁడు:

ఉ. ఈ చనినట్టియుద్ధముల నెవ్వరు చచ్చిరొ రావణాజ్ఞ, దో
షాచరు లెల్ల వారిటకు సాగిరి, వీరు తమంతఁ దాము నే
నై చని సంహరించెద మినాన్వయు నంచని వత్తు రెంత బా
హాచణులో యెఱుంగుము మహాహవ మింకను దీవ్ర మయ్యెడున్

స్ర. అదిగో దవ్వునఁ గానిపించుఁ గపిసైన్యం బెంత గగ్గోలుగాఁ
గదలుం గ్రక్కదలున్ వియత్పదమునన్ క్ష్మాభృత్తులున్ వృక్షముల్
మెదలున్ బాణపరంపరల్ చెదరు గంభీరోగ్రసమ్మర్దధీ
ప్రదమై తోఁచెడు దిక్కటాహనిబిడారావప్రచండంబుగన్. 10

సీ. అచట మణిప్రతానాంశుసంతతులతో
ముక్కంటిపోలిక ముక్కిరీట
ములతోడ ధగధగై తళతళై భాతిప్రం
డ్రములతో స్ఫీతగండచలకుండ
లములతోఁ బటుధనుర్లస్తక జ్యాలగ్న
వామదక్షిణహస్తవల్గు మణిన
వాంగుళీయకకాంతి చెంగనాలుగ శర
సంధానముం జేసి సర్వవాన

రులను నెగచుచుఁ గలచుచు దోలఁచుచుండి
రావణ సుతుండు దివ్యశస్త్రాస్త్రవేది
యగు త్రిశీర్షుండు యుద్ధవేళాగ్నిమూర్తి
యార్తిఁ గూర్చుచు నుండెఁ గీశావళికిని. 11

ఉ. కొండల మేల రక్కసులఁ గొంగ వధింతు నటంచుఁ దండ్రితోఁ
డం దగఁ జెప్పి వచ్చెను విడందగుఁ బ్రాణములైనఁ గాని తీ
ర్చం దగుఁ దండ్రి దా హృదయశల్యముఁ దీర్పకయుండ నింటికే
గం దగదంచు నిశ్చయముగాఁగఁ ద్రిశీర్షుఁడు పెచ్చురేగెడున్. 12

ఉ. సూటిగఁ బోయి రాము నెగచుంబని సాగకయుండ వానరుల్
కోటులు వచ్చుచుండి రెలగోలుగ వారిని గోలనేయు పెన్
ధాటికి నైనఁ గాలము వృథాయగుచున్నది వారిఁ దూల్చుటో
యేటికి నడ్డముంబడిన యేపుగ నున్నది బారబారకున్. 13

ఉ. అంతె నరాంతకుఁడు తనయన్నకు మార్గము సూటిచేయఁగాఁ
గుంతముఁ బ్రాసముం గొనుచు గుఱ్ఱము నెక్కి విజృంభమాణకా
లాంతకమూర్తి వోలెఁ గపులందఱఁ జిందరవందరా నటుల్
వింతగ సంహరించుచును విక్రమ ముద్ధురమైన యట్లుగా. 14

సీ. పాఱిపోయెడువారి పాదముల్ నఱకుచు
నిలుచున్నవారల తలలు నఱికి
ఎదిరించువారల యెముకలొమ్ము లగలించు
చలయించువారి గొంతులను గోసి
దండియౌ పీకల రెండుగా ఖండించు
చలుపంపువారి ముక్కలుగఁ జేసి
అది ఘోర శత్రుసంహారంబు కానట్టు
లొక కసాయిదుకాణమో యనంగఁ

జిదిమి చిదిమి చేతను బోసి చెఱిగి చెఱిగి
మఱిగి మఱిగి మిగులఁ గ్రాగి విఱిగి విఱిగి
తాలుతప్పల నోలికఁ బాలనోలెఁ
జూచి చూడని యట్లుగాఁ గ్రాఁచెఁ గపుల. 15

మ. ఒక రక్షోదళమర్దనాత్మకసముద్యోగంబునం బొల్చు వా
నికి సుగ్రీవుఁడు వాలిసూతికిని వానింజూపి, వీఁడో నరాం
తకుఁ డీనాటికిఁ బ్రాస మొండు గొని, కన్నావే మఱిన్ వానరాం
తకుఁడయ్యెన్ జుమి చూడు వానివని, యన్నన్ వాలిపుత్త్రిండునున్

గీ. వాని కెదురేగి యేమిరా! బక్కదైన
కోఁతిగమి నూచకోఁతగాఁ గోయుచుంటి
ప్రాస మది యేది విసరు నాపై ననంగ
దాని నంగదుపై నరాంతకుఁడు విసరె. 17

క. అది ముక్కముక్క లయ్యెను
గదిసిన కోపమున వాఁడు కదుఁ బిడికిట నం
గదు తలపై గ్రుద్దిన నం
గదు శీర్షము వగిలి నేత్రు కాల్వలు కట్టెన్. 18

చ. స్మృతిచెడి యంతలోఁ దెలిసి శీర్షము నొక్కుచు వామహస్తసం
గతముగ వానిపై దుమికి గాఢతమంబుగ వానిఱొమ్మునన్
క్షితిధర మొండు దూఁకెననఁ జేర్చెను దక్షిణహస్తపాతమున్
క్షితిఁబడి చచ్చె రాక్షసుఁడు చేరల నెత్తురు లోలిఁ గ్రక్కుచున్.

వ. అంతఁ బరమాశ్వంబులు కట్టిన రథంబున సచాపుఁడైన త్రిశిరుం డును బర్వతోపమానమైన మత్తానేకపారూఢుండై పరిఘహస్తుం డైన మహోదరుండును మత్తద్విపాకృతియై పరిఘంబుపూని దేవాంతకుండును నరాంతకవధజనితక్రోధులై యొక్కపెట్ట యంగదుం దాఁకిన. 20

మధ్యాక్కరలు

దేవాంతకుని మీఁద నొకక్షితిరుహంబు తీవ్రంబుగాఁగ
నా వాలితనయుండు విసర నమ్ముల నది త్రిశిరుండు
తా వేయిముక్కలు చేయఁ దనరారి తారేయుఁ డంత
వే వానఁ గురిపించె వేనవేలు వృక్షోరుహంబులను. 21

ఆ వాన వెలిపించెఁ ద్రిశిరుఁ డంత దేవాంతకుం డురిసి
వే వచ్చిన, మహోదరుండు వేవచ్చి వేగ నిద్దఱును
నా వాలిసుతుఁ బరిఘద్వయంబుతో నడుమ వక్షమున
గావికన్నుల నంగదుండు క్షమయుఁ గ్రక్కదల లంఘించి. 22

అమ్మహోదరుఁ డెక్కినట్టి యవనిధరాభంబు ద్విపముఁ
గ్రుమ్మి ముష్టిప్రఘాతమునఁ గుంభంబు గునియంగ నడుమ
నమ్మత్తగజము గీపెట్టి యవనిపై నడగిన దాని
కొమ్ము వెఱికి యంగదుండు కోపోగ్రఘూర్ణితాక్షముగ. 23

అయ్యంగదుం డంతఁ గొట్టె నసురఱొమ్మగలంగ ఱొమ్ము
వ్రయ్యఁగా నసుర నెత్తుఱులు వాంతిగా బాధ తట్టుకొని
చయ్యన లేచి యంగదువిశాలవక్షమ్మును బరిఘ
నొయ్యన మోద నంగదుఁడు నుర్విపై నొగిఁ గూలఁబడియె. 24

మొగ్గతిల్లంబడి యంగదుండు భువినుండి మొగి లేవఁబోవ
నగ్గియమ్ముల మూట నొసలునందుఁ బ్రహారంబు సేసె
మొగ్గ త్రిశిరుండు వాని ఘూగుసు మూఁగి రక్కసులు
వగ్గ బాధింపఁగా జూచి పావని, పైని నీలుండు. 25

పావని గిరి తెచ్చి త్రిశిరుపై నైచెఁ బెఱుకోవ మొప్ప
నావల నీలుండు కొండ నడిమె దేవాంతకుశిరము
గ్రావాభ మగునట్టి వేఱ గజముపైఁ గడు మహోదరుఁడు
మూవుర నెదిరించెఁ బరిఘ పూని విస్ఫుటఘోషఘణితి. 26

పరిఘతో దేవాంతకుండు పావనివక్షంబు పొడువ
బరువుగాఁ జావని మాడుపట్టది పగులగా గ్రుద్దె
తెఱచి నోర్దేవాంతకుండు త్రెళ్ళి ధాత్రిపయి నంతస త్రి
శిరుఁడు పావనిమీఁదఁ గురియఁ జేయఁగా శితబాణచయమ్ము. 27

పరిఘతో దేవాంతకుండు పావనిపై దూఁకఁబోవ
తఱుణంబు నీలుండు వానితలపైని ధాత్రీధరము శి
ఖరమునఁ జీలి శూలంబుగా వాడికలది ద్రిగఁబడఁ
బరగించె వాఁడును గొఱఁతఁబడ్డట్లు ప్రాణాలు తొఱఁగె. 28

అంజనీసూనుఁ ద్రిశీర్షుఁ డమ్ముల నలయింపఁ గినిసి
యంజనీసూనుఁడు వాని హయముల హరియించె రక్క
యంజనీసూనుఁ ద్రిశీర్షుఁ డసి యురమందున వేయ
యాంజనేయుండు వానిని నిరాయుధుఁ డౌనట్లు చేసి. 29

గీ. వాని కరవాలముం గొని పరమఘోర
రావముం జేసి బెదరించె రాక్షసులను
ద్రిశిరుఁ డుద్ధతుఁడై మారుతిం గరతల
మునఁ బ్రతాడింపఁగా వాయుపుత్త్రుఁ డంత 30

వ. వానికిరీటంబులతోడి మూఁడుశిరస్సుల నెడమచేతఁ బొదివి పట్టి కొని కరవాలంబున వానిమెడ నఱకి మూఁడువత్తులతో మూఁడు దీపజ్వాలలు వెలుగుచున్న ప్రమిద నూది యొక్కసారి యార్పిన ట్లార్చి, రక్షస్సైన్యంబు నేత్రంబులకుఁ జీకట్లు కప్పిన, మత్తోన్మత్తులను ఋషభగవాక్షులు వధించినఁ ద్రిశీర్ష దేవాంతకనరాంతకులు రావణుని కుమారులును మత్తోన్మత్తమహోదరులు రావణుని సహోదరులును. 31

మ. ఒక యానందపయోధి పెన్దరగలం దుయ్యాలలూగెన్ సమ
స్తకపిశ్రేణి మరుత్తనూజుఁ డొకఁడే సర్వంబు లంకాపురం
బొకఁగోటన్ మఱి మీటఁగల్గునని యిట్లూహించుచుండంగ వా
రికిఁ గన్పించెను భూతమో, యసురయో, ప్రేంఖాచలచ్ఛైలమో!

సీ. ఈ రక్కసులతోడ నేమి నమ్మక మహో
కుంభకర్ణుండు దిక్కుంభికుంభ
కర్ణుండు దిక్కుంభకర్ణుండు, చచ్చిన
వాఁ డింతలోపల బ్రతికివచ్చె
చచ్చినయట్టులే చత్తురు రాక్షసుల్
మనమింత వెనుకకు మసలినంత
బ్రతికివత్తు రటంచు భయపడి కీశప్ర
జమ్మది కాందిశీకమ్ముగాఁగ

నంగదాదులు మఱలించి రఖిలకపుల
నితఁడు కుంభకర్ణుఁడు కాఁడ యితఁడు వేఱు

వీఁడు రథి, చాపి, చూడుఁడీ! వాఁడు పాద
చారి, గది, రండు రామలక్ష్మణులు కలసి. 33

మ. అనినన్ వానరు లెల్లఁ జూచి యవురం చా యెవ్వఁడో రామచం
ద్రునితో యుద్ధము సేసి చచ్చును మరుత్సూనుండు చంపున్ వినా
శనదుష్టాకృతి కుంభకర్ణుబలెఁ గీశశ్రేణి బొక్కిఖ్యగాఁ
దినఁడంచు నె వెనుదిర్గుచుం గునిసి రద్రిక్ష్మాజవర్షంబులన్. 34

గీ. అతఁడు తననామ మతికాయుఁ డంచుఁ జెప్ప
చాహవధరిత్రి వీరవిహార మాచ
రించుచున్నాఁడు వానిపే ర్విన్న యంత
దండిమగలకుఁ ద్రిజగతి గుండెదిగులు.

చ. అనిఁ దనమూర్తికిం దగినయంతటి వందరథాలతో రథం
బున సకలాయుధంబులు సముజ్జ్వలమూర్తులు వంద వంద చొ
ప్పున నవి యేర్పరించి తనపూనిన చాపముకాక వేర్పదిం
టిని మణిహేమభూషణతటిత్స్ఫురితంబుల నిల్పి ప్రాంశులన్. 36

క. ఇరుదెసల రెండుకత్తులు
వరుసగ నలువురు గ్రహింపవలయు వెడల్పొ
త్తరువును దైర్ఘ్య మ్మది పది
కరమ్ము లంతవి రథానఁ గాంతులు చిమ్మన్. 37

చ. అతఁడు తపంబు సేసి జలజాసనుచేత వరంబులందె, వి
చ్యుతి కనరానిదౌ కవచ ముజ్జ్వలచాపము నందె, వేల్పులుం
దితిజులు దాఁటరాని దగు తేజము నందె, మఱిన్ మహాస్త్రసం
తతి పడసెన్ మహాద్ర్యుపఘనవ్యతిరేకమహస్సు లందుచున్. 38

ఉ. కత్తులబోను వంటి దశకంధరు రాజ్యమునందు నీతికిన్
గత్తికి నైనవాఁడు పితృకార్యకృతివ్యసనుండు వేల్పుతే
డెత్తినయట్టి వజ్రమది యెత్తిన దెత్తినయట్లె గాలిలో
హత్తెను కాదహో వరుణుఁ డాచిన పాశము లేశమైననున్ 39

ఉ. అల్పులతోడ నాహవము సాఁడఁడు యుద్ధమునందునన్ వృథా
జల్పము సేయఁ డస్త్రములు స్వల్పులయందున వాడఁడున్ నవా
కల్పము లన్న మక్కువయుగా మణిహేమములన్ ధరించుఁ గై
మల్పులు వింటినేరుపులు మానని యిష్టమునన్ ఘటించెడున్. 40

గీ. రావణుని ధర్మసతి యోగ్యరాండ్ర మిన్న
ధాన్యమాలిని, యామె సంతాన మితఁడు
పొలసుదినములలోఁ దప్పి పుట్టెనతఁడు
పట్టి శౌర్యప్రధానజీవంబువాఁడు. 41

ఉ. ఆతని పైఁ గపుల్ విసరు నద్రుల వృక్షచయంబులన్ శర
వ్రాతముచేఁ దొలంచుచును బండికిఁ గట్టిన వేయిగుఱ్ఱముల్
ధాటిగ సారథివ్రతతి తోలుచునుండ వెసన్ సహస్రభా
ద్యోతులు మింటినుండి దిగి యుర్వికి వచ్చినయట్లు లేగుచున్. 42

శా. వందల్ వేలును బండరాళ్ళు తరులున్ వర్షింపఁగా వానరుల్
చిందంబోవదు వాని బండిపయిని జిన్నైనఁ దచ్చక్రముల్
క్రిందన్ గుఱ్ఱపుఁగాళ్ళక్రిందను బడిన్ గీశవ్రజం బేటికిన్
మ్రందన్ వానిరథంబు తప్పికొన బర్వైపోయెఁ గీశాళికిన్. 43

వ. గవయగవాక్షులు మైందద్వివిదులు నలఋషభులు నీలాంగదులు మొదలయిన సర్వకపిసేనాపతులును వాని శరలీలావైభవంబునకుఁ దాళలేక తొలంగి చనగా నతికాయుండు సూటిగా శ్రీరామచంద్రుని కెదురుపోయెను. 44

ఉ. వేలసముల్ సురారిపతిపీడును లంకను ముట్టడింపఁగా
వ్రాలఁ డెవండు నీవొకఁడు వ్రాలితి వ్రాల్చితి రాక్షసాళి దో
శ్శీలుర నీవు చేసినవి చేఁతలు మిక్కిలి నద్భుతంబు ల
స్త్రాళికృతంబు కా కితరమైనది యద్భుత మున్నె ధాత్రిపై. 45

ఆ. పట్టి బాహుబలము పనిసేయునే? చేసె
నే యదంతటా పితృవ్యబలము?
అందుచేత నేను నస్త్రబలంబును
నేర్చినాడ, నీవు నేర్చినావు. 46

చ. నిసి మిను దాఁకి తారకలు నిక్కినవాఁడను, వ్రేలెఁ డంతమా
నిసి పగు దీవు, మంత్రములునేర్చిన నేర్పు గడించు సామ్యమున్
గుశికసుతుండు నేర్పినవి కోలలు కొన్ని మహాద్భుతంబులై
యొసఁగునొ వానిచే మఱియు నెక్కనసాదువొ నేను జూచెదన్.

చ. తెలిసిన యస్త్రమంత్రములు తీర్చినశీలముచే మహఃప్రభా
కలితముగా వెలుంగునని కైసరులాడెద రీవు దేవతా
నిలయుఁడ వైనచోఁ దెలియనేరనుగాని, భవన్మహోయశో
విలసన మేమొ విన్నయెడ విభ్రమముం గలిగించుచుండెడిన్. 49

సీ. పితృవాక్యపాలనావ్రతనిష్ఠుఁడవు నీవు
పితృవాక్యపాలనావ్రతుఁడ నేను
ఏకపత్నీవ్రతాహీనభావుఁడ వీవు
నేకపత్నీవ్రతాహీనుఁ డేను
వివిధాస్త్రశస్త్రాదివేతృతాఖని వీవు
వివిధాస్త్రశస్త్రాదివేత్త నేను
అల్పులతో యుద్ధమాడ వింతయు నీవు
నల్పులతో యుద్ధమాడ నేను

క్షోణిభృత్ప్రియమాణుఁడ నేను గొణిదెఁ డీవు
బడలి లక్ష్మని బాసినవాఁడ వీవు
బడలి లక్ష్మని బాయనివాఁడ నేను
బోల్కి యున్నది మనకును బోల్కి లేదు. 50

మ. అనినం గోపము నంది లక్ష్మణుఁడు దివ్యచ్చాపకోటిం ఘటిం
చిన జ్యావల్లి గ నిల్చి యొట్టెసుడు తీర్చెన్ దేవతారాతికిం
గనుగొంచున్ రఘురామసోదరుని రక్షస్స్వామి కోదండశం
డునిఁ గోపభ్రువు సామ్యభాషణసమానున్నాననక్లిన్నునిన్. 51

ఆ. అన్న నిన్ను యుద్ధమాడఁగనీయడు
బవరమందు ననుభవంబు లేదు
పిన్నవాఁడ నీవు నన్నెదిరింతువు
మఱియు శ్రేయమైన మాట వినుము. 52

ఆ. అధిగమంబు వేఱు ననుభవం బది వేఱు
విద్య కివ్వి రెండువృత్తు లరయఁ
బిన్నవాఁ డటన్న ప్రేమ చెట్టదిసుమీ
బాలురైనవారిఁ బాడుచేయు. 53

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 54

ఉ. అన్నకు నాకు వారడియటన్నది యొక్కదినంబు సువ్వె, నా
పిన్నతనంబు గౌరవనివిష్టలసద్ధిషణాగతంబు, తాఁ
బన్నగ మూఁడులోకములు వామనమూర్తి క్రమించె స్వామి, నా
కన్నను జిన్న యప్పటి, కిఁక న్నను బిన్నను టెట్టులున్నదో. 55

చ. పొలుపుగ విద్యయుం దదనుభూతియు రెంటినిగూర్చి పెద్దమా
టలు వచియించుచుంటివి విడంబనగా, నియమంబులేద యూ

స్థలముల నొక్కఁ డుండియును సత్వము గర్వముచే నశించు, నా
వల నొకరుండు గెల్చుఁ బ్రతిభాప్రతిభాసితసత్కళాబ్ధియై. 56

వ. మఱల నతికాయుం డిట్లనియె. 57

ఉ. అన్నకు నీకు వారడి యటన్నది నిక్కముగా దినంబె యై
న న్నిటలాక్షకార్ముకవణం బది గెల్చిన దేమొ నీవుకా
దన్నను, భార్గవున్ గెలుచుటన్నది చేసిన దేమొ నీవుకా
దన్నను, నొప్పికొందు వను టన్నది చేసెదవంచు నెంచెదన్. 58

ఆ. జమునిపట్టణంబు సర్పణశీలంబు
నొకవిలి త్త దగ్గరకును వచ్చు
వెళ్ళవలయు మనము పెఱమహాగ్రామముల్
యమునిపురమె నడచి యరుగుదెంచు. 59

ఆ. నాకు వచ్చునట్టి నష్టమ్ము లే దిందుఁ
జెప్పకుండ నేమి చేయరాదు
పిన్నవాఁడ పీవు నన్నెదిరింతువు
మఱియు శ్రేయమైనమాట వినుము. 60

ఉ. బన్నముఁగాఁ ద్రిలోకమణిపట్టము తాల్చిన దర్పభృత్తురా
సాణ్ణవఫాలభాగమున సంగత మద్ధనురుద్గమ త్సము
ద్యన్నవసాయకోన్మథనమై పెను నెత్తురుబుగ్గ లేచె భ్రా
మ్యన్నియతిన్ బ్రయోజనము మాలిన కోపము లేచిపోవునాన్. 61

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె. 62

ఉ. కొన్నిట గెల్పు కాంచెదరు కొన్నిఁట నోటమి గాంతు రెందఱో
యెన్నగ గెల్పు లేరి వచియింతురు వైద్యులు పండితుల్ సమా

సన్నములైన కార్యముల సంగతి యప్పుడు చూచుకోవలెన్
నిన్నటిమాట లేమి యగు, నేడు ఫలానికి రావు కత్థనల్. 63

చ. బిరుదుదుగండ వౌదు వనిపించెదు నందరథాలపెట్టు పె
న్నరదము వేయిమావులు శరాసనముల్ పది చాలనట్లు ము
ద్గరములు ప్రాసముల్ గదలు ఖడ్గము లొక్కఁ డొకొక్కవంద సం
గరమున కేగుదెంచితివొ క్రయ్యము లంగడికొంచుఁబోదువో. 64

శా. నీ గుఱ్ఱా ల్సకిలింతలందున ఖురానీకావనీఘట్టనా
వేగంబందున చక్రభీషణరవావిస్ఫూర్తి త్వత్సారథి
ప్రాగల్భ్యోక్తుల డోలుమ్రోఁతగ వినంబడ్డట్లు నీగొంతు మా
యీ గొంతుల్వినిపింప వంబుధిమరు త్తీపాటునన్ రానిచో. 65

చ. అన నతికాయుఁ డిట్లనియె నోఁ బ్రతివాక్యవిశారదత్వమై
చనెదవు, పోరుచోఁ బ్రతిపృషత్కప్రయోగ విశారదత్వ మై
నను మఱి సంతసించెదన నాకది యేమియులేద, నా విక
త్థనతయుఁ గాదు, పిన్నవని తాఁకుట నన్ను భరం బటంచునున్. 66

మ. ఒక వేయుద్ధములందుఁ బేర్వడిన న న్నూహించుచున్ బిన్నవా
నికి నీయుద్ధము నప్పగించు టది చన్నే ? చూడుమీ యిట్టియ
న్నకు మీయన్నకు, నీవునుం గలనిలోనన్ గెల్చినన్ గెల్వవ
చ్చున, యట్లయ్యు ననిశ్చితంబయిన యీచొప్పున్ ఘటింపింతు రే?

వ. అనిన లక్ష్మణుం డిట్లనియె.

చ. కనుకని వచ్చి దెబ్బ తిని కాలికి బుద్ధిని జెప్పిపోయె నె
వ్వనిదెస నిల్వలే కతనిపైఁ దనపుత్త్రినిఁ బిన్నవానిఁ బం
చినయటు కాదె రాఘవునిచేఁత? శరాసనముం దనంతచూ
చిన యనుజన్ముఁ బంచె, గెలిచెన్ రిపుఁ దాను, దదీయపుత్త్రిపై.

మ. మొరయించెన్ దనయల్లెత్రాటిని గరంబుం బూన్చి సౌమిత్రి దు
ష్కర మారావముచేత దద్దరిలె లంకాపూర్వియద్వీథి, వా
నరులున్ లక్ష్మణునంకఁ జూచిరి సమంతాద్రాఘవజ్యాసహో
దర మీరావ మటంచు రక్కసుఁడు నేత్రద్వంద్వమున్ విచ్చుచున్

గీ. ఈ ధనుర్జ్యానినాద మిదే కడింది
సాకిరి భవత్ప్రతాపదోశ్శక్తి కంచు
మృదులబాణంబు సౌమిత్రిమీఁద వదలి
యిట్టుల వచించె రక్షోమహేశ్వరుండు. 71

ఉ. నేను రథాన నుంటి మఱి నీవు ధరిత్రిని నిల్చి తాహవం
బైనను బాడికాదు మరియాదయుఁ గా దిది చూడు మొప్పినో
న్నానని నీ వనన్ విడుతు నారసముం జన లక్ష్మణుండు మే
మైన మఱెత్తివచ్చినది యన్నిటి కిన్నిటి కొప్పికొంచునే. 72

వ. అనిన నతికాయుండు తీవ్రనారాచంబు సౌమిత్రిపై వదలిన నతండు
దానిని ఖండించె. మఱియు నైదు వేల్పుకుముదారులను ముండ్ల
దారులు పట్టించిన యమ్ములు వేయ లక్ష్మణుండు వాని నన్నిం
టిని వారించె, నంత నతికాయుండు నీవు గొప్పకోదండి వగుదువు,
ఇపుడు నీవు వేయు మన సౌమిత్రి యిట్లనియె. 73

ఉ. నాకమునందునన్ దివిజనాథుని పెన్నొసటన్ శరంబునం
దేఁకువ నెత్తుకుందొరవు తీసితి నంటివి, నీనొసంట నే
నాకరణిం బొనర్తు నది యాఁగికొనం గలచేని యాఁగు మం
చే కెలసంబొ విడ్చె నొక యెంచిన బాణము, వంచి చాపమున్. 74

ఆ. అసుర దానివేగ మాపికోఁ జాలక
పెఱశరాళి దాని విఱువలేక
ధరణిధరము శిరము తప్పికోఁజాలక
పెదవి నెత్రుబొట్లు విడిచికొనియె. 75

మ. అవునయ్యా రఘురామసోదర! సెబా సంచున్ సురారాతి పి
న్నవుకా పీ పని చేసినట్టిఁడు ననున్ నాకంబునన్ లేఁడు, రా
ఘవుతో యుద్ధము చేయలేదనిన శంకాలేశముం బాపినాఁ
డవు, నాయమ్మును దట్టికొమ్మనుచు వెంటన్ బాణముం దూసినన్.

ఉ. లక్ష్మణు ఁడొమ్మునం దహిబలారి యొకండు ఫణంబు విప్పుచున్
సూక్ష్మము లెఱ్ఱనాలుకలు చూపిన యట్లుగ నెత్రుచిమ్మినన్
బక్ష్మము లార్చికొంచు దివివచ్చిన వేల్పులు చూచుచుండగా
లక్ష్మణుఁ డెంచె శత్రునిబలంబును ధైర్యము వింటిసేగుపుల్. 77

వ. ఇతఁ డస్త్రసాధ్యుఁడు గాని శస్త్రసాధ్యుఁడు కాఁడని తెలిసికొని
సౌమిత్రి యతనిపై నాగ్నేయమును విడువ నతికాయుండు దానికి
సౌరాస్త్రంబును జోడింప.

ఇంద్రవజ్రము

శ్యామారుణంబుల్ సిత శారకాంతుల్
వ్యోమప్రదేశంబునఁ బూర్ణ మూచున్
భీమంబుగా లోచనవిద్ధముయ్యెన్
తా మంతనంతన్ శమతన్ వహించెన్. 79

వ. అంత లక్ష్మణుండు తనశత్రువు తపోవంతుఁడని తెలిసికొనియె. 80

క. ఉపసంహారింపకుండఁగ
విపులవధము సేయకుండ విఱుగకయుండన్
గృప నార వూరక తపో
నిపుణుల యస్త్రములుగాని నిర్భరశక్తుల్. 81

వ. అంత నతికాయుం డిషీకాస్త్రంబు నిగిడింప లక్ష్మణుం డైంద్రము
నిగిడించిన. 82

ఇంద్రవజ్రము

ఆకాశభావం బది యస్తమింపన్
క్రోశాల్లలై నాగటికోల లొప్పన్
సాకొప్పఁ బర్జన్యుఁడు చాళ్ళుదున్నన్
జేకొన్న హేలాకృషి చెంగలించెన్ 83

వ. అన్యోన్యనష్టైషిణులు మహాస్త్రవై యర్థ్యభావనులు నై శస్త్రనై పుణి
మీఁద నాధారపడి సౌమిత్రి శరీరంబు పుష్పితాశోకంబై యతి
కాయునిచే నశస్త్రవిద్ధంబై యుండ సౌమిత్రి. 84

ఉ. నా కదియించు బాణములనై పుణి కించుక లొచ్చు వీఁడు నా
యే కలుకమ్ము వీని తను వెక్కుడు నాయొడ లెల్ల రక్తమై
కాక యొకింతయుం బడలికం గనఁ డేగతి వీనిఁ గూల్పనౌ
నా కిది పాలువోదని మనంబున నెంచుచుఁ గోపచిత్తుఁడై. 85

వ. ఆసమయంబునఁ గడలినుండి వచ్చిన గాలికరఁడు సౌమిత్రిచెక్కుంట
రివ్వున దూయఁగా నతండు కసినాటుగొన వాయువు భయ
భ్రాంతుండై యాయనచెవిలో నిట్లని యూదె. 86

శా. ప్రాణోపాసన సేయు నీతఁడు తనుత్రాణం బనిర్భేద్యవా
వాణీమానసపద్మపద్మకసుహృద్వాల్లభ్యలబ్ధంబు ని
ర్యాణం బందఁగఁ జేయ వీని నెపుడే బ్రహ్మాస్త్ర మొక్కండె పా
రీణం బైనది నాగ సుళ్ళు తిరిగెన్ రిష్టప్రమాశాకృతిన్. 87

వాతోర్మి

అంతన్ గతుఃపతి కాయాయిదిశల్
కుంతప్రాసమ్ములు కోలల్ పరిఘల్
క్రాంతంబై ముంచిన కంధిప్రభ దు
ర్దాంతంబై లక్షలు రాపిళ్ళగనై. 88

దిక్కుల్ కన్పింపక ధీరత్వ మహో
యొక్కింతైన న్నిలుపోవం గనకే
చిక్కించెన్ దేహాము చెక్కెన్ దునుకల్
ముక్కల్ చెక్కల్ చెడిపోయెం దనువుల్. 89

వ. అంత నొకపెద్ద కొండమీఁద విశాలాంభోధరమ్ము క్రమ్మి యది
విచ్చఁగాఁ గొండ మాయమయిన ట్లున్న సకలవానరరాక్షస వీరు
లును నివ్వెఱ భజింప నది బ్రహ్మాస్త్రంబని తెలిసిన యాంజ
నేయుం డహో సర్వాస్త్రంబులు ప్రయోక్తృప్రభావపరిణతంబు
లనుకొంచుఁ బ్రశంసాప్రమోదసింహనాదంబు సర్వరాక్షసభయం
కరంబు పొనరించిన నా మహాప్రచండారావంబునకు బెదరి నల్గురు
సారథుల యదుపు మాలి వేయిగుఱ్ఱంబులు రథంబుతోఁ గూడఁ
బరుగులెత్తి మహాసాగరంబునఁ బ్రవేశించి నశించె. 90

శా. ఇంకన్ యుద్ధ మటంచు నేమికల దా యీ వానరానీకినుల్
లంకాపట్టణ మగ్గిపెట్టెదరు పేలం జూఱగొందు ర్నిరా
శాంకంబై చనె రాజుతోడి బ్రదుకై యయ్యయ్యొ! మే మిచ్చటే
లంకా పట్టణమందు నంచు దనుజుల్ లంకాపురిం జొచ్చుచున్. 91

క. పదిదుఃఖము లొకసారిగఁ
బొదివినచో దేనికొఱకుఁ బొగులుటయో స
ర్వదితిజలోకేశ్వరుఁడు దృ
షదాకృతిగ దశగళుండు స్తంభము పొందెన్. 92

క. తెలిసినయంతన యెవరికి
నలపోయుటో తెలియలేక వరుస వరుసగా
వలపోఁతకాక ముద్దగ
వలపోయుట గుండెలోని బరు వధికంబై. 93

ఉ. శోకము బిట్టుగా నగుచు శోకగృహంబునఁ గొన్నినాళ్ళుగా
నేకల ముండి భూమిపతి యెవ్వరిఁ జూడఁ డటన్న భోగహా
శోకము పొంద వీల్పడక శూరుఁడు దుర్గకవాటమున్ ఘను
ర్జ్యాకలితారవంబుగ మహోష్ముఁ డతండు పగుల్చుచుండెడిన్. 94

మ. అతికాయున్ వధియించె నన్నది సుమిత్రానందుఁ డాశ్చర్యసం
గతి, కైలాసముకంటె బర్వు మఱి తత్కాయం బదింకొక్కసం
గతి, తామిద్ద జభేద మన్నయటులం గాకుత్స్థుఁ డాడెన్, సమా
దృతికా కయ్యాది నిక్కమేయగునో? తా మిం రెం డొకేతేజమై.95

చ. బవరము లాడుచో నుభయపక్షములందున వీరపాళి సం
భవమగు మృత్యు వందుట సమానముగా, నొకవంక మొగ్గ, రా
ఘవు దెసఁ గీశపీసుల నొకండును జావఁడు, చచ్చికూడ రా
ఘవులు సజీవు లయ్యెదరు, కయ్యము కా కిది జీవలీలయై. 96

మ. మఘవుం డెంత మఱిన్ మఱిన్ సురపురిన్ మాగెల్పు వాక్రువ్వ. శ
స్త్రఘనుల్ వీరలు కుంభకర్ణుని వధించం గల్గుటం జేసి, య
స్త్రఘనుల్ వీ రతికాయు నీగతి వధించం గల్గుటం జేసి, ధ
ర్మఘనుల్ శీలఘనుల్ పరాక్రమనిధుల్ రాముల్ మహోగ్రప్రభుల్

మ. సుతులున్ మంత్రులు తమ్ములున్ మఱిమఱిం జుట్టాలు పక్కాలు ది
క్పతులం గెల్చితి వేరి సాయమున, నవ్వారెల్లరున్ వీరిచే
హతులై పోవుట చిత్రమయ్యె. నితఁ డాహా వాసుదేవుండెచూ
శితికంఠుం డిట నేమి చేయఁ గలుగున్ జేజారి పోవచ్చినన్. 98

చ. రజతమరాళమై దితిజరాజుగృహంబుల నున్నయట్టి శై
లజపతి యక్షపుత్రునిచ్ఛలంబున లంకకు వైరియైన క
పజనునికిన్ లతాంగికిని సల్పె రహస్యపురాయబారముల్
గజదితిజారి నమ్మికొని కయ్యము చేసిన గెల్చినట్టులే. 99

గీ. జానకీదేవి చెప్పిన ఛాయ నేను
కైతవోపహారంబులు కాలకంఠు
నకును గంతంబు లిచ్చుచున్నాను మఱి య
థార్థముగ నీయవలయు నింకైనఁగాని. 100

చ. కడుకొని వేదముల్ చదివి కయ్యము సేయగ నేర్చినాడు నా
కడుపునఁ బుట్టినట్టి పసికందులఁ బొట్టను బెట్టుకొన్న యీ
వడిగల వింటివాఁడొకఁడు వచ్చిన విష్ణువటంచు నెంచఁగా
నిషియఁగఁ జేయు చొప్పికొన నీయదు కోపము మండిపోవుచున్ 101

చ. చెలువుగఁ బుత్రులై హితము చెప్పుట తప్పని చెప్పరంతె, మం
త్రులవలెఁ దమ్ములంబలె ననున్ వచియించియ యుంద్రు లేనిచోఁ
దలఁపున నుండెనం చెఱిఁగి తానది చెప్పమి చేసి లేనియ
ట్టుల నటియించు మూర్ఖుఁడు జడుండు జనుండు స్వలాభబుద్ధియై.

క. ఆకాంత ధాన్యమాలిని
వే కొడుకుల నిచ్చె శౌర్యవిభవుల నాకే
నా కొడుకుల దిగమ్రింగితి
నా కోమలిమొగము చూచు టదియెట్లు శివా! 103

సీ. బవరమ్ము సేసి లాభం బించుకయు లేదు
బవరమ్ము నేను దప్పకయ చేతు
జానకి దైత్యవంశవినాశహేతువు
వైదేహి వదలనే వదలనేను
మొదలిది యిది దుఃఖమును ద్రవ్వుటే యగు
తుదిదాఁక దాని ద్రవ్వెదను నేను
అస్మన్మహాదర్ప మడగించుటకు నిది
ప్రాణాలతో దాని వదల నేను

అసురసంహారమున కయి యరుగుదెంచె
నేనిఁ బూత్రిగా నది చేయనీయ నేను
మఱియు నాకంటె ముందుగా నరిగినాఁడు
వీఁడు మహాత్ముఁడైన విభీషణుండు. 104

మ. ఘనుఁ డీతండె త్రివిక్రముం డయినచోఁ గానిమ్ము యిందాఁకఁ దె
చ్చినదే చాలును మానవుం డగుచు వచ్చెన్ శ్రీవికుంఠంబునం
దునఁ గాలూఁదగ లేక, జానకియుఁ దోడ్తో లక్ష్మి యైవన్ దనం
తన యేతెంచి యిటన్ వసించె హరి కింతన్ సిగ్గుచే ఔనటుల్.

శా. ఈ యుద్ధం బిది దీని కేమి యిది తా నెట్లేగు నట్లేగుఁ గం
దోయిం గుండియ నిండఁగా ననుభవింతుం దుఃఖ మే నంచు దై
తేయప్రాజిత శోకసాధమున నాదేయీనిభాక్షుంబులం
బోయెన్ గుండియ పుత్రదుఃఖమునకున్ ఫుల్లాంగణం బట్లుగాన్.

వ. అంత మేఘనాదుండు రావణునిచేత బురుజులు గుల్మములు రచ్చలు కొలువులు దద్దడములు క్రంతలు భద్రపఱుపంబడినట్లు వానరులెవ్వరు రక్కసులచే నవజ్ఞ పొందరాదని యాజ్ఞాపింపఁ బడినట్లు తెలిసికొని, తండ్రికిఁ గలిగిన భయసంశయంబుల ననుమానించి శివాదిదైవతముల నమ్మికొనిన వారి నవ్వికొని రక్షోరాజశోక భవనంబునకుఁ బోయి పితృవ్యులయు ననుజులయు మరణంబులకుఁ దానుసైత మెంతో విలపించుచున్నట్లు నటించి, చివర కిట్లు నెమ్మదిగా నారంభించె. 107

శా. నే నం చిక్కడ నొక్కఁ డుంటినిగదా నీ కీ శుచాదైన్య మే
లా? నాకన్నను మించు పోటరులు కా రా రాఘవుల్ తీవ్రచ
ర్చానారాచభుజంగరాజిఁ గఱపించన్ మృత్యుపర్యంతమై
రీ నా నేటి శరాళికిం బ్రదికిరా రీ సారి ముమ్మాటికిన్. 108

చ. అయకకులయ్యుఁ దొల్లిటి మహాభుజగాధిపమంత్రముల్ ప్రతి
క్రియ పొనరింపఁ గాఁదగు నకృత్రిమనిష్ఠలయందు సాధ్యమై
యయయెు మదీయచాపమునయం దిపు డుద్గతిఁబొందు శస్త్రపా
ళి యమునిఁజూపులే, తిరుగులేదు, సరాసరి బండినెక్కులే. 109

చ. గగనము వాయు వగ్ని యుదకంబులు ధాత్రియు నైదు రెండు నా
మొగి మఱిరెండు నీమొగి నమూర్తము మూర్తముగాఁగ విచ్చున
ట్టి గురుప్రయత్నమందునఁ గడిందిది దృగ్విషయంబు తొల్తగాఁ
బగిలినయవ్వి డొత్తునివి వచ్చివి నిప్పులుగా విదీర్ణమై. 110

ఉ. దీపితవృత్తియై తదధిదేవత సర్వనియామకత్వరే
ఖాపరమాద్భుతంబయి జగంబును నిల్పఁ ద్రయీసమస్తర
థ్యావరనేశ్వరం బగుచుఁ ద్రయ్యుదితోగ్రపథార్చితుండు స్వా
హాపతి సర్వకార్యకరణాద్భుతవృత్తి జగత్క్రియాకృతిన్. 111

చ. అతనిని మించి యిచ్చుట సమర్చనయోగ్యత కల్గువాఁడు లే
డితరుఁ, డమూర్త మైనయది యెల్లయు నాతఁడు గాఁగ మూర్తమై
వితతి వహించె, వానివయి వేల్పులు గల్గరు, వేల్పులెల్ల ర
గ్ని తమకుఁ బోషకుండయిన నిల్తురు పొల్తురు స్వీయవృత్తులన్.

మ. శివుఁడున్ విష్ణువు నింద్రుఁ డీ సురజగచ్ఛ్రీనాథు లెల్లర్మహా
గ్నివికారంబులె చేతనత్వమని యగ్నిప్రోక్షతత్వంబు సే
రవినాశంబగువృత్తి వహ్నికిఁ దయీవ్యాహారహోమాదులం
దవు నద్దానికి దాసు లీ హరిహరేంద్రాదుల్ ఫలాధారులై. 113

ఉ. మానవులందుఁ బెద్దయగు మానిసి కేశవుఁ డంచు నందునం
దైన వినంబడున్ దివిషదర్చ్యఖిలేశ్వర! యీ వికుంఠదు
ర్గానఁ గవాటమున్ ద్వరువిఘాతముచేసిననాఁడు కాని యీ
మానిసి యీచు వచ్చిన రమాపతియాన యెపం గుమారిలన్.114

ఉ. అస్త్రము వజ్రమై తనరు నగ్గిని వేల్మిలు సర్వహా జగ
ద్విస్మయకారు లచ్చటను విష్ణువు జిష్ణువు నట్టరే ద్విష
ద్ఘస్మరమైన దాని ఫలితంబున లోచ్చగువారె వీరు వి
ష్ణుస్మరవైరిముఖ్యులు వినూతనరూపధరుల్ సురాకృతుల్. 115

మ. తపముల్ వేల్మిలు నొక్కఁడే యగున యేతల్లోకకార్యక్రియా
నిపుణంబై చను వేల్మి లీ జగతికిన్ వేల్మిల్ తపోజ్యేష్ఠముల్
శపథం బియ్యది రామలక్ష్మణుల నే సంహారముం జేతు నే
నపుడే చేసియయుందు నింతవసరం బౌనంచు నెంచం జుమీ. 116

గీ. మనకుఁ దెలియును గొన్ని హోమములు దైత్య
విద్య లవి నేర్వఁగా లేరు వేల్పులయిన
స్వీయముగ నమోఘముల్ హుతాశనుఁడు వచ్చి
లెక్కఁగా నిచ్చిపోవు శిలీముఖముల. 117

మ. కటికయ్యున్ యముఁడైనఁగాని యలమార్కండేయునింగూర్చిభూ
ర్జటితోడన్ మొగమోటమిం బడియె నూర్జస్విత్వరేఖన్ శిఖా
జటి వైశ్వానరుఁ డింత కక్కుఱితి చేసాచఁడు హోమక్రియా
స్ఫుటసంలక్షణమూర్తి లేఁ డచట విష్ణుండున్ మఱిం జిష్ణుఁడున్ 118

శా. సామర్థ్యంబులు సత్క్రియాతతులు తత్సంజాతమహా సత్ఫలం
బీమూఁటన్ నడువన్ వలెన్ జగము లంతే ధూర్జటుల్ విష్ణులుఁ
మోమోటంపడి స్వీయముల్ మతములన్ ముందుంచికొంచున్ జగత్
క్షేమంబంచును బైకి నెట్టెదరు భక్తిక్లిష్టదుర్జీవులన్. 119

వ. అనిన రావణుం డిట్లనియె. 120

క. నీవొకరుండవు మిగిలితి
దేవేంద్రవిరోధి! వారు తెగువరులు సుమీ

నీ వైశ్వానరకోటికిఁ
దా వైశ్వానరుఁడు వాఁడు దైత్యేశసుతా ! 121

మ. నినుఁ బంపింపఁగ వద్దటంచుఁ గలదున్, నీవేగి యాసంశయం
బును దీర్పంగల వన్నయాశ కలదున్, బోరింతసాగెన్ మఱిం
దనుకన్ వచ్చెను వెన్కకుం దిరుగఁగా నాతండ్రి లేదేకదా
మనమో వారో శివుం డొకండు కరుణింపన్ వారె కానోఁగదా!

గీ. సర్వథా నీవు వారిని సంహరింప
నే వలయు సర్వదితిజధాత్రీవలయము
నిది విభీషణునకు మాట యిచ్చెనంట
యన్నియును దనచేతిలో నున్నయటుల. 123

క. ఒకవేళ వారు గెల్చెద
రకటా! యీ వీడు వారిదైనది, దైతే
యకథాగుణి రాజవు నీ
వుకావు, కనుగొమ్ము రాఘవునికోపమ్మున్. 124

ఆ. వారి కెంత తెగువ వలయునో యంతయు
నుండుటకును హేతు వున్నదనుము
మనది పౌరుషంబు, మఱియుఁ జచ్చిననేమి
చావకున్న నేమి సాగరులకు. 125

క. వారికిఁ బోయెడి దేమీ?
యారా పోయెడిది మనకు నక్కతనన్ నీ
వా రాఘవులను జంపుమి
యీ రావణుసుతుఁడ వైన నేగుము వత్సా. 126

వ. అంత మేఘనాదుండు సకలదితిజలోకేశ్వరచరణపీఠి నమస్కరించి,
దండిమగఁడైన రాముడు నిండుపరాక్రమము గల్గు నీకెదురై లేకుం

డెసుగాత మని యాశీర్వచనంబు పొంది యనలత్వరాహంక్రియా ఘూర్వహాములైన ఖరములు పూన్చిన మణిమాణిక్యవినూత్న మంజుసుషమామార్తాండబింబంబుఁబోని రథం బెక్కి మిన్ను దాఁకిన దీప్తిచేతను మేలు మేలన రాక్షసులు, పరిఘ కుంత ప్రాస పట్టిస తోమర నిశితాసి చాపపండితులు రక్షోవీరులు తన్ననుసరింప.

క. ఎచ్చట యుద్ధము జరుగునొ
యచ్చటఁ దా నవతరించె నత్యుగ్రంబై
పచ్చఁదనము మాడిన యెడ
పచ్చని జలధరము వచ్చి వ్రాలినభంగిన్. 128

చ. రథమును నొక్కచో నిలిపి రాక్షసవీరుల బండి భద్రమా
విధమునఁ జూడఁగా ముదల వెట్టి మహాహవధాత్రి నొక్కచో
విఘుతజలంబు మ్రుగ్గులను వెట్టి హుతాశనుఁబెట్టి జ్వాలగాఁ
బృఘుతరవహ్నిఁ జూచి స్తుతియించి యలంకృతు హవ్యవాహనున్

ఉ. నల్లనిమేఁకనున్ గళమునం గొని హోమము చేసె నగ్ని సం
ఫుల్లశిఖాసముజ్జ్వలితమూర్తి స్వయంబుగ వచ్చి తా హవిః
పల్లవపుష్పమాంసములు పాణియుగంబున స్వీకరించె నా
వేల్లితవహ్నికుండమున విస్ఫుటమై జయచిహ్నముల్ తగన్. 130

వ. అంత నతండు రథంబును ఖరంబుల బాణంబుల సర్వాయుధంబుల నభిమంత్రించి యంతర్ధానంబు పొంది రాక్షసులఁగాంచి యిట్లనియె.

క. మీ కెదురు లేద కీశా
నీకంబులఁ జంపుఁడింక నిర్భరప్రాసా
నీకంబుల నసి పరిఘా
నీకంబుల రాముసేన నీఱై పోవన్. 132

మధ్యాక్కఱలు

రట్టుగా రాక్షసాళి బవరంబున రాపిళ్లు బిట్టు
పెట్టగా వానరావళులవీరులై వీరు చెట్టులును
గుట్టలు వారిపై విసరఁ గోలల గుము లెటనుండి
పుట్టెనో వానినిఁ బెలుచ ముక్కలు ముక్కలు చేసె. 133

ఇట్టి వీరుం డొక్కఁడే మహేష్వాసుఁ డింద్రజి త్తనుచుఁ
బట్టి నేత్రమ్ములకుఁ గనుపట్టనివాఁడు కోలలను
గట్టెడువాఁడు మాయలను గదియించి గడ్డువంతెనలు
గట్టులు విసరుట యెచట తూమ్రజముల్ కదియించు టెచట. 134

ఔషధంబునకు నందనిది వ్యాధి మహాతీవ్ర మగుచు
భ్రేషమ్ము కూర్చుచుఁ బ్రాణవితతికి విధృతిమైఁ బ్రతి ని
మేషమ్ము చూచుచునుండ మృత్యువు మ్రింగుచునుండ
దూషితవృత్తిగా యత్నదూరమై దూపిల్లునట్లు 135

కాలుచేతులు కట్టివైచి కంబానఁగట్టి ముండ్లొప్ప
కోలలతోఁ గొట్టినట్లు గునపాలఁ గ్రుమ్మినయట్లు
వ్రాలిన వానరుల్ నేలఁబడినట్టి వానరుల్ గుండె
వ్రీలిన వానరుల్ మెడలు విరిసి త్రెవ్విన వానరులును. 136

ఒకనికిఁ గన్నులుపోయె నొకనికి నూరువుల్ తెగియె
నొకనికిఁ జేతులు విరిగె నొకనికి నుడిగెఁ బ్రాణములు
నొకనికి నడుము రెండయ్యె నొకరికి నురము బెండయ్యె
నొకఁడు రెండుగఁ జీలె నడిమి కొకని మేనుయ్యాలయూఁగు. 137

సాగిన పందిరిగాఁగ జడ్డవాసంబులు గాఁగ
ఫీఁగిన వానరుల్ పట్టు విడలక వ్రేలు తీవలుగ

నాగుబ్బుగా నేచుఁ దములపాకుతోఁటయ్యొ రావణి ప్ర
యోగించు శరములచేత యుద్ధమహోర్వి యంతయును. 139

అయ్యయ్యొ రామునికోఁటకు నరుదెంచి యక్షలఖండముల
యయ్యొ వివిధజాతు లైనయట్టి వా రక్షలవానరులు
దయ్యమ్మొ నెత్తికోల్కతుదిఁ దాఁకిరి తా వానరు లను
నెయ్యమొప్పెడి జీవరాశి నేటితో నేలఁ బాసినది. 140

అల్లాక్కఖలు

పదియు నెన్మిది శాతబాణాల నం
గద గంధమాదను గర్వమడచి
మదనుత్తుఁడౌ నలు మాయించి తొ
మ్మిదిబాణములతోడ మోదు డించి 141

ఏడమ్ములన్ మైందు నేఁపడంచె
నాడించి తొమ్మనఁ గంఠంబునన్
వాడివై చను నైదు బాణాలతో
కూడి గజున్ స్మృతి గూల నేసె 142

పదిబాణముల జాంబవంతుండు ము
ప్పదితీవ్రబాణాలఁ బడసి నీలుఁ
డదవదలై పంచప్రాణాలతో
నుదయంబు చెడి లోన నురిసిపోవ. 143

వ. సుగ్రీవు డంగదుడు ఋషభుఁ డాంజనేయుండు దధిముఖుఁడు కేసరి జ్యోతిముఖుడు గోముఖుడు పావకాక్షుఁడు కుముదుఁడు మొద లయిన సర్వసేనాపతులు ప్రాణంబులం బాయ స్మృతిపథంబు ద్రోయ కసవుమేయ గుండియలు రాయ పరలోకపటంబు నేయ

యమపురంబు డాయ శిరోఽక్షిశ్రవశ్చిబుక గల్ల కంఠాంస
భుజ వక్షో మధ్యోరు జంఘమ్ముల నరుంతుదమ్ముగా సంహరించి.

ఉత్సాహము

చంపఁదగినయట్టి యొక్క శత్రువైన లేక నై
లింపవైరిచయము పురము లీలగాఁ జొరంబడన్
శంపలేని మొయిలు లాకసమున గ్రమ్మినట్లుగా
నంపవాన కురియుచుండె నసురవీరుఁ డుగ్రుఁడై 145

కన్ను కన్ను పొడుచుకొన్నఁ గానిపింప నట్టులా
సన్నమైన యంధకారచయము గ్రమ్మఁజేసి యు
త్పన్నమైన కీశచయము శవములెల్ల భీతిసం
పన్నమైనయట్టు లుండ మఱియు మఱియు నుగ్రుఁడై 146

రాఘవుల్ కలట్టిచోటు రాక్షసుండు చేరి బా
ణౌఘములను బోనుపెట్టి నట్లు గుమ్మరించుచున్
మేఘనీలమూర్తి మింట మిడిసిపోయె బిట్టుగా
శ్లాఘ కవధియైన యట్టి శౌర్యలక్ష్మి పట్టుగా. 147

అంత రామచంద్రుఁ డనుజు నరసి వీఁడు చాల దు
ర్దాంత మైనవాఁడు శరవిదారితాంగులన్ నిర
భ్యంతరముగఁ జేసి మనల నాహవోగ్రజయనితాం
తాంతరంగుఁడై ప్రవేశ మాచరించు లంకలో. 148

ఉ. శస్త్రభృదగ్రగామియుఁ బ్రజాపతిదత్త మమోఘమైన బ్ర
హ్మాస్త్రముచేతఁ గీశపతు లందఱ నిష్ప్రభులన్ నిరీహులన్
నిస్త్రపులం బొనర్చి యిఁక నిన్నును నన్నును సైతమున్ స్వతే
జస్త్రసరేణుభూతులుగ సల్పి జయంబును గొంచు నేగుఁబో. 149

ఉత్సాహము

అంత నింద్రజిత్తు నవమహోగ్నిభూతబాణవి
క్రాంతి చేత వాన కురిసి రామచంద్రు లక్ష్మణున్
శాంతతేజులై యొసంగఁ జండసమరజయనితాం
తాంతరంగుఁడై ప్రవేశ మాచరించె లంకలో. 150

గీ. బయట గోమాయురుతమును వారిరాశి
మ్రోఁతయును దక్క వేఱుచప్పుడులు లేక
వరగ లంకాపురీవియద్భాగగతని
శామహాసమయమ్ము నిశ్శబ్దమయ్యె. 151

ఉ. ఇంద్రజి బాహువిక్రమమహేశ్వరుఁ డూర్జితసత్త్వుఁ డుగ్రుఁడై
సాంద్రమహస్కులన్ సరసిజప్రియవంశ్యుల వానరాళి ని
స్తంద్రమహస్కుఁడై గెలిచి చంపె మహాహవభూమి యయ్యె ని
శ్చంద్రము స్వామిహీనము ప్రజాపతిదత్తవరప్రభావతన్. 152

క. ఱేపటికిఁ గపిశవమ్ముల
కూపారమునందు ద్రోసిరో వలయును మా
కీ పని పెట్టెఁ గొడుకు సుభు
జాపరిణతమూర్తి రాక్షసమహేశ్వరుఁడై 153

క. దిగి వారిద్దఱిగొంతులు
తెగఁగోసియ యుండవలయు ధృతి మెండిఘటా
లుగ వారు బ్రదుకవచ్చును
నిగూఢజీవులు రహస్యనిభృతాత్ములునున్. 154

చ. మఱి యది యట్లుచేయుటయు మంచిదికాద, యధీరకృత్యమా
మఱియు మహానుభావుఁ డగు మారుతి మేల్కనియుండు నాతఁడే

ర్తైఱి నిది యిప్డు సేయు నని ధీవిషయంబున లేద యీగతిన్
వెఱపఱి యీ మహాసమయవిష్ణువు కాలగతుండుగా నగున్. 155

చ. అపుడు విభీషణుండు కలఁ డచ్చట నస్త్రము లేమి చేయఁజా
ల వతని, వాఁడు రాఘవుని లక్ష్మణు రక్షణ చేయువాఁడు యో
ధవరుఁడు బాహుయుద్ధమునఁ దజ్జయ మింద్రజి పొందఁ డింక నే
ను వెడలి చంపఁగావలె వినూత్నసురారికులాదిపూరుషున్. 156

వ. ఇచట రావణుం డిట్లూహించుచుండ నచట నూత్నరక్షోవంశ
మూలపురుషుండు మహాశ్మశానంబువోని యా సముద్రపుటొడ్డున
నమ్మహాంధకారమ్మున నేకాకియై తిరుగుచు భిన్నచమూభాగంబుల
కేగి తచ్చమూపతుల వెదకుచు వారిలోఁ బ్రాణవంతులతో. 157

ఆ. ప్రభువు రామమూర్తి బ్రహ్మాస్త్ర మింత మ
న్నించె నంతెకాని నెగులులేదు
రేపు ప్రొద్దుటికిని శ్రీపతి తేరుకొ
ను న్భయంబు లేదనున్ వరుసగ. 158

ఉ. మారుతికోసమై వెదకి మారుతిఁ గన్గొని రాక్షసేశ్వరుం
డారయ నీవునుం బ్రభువవై విధిబాణము గౌరవించి త
ద్ధా రుచిరాకృతీ! యనిన దానవవీరునితోడ నిట్లనెన్
మారుతి, రాక్షసేంద్ర! పదమా కనుగొందము కీశవీరులన్. 159

క. కొనయూపిరితో నుండిన
జనులు సమాశ్వాసధైర్యసంగతచిత్తం
బెనయుదు రోదార్పునఁ బో
యిన ప్రాణము లేచివచ్చు నెల్లజనులకున్. 160

వ. మహాకల్పాదియందు మహాపుణ్యజీవుల కొఱకు హిరణ్యగర్భుని
పోలెఁ బ్రాణమాడు కీశవీరులకొఱకు వారిద్దఱును గాఁగడాలు
చేఁబూని వెదకుచుఁ బోఁగా 161

సీ. ఒకనికన్నులలోన నొక్కవె ల్గుదయించెఁ
గాఁగడావెలుతురు కాని దొకఁడు
ఒకనిమోమునఁ దోచె నొక్కయుత్సాహంబు
శివముఖాయోగ్యభాస్వర మొకండు
ఒకని మేనునఁ దోచె నొక చిన్న కదలిక
స్రవదుపలస్థమహాచలన మొకఁడు
ఒకని చెక్కిటఁ దోచె నొకనవ్వు చిఱుగీత
గ్రీష్మసరోవాయుకృత మొకండు

కనులు పెద్దవి చేసి చూచె నొకరుండు
పెదవి యాడించె నొకఁడు కంపించె నొకఁడు
కనులలోపల నీర్వెట్టుకొనియె నొకఁడు
కేలు కాలాడఁ బోవని కీశవితతి. 162

చ. బ్రతుకుట చచ్చుటీ నడిమిభాగమునందున నెన్నివేల ప
ద్ధతు లవి యుండవచ్చు ననుదానికిఁ గీశతతుల్ ప్రమాణమై
దితిజమహేశ్వరుండును మతిప్రభవిష్ణుమహేశ్వరుండు మా
రుతియును సంచరించిరి నిరూపితజీవసనాతనచ్ఛవుల్. 163

వ. గజ గవయ గవాక్ష మైంద ద్వివిద నల ఋషభ గంధమాదన పావకాక్ష జ్యోతిముఖ కేసరి దధిముఖాంగదప్రముఖ సర్వకపిసేనాపతులు ప్రాణవిరహితులై యుండ వారిద్దఱు సుగ్రీవు వెదకి యాయనం గన్గొనిరి. 164

శా. నేలన్ నెత్తురుగొండనోలెఁ బడియుండెన్ జాంబవంతుండు ను
ల్కాలీఢచ్ఛవివారశారసుమమల్గా మేను గన్గొంచుఁ దా
తా! లుప్తాసువు గాకయుంటివి యనన్ దా జాంబవంతుండు నీ
వా! లీలాకృతి గొంతు గుత్తిడిలి నయ్యా! దైత్యలోకేశ్వరా! 165

ఉ. కన్నులు బ్రహ్మబాణమున గాయములయ్యెను జూడలేవు జా
నూన్నయనంబుఁ గల్గదు తనూసకలామయసాన్నిహిత్యమై
యన్నల! సర్వసైన్యము సమాప్తము చేసెన వాఁడు, భద్రమై
యున్నది చెప్పుమీ యతని నొక్కని యంజనిదేవిగర్భమున్. 166

వ. అనిన విభీషణుం డిట్లనియె. 167

చ. అడుగవు రామలక్ష్మణుల నంగదు సర్వకపీంద్రు సూర్యజున్
గడఁకొని యాంజనేయు నడుగంగను మారుతి నీకు నంత యి
ష్టుఁడొ యన, జాంబవంతుఁడుకడుంగడు నూరుప్రకొంచునిక్కుచున్
వడివడి గొంతులోఁ గలుగువాక్కును యత్నముతోఁ బెగుల్చుచున్

గీ. వాయుపుత్రకుఁ డొక్కండు బ్రదికియున్న
బ్రదికియున్నాము మనమందఱము నతండు
బ్రతికిలేఁ డెవ్వరము నిట బ్రతికిలేము
యనఁగ నంజనీసూనుండు ప్రాంజలియయి. 169

వ. అతని పాదాభివందనము చేసి, తాతా! యిదిగో నే నిచ్చట నుంటిని, యేమి యాజ్ఞాపింతువో యాజ్ఞాపింపు మన ఋక్షపతికిఁ గన్నులు వచ్చె, జానూన్నయనంబుఁ గల్గె, నొడలినొప్పు లన్నియుఁ దీరె, నంత రామలక్ష్మణు లెట్లుండి రని యడిగి తెలిసికొని యొక్క నిట్టూర్పు పుచ్చి యాంజనేయునిఁ గాంచి యీ మహాపద తరియింప నీ వొక్కండవే తెప్ప వని. 170

చ. నలుఁబదిరెండుకోట్ల పృతనన్ గపివాహిని నింద్రజిత్తు దో
ర్బలవశవర్తియై దివసపంచమభాగమునన్ హరించె భూ
తలపతిపుత్త్రియుగమ్మును దారితదేహులఁ జేసెఁ బ్రాణవి
హ్వలతను గూర్చి శల్యవృతపంజరవిద్ధులఁ జేసె నుద్ధతిన్. 171

ఉ. ఈ నొకఁడే విశల్యకరణిం గొని తెచ్చి మహానుభావుఁడై
యీ విపదంబురాశిఁ దరియింపగఁజేయ రఘుద్వయిం గపీం
ద్రావళిఁ గావ నెంతయు సమర్థుఁడ వయ్య సుధీ! మరుత్తనూ
జా! విలసద్భుజాపరిణతాద్భుత వేగబలోగ్రవార్ధిధీ! 172

గీ. అప్పు డంబుధిదాఁటి మహానుభావ!
కపుల రక్షించితివి రామకార్యనిపుణ!
యిపుడు విపదబ్ధి దాటింప వే! మహాత్మ!
కృపమెయి సరామలక్ష్మణ కపిచయంబు. 173

చ. కలమకదా హిమాచలము, గౌరికిఁ బుట్టిలు, భారతావనీ
తలవహనక్షమం బయిన దైవతశక్తికి శైలరూప, మా
మల మలఁచున్ ధరాజనుల మానససీమల సాత్త్వికత్వ మా
వల నొకయాస్తికంబయిన భావము కల్గఁగఁ జేయు నిచ్చలున్. 174

గీ. పైడిగుల యేమొ వట్టి దేవతలయిల్లు
మంచుమల సర్వదేవతామహిమభూమి
వెండిమల స్వామి సతము కాపుండుచోటు
చనఁగ వలయుఁ గైలాస మంజనితనూజ! 175

గీ. దానికిన్ నంతదవ్వునఁ దనరు నుర్వ్వ
ఋషభ మను పేరి కాంచనశృంగ మొకఁడు
రెండు శృంగమ్ములకు మధ్యనుండు నోష
ధీమహాపర్వతము మారుతీ! మహాత్మ! 176

చ. కణకణలాడు నిప్పకలుగా మణిదీపిక లట్లు తారకా
గణములు వోలె నల్దెసలఁ గాంతులు చిమ్ముచు దీపితాంశుసా
రణులుగ నోషధీచయము రాజిలుఁ దద్గిరిశేఖరంబునన్
ఘృణినిచయాభిసర్పణచికిత్సతిసర్వదృశామయంబుగన్. 177

వ. మృతసంజీవనియు విశల్యకరణియు సౌవర్ణకరణియు సంధాన
కరణియు. 178

శా. యత్సామీప్యముచేఁ బునఃకలితమై ప్రాణవ్రజం బొప్పునో
యత్సంయోగముచేత విశ్లథములౌ నస్థుల్ మఱిం గూడునో
యత్సంపర్కముచేత సర్వశిలలౌ నష్టాపదీభూతముల్
యత్సాన్నిధ్యము చేత ఖండితశరీరాంగాళి సంధించునో. 179

చ. అవి కొనితెమ్ము రాఘవులయందున వానరసేనయందునం
దవిలిన సత్కృపాగుణము తాల్చుము, వేల్చుము పుణ్యహవ్య మిం
దవి గొనితెమ్ము ధారుణికి నస్తమయం బిసుమంత లేకయుం
డ వనజబాంధవుండు గగనంబున తే పుదయించులోపలన్. 180

శా. అంభోరాశియు దక్షిణాపథము నార్యావర్తమున్ దాఁటి తి
చ్ఛంభుస్థానము చేరి నంతటన యోషధ్యద్రి కన్పించు సం
ధ్యాంభోభృన్మహనీయమూర్తివి నభస్వద్భాస్వదూర్జస్వితా
గంభీరాకృతిఁ బోయి రాఁగదవె యోగస్వాకృతీ! మారుతీ. 181

మ. అమృతోక్తుల్ వినినంత మారుతి విఘుష్యన్మారుతాపూర్ణ మే
రుమహాకందర మట్లు పర్వతముగా రూపొంది గర్జించె ను
గ్రముగా శాంతవియత్పదం బయిన లంకాపట్టణం బెల్ల సం
ద్ర మహో ఘోంగి ధరిత్రిపై బొరలునో నా గుండియన్ బెగ్గిలన్

ఉ. రావణి రావణుండు విని రావముఁ బుత్త్రుఁడు తండ్రియున్ మఱిం
బావని మేల్కనెన్ విఱిగి బ్రహ్మమహాస్త్రము పట్టు తప్పెఁ దా
నీవల నేమి వానరమహేంద్రుఁడు సేయునటంచు నెంచుచున్
రావణి యేమొ నవ్వికొనె, రావణుఁడున్ భయమందె గుండెలో.

శా. హింతాలాకృతి యప్డు శైల మధిరోహించెం బయోరాశివే
లాంతప్రోన్నతమున్ మహారజతశైలాభుండునై యూఁపు కొ

న్నంతన్ దొల్తటికొండనా నదియునైనన్ ధాత్రిలోఁ జొచ్చి త
త్త్రాంతంబంతయు నల్లత్రాచుగములై ప్రాఁకెం బయోభంగముల్

ఉ. కదలిన మేనులై యురిసి గాయములందున వానరాళి య
క్కుదుపునకున్ శ్రమంపడియె గుండియలందున బాధపొందుచున్
గదలిన ధాత్రియై ధరణి కంపముపుట్టిన నింద్ర బాధముల్
మెదలినయంత సర్వమును మేల్కనె లంక యకుంభకర్ణమై. 185

శా. అవ్యాఖ్యం బనిరుద్ధ మూర్జిత మనంతాకాశవీథీప్రయా
ణవ్యగ్రత్వర నేగుచుండిన మహానక్షత్రగోళంబునా
సవ్యాధ్వప్రచల త్సుదర్శన మహాచక్రంబునా ధర్మర
క్షావ్యష్టంబగు పాద్మనాభము మహాసంకల్ప రూపంబునా. 186

గీ. సర్వసంధ్యాసమాసన్న సౌరబింబ
మొకఁడు కపిరూపమునఁ బోవుచుండె నసఁగఁ
బ్రసభ వేగాన నంధకారమయ వియదు
దాత్త తేజోభ్రమిమా నిరాధారవీథి. 187

మ. ధ్రువనక్షత్రము గుర్తుగా గగనపాథోరాశి సాంయాత్రికుం
డవు నమ్మారుతి యుత్తరంబుదెస సూర్యాంశుప్రతానాలయం
బవు నయ్యోషధిశైలముం గనుచు డాయంబోవుచో నంత నం
త వివస్వత్ప్రభ మాలి యావృతమహాంధ్యంబుం బ్రదర్శించినన్. 188

క. ఈయోషధిగిరికి జన
శ్రేయంబుం దెలియునంత చిత్తము లేదో!
మాయాదూరులు రాఘవు
లాయుర్మర్మానభిజ్ఞ మగు ద్రవ్యంబో. 189

క. లాభము వలవదు పరలో
కాభయవృత్తిం గణించ దన్యజనమతి
క్షోభము పట్టించుకొనదు
లాభము చెడుగుణము ధనికలోకమునందున్. 190

శా. ఓయీ! పర్వతరాజ! నన్నెఱుఁగ వోహో నీవు నాకార్యమే
మో! యేనెందుకు వచ్చినానొ, మఱి నాయుగ్రత్వ మేలాటిదో?
ఆ యీ విజ్ఞత లేనివాఁడవు కదయ్యా, నీకుఁ గైలాసమే
మో యీ దగ్గరదైవ మన్న మతి లేదో యింత సాన్నిధ్యమై. 191

శా. కన్నుందోయికిఁ జూపు మోషధిచతుష్కం బట్లుకాదేని నే
ను న్నిన్ గుంకటివేళ్ళతోడఁ బెకలింతుం గొంచుఁబోదున్ జుమీ
నిన్నే కాదు హిమాచలంబయినఁ గానీ! మొత్తి డాలాటి దిం
క న్నేనై పెకలించి తీసికొనిపోకం దప్ప దోయీ! గిరీ! 192

గీ. కడఁగి మట్టు వెడల్పుగా ఘాతచేసి
వేళ్ళు తెగిపోనియట్లుగా విస్మయముగ
వేఱ యొకచోటఁ బాతగాఁ జిన్నమొక్క
క్షితితలంబునఁ జెల్లగించిన విధాన. 193

గీ. కౌఁగిలించుక కుదిలించి కదిపి కుదిపి
యూపి పైకెత్తి బుజమున మోపి చోపి
మింట నేగంగఁ జొచ్చె సామీరి మీఱి
మఱియు వెనుజూచుటయు పావమాని మాని. 194

గీ. ఆ మహాంధకారమ్మున నరుగుదెంచి
నప్పు డొక మహావ్యాఘ్రమై యరుగుదెంచె
మఱి తిరిగి పోవుచో ఫణామణులకాంతిఁ
బొల్చెడు మహాభుజంగమై పోవుచుండె. 195

ఉ. పోయినయంతమేర దివి మోసిన ప్రాణమహానిలంబులం
దాయువుపోసిన ట్లపఘనాయిత సాధువియ న్నిరామయ
వ్యాయతి కల్గినట్టులు శశాంకసుషీమకరప్రసారరే
ఖాయతి బీజభూతకలితాసుచయంబులు కందళింపఁగా. 196

ఉ. తెచ్చినయట్టి శైలమును దెచ్చిన దానిని దెచ్చినట్టుగాఁ
దెచ్చినచోటనే మఱల దింపఁగ నయ్యెను బావమూనికిన్
వచ్చిన ప్రాణముల్ తెలియ వచ్చిన వార్తలు దీర్ఘదీర్ఘమై
ప్రచ్ఛినయూర్పులై కపిసమూహము మోహము పోయినంతటన్.

గీ. చేతితోఁ దీసివేసినరీతి సర్వ
బాధలును బోవ నాశ్చర్యపడుచుఁ గపులు
నొడలులందు స్వాధీనత యుడిగినట్టి
చోట్లు మఱిమఱి యాడించి చూచికొనిరి. 198

క. కార్చిందును మైవాల్చెద
రర్చిర్జ్వాలాస్వరూపమై దుమికెదరున్
చర్చలు సేసెద రూరక
యార్చెదరును మఱల బ్రదికినట్టి కపీంద్రుల్. 199

ఉ. పచ్చనిమేని నిద్దమగు ప్రన్నని కాంతులసామి యూరుపుం
బుచ్చఁడు నివ్వెఱంపడఁడు పొందినమేలుగ నూహసేయఁడున్
వచ్చిన వానరేశ్వరులవంక వినూతన నేమి లేనటుల్
మచ్చిక మాటలాడు కపిమండలి దీని ప్రసంగ మెత్తరున్. 200

వ. అంత సుగ్రీవుం డరుదెంచి శ్రీరామచంద్రునితో నిట్లనియె. 201

చ. ఎసకముగాఁగఁ బంక్తిగళుఁ డెప్పటికప్పుడు చచ్చినట్టి రా
క్షసులను ద్రోయుడం చనియె సాగరమందునఁ జచ్చినట్టి రా...

తేసులును జచ్చినట్లు యిరి సంగరమాడిన నేడుగాక నీపీం
ద్రసముదయంబు చాసను పురాభవపుణ్యదహాత్మరాఘవా! 202

క. పెద్దనిద్దుర పోయి కపివ్రజంబు
మఱల నిదురపోవఁగా మదిఁదలచదు
కపులు గంతులు వేసిన కరణిఁ గడచె
నెగసి పరిక్షేప్తములు యామినీఘటికలు. 203

సీ. ఇసుకతిన్నెలమీఁద బసుపారఁబోసి క
పిశ్రేణి కన్నులు పిచ్చలించి
వార్ధికరశ్ళపై బారాణి యలికించి
కపిరాజి కన్నులు కందళించి
రోదసీకాహ ... దోరణా లగటి
... ... బెండ్లి తనుకు తెచ్చి
వేలాగిరుల్ కుంకుమాలేపమునఁ దెచ్చి
వలిముఖాననములు కళ వహించి

విజయలక్ష్మివివాహంబు వెలయువేళఁ
జేయఁబడు నలంకారవిశేష మనఁగ
న య్యుషోవేళఁ బ్రాచీదిగంగనాము
నోజ్జ్వకాంతినేపథ్యమ్ము నూత్నమయ్యె. 204

ఉ. ముమ్మరమూచు గూండ్లు చెడిపోయిన నెక్కడనైన యట్టి వృ
తమ్మును నాయుధం బగుచు జ్యానిరతోగ్రనినాదమై నివా
సమ్ములు మాలి భీతి ఖగసంతతి సర్వము లేచిపోఁ బ్రభా
తమ్మునఁ బక్షిరావ మను దానిని దేనికిఁ జెప్పగావలెన్. 205

చ. విఱిగిన బాపుటాలగుచు వ్రీలినయట్టి రథంబులై కళల్
తఱిగినయట్టి డాళ్ళగుచుఁ దళ్కులు మాసినయట్టి భీకరా

సుకుల మొగంబులై విగతశోభముగాఁ జను లంకలోపలన్
దరణికరప్రసార మది ద్రవ్యచయంబు స్వరూపసిద్ధికై. 206

ఉ. లేచినతోఁ గపివ్రజకళేబరముల్ జలరాశిలోపలన్
ద్రోచినతో సమాప్తమని తోఁచిన యుద్ధము వెల్గులన్ దిశల్
రాచినతో సరోజహితుప్రాంశులు ప్రాంశులు ప్రాణయుక్తమై
లేచినతో సమస్తము వలీముఖసైన్య మదేమి యయ్యెనో? 207

సీ. తగ యుద్ధభూమివార్తలు చెప్ప నియమింపఁ
బడిన రాక్షసులు తత్ప్రభుని కొక్క
యాజ్ఞచే భయముతో నరుదెంచి వినతులై
యాడిరి గజగజలాడుకొంచు
క్షమియింపవలయు రాక్షసచక్రవర్తి! మా
కేమియుఁ దెలియ దహిండనులకు
నొక్క శ్మశానమం దున్నట్టు లున్నాము
కొఱవిదయ్యములు మాకుం గనఁబడె

నొండు రెండు సూరాన మే మొగిని దత్స
మీపమున కేగ నవ్వి యదృశ్యమయ్యె
నా నరులు కల్లుచోటికి నరుగవల ద
టంచు మా కాజ్ఞ, దాన మే మరుగలేదు. 208

గీ. మహిత మగు నొక్క దేవతామండపమ్ము
నాల్గు జోతులు వెలుఁగుచున్నయవి లోన
సూర్య లోక యిద్దఱైన చక్షువులవాఁడు
మోసికొని వచ్చి మఱికొంచుఁబోయె దాని. 209

క. చనినంతఁ గపిశవంబులు
కనుచుండఁగఁ గపిపిశాచకాండం బయ్యెం

జనినాము మాగృహంబులు
వనరి కపిపిశాచములకు భయభీతులమై. 210

గీ. నేటిప్రొద్దున నేఁగ మున్నీఁడ! సర్వ
కపులు యుద్ధమాడఁగ మృతిఁగన్నవారు
నైన బ్రదికిరి కోటఁగోరాడుచుండి
యేమి చెప్పుదు మర్చితాహీనభూప! 211

చ. పవలునయందుఁ దా రుభయపక్షములున్ శ్రమపొంది నాటికిం
బనరము సేయఁబో మనిన పద్ధతి నుండిరి దైత్యవీరు లం
దెవఁడును నేను బోయి వధియింతును రాముని నంచుఁ జెప్పలే
దెవనికి వానికే భయమహీధర మున్నది గుండెలోపలన్. 212

మ. ఇది యాశ్చర్యముగాఁగ నున్నది మృతుం డేరీతి జీవించునో?
యిది యేలాటిది ఖండితాంగము లహో యేరీతి సంధించునో?
యిదియుం జిత్రము కీకసాళి పొడియై యే రీతిగా వాతునో?
కదనంబేటికి దొంగవానరులతోఁ గాకుత్స్థుతో విష్ణుతో? 213

మ. అవియే యెండలు కోటలో ననలభావాత్యుగ్రముల్ బాధ నిం
పవు కీశాళికి గంధవాహకసుశీతంబుల్ సుధాంచద్విశా
లవనీరాశికబంధసిక్తసితవేలావాలుకాసంస్థముల్
లవతోబాధకముల్ మఱిం గుతపవేళాస్నానతశ్శీతముల్. 214

మ. మలఁగున్ వేసఁగివోని యెండలు మఱిన్ మండించుచుండన్ హసం
తులు మధ్యాహ్నపు రెండుజాములకుఁ బాథోరాశి పైనుండి గా
లులు రా నెండలమంట తగ్గకయ వాలుం బ్రొద్దుగా నైన వే
శల గాలుల్ సనసన్నగా మలఁగి మల్లాడుం దరుశ్రేణులన్. 215

శా. సూర్యుం డగ్ని మఱల్చి తా మగిడినన్ సూర్యాత్మజుం డంతటన్
ధుర్యుండై చను రాజబుద్ధి హనుమంతుం గాంచి పల్కెన్ వడిన్
శౌర్యాగ్నిచ్ఛట మాసియున్నయది రక్షఃపట్టణం బంతయున్
బుర్యర్ధ్యంబులు సౌధభాగములు కాల్పుంబెట్ట నౌ నెంతయున్. 216

మ. ఉపనిర్వార మొసంగలేని స్థితియం దున్నా డధోబుద్ధి య
స్రపలోకేశుఁడు కుంభకర్ణుఁడు తనూజాతుల్ మృతిం బొంది దు
ర్గపులుం గన్పడ రొక్కరున్ విగతరక్షం బొల్చు ద్వారంబు ల
స్రపవీరుం డొకఁడైన యుద్ధమునకున్ రాఁడీ దివావేళలో. 217

క. మన మాడుకొనఁగ రాలే
దని చేయఁగ వచ్చి నార మని యీకడకుం
జనుదెంచె, వారు కలనికిఁ
జనుదేరరు నుఱక యుంట చన్నే మనకున్. 218

చ. కొఱవులు కాగడాలు దరికొల్పిన నిప్పుక లైన కోలలుం
బరిసెలు పూనికొంచుఁ బరిపాలితవేగులు వానరుల్ మహా
సురపురి నిప్పుబెట్టవలెనూ! త్వదుపజ్ఞమ యగ్నినీతి, నీ
వరయఁగ వైనతేయుఁ డన నాదెస నీదెస నీవుగా హరీ! 219

మ. పవ లగ్నుల్ వివరించె మత్పిత నిశాభాగంబునం దేనునై
వివరింతుం గపిసేనచేఁ గొఱవులన్ వెల్గించి లంకాపురిం
బవరం బన్న మహోత్సవంబు చివరం బాలింతుఁ బూర్ణాహుతిన్
నివురుల్ కప్పిన నిప్పు రాఘవునకు న్నీరాజనం బిచ్చెదన్. 220

మధ్యాక్కఱ

అనిన నంజనిసుతు నాజ్ఞ నత్యుగ్రు లైన వానరులు
ఘనులు జాంఘికులును వార్ధి గగన లంఘనపటిష్ఠులును

తనర నుల్కాహస్తు లగుచు తార్చిరి దహనంబు లంక
వెనుముం దెసల లేచిపడిన పెటిలిన పెళ్ళలకోలె. 221

ఉ. వానరులం దవజ్ఞ నెజపన్ వలదం చను రావణాజ్ఞ పె
న్మూనిన చిత్తవృత్తులయి యుండిన రక్కసు లిండ్లయందునన్
వానరు లగ్ని పెట్టుటను వారణసేయఁగఁ బోవ రయ్యె, య
జ్ఞానులు నెంచఁబోవ రవుగాములు వీఁకిడిజాతి మోజకుల్. 222

సీ. వచ్చిమంటలలోన ప్రభవించుచున్న మ
హాధూమపటలి యంభోధరములు
తెలిమంట లల్లపాములు ప్రాఁకుచున్నట్లు
వదలిన క్రొత్తకాల్వల జలంబు
యెఱ్ఱని మంటలై యెసలారు చోటులు
వాసంతములు చూతపల్లవములు
నెగయు మంటలలోన నెగురు పదార్థముల్
చేలపై నాడు పక్షివ్రజంబు

నాకువచ్చని మంట లైనట్టిచోట్ల
నందముగ మోసులెత్తిన యాకుమళ్ళు
సరగ సర్వానుభవములు చానఁబోవ
ముందు దితిజరాజ్యేందిర పొందు ననఁగ. 223

పృథ్వి

అగురు మొదలుగ నైన సుగం
ధ గుపవిమలపదార్థచయం
బెగచు శిఖల నహీనమహా
గ్నిఁ గఁ బరిమళము నించె దిశల్. 224

ద్రుతవిలంబితము

నిగుడు గోపురనిర్భరసౌధముల్
పగిలి కూలిన బంధురరావముల్
విగళితాశలు ప్రేల్చినయట్టులై
నెగడె వహ్నులు నిల్చినయట్టులై. 225

ప్రహేయము

ప్రియుఁడు ప్రియయు నిద్రింపఁగ నగ్నిన్
శయనగృహము ప్రజ్వాలావిలీఢం
బయిన మదనుఁ డైనాఁడో కన్పిం
చు యమునివివృతాక్షుల్ గాఁగఁ జూపన్. 226

వంశస్థము

మహాగజేంద్రంబులు మాడ్చు మండఁగా
మహాగ్ని భీతిం దెసమాలి పర్వఁగా
మహాగ్నిచేతం బడె మత్తదంతివ
త్ప్రహారమై సైతము ప్రాణముల్ చనన్. 227

ఏకరూప

స్తోకంబై తోఁకలును జూలు నివ్వల్
దాశోన్నన్ హేషలుగ వాడు లోవ్వన్
జీకాకై మంటలకె చేసు గుఱ్ఱా
లేకోనల్ లే వనల మేదు చోటుల్. 228

చంచరీకావళి

జ్వాలాలీఢం బ్రోచుం బ్రాణశాలల్ సెలంగన్
హేలం బానీయంబై యేపు మీఱెన్ మహాగ్నుల్

క్రాలున్ గత్తుల్ సెప్పల్ గౌణమహా వృత్తి మున్నై
యేలెన్ వాచ్యత్వంబే యిప్పు డీ కల్లుభానన్. 229

సు కే స ర ము

ననలు చ్ఛిపుల్లు వహ్నిపరిణామమూర్తులై
యనలము లంటుకొన్నఁ దమనైన యాకృతుల్
కొనకొని మాఱఁగాని మఱి కోలుపోవు నై
జ నిభృతమైన వన్నియల జాలి తోటలన్. 230

ఇ ల

వసనంబు లూడఁగఁ బడతిగమి పఱవన్
పసమీఱు తత్కుచభరము రుచి కనుచే
యసురుల్ మహాగ్నికి నఱ తగులఁబడియున్
గొసరైన చూపులఁ గుసులుకొని కనఁగన్. 231

మే ది ని

తగిలిన చోటనే తగులుఁ దా మరుత్సుతుండున్
దగ మును మంటఁ బెట్టినవె దహ్యమానముల్ గాఁ
దగె ననఁ దగ్ధ్రహేశ్వరులు తాల్చు నీర్ష్యచేతం
దగులఁబడంగ గుండియలఁ దప్తి మూఁడు రెట్లై. 232

వరాహము

రక్షస్సుల్ మదుల నరుచిరముగఁ దలచు
రమణ గలదు గృహాసంజాతం
బక్షీణంబుగఁ బశుతతి యసువు లురల
నజవిసరమును వరాహంబుల్

భక్షింపన్ మఱుసటిదగు పవలునఁ బగ
ననలుఁడు కరుణాధూతిన్
దీక్షన్ వారిని సయితము తెరల నుసురు
తిగిచె ననువులు ప్రచండుండై. 233

## అలసగతి

తమగృహములున్ మఱియు దగ్ధ మగుచుండన్
గుమతులయి రక్కసులు గొండఱు దురాశా
భ్రమలు తగులంబడు పరావసథచౌర్య
క్రమను నెఱపన్ దహనకాండము దహింపన్. 234

## దోదకము

తల్లులు పాలను ద్రావెడు గుడ్డుల్
పిల్లలతోఁ బెనువీధులఁ బర్వన్
గొల్లలుగాఁ బశుకోటులు నంభా
వేల్లితసంరవవిక్లబ మాచున్. 235

## మధ్యాక్కఱ

నిప్పంటుకొని వంశఘటలు నిడివిగా నిట్టగాఁ జీలి
కప్పులు లేచిపో నిండ్లు కాలిపోఁగాఁ గూలిపోయి
తుప్పలై మింటికి నెగిరి దూరాన దూఁకి యాయిండ్లు
నిప్పంటుకొని యార్పరాక నిప్పలే నిప్పలై పోయి. 236

ఊరెల్ల మంటలై యురిసి యుప్పరం బూటి జ్వాలలను
వారిధిలో దవ్వుగాఁగ బ్రతిబింబపరిణామ మొలసి
వారాశియును మిన్ను లెట్టవడి మహాప్రళయకాలంబు
చేరు వైనట్లుగా భీతి చెందించెఁ జెందించె వగవు. 237

పిడలికి వహ్నికీలలయు నొడలికి నుపకంబు వలయుఁ
గడుఁ బ్రమాణము గల్గునట్లు కానరాఁగాని యీరీతి
విడివడి యున్నచోఁ బడసి విలయంబు వినయంబు బెడిసి
చెడిపోయి భూతముల్ భయము చెందించి చెందించి భయము 238

తంతన్యమానమ్ము నగుచుఁ దా సభేదప్రతీపత్తి
యింతగా గుణిగుణములకు నెసలారు బెందైనఁగలదె
యెంతగా వహ్ని తారాణ్యమ్ము నెస శిఖానిసరమ్ము నరుణ
కాంతులు భిన్నముల్ కాక కనఁగ నొక్కటిగాఁగఁ జేగ. 239

ఫల సదనము

అనల మిత్రుల పుణ్యము నలమి యలుముంగా
దనుజసమితి చెడి సదనము లణఁగంగా
దనుజపతికి నెడఁద తలరి చెద్ధరంగా
మనసు సేవకే యగుచు మతిలె గర్వంబై. 240

చ. ఒకరవ నేమొ చాలునటు లుప్పరమంతయు నిండిపోయె వ
హ్నికలగు రాన మల్ల కరిబృంహితముల్ హయహేషలున్ బహు
ప్రకరము గొంతు చీల్చికొను రాపము రాక్షసు లేడ్పులున్ మఱి
ట్లు కడలిఘోషలున్ ఘళయంలయియత్తు విదీర్ణమైనటుల్. 241

ఉ. చచ్చెడునప్పు కూడ నొక శాంతియుఁ దీపియు సౌఖ్య మొప్పఁగా
జచ్చుట కేమొ యిష్టపడు సర్వజగత్తును దానిచే బలెన్
వచ్చని మేని నిద్దమగు ప్రన్ననికాంతుల స్వామి యాదరం
బెచ్చఁగ నల్లెత్రాట వివియించెను నిస్వన ముగ్రశాంతమున్. 242

ఉ. ఒక్కనితో విరోధమయి యుండిన, నుండిన యావిరోధనే
మిక్కిలి కాలమై చన నమిత్రునియం దొక యాదరంబునా

త్రుక్కిచనన్ విరోధము విరోధమె యొక్క విఃఘాత్వమై
నెక్కొను నాదరంబడియు నిండి విరోధముతోడఁ జిత్రమై. 243

ఆ. తాదృగాదరంబు దానవవైరికి
దానవాళియందుఁ దనరుచుండు
మఱియు నాదరంబు మసలినచోటుల
స్వామి తాన పూని చంపుచుండు. 244

మ. మరి లంకాపురి చేరినప్పటికి రామస్వామి యుద్ధానవే
మొరయించెం దననారి మోహకగుణాపూర్ణ స్వనాభోగని
ర్భరమున్ నేటికి నర్ధరాత్రమున ధారాకచ్ఛపీనాదసుం
దరమున్ నారిని మ్రోసె దైత్యజనహృత్సమ్మోదభిదాయిగా. 245

క. కడఁగి సర్వరసంబులఁ గలిసిపోక
పరిమళిమ్ము నోట వెలుగునాఁ బైకిఁ దేల్చెఁ
దనరెడు ప్రవాహమునఁ బూలదండ వోలెఁ
దనుఁ సంఘకారమున రాదామనిన లె 246

క. మంటల వెలుఁగుల యందున
మింటం గనిపించె దైత్యమేదినిపతి యి
ల్లంటుకొని యున్న గోపుర
మంటపములు దైత్యరాజ్యమహిమాంకములై. 247

మ. తనకోదండజగద్విదారణసమర్థప్రాజ్యమౌర్వీప్రవ
ర్తనముం జేసి దశాస్యుగుండియ నధైర్యంబుఁ బ్రకంపింప నెం
చిన శ్రీరాముఁడు నారసం బొకఁడు మోసెన్ గోపురం బద్ది కూ
లిన దామెత్తుననుండి రాఘవధనుర్లీలామహాంకంబుగన్. 243

గీ. మొగి నహంకారమునకు ముద్దుబిడ్డ
కోప మనునది యది శతకోటిముఖము
దుఃఖ మసమర్థతయు నీర్ష్య తూల్చు నోట
మియుఁ బరాభూతి యన్నింటి మిగులు గుణము. 249

ఉ త్సా హ ము

రామచంద్రుమీఁద వచ్చు రావణునకుఁ గోప ము
ద్దామభీమ మైన గుణము దైత్యరాజ్యనాథతా
భూమభావ మదియు జన్మభూమి యైన గుణము సం
గ్రామశక్తి మిగిలినట్టి కారణంబు కలదియున్. 250

వ. గోపురనిపాతసంజాతకోపభావ మసురలోకేశునకు నవశ్యంబు కలుగు
నని సుగ్రీవుండు కపిచమూపతుల దుర్గముఖ్యద్వారముల యుద్ధము
నకు సమాయత్తపఱచి యిట్లనియె. 251

సీ. దివిషజ్జగన్మహోధినిదానమై వ్రాదం
తన్సీమ నాటిన నారసంబు
జలరాశిగతప్రతిచ్ఛాయామిషన్ భోగి
జగతి నెత్తిన జిగీషాపతాక
మధ్యమలోకసమ్రాడ్వ్రాతమునకుఁ గం
తాంతరంబునఁ బట్టినట్టి డెక్క
దైత్యరాజ్యేందిరా తారుణ్యవరసీమ
గజనింబఫలమైన ఘనకుచంబు

అరయఁ దనయిల్లె పెద్దదేవాలయముగఁ
గోరి నిర్మించికొన్నట్టి గోపురంబు
నలుదెసల నిట్లుగాఁ గూలినన్ సురారి
నడుమనే పెద్ద పెద్ద మంటలుగ లేచు. 252

ఉ. శ్రీరఘురామచంద్రుఁ డిరచించిన యమ్మెటులేగ భూమిలో
దూరెనొ? దూరి గోపుర మధోధరణీస్థితిలోఁ బునాది వి
స్తారఁగఁ జేసెనో విడిలు నట్లుగ గోపుర మిట్లు నద్దెసల్
బీటుకొనంగ సృష్టి విరచించిన బ్రహ్మ యెఱుంగఁగా వలెన్. 253

చ. నలువుగ సప్తతాళదళనంబును వాలివధంబు శైవచా
పదళనముల్ రఘూత్తముని బంధురకార్ముకసత్కళాద్భుతం
బులుగ వచింత్రు గోపురము ప్రోవుగఁ గూల్చుట వాని నెత్తిపై
మొలిచెను యుద్ధమందుఁ బడిపోవుచు నున్నది లెక్క కెక్కకన్.

వ. అనుచుండ రావణుండు పడని గోపుర మెత్తు మండుచుఁ గుంభ
కర్ణుని పుత్త్రులను గుంభనికుంభులను బిలిపించి యిట్లనియె. వారిలోఁ
గుంభుడు చాపాయుధుఁడు, నికుంభుఁడు పరిఘాయుధుఁడు. తండ్రి
ముక్కులోనుండి యూడిపడినవాఁడు. 255

శా. మాయాసంగర మంచు వేఱుగఁ దలంపం జాతఁ డవ్వీరులున్
మాయాదూరులు చేతిలావు కలిమిన్ బన్నంబు పొందింపనౌఁ
గా యుద్ధంబున, జేనికోస మని కాకన్ వేనికిన్ వెట్టయా
స్వీయం బాతఁడు సేయఁగా వలయు నువ్వే యుద్ధముం దీవ్రమున్.

శా. నాకుం దమ్ముఁడు మీకుఁ దండ్రియును నానాదేవతాశౌర్యరే
ఖాకుద్దాలము వానిఁ జంపెనుగదా కాకుత్స్థుఁ డవ్వానిపై
నా కుండన్ వలె, మీకు నుండవలెఁ గంఠవ్యగ్రకోపంబు వే
త్తే కాండీకుల కేలయుండు? మఱి వారేలా చనన్ వారిపై. 257

శా. మీ రేతాదృశమైన కోపమును గంభీరోహ్ములై దాచికొం
చౌరా ముజ్జగముల్ హరింపనగు శౌర్యారంభులై యుండియున్
దా రాజై పెదతండ్రియా జనుని చేతఃప్రీతికై యాజ్ఞలే
కా రాముని వధియింప నేగరు కదయ్యా! శౌర్యధర్మాబ్ధులై. 258

క. పరిఘను దంష్ట్రికి నెక్కిన
యిరమ్మదముఁ బోలెఁ దీర్తు వీవు నికుంభా!
సరి పిత పుత్త్రా దిచ్ఛే
త్పరాజయ మ్మనుచు ననెడువాఁడు కదయ్యా! 259

క. మఱియును గాపట్యకవిద్యన్
గుఱువను నే నగుదుఁ గాదె కుంభునకున్ మీ
రిరువురు మాయిద్దఱకిన్
సరియైనను పోయిరండు జయముం గొంచున్. 260

వ. అంత వారిర్వురును మసృణఘనసచ్ఛాయామహితమరకతశిలాఘటి
తాంగుళీయకులు నుదయత్తరణికిరణభరణమాణిక్యకుండలులు,
జానుఘటిత వస్త్రపరిస్ఫురన్నూపురఘటిత శత్రురూపశిరస్కారిపర
భూషణులును చిత్రవిచిత్రతంతన్యమానకాంతిసంతాననిరూపితగగన
కోణరమణీయనవరత్నహారులును ఖడ్గత్సరుభూతవైదూర్యసుషమా
సమాలింగితపార్శ్వదేశులును నై రథంబు లెక్కి యుత్తమఖరం
బుల ఖురవిదారణంబుల శిలాఘటితరథ్యల మిణుంగురులు రేగఁ
దోవచ్చు భీకరరక్షస్సైన్యఖడ్గప్రాసపరిఘాద్యాయుధసంఘర్షణం
బున జనించు రావంబు భయదయుద్ధసూచిగా నొప్పార శాంతించిన
యుద్ధదేవత మఱల లంకాపురంబునఁ దాండవించుచున్నట్లు
సైన్యాధ్వప్రదీపకోల్కాసహస్రంబులుగా బయల్దేరిన. 261

సీ. తండ్రు లార్జించి యుంచిన ధనము రాజ్య
మైన తనయుల దగు భూషణాభిలాష
యును నహంకారమును దర్ప మొక్క తెరువు
చనవు నానావికారముల్ సంక్రమించు. 262

వ. వారితో యూపాక్షుండును శోణితాక్షుండును ప్రజంఘుడును
గంపనుఁడు యుద్ధంబునకుఁ జనిరి. 263

మ. పరిఘప్రాసగదాసులం గపులఁ జంపన్ రాక్షసుల్ క్రూరవా
నరులున్ దంతములన్ నఖప్రతతిచే నక్తంచరాళిం గరా
గరి ముక్కుల్ చెవులుం గళంబులును ఱక్కన్ ముక్కలుం జేయ సం
గర మాభీలము రక్తబంధురముగాఁ గన్ మాఱె నయ్యో యెడల్. 264

చ. రథులయి దానవుల్ శరపరంపర వానరవీరరాజి ని
ర్మథనము సేయఁగాఁ గపులు దైత్యుల పైనను బర్వతంబులున్
బృథులకుజంబులం బఱపి ప్రీలఁగఁ జేయఁగ దేహరాజి సూ
ర్జఘురవమేదురంబు బవరంబును వర్ష ఋషి ప్రచండమై. 265

క. వెనుదిరిగి పాఱు కపితోఁ
కను దైత్యుఁడు త్రొక్కిపట్టఁ గళవళపడఁగా
జనుచున్న దైత్యుజుట్టుం
గొని యూఁపును జెట్టుమీఁది కోఁతియుఁ బెలుచన్. 266

క. ముక్కులు చెవులుం బోయిన
రక్కసులును దోఁకలెల్ల రాలిన కపులుం
దిక్కులఁ జన యుద్ధేందిర
మొక్కలువోయిన ఖరాసివోలిక నొప్పెన్. 267

ఉ. కంపనుఁ డంతటం దనువు కంపర మెత్తినయట్లు సేన జ
ల్లింపుగ ఖడ్గముం గొని వలీముఖసంతతి రాల్చుచుండ సై
రింపక యంగదుండు విపరీతము కోపము నూని వానిచె
ల్లింపులు సాఁగనీక యదలించిన నాతఁడు కోపమూనుచున్. 268

ఉ. అంగము వక్షమందునఁ గరాసిని వ్రేయఁగ నంగదుండు క
ష్టం గనుదోయి లిప్తగను బమ్మెరవోయి తెముల్చికొంచు వా
నిం గమకించి పట్టికొని నీల్గినఁ గత్తిని లాగివేసి వా
నిం గదియించి గ్రుద్ది యమునిం గనిపించె నిమేషమందునన్. 269

చ. తన పినతండ్రి నివ్వగిది దైవతనాథునిపౌత్రుఁడున్ హరిం
చినఁ గని శోణితాక్షుఁడును శీఘ్రముగాఁగను వాలిసూను నే
నను నిశితాశుగంబులను నాటిన నంగదుఁ డంగ లొప్ప దై
త్యుని శకటంబుపై నరిగి దూసెడు నమ్ముల లెక్కసేయకన్. 270

గీ. కడుకొని రథాశ్వయుగ్మంబు మెడలు విఱిచి
యావులింపంగ సారథి నణఁగఁద్రొక్కి
పట్టికొని లాగి వానిచాపంబు విఱిచి
వాని యురమును దాడించులోన వాఁడు. 271

క మింటికి నెగురంగా వెను
వెంటం దానెగిరి వాఁడు విసరిన కత్తిన్
గెంటుకొని లాగి జందెపు
గంటుం బొనరించె వానికాయమునందున్ 272

మధ్యాక్కఱ

ఈ పగిదిన్ శోణితాక్షుఁ డెంతయు నిఱుకటం బడఁగ
యూపాక్షుఁడుం బ్రజంఘుఁడు మహోగ్రులై యుఱికి సాయమ్ము
దీపింప శోణితాక్షునకు ద్వివిదుండు వేగ మైందుండు
కోపించి సాయ మంగదునకున్ సమకూడిరి వచ్చి 273

క. అమ్మువ్వురు నిమ్మువ్వురఁ
గ్రమ్మిన శౌర్యలసదిందిరాయుగ్మము వే
గమ్మున జడలు పెనంగొన
చెమ్మాచెక్కాడినగతిఁ జెలు వొప్పారెన్. 274

వ. ద్వివిదమైందాదులు రువ్విన శిలావృక్షంబులు ప్రజంఘుండు ఖడ్గంబుతో యూపాక్షుండు శరములతో శోణితాక్షుండు గదతోఁ దిరిగి తిరిగి వృథాచేయగా నంతఁ బ్రజంఘుండు తీవ్రఖడ్గంబున నంగ

దునిపై కుఱికిన నంగమఁ డశ్వకర్ణద్రుమంబున వారించి వాని ఖడ్గంబును లాగికొని దానితో వానిశిరంబు ద్రుంచె. పితృవ్యుఁడీ కీర్తి ఘోరాజిస్మృతి నంద యూపాక్షుండు కోపాక్షుండై యమ్ముల పొది శరమ్ములు వమ్ముగాఁ గత్తిపూని నేలకుఱికి నంత ద్వివిదుండు వానియెడందఁ బిడికిలి నడచి బాహువంజరంబున బిగింప శోణితాక్షుండు గదాగ్రంబున ద్వివిదుఱొమ్ము గాడనేయ ద్వివిదుండు సొమ్మసిలి తెప్పిఱి వానిగద వానిచేతినుండి గుంజుకొనియె, నంత మైందుండు యూపాక్షు వక్షస్స్థలంబు ముష్టిఘాతంబున వ్రక్కలించిన శోణితాక్షయూపాక్షులకును మైందద్వివిదులకు నాకర్షణ ప్రకర్షణ ఘోరంబుగా బాహుయుద్ధంబు ప్రవర్తిల్లె, ద్వివిదుఁడు శోణితాక్షుని మొగమంతయు రక్కి వాని నంధుని జేసి నేలమీఁదం గూల్చి వానిని బ్రాణంబులనుండి పాపె. మఱియు మైందుండు యూపాక్షుని యూపపశువుంబోలె సంహరించిన రాక్షససేన భయపలాయమానంబై కుంభునిఁబోయి యాశ్రయించిన. 275

శా. కుంభుం డంతటఁ గార్ముకోగ్రశరదక్షుండై విజృంభించినన్
శుంభద్బాణజవాయువీచిఁ గపిరాట్పూర్వ్యాచరుల్ పరాఘాతులై
శుంభద్బాణజవహ్నితప్తిఁ గపిరాట్పూర్వ్యాచరుల్ పరాభూతులై
గంభీరాహవ మొప్పె వానరచమూకాండమ్ము గగ్గోలుగా. 276

ఉ. పేఁ డొక రావణాసుతుఁడు విస్తృతకీశచమూజయేందిరన్
బోఁడిమి దొంగిలించికొని పోయెడు వానరసేన నిస్పృహన్
వాఁడిమగంటిమిం జెడియె వచ్చినదానికి రాముసాయమున్
వేడిగ నయ్యెడున్ మఱల వెంటనె ప్రత్యుపకారవాంఛులై. 277

గీ. కుంభకర్ణుని తనయునకున్ ధనుస్సు
నకును సంబంధ మేమి యనంగ నద్ది

కపుల ప్రాణంబులకు శరకాండమునకుఁ
గలుగు సంబంధ మన్నట్లు గానిపించె. 278

ఉ. సంజను నిన్న రావణియు సర్వవలీముఖసేనఁ జంపఁగా
నంజనిపుత్త్రకుఁడు కరుణాంబుధియై బ్రదికించెఁ దెల్లవా
రం జనువేళ నేఁ డితఁడు రాక్షసుఁడై మఱలన్ వధించెఁ దా
నంజిక యొక్కరోజు కొసరైనది యీబ్రదు కెంత చిత్రమౌ 279

మ. ద్వివిదున్ మూర్ఛను బుచ్చె మైందుని ధరిత్రిన్ వ్రాల్చెఁగా నంగదుం
డవురా చూచుచు మాతులద్వయముపా టాభీలుఁడై కుంభునిం
గవియన్ గుంభుఁడు వానిఁగూడ బటువౌ కాండంబులం గూల్చె దా
నవు లుచ్చైర్నినదంబులం గెలుపుకంఠంబుల్ సువాళింపఁగన్. 280

ఉ. అంగదుఁ డట్టులాట కపు లందఱి కచ్చెరువైన వార్త వా
రంగద నేగి రామునకు నంగదువార్తను జెప్ప రాముఁడుం
జెంగటి జాంబవంతుని సుషేణునిఁ గుంభుని దాఁకఁ బొమ్మనెన్
సంగరమందు నేగిరి వెసం గరమందుఁ గపీంద్రు లుగ్రులై. 281

ఉ. వచ్చిన వానరేంద్రులను వారణచేసెను గుంభుఁ డంతటన్
విచ్చిన నారసంబులను జెట్టిన గోడఁగఁ జేసి వారు తా
మెచ్చటనుండి రచ్చటనె యించుకయుం గదలంగనీక వా
రచ్చటులోగ్రవిక్రమము నారసి రిచ్చవడంగ గుండెలన్. 282

మ. అది సుగ్రీవుఁడు చూచి వీనికరమం దత్యుగ్రమౌ చాప ము
న్నది యీ కార్ముక మున్నదాఁక నితఁ డైనం గాడు సాధ్యుండటం
చెద నూహించి తదీయమౌ శరచయం బింతైన లెక్కింప కు
న్మదవృత్తిం జని వానిదా రథముపైన న్నిల్చి తీవ్రాకృతిన్. 283

వ. వానిధనుస్సు వానిచేతినుండి లాగికొని ఫెళున విఱిచి యిటనియె.

ఉ. రావణుఁ డీవవో శరపరంపర యీగతి విడ్చు చాడ్పునన్
నీవుగఁ గుంభకర్ణుఁడవు నిర్భరమైన భుజాబలంబునం
గావలమైన యీ కపులకాండము నీ విలుముంద రాగునే?
యీ వొకరుండె యీ త్రిజగ మెత్తిన నొత్తెద వొక్కమూలకున్.

మ. అనినం గుంభుఁడు తీవ్రకోపమున బాహాశౌర్య మేపారఁ బె
ల్చన సుగ్రీవునిగుండెపైఁ జఱచినన్ సౌర్యుండు కోపంబు మం
కెనగాఁ గంటితుడం ఘటించి ధర లంఘించెన్ మఱిన్ వానితో
డన తా మొక్కరి నొక్కరున్ వదలకుండన్ జెట్టులోఁ జెట్టుగా. 286

వ. అంత సుగ్రీవుండు వానిని విదలించి దూరంబు ద్రోసి మఱలఁ బట్టుకొని చేతులలో నెత్తి విసరి సముద్రంబునందుఁ బడునట్లు వేయగా నతఁడు మఱల నెగిరివచ్చిన సూర్యసుతుండు వానిం బడఁద్రోచి వక్షస్థలం బెక్కి కంఠంబు నులిమి నిష్ప్రాణుం జేసిన నికుంభుం డిదియంతయు దూరమునుండి యుగ్రుఁడై తనమహాపరిఘను గగనసీమ ద్రోగించుచు నాడించుచు సింహానాదంబు సేయుచు వచ్చుచుండిన. 287

మధ్యాక్కఱ

మువ్వేలు గంటలు గగనముం జీల్చి మ్రోసెడు పరిఘ
దవ్వునుండి కూడ యమదండంబు దండించు పరిఘ
నవ్వి యింద్రుని శతారంబు నాట్యంబునం జేర్చు పరిఘ
క్రువ్విన బొడుపులఁ బ్రాణకూటముల్ కుదిలించు పరిఘ. 288

పగగ నాకసమును మ్రింగు పరిణాహపటువైన పరిఘ
సరగ రక్షోయశ స్సాలయు సందులు సంధించు పరిఘ
అరిరాజవక్షఃస్థ్సలయము నగలించి యార్చెడు పరిఘ
యిరవుగాఁ గొని తురాసాట్టు నెడద పేడెత్తించు పరిఘ. 289

మొగిని గన్నంతలోఁ బ్రాణములు నాగిపోయెడు పరిఘ
దిగిభదంతముల మొదళ్ళు తెమలించి తీర్చినపరిఘ
యగలించి శనతంత్రి పరిఘ యదిలెక్కయా యను పరిఘ
దిగుడితకీర్తిప్రభాళి తెలుపులు దిద్దిన పరిఘ 290

మ. కృతకార్యుంగ గపిరాజు నాయువది సుగ్రీవుండు చచ్చెం గపీ
ట్పతి నిర్మూలనమందె నంచుఁ గపిరాడ్వ్రాతంబు ఘోషింపఁగా
నతమై వాయుపథంబు తత్పరిఘ ఘంటానాదసంతానసం
ప్లుతమై యేడ్చినయట్టి రావములఁ గల్లోలంబుగా నైనచో 291

గీ. జయజయనినాదమేదురాశాభరంబు
దితిజసంతానఘోషముల్ దిశ లగల్ప
నొక్కడుగు రెండు నడుగుల మొక్కలీఁడు
పోయి సుగ్రీవునిం దాఁకఁ బోవుచుండ. 292

ఉ. ఎచ్చటెనుండి కేశవరమేశ్వరమూర్తి నభస్వదాత్మజుం
డచ్చట దూఁకెనో, పరిఘ కాతనివక్షము లక్ష్యమయ్యెఁ దా
విచ్చెను ముక్కముక్కలయి ప్రీలెను, మారుతియున్ నికుంభునిన్
ముచ్చిలిగుంట నొక్కికొని పోవఁగ తర్జను లుగ్రవైఖరిన్
ద్రచ్చిన నాముగుంట నరుదారగ బొట్టనవ్రేళ్ళు నొక్కగా. 293

గీ. మెడ పిసికి ప్రాణములు తూలఁ బుడమిఁ గూల్చి
గుండెపైఁ గాలుమోపి మిక్కుటముగాఁగ
శిరసు కుడిచేత మొలికలు తిరుగఁ ద్రిప్పి
పాటితంబైన శిరమును బాఱవిసరి

మదరేఖ

సింహాధ్వానము చేసెన్
రంహాస్ఫూర్తిగ మింటన్

దంహోయానము దైతే
యాంహో వ్రాతము బాసెన్. 295

వ. అంత రావణుండు తన యిరువది చేతులకుఁ బదితలలకుఁ జారి
తార్థ్యంబు కలిగినట్లు తలలుపూని యున్నరని దుఃఖించి యయ్యో!
తమ్ముఁడా కుంభకర్ణ! నిన్నుఁ జంపికొన్నది చాలక నీ బిడ్డలఁ
గూడఁ జంపికొంటి నని యేడ్చి యేడ్చి. 296

గీ. పరమయోగీశ్వరుండును బరమభక్తుఁ
డైన యాంజనేయునకుఁ గ్రౌర్యం బిదేల
యెచట వానరవాహిని కిరకటమగు
నచటఁ బ్రత్యక్షమగు సీతఁ దయ్యో యనుచు 297

చ. వెడలినవారు రాముపయి వెంటనె పోవక దారిమధ్య నీ
బుడిబుడి కోఁతులం దెమదుపోవుదు రేటికో నాకు రాము నో
త్రిడియయి త్రాఁడో, పేఁడో యది తేల్చరు మూర్ఖులు గోరులంచు జీ
వుఁడు పడు సంశయంబు విడిపోవదు సర్వనిదానదూరమై. 298

సీ. అతని భార్యను నేనుగా నపహరించి
వాసి లోఁకువతనమును జేసికొంటి
నతఁడు నాకంటె నధికుఁ డైనట్టు లాడె
నతని యధికత నా చేసినట్టి తప్పు. 299

మ. తనకంటెన్ రఘురామచంద్రు నధికత్వం బేమి విల్విద్యలో
ఘనబాహాబల మంచుఁ జెప్పనెడ నా కైలాసముం బూనుకం
టెను జ్యేష్ఠం డగునేమి? గోపురముపాంటెన్ జ్యేష్ఠుఁ డన్పించెడిన్
ఖనువం దుండిన నేప్పు కావలె భుజాదర్పంబు మా కేటికిన్. 300

క. నావలె నతనికి లోఁకువ
భావము గనకుండఁ గోపభావము కలిమిన్

వే విలునేర్పున మిక్కిలి
నావలె నైనట్టిఁడై చనన్ వలె మఱియున్. 301

ఉ. అంతకకల్పుఁడైన మకరాక్షుఁడు కార్ముకవిద్యయందు నా
యంతటివాఁడు శిష్యుఁడగు నాతని కన్నియు నేర్పినాఁడ, వాఁ
డెంతయు రామునందున వహించును గోపముఁ దండ్రిఁ జంపె నం
చింతట వాఁడు తండ్రిపగ, యెత్తిన నాపగ, రెండు తీర్చెడున్. 302

గీ. ఖరునిఁ జంపి యెన్నాళ్ళయ్యె ఖరుఁడు వీఁడు
నతని పగ యింతకును దీర్పనైతి నేను
తండ్రి పగయును మఱి పెదతండ్రిపగయు
రెండు తీర్చున యీబిడ్డ ఢండిమగఁడు. 303

ఉ. తన్నును బిల్చి యిట్లు పెదతండ్రియుఁ దండ్రిపగన్ హరింపు మం
చు న్నొఱిఁ జెప్పగా నెదురు చూచెడు నమ్మకరాక్షుఁ డర్ణవం
బెన్నడు దాఁటి లంకపయి నెత్తెనొ రాముఁడు నాటినుండియుం
గన్నులయందు నిద్ర చెడి కార్ముకముం గనుచుండు నెంతయున్.

శా. నొవ్వంజేసెను ముజ్జగంబు దశకంఠుం డేడులోకంబులన్
నొవ్వం జేయఁగఁ జాలుఁ దానొకఁడు తానున్ లంకలో నుండె వా
డెవ్వాఁడో తన తండ్రియైన ఖరునిన్ హింసింప రాముండు వాఁ
డెవ్వాఁడో మఱి తేల్చిపెట్టు నొక యస్మ్మె యీ పగంటన్ మఱిక్ష

క. తన విలువిద్దియ యేమో
తనకే యచ్చెరువు గొలుపు దశరథసుతుచే
సిన జగము మెచ్చుపనులకు
మనమున నవ్వికొనుఁ బ్రజకు మతిపోయినదో. 306

చనుచుండఁ బెక్కు దుశ్శకునంబు లయ్యెఁ
దనకుఁ దండ్రికిఁ బోలెఁ దానెఱుంగండు
తనతండ్రి కేరీతిఁ దగిలెనో యవ్వి
తనకు నదేరీతిఁ దగులఁ బోయెడును. 307

జ ల ద ము

భీకరగర్దభారుణము పెద్దమొగిల్
ప్రాకటశోణితోదకము వర్షము ద
ర్వీకరపుచ్ఛధారముగ వ్రాద్ధ్యయబా
ధాకరఘోరమై కురిసె నచ్చెరువై. 308

వి మా న ము

అనేఘు మాకాశమందున్
గమించి విద్యుత్తు పొందున్
సనేత ముల్కాప్రపాతం
బనేయమై పొల్చె నెల్లన్. 309

వ. అంత తెక్కతోఁ గొట్టిన గ్రద్ద బాహుదండంబునం బెడద్రోచి
సీదరించి మకరాక్షుం డిట్లనియె. 310

క. ఎవఁడో యల్పిష్ణునకు న
శివమో శివమో మహేను శీఘ్రఘసముద్య
న్నవశితశర నవసితశర
దవిరత హరిణాంక నవనవాంశుకమూర్తిన్. 311

వ. అంత మకరాక్షుండు శ్రీరామచంద్రుని కెదురునడచి యిట్లనియె.

27

క. నేనెవ్వరనో యెఱుఁగుదె
నేను ఖరాసురునిసుతుఁడ, నే నప్పుడు జన
స్థానమున లేకయుంటిని
నే నుండిన నిచట నేఁడు నీ వుండవునున్. 313

ఉ. ఆయన యూహలున్ మఱియు నాయన వే, నను దండకంబు రా
నీయఁగ లే దెదో పదకమెత్తెను దొంగిలికొంచు వచ్చె నీఁ
తోయజపత్రలోచనను దోయధి దాఁటితి వచ్చినావు నీ
కీ యెడ బ్రహ్మవ్రాసెఁ గద మృత్యువు నాదగు చేతిలోపలన్. 314

శా. మత్తెక్కించెను నీ కహో ప్రజలహా మాటల్ మహాధన్వి వీఁ
డత్తెన్ శైవధనుస్సు నంకరలుగా నేడైన తాళ్ళేసె నా
యెత్తౌ వాలినిఁ గోలనేసె నని యింకేమున్న దేనే ధను
ర్భృత్తన్నొంచును నీమొగల్ తెలియలేదే నీకుఁ గాకుత్స్థుఁడా!

ఆ. వానికొడుకు లంకలోన ధనుర్విద్య
వింటికొప్ప తాఁకు విద్య నేర్చె
మఱియు వాఁడు వచ్చె మనపైని నేమా న
టంచుఁ దెలియలేని యధమమతివి. 316

ఉ. నించినశౌర్యమె నిలుము నీ దగు రక్తముచేత నట్ట క
ట్టించెద లంక నేలఁ బ్రకటీకృతచాపకళల్ సురాసు ల
గ్గించగ నంపచేటఁ జెఱిగించెద నీదు పరాక్రమంబు, జ
ల్లించెద నీదుశౌర్యము శిలీముఖనిర్మితమైన జల్లెడన్. 317

వ. అంత నవ్వుచు శ్రీరామచంద్రుం డిట్లనియె. 318

చ. ఖరుఁ డన నాకుఁ గల్గె మమకార మొకానొకఁ డంతరంబునన్
ఖరునిసుతుండ వీ వనుచుఁ గార్ముకముం గొని నేన వచ్చితిన్

పెఱలగు దానవాళిని గపిప్రభులం దెవఁడో వధించు, ని
న్నరయఁగ నిల్లె వంపుఁడని యాజ్ఞ యొసంగితి వానరాళికిన్. 319

చ. తొలుతను గుఱ్ఱముల్ మఱియుఁ దోడనె సారథితోడ బండియున్
విలు విఱుతున్ ద్వదీయకులపీకులు శూలము గొంచు వత్తు రా
నల నలశూలమున్ విఱుతు వారలు వత్తురు మల్లయుద్ధకో
శలులయి యగ్నిబాణమునఁ జంపుదు నిన్నును నల్లె చంపుదున్.

వ. అంత మకరాక్షమరణశ్రవణసంజాతదుఃఖదుఃఖితుం డైన రావణుండు. 321

గీ. చదువుచెప్పి కొడుకు శౌర్యవారాశిని
జేసిపెట్టు మనుచుఁ జిన్నయన్న
కొడుకు ఖరుఁడు పంచెఁ గూలద్రోసితిని వా
రాశియందు దైత్యరాజ ననుచు. 322

ఉ. ప్రోదిగ బుద్ధియై గురువు పోలిక శిష్యుఁడ వౌచు సంశయ
చ్ఛేదము చేసినావు గుణిశేఖర! యో మకరాక్ష! వీఁడు దా
మోదరుఁ డంచుఁ, గాని యొకపోలిక సంశయలేశ మొప్ప, నా
గాదిలి పిన్నతల్లిదగు కార్ముకవిద్య యటంచు నెంచెదన్. 323

క. ఒక్కొక్కవిద్య యందున
నొక్కొక్కప్రదేశమందు నొక్కొకవిధమై
మిక్కిలితనములు కలుగును
జిక్కనితలఁపులు మనస్సు చిగిరించినటుల్. 324

వ. అనుచు మహాదుఃఖసాగరంబున నున్న తండ్రి నెఱింగి యింద్రజిత్తు తండ్రిని దర్శింప వచ్చి మౌనంబునఁ గూర్చుండ రావణుం డింత యేడ్చి యిట్లనియె.

క. కనిపింతువో కనిపింపవో
తనరంగా మాయయో యథార్థంబో రా
ముని జంపగలిగెదేన్ రా
ముని జంపుము నా కదొకఁడె ముఖ్యమ్ము సుతా! 326

ఉ. వేనికి గోటిమీఁది పని వెక్కసపాటును బొంద వేలుపుల్
జేని నొసంట రక్తస్ఫురిన్ బిరుదై యుబికింప, వానికిన్
మానవు నొక్కనిం బిలుకుమార్చుట యెంతటి దీవుగాని వై
శ్వానరుఁ డందు మాటికిసి, వానికి పేనినిఁ గ్రింపుచేయుమీ. 327

గీ. అని మజల దుఃఖముం ద్రవ్వ నసురరాజు
నొగిని మేఘనాదుం డటనుండి జారి
తండ్రి కీ రీతి నైనఁ జేతఃప్రియంబు
నాచరించుటకును నిశ్చయంబుచేసె. 328

చ. తనబలమందె నమ్మకము ధారుణి నెవ్వనికైన శత్రువౌ
జనుని బలం బెఱుంగుటకుఁ జాలఁడు తక్కువసేయు దానికీ
జనులను రెండుసార్లుగను జంపితి నేగతి లేచివచ్చిరీ
మనుజులు వీరివైన మహాత్ముల్ మది బర్వగ గోచరించెడున్. 329

ఉ. చచ్చిరటంచు నెంచుటకుఁ జాలరు, ప్రొద్దును గంగ దవ్వనన్
వచ్చినయంతఁ జావములు వారును సిద్ధము, వారిమాట పో
నిచ్చిన నిన్నికోట్లకపు లేగతి లేచిరిదేమి మాయయో?
పొచ్చెము నాదుమాయ యయిపోయిన దచ్చటిమాయ యెట్టిదో?

క. బ్రదికిన బ్రదుకఁగ వచ్చున
మదస్త్రసంతానమహిమ మరణింపక త
ప్పదు కాదె యిప్పటికిఁ జూ
చెద వారిరహస్య మేమొ చిత్తమునందున్. 331

ఆ. అని తలంచి కొంచు యజ్ఞభూమికి నేగి
హోమ మాచరించె హుతవహోగ్ర
కుండమందు నగ్నికూలంకషంబుగాఁ
బ్రజ్వలించె నాజ్యభావితుండు. 332

ఉ. ప్రవ్వలుపూని యెఱ్ఱతలపాగలు తాల్చిన రాక్షసాంగనల్
మువ్వురు వచ్చి శస్త్రము లమోఘములున్ శరపత్రకంబులున్
ద్రవ్వి విభీతకాత్తసమిధల్ నవవస్త్రము లప్పనంబుగా
నవ్వల నివ్వల న్నిలిచి రంజలిబద్ధకరాంబుజాతలై. 333

మ. సమిధల్ దర్భలు నూత్నవస్త్రములునున్ సంస్తీర్యమాణంబులై
యమరన్ వహ్నిని వేల్చె దానవుఁడు సప్రాణంబు ఛాగంబుఁ గృ
ష్ణము వహ్నిప్రియ మాహరించెఁ బరితోజ్వాలాగ్రధూమంబు కే
శములై యొప్పఁ హుతాశనుండు సముదంచత్ప్రసన్నుండుగా.

తే. దక్షిణావర్తశిఖుఁడు హుతాశనుండు
స్వాయముగా వచ్చి హాటకసన్నిభాంగుఁ
డయి హవిస్సును స్వాయముగా నందికొనియె
నరుణభుజగఫణాభహస్తాంబుజముల. 335

మ. అనృతంబున్ ఋతమైన యట్టుల నదృశ్యంబౌ రథంబున్ ధను
స్సును గుఱ్ఱంబులు కేతనం బెసఁగె తేజోరూపమై యుండియున్
కనరాకన్ దశకంఠసూనుఁడు దిదృక్షాతీవ్రుఁడై చూడఁ బా
సిన కీశేశుల కైన యక్షులకు నక్షిత్వంబు లేనట్టులన్. 336

చ. వినఁబడుచుండె నాగక వశీకృతసంతతధారగా రథ
స్వనమును జాపఘోషమును వాజిచతుష్టయహేషయున్ వినూ
తనకశవిశ్లథస్వనము దర్పసముజ్జ్వలహాసమున్ దమం
తన పరిదీప్తమైన శ్రవణంబులకున్ శ్రవణత్వ మొప్పగన్. 337

ఉ. ఆతని వాడియంపగమి యగ్నికణంబులఁ గొట్టినట్లు ప్ర
స్ఫీతము తాఁచుఁ దాఁకినవి ప్రీల్చక యచ్చట నంటుకొన్నటుల్
చేతము సొమ్మసిల్లగను జేయుచు నూరక మండెడున్ వృథా
నూతనశక్తి యొప్పెడు తనూత్వమునందుఁ దనూత్వ మొప్పఁగన్.

గీ. అతని రథనేమినిస్వనం బదిగొ యంచు
నూటిగా మింటిలోనికిఁ జొచ్చినట్టి
కీశవీరులు మిన్నుఁ గౌఁగిఁటను బట్టి
యచట దూరాగతముల శరాళి ప్రస్సి. 339

ఉ. చచ్చిరి మొన్నఁ, బ్రాణములు సంగతమయ్యెను నిన్న, నేఁ డహో
చచ్చుచునుండిరిన్ మఱలఁ జర్విత చర్వణ మైన యట్టులం
జచ్చుటయున్ సజీవతయు సౌఖ్యమొ దుఃఖమొ వానరాళికిన్
వచ్చిన పోవుచున్న వగు ప్రాణము లయ్యెను వానరాళికిన్. 340

ఉ. రాజితమూర్తులై యెసఁగు రాముఁడు తమ్ముఁడు పూచు కింశుక
తేజము లట్లుగాఁ గనను జాలని లక్ష్యము గాఁగనై వృథా
భ్రాజితకోపవృత్తు లయి భాస్వరరక్తమనోహరార్ద్రసీ
రేజము లట్లుగాఁ దనర దృష్టులు మిన్నునఁ జూచుచుండఁగా. 341

చ. కడువడి రామలక్ష్మణులు కట్టిన చిక్కని యంపపందిరిన్
నడుమను సందుచేసికొని నారసముల్ చనుదెంచు నొక్క క
న్పడని సురారి బాణముల పందిరిలోనఁ జరించునొక్క బి
ట్టొడళులయందు ప్రస్సిన రఘూద్వహు లించుక యెంచజాలకన్.

ఉ. మైథిలిఁ బాసి మిక్కిలి నమాయకుఁడై చను రాముఁ డట్లు మా
యాధనుఁడైన యింద్రజి శరాహతి డయ్యుట న్యాయ్యమే, ప్రభుం
డై ధరణీకుమారిక హృదంతరమందున విస్మరింపనా
బాధ ప్రమాణముం దెలిసి బాణములేయుట యొప్పు వానికిన్. 343

ఉ. దానవరాజపుత్త్రశరతాడితదేహులు నిస్సహాయులై
వానరవీరు లెల్ల రఘువల్లభుచుట్టును జేరి యుండఁగాఁ
గోనల కన్నులం దెఱుపు గూడిన లక్ష్మణుఁ డన్నఁ గాంచి యీ
దానవవంశ మెల్లను విధాతశరంబున సంహరింతునాన్. 344

ఉ. రాముఁడు నవ్వి యిట్లనియె, రాక్షసుఁ డల్పుఁడు వీఁడు నీ శర
గ్రామముముందు నిల్చుటకుఁ గల్గునె? యొక్కఁడు వీనికోసమై
యేమి సమస్తరాక్షసవధేచ్ఛ? మఱంతగ నీకుఁ గోపమై
ప్రామిన, వీని నేనుగ శరాంతమునందు వధింతు లక్ష్మణా! 345

శా. ముల్లోకంబుల మేఘనాదుఁ డితఁ డేమూలలన్ మహాభూతసం
పల్లీనుం డయి యున్నయప్పటికిఁ జంపన్ నిశ్చయం బూనితిన్
పెళ్లా నీతనిమాయ సం దొకటి కన్పింపంగఁ దద్దేహమున్
డొల్లంజేసెద చించి చీల్చఁగను గండుంగోఁతు లా పిండమున్ 346

వ. అని శ్రీరామచంద్రుండు ప్రతీక్షావ్యగ్రుఁడై యున్నంత. 347

చ. చిఱికియుఁ గూడ బూరటిలు చేవ యదెట్టులు గల్గె రాఘవ
ద్వితయమునందు నంచు మతితీవ్రత పాయని మేఘనాదుడున్
బ్రతినిముసంబు రాఘవుల బంధురదీపితచిత్తవృత్తులన్
మతిఁ గనుగొంచు రాఘవుని మాటలు వించును గంచు నర్థమున్

ఉ. దానవరాజసూనుని హృదంతరమందునఁ గల్గె భీతి వై
శ్వానరమూర్తి చల్లఁబడి చాక్షుషవీక్షఁ దగెన్ దదుగ్రవై
శ్వానరమూర్తి రాఘవుని బాణముఖంబునఁ దోఁచె నంత సం
హానతమాయ బీట్లు వడుచున్నటులం గనిపించె బుద్ధికిన్. 349

మ. తనతోడం జనుదెంచినట్టి దనుజుల్ తానేగినన్ వానరేం
ద్రనఖాపీడన దంతఘట్టన విరక్తప్రాణులై పోదు రే

గనిచో నగ్ని యుపాస్యదైవమె విరక్తంబా గతిం దోఁచెనా
యెను భీతాత్ముఁడు దైత్యుఁడుం దిరిగిపోయెన్ దొడ్డిదారింబడిన్.

మధ్యాక్కరలు

తిరిగిపోయిన యింద్రజిత్తు దితిజుల స్థితిగూర్చి తలఁచి
సరయంబుగా వారి కేవౌ సాయంబు సమకూర్ప నెంచి
మఱియు వైశ్వానరు నధికమహిమంబు మాటయు వేఱ
తెరువున నవుగాములందుఁ దిరముగాఁ దేల్చుకో నెంచి 351

సౌమిత్రి యన్నట్టి మాట చాల యాశ్చర్యంబు గూర్చె
హోమంబు సేయంగ నగ్నిహోత్రుఁ డాహుతుఁ డైరాఁడు
నే మాదిరిగను బ్రహ్మాస్త్ర మేయ దైత్యేంద్రువంశంబు
శ్రీమించగా నంత సంహరించు, వారించు నగ్రజుఁడు. 352

ఉ. ఆతఁడు నన్ వధింతు నని యాడెను నన్వధియింపరాక ప్ర
స్ఫీతము నొక్క-హోమమును జేసెద నేను నికుంభిలాఖ్యమున్
ధాతల కెల్ల ధాతయును దాని ప్రతిక్రియ చేయలేఁడ, ప్ర
ద్యోతితమూర్తినై వెలయుచుందును నే నపు డప్రధృష్యుఁడై. 353

మధ్యాక్కర

అది రెండు మూన్నాళ్ళు పట్టునట్టి క్లిష్టాచారనియమ
మది యాచరించుచుండంగ నల్ప మభ్యంతర మైనఁ
బొదలకుండఁగఁ జూడవలయుఁ బూన్కికిఁ బొదలు సర్వాశ
మొదలంటఁ దెగిపోవ యత్నమున్ మాని మొద్దులై యుంద్రు. 354

ఆ. అంత మేఘనాదుఁ డరదంబు నడుమను
సీత దుఃఖమూర్తి చెలువు మిగుల
నాహవంబునందు నవతరించెను వాఁడు
కనులు పెద్దవిచ్చి కపులుచూడ. 355

వ. అంగారకగ్రహపీడితయైన రోహిణింబలె దుష్టజనహస్తగతయైన స్మృతింబోలె విహతయైన శ్రద్ధంబోలె సోపసర్గయైన సిద్ధింబలె నపవాదలగ్నయైన కీర్తివలెఁ బ్రతిపద్విద్యవలె సంస్కారహీనయై యర్థాంతరగతయైన వాణినిబోలె స్వరవిహీనయై నిష్ఫలయైన వేదవిద్యవోలె నసత్పురుషదత్తయై సుజనాపకారిణియైన యధికారరేఖయుం బోలె నీచభాషాక్లిశ్యమానావస్థయై జగన్ముక్త్యైకమార్గోపదేశరహితయైన దేవభాషయుంబోలెఁ బరలోకభావనాపరిత్యక్తయైన సంఘవ్యవస్థబోలెఁ గలిసమాశ్రితయైన ధర్మదేవతంలోలె నతని యరదంబున నున్న సీతంగాంచి మారుతిప్రముఖవానరేశ్వరులు నివ్వెఱనోగా నింద్రజిత్తిట్లనియె. 356

సీ. లంకాదహనకార్యశంకారహితధుర్య
మహితులారా! మదోన్మత్తులార!
కైంకర్యభావనిశ్శంకదూషితసంగ
రాగతులార! దురాత్ములార!
యేకారణంబున నేగుదెంచితిరో మీ
రే కారణంబున నిచటు వదల
రా కారణంబు నా యరదంబునందునఁ
గూరుచున్నది చూచికొనుఁడు కనుల
నామె వధియించెదను గనులారఁ గనుఁడు
ఈ త్వదీయమహాకార్య మెల్ల బూది
లోనఁ బోసిన పన్నీరుగా నమోఘ
కార్ముకులు మీదారల్ బెట్టుగాఁగ నేడ్వ. 357

గీ. ఎంతచేసిననైన మీరిచటినుండి
వెడలిపోయెడునట్లు కన్పించలేదు
తిరిగి పోదురో కడలిలో దిగుదురో మ
ఱింతతోఁ బీడ వదలిపోయెడిని మాకు. 358

ఉ. ఘోరతరమ్ములైన కాయగసుమ్మల్ తిను జంతువులైన కోఁతులున్
రాక్షసరాజధానిపయి రాముఁడు నాఁగఁ గిరాతు నొక్కనిన్
దక్షుఁడటంచు ముందునిడి దండుగ వచ్చిరి చిత్ర మీ కుఱం
గేక్షణ సీత నేను వధియింపఁగఁ జూడఁగ వచ్చి రబ్రమున్. 359

ఉ. వచ్చినసేనయో యెలుఁగుబంట్లును గోతులు కొండముచ్చులున్
వచ్చెనుగాదు కోఁడెలులు పందులు నక్కలు నైనఁ గూడ రా
వచ్చును గొప్పసేనఁ గొనివచ్చెను రాముఁడు గొప్పసభ్యులం
దెచ్చెను నేను జానకి వధించెడు రూపకదర్శనార్థమై. 360

వ. అంత నిలువున నీరై క్రుంగిపోయిన మారుతి, 361

గీ. ఓరి బహుమహాకల్పమహారుయుగని
రంతరమహాఘసంతాన మట్టకట్టి
యిట్టు లైనట్టి వాఁడ! నీకెట్టు లయ్యె
వశుఁడు కృతవేది యైన వైశ్వానరుండు. 362

ఉ. స్త్రీవధముం బొనర్తు వట స్త్రీజనతారమణీయముగ్ధమా
డావిలసన్మణిన్ మనుగడన్ సయిరింతువు సాధురేఖమున్
నీ విలయోహామున్ మఱియు నీవును దానవజాతిజన్మకుం
దావలమౌ నఘంబునకుఁ దాఁ దలముట్టిన దంచుఁ జెప్పనో. 363

గీ. దుష్టుఁడా! దురాత్మ! దుర్నీతివారాశి
చటులబుద్ధి! పాలసా! నృశంస!
సకలపాపభావసంజాత! దానవ
ధూర్తసర్వవంశధూమకేతు! 364

మ. అనుచుండం గపివాహినీతతి క్రుధాహంకారరోషధ్వనుల్
మినుముట్టన్ దితిజేంద్రపుత్రకునిఁ గ్రమ్మెన్ మేఘనాదుండునుం

ధనువుం జేకొని దూదిపింజలుగఁ దత్సైన్యంబు దూరాలకుం
జనగాఁ దూల్చెను వ్రాల్చెఁ ద్రీల్చెను ధనుశ్చండక్రియానైపుణిన్.

మ. త్రవయున్ మూలిన యింద్రజిత్తు కడఁకన్ ధాత్రీతనూజాత జం
దెపుదెబ్బన్ నిశితాసి వాలుగను ఖండించెన్ గపీశాను ల
స్రపుదుష్కృత్యముజూచుచున్ హృదయవారాశ్యున్నమద్బాడబుల్
స్నపితాక్షుల్ శిలలట్లు నిల్చిరి కృతాంతర్వహ్నిదగ్ధాననుల్. 366

వ. జాంబవత్సుషేణ నల నీలాంగదాంజనేయులు నిలుచున్నవారు నిలుచున్నట్లు కూలిపోయి కత్తివేసిన మొగమున నెత్తురుచుక్క లేనట్లుండ వికృతహాసాననుండై యింద్రజిత్తు రథంబు మఱల్చుకొనిపోవ, వారు చదికిలంబడి పెద్దకాలంబు తలలు చేతులంబూని యుండి, యీవార్త శ్రీరామచంద్రునకుఁ దెలియఁజేయవలయు నని స్మృతి యుదయించి నెమ్మదిగా నేగి ప్రభువునెదుట దుఃఖాకృతులై నిలచి గొంతులు పెగుల్చుకొని యర్ధోక్తులతో నంతయు విన్నవించిన. 367

క. విన్నాఁడో లేదో రాముఁడు
విన్నట్టుల మొగము కానిపించదు మఱికం
చున్నాఁడో లేదో పతి కం
చున్నట్టులు కంటివెలుఁగు లొప్పకయుండెన్. 368

సీ. అంజనీసుతుఁడు హస్తాంజలిగుప్తను
ఖారుణాంభోజుఁడై యట్లెయుండ
సూర్యతనూజుండు శూన్యదృష్టులతోడఁ
గడలిపై గగనంబు గాంచుచుండ
నంగదుండును దృష్టు లవనిపై హనుమపై
రామచంద్రునిపై మఱల్చుచుండ
కపిచమూనాథు లుత్కటలోచనాంతులై
ప్రాణమ్ము లుండి లేనట్లు తిరుగ

నాగిని సౌమిత్రియును నిష్క్రియుం డగుచును
రామచంద్రుని పాదనీరజమునందుఁ
గూరుచుండి బాష్పహిమంబు గురియుచుండఁ
గాలపురుషుం డకాలత్వఘటన మంద. 369

ఉ. వచ్చి విభీషణుండు రఘువానరవీరులఁ జూచి కారణం
బిచ్చ నెఱుంగ నేర కట నెవ్వనినో కపివీరుఁ గాంచుచున్
వెచ్చని యూరుపై పెడగఁ బిల్చి సమస్త మెఱింగి వార్తలన్
విచ్చిన మోముగాఁగ రఘువీరులఁ గాంచుచు నిట్లుగా ననెన్. 370

శా. సీతాదేవిని మేఘనాదుడు వధించె న్నాగ నమ్మంగ రా
దా తండ్రిన్ దనయుం డెఱుంగు నతఁ డేలా యొప్పికో త్తెచ్చు భూ
జాతన్ బంక్తిగళుండు గొంతున నభస్వద్వీచి యాడంగ నా
రీతిం జేయఁగ నొప్పికోఁ డిది మృషా వృత్తాంత మెల్లెంచినన్. 371

ఉ. ఆతనియొద్ద దుర్గుణము లన్యము లోకసహస్ర ముండినన్
నాతివధంబు సేయు టనిసన్ దశకంఠుఁడు సేయఁ డెవ్వఁడున్
నీతివిదుండు శౌర్యరసనీరధి వేదమహార్థవేత్త కా
మాతురుఁ డన్న దొక్కటియ యంగనఁ జంపెడు నంత చెట్టయే?

ఆ. మాయ యన్నమాట మారుసే ర్వానికి
మేఘనాదునకు మహోఘమతికి
స్వీయమాయ యెట్లు చెల్లింపనో నది
యొక్కయూహ నేది యుండ దెపుడు. 373

క. అనెడు విభీషణు మాటలు
వినుచుండియుఁ గూడఁ గీశవీరులు వినరున్
గనులారఁ గనినయట్టిది
వెనుకను వినినట్టిమాట విద్ధవఱచునే? 374

చ. మరల విభీషణుం డనియె మాటలు నాయవి మీరు నమ్మఁబో
వను మఱి నమ్మ కే మొనరుపం దలఁపూనెద రిట్లయుండి య
బ్బురముగ నిండ్లకుం దిరిగిపోదురొ, క్రుద్ధులు లంక నెల్లఁ గా
ల్తురొ, యటు కాల్పనెంచినను దోరముగా నిటు లున్న నేనొకో?

చ. క్రతువు నికుంభిలాఖ్యము దురాత్ముఁడు వాఁ డొనరింప నేగెఁ ద
త్క్రతువు సమాప్త మైనయెడఁ గల్గదు వానిని గెల్చు టన్న దా
క్రతువును భంగపుచ్చవలెఁ గావున శక్యమగున్ని వానిఁ జేయఁగా
మతి గలదేని నయ్యెదియు మానక వెంటనె సేయఁగావలెన్. 376

క. అది పూర్తియైన వానిం
గదలింపఁగలేడు శార్ఙ్గకార్ముకుఁ డైనం
గదలుఁడు దుఃఖింపంగా
నొదవిన కాలంబు యుగము లున్నవి భావిన్. 377

చ. ఒక వటవృక్ష మున్నది మహోన్నత, మచ్చట వాని హోమశా
ల కలదు చుట్టునన్ దనుజులం బెనుగాపుగ నుంచుఁ బోయి వాని య
జ్ఞకృతిని వేగ భంగపఱచన్ వలె లేనియెడన్ సమస్త మై
నకపులు నేట జేవట పునర్మృతిఁ గాంచుట తప్ప దింతయున్. 378

గీ. హనుమ యెఱుఁగు నశోకంబు నచటి కరిగి
చూడవచ్చును మీ భావశుద్ధి కొఱకు
నటులఁ బావని యేగుత మిటుల మేము
లక్ష్మణస్వామియు నికుంభిలకుఁ జనుదుము. 379

గీ. అంత నంగదుఁ డనియెను యతఁడె చెప్పె
నద్ది రూపక మంచు మఱామె యనియె
నీమె యనుటకుఁ, బదఁడయ్యె యింద్రజిత్తు
వధ పొనర్చును లక్ష్మణస్వామి యనుచు. 380

క. అనినన్ సప్రశ్రయులై
వనచరులును రాఘవులును వనరుట మానం
గను లక్ష్మణుండు తోడన
ధనువుం గొని బయలుదేరె దానవువధకై 381

చ. అచట విభీషణుం డనియె నా కపిసేనలతోడ లక్ష్మణుం
డు చనిన చాలదవ్వునం గడుం గగనంబున నల్లికొన్న చె
ట్టుచివర లావరించిన యటుల్ పొలుపొందిన మేఘమాల దై
త్యచమువు, కావు మేఘములు, తత్తరువే వటవృక్షరాజమున్.382

శా. చెట్టుం జేరగరానియట్లు దితిజశ్రేణిన్ మహావ్యూహముం
గట్టెన్ గట్టిన వ్యూహ మీవు విఱువంగాం దట్టుకోలేక వాం
డెట్టుల్ వచ్చును యుద్ధమాడ నది యంతే, వేల్మి భంగమ్మనా
నొట్టుం బెట్టినయట్లు వాండపుడు వధ్యుండౌను ముమ్మాటికిన్. 383

ఉ. వాండు తపంబు చేసి కొనె బ్రహ్మశిరంబు నికుంభిలాస్త్రమున్
నేడు మఱిన్ రఘూద్వహుండు నీవును గెల్వగలేరు పూర్తిగాం
బోడిమి వేల్చగాంబడినం బూరుషయత్నము భంగపుచ్చమీ
వాండెఱుగండు కాల మనువాం డనలాధికుం డన్న యర్థమున్.

శా. అంతన్ మారుతి భీమవిక్రముండు దైత్యవ్యూహముం బట్టి పా
దాంతంబందు నఖాంతమందున ముఖాంతంబందునన్ భ్రూధ్వవృ
క్షాంతంబందున వేలువందలుగం బ్రాణాంతంబు సేయన్ ద్వారా
వంతుల్ దానవు లేగి గొల్లు మని యేడ్వన్ వాండు కోపంబునన్.

మ. ధనువుం గైకొని చైత్యమున్ విడి వియత్సంకర్షణున్ మారుతిం
గని వీండొక్కండు సర్వదానవమహాకాలుండు వీనిం వధిం
చిననే గాని ప్రశాంతి లేద యనుచుం జిత్తంబునం దెంచి యే
సెను బ్రాసంబులు బాణముద్గరములున్ శీఘ్రంబులౌ హేతులున్.

క. విఘటితసర్వాయుధుఁడై
యఘమతి యింద్రజి తలంచె నతనివధంబున్
మఘవజయముఁ గన్న మనః
ప్రఘూణమున వాయుసూతివధముఁ దలంచెన్. 387

ఉ. ఆతని పరాక్రమించు విధ మద్ది యెఱుంగు విభీషణుండు మా
రుతిని వధింప నెంచెను దురాత్ముఁడు వీఁడని చెప్పె లక్ష్మణున్
శితశరజాలతాడితుని చిత్తము నీదెసకున్ మఱల్చె మా
నతముగ నన్న లక్ష్మణుని నారసముల్ విహరించె నాదెసన్. 388

మ. తన కన్పించని మింటియుద్ధమున నేతద్బాణసంతానమం
దున నొక్కండు స్వదేహరక్తమునయందుం దోఁగి ధాత్రింబడెన్
గనఁ దాదృక్శరముల్ పరంపరగఁ రాఁగాఁ దాళఁగాలేక పా
వనిదిక్కున్ విడి యేగి లక్ష్మణునితోఁ పాటకులన్ విప్పుచున్. 389

ఉ. చూచి విభీషణున్ మనసు మూఁడినయట్లయి యెట్టిచోటునం
దోఁచితి నాకు సర్వమును దోఁచిన దివ్వడు. నీవులేక నా
యీ చయనంపుచో తెఱుగు తెట్లగు వీరికి, నిన్నుఁగాని యా
నా చిననాన్నయం చనిన నందను చందము విద్వదగ్రణీ! 390

ఉ. చాలి స్వవంశదూషకు నసాధువు నెత్తురు త్రావఁబోదు వే
గోలము కుక్కనెత్తురును గ్రోలు స్వపక్షము వీడినట్టిదా
జాలక మా రహస్యములు శత్రులకున్ వచియించుచుంటి కా
కోలము క్షీరసాగరనిగూఢము, సిగ్గని లేదు దానికిన్. 391

క. వీరులఁ జేరితి, చత్తురు
వీరులు, బ్రదికెదరు వారు వీ ర్బ్రతికింపన్
వీరులు చంపెద రరులను
వారి రహస్యములు చెప్పవా రుండంగన్. 392

చ. అనిన విభీషణుం డనియె నన్నవి నీవు యథార్థముల్ప లెన్
దనరును లౌకికంబుగను దత్పరమార్థము వేఱ యుండు నీ
జనకుఁడు సీతఁ దెచ్చిన దసజ్జనకృత్యము నీవు కా దటం
చనినది లేదె? పోయి యిది యాడితె? యెవ్వఁడుగాని తండ్రితోన్.

క. అనినను నీమెడ పిసుకును
నను నాడఁగ బయలు దేరినాఁడవు మఱియున్
మనవంశము క్షీరోదధి
మన మొదలు తిమింగిలములు మకరఝషములున్. 394

క. మృతుని బ్రదికించు నెవ్వఁడు
మృతుఁడవు నీవగుదు నేఁడు నెవ్వఁడు నిన్నున్
బ్రతికించుఁ జచ్చె నెవ్వఁడొ
బ్రతికించె నెవండో యనుట పామరముసుమీ! 395

క. అతని రహస్యమ్మును నీ
పితకుం జెప్పితి నతండు వినఁడాయెను జె
ప్పితి విరారహస్య మతనికి
నతఁడు వినుచునుండె, దోస మది నాయదియే? 396

ఉ. చెప్పిన విందు రే జనులు చెప్పిన విందువా నీవు చూతు నే
నిప్పుడు చెప్పుటల్ వినుట లెవ్వఁడు చేయును బ్రహ్మచేసినం
జొప్పడు నగ్గి వేల్చి రిపుసూదన మస్త్రము తెత్తు నంటి వీ
వప్పని యేమియైనయది? యగ్ని క్రియాఫలదాత మాత్రమే. 397

క. క్రియ జరుగవలయు నగ్నియుఁ
బ్రియపడుటకు, జరుగ నెవఁడు ప్రియపడవలయున్
స్మయచిత్తులకుం దెలియదు
క్రియారహస్యము మహోఘకృతినిపుణులకున్. 398

ఉ. వీరులొ కాఁగొ రాఘవులు వేల్చిన మాయ ఘటించుచున్ శరా
సారముచేతఁ గ్రుమ్ము టది చాలదు నేర్పుటకై ముఖాముఖిన్
మీఱిటనుండి రిద్దఱును మేకొనఁజాలవు మాయ స్వామియున్
నేరఁడు వీరతాగుణము నిగ్గును దేల్చికొనంగఁ జూడుమీ! 399

వ. అంత మఱిం బరస్పరవధైషులు బద్ధమనస్కులు రథ మారుతి భుజాసమారూఢులు నరరాక్షసవీరులు నొకరి నొకర రెదురుకొని యింద్రజిద్విహునిశితనారాచపరివిద్ధుఁడు లక్ష్మణుండుగా నెగడిన సౌమిత్రి చాలకాలము శరములను స్వీకరించుటయె కాని తిరిగి ప్రయోగించుట లేకయుండ నింద్రజి యతని నిరాదరణమునకుఁ గుపితుండై, తీవ్రతరము లమ్ములు చిమ్మ సుమిత్రానందనుండైదుశాణంబుల నతనిఁ దాడింప నవి యరుంతుదములై రావణి భయభ్రాంతుండై మొగంబున దైన్యంబు నిరూపింప విభీషణుండు సౌమిత్రితో నతనితక్కువతనంబు వచించె, నంత సౌమిత్రి యెంత నేవటికిఁ బరిసరశిలావృక్షచ్ఛేదనంబు చేయుచు శత్రురథసామీప్యంబు వారించుచు బహుకాలంబు చేసి యస్తమయవేళ నతని సారథిని ద్రుంచి యశ్వంబుల సంహరించి రథంబును నుగ్గుచేసి యతనిని విరథుం జేసె. 400

మ ధ్యా క్క ర

అసురశక్తివివృద్ధికరము యామిని యామనిచో తె
యసురరాట్సుతు నేనఁ జివురుటాకుల యరుణిమఁ దెచ్చె
మసలి పశ్చాద్గమనంబు మసలిన మాద్రిఁ గాలంబు
శిశిరమై యాతని మేనిచిప్పు వంచించి యాకార్చె.

వ. పరమవిచిత్రచ్ఛంక్రమణభాస్వరవేగుఁడైన హనుమ కెదురు రథంబు లేని తననిస్సహాయత భావించి రాత్రి చీఁకట్లముఱుగునఁ దనలేమిఁ

గప్పిపుచ్చెఁడని యసురసైన్యంబుతోఁ జెప్పి మేఘనాదుండు పుర ప్రవేశంబు చేసి యొకరాత్రివేళకు సరథాశ్వసూతుండై కనిపించిన దైతేయవీరుం గాంచి సుమిత్రానందవర్ధనాదు లాశ్చర్యపడి యతని యెలయింపుబవరంపు వెలయింపులు సాగియు సాగకుండ యుద్ధంబు సాగింప. 402

మధ్యాక్కర

వైవస్వతంబైన వెలుఁగు ప్రాగ్దిశాభాగంబునందు
సౌవర్ణ రేఖతోఁ బొలిచె సౌమిత్రి శాంతాస్యమందు
భావించె మేఘనాదుండు బవర మిఁకఁ బటువయ్యె నితఁడు
నావుగింజంతైన యేల నూల్కొని నొవ్వఁడటంచు. 403

వ. అరదంబు లేక పట్టుతప్పినట్లైన రావణుపట్టికి సిగ్గుపుట్టునట్లు సౌమిత్రి హనుమబుజంబు డిగ్గి యుద్ధమాడుచు మేఘనాదుని మోఘనాదునిఁ జేయుచు విజృంభింప నతండు తనసైన్యంబు సౌమిత్రిం దాకునట్లు చేయ మారుతియు నంగదుండును విభీషణుండు నాసైన్యంబు నెదుర్కొనిన నద్దివాభాగమంతయుఁ గపిరక్షస్సైన్యముల పెనంకువలతో బీభత్సంబై యింద్రజి సౌమిత్రిని డాయుచు డయ్యుచు, చేరుచు, సారహీనుండగుచు, నడుమ నడుమ మారుతి విజృంభణంబుల నరికట్టుచు విభీషణువనుచరులైన రాక్షసులఁ బోల్చికొనలేని తనరక్షస్సైన్యంబు దిగ్భ్రాంతి వాపుకొనుచు నెడనెడ నిడియించుచున్న రాముతమ్ముని యమ్ములకు నాసారంధ్రమ్ములఁ గ్రమ్ము నెత్తురులు చిమ్మికొంచు మఱల సౌమిత్రి నలయించుచు నాగర్భశ్రీమంతుఁడై పరాజయ మెఱుంగక విరథుం డగుట యెఱుంగక నిత్యమాయాపథాశ్రితుఁడై నేలమీఁద నున్న మహావీరులపై నమ్ములేయు. వింటికోణంబు లలవాటు లేక. 404

మధ్యాక్కఱ

చీఁకట్లు తూర్పుదిక్కు-రలి చెలఁగ పశ్చిమదిక్కు- చేరి
చౌకట్లుగా వ్రేలుచుండి చదలున జలధరాళిములు
రాకాసిసేనకు బలము రంజిల్ల రాత్రి జృంభించె
నాకాశతారకల్ భయము నందినయట్టు లల్లాడ. 405

వ. అంత రక్కసిమూఁకలయిక్కలును నుఘువారియరదంబు నిరవును గనిపింప మాటిమాటికి సౌమిత్రి వెలయించు నాగ్నేయబాణంబులతో, మరణించు కపిరక్షస్సైనికులయాక్రందనములతోఁ జితుల వలెఁ గన్పించు చిట్టిపొదలతోఁ బిశాచాక్రందనములనోసి భయభీతహాయహేషలతోఁ గాలుచున్న శవముల నెగఁద్రోయు వాసములసవ్వడివోని యాయుధములధ్వనులతో నా యుద్ధభూమి రుద్రభూమివలె నైన. 406

మధ్యాక్కఱ

సౌమిత్రి వినికృత్త బహురసాసుమహా శైలమహా నచట
నే మడమైమె లేకయ యుదయించిన యినబింబమందు
సౌమిత్రిశిరమైన నింద్రశత్రులోచనయుగ్మమునకు
భూమికి దిగివచ్చె నినుఁడు మోహానమూర్తి యన్పింప. 407

వ. మఱియు యుద్ధంబు తుములంబై దినంబు గడచి యింద్రజిత్తు పరాక్రమించి విభీషణు నైదుబాణంబుల హరియూథంబు బహుపృషత్కంబుల వ్యథింప రామానుజుండు కోపంబున నతనిని రథాశ్వంబుల సంహరించె, హతాశ్వుం డింద్రజిత్తు యమదత్తంబైన యొక మహాస్త్రంబు పినతండ్రిపై నేయ సౌమిత్రి దానినిఁ దనకుఁ గుబేరుండు స్వప్నమందుఁ బ్రసాదించిన యస్త్రంబుతో నివారించె, వ్యర్థాస్త్రుండై రావణి విభీషణునిపై శక్తిం బ్రయోగింప లక్ష్మ

ణుండు దానిఁ బదియమ్ములతో వమ్ముచేసి వారుణంబుఁ బ్రయోగించిన నింద్రజిత్తు రౌద్రంబు ననుసంధించె. ఆ రెండస్త్రంబు లాకాశంబున నొండొంటిఁ దాఁకి రెండును విఱిగిన, రావణి మహాకోపంబున నాగ్నేయంబు నిగిడించిన సౌమిత్రి సౌరంబు సంధింప, నాగ్నేయంబు వ్యర్థంబుకా, మేఘనాదుండు మహాద్భుతమైన యాసురంబు ప్రయోగించిన నది శతకోటి సూర్యసంకాశంబై యనంతములగు ప్రాసముద్గరాఖీలంబుగ వచ్చుచుండ సౌమిత్రి మాహేశ్వరంబుఁ బ్రయోగింప నాకాశంబు పగిలి భూతంబులు వ్రయ్యగా సర్వదేవతాఋషులు నరుదెంచి విస్మయాకులితు లగుచుండ నవి రెండును బెనఁగి పెనంగి యుపశమిల్ల, లక్ష్మణుండు క్రోధావేశంబున నెద్దాని మున్నింద్రుండు దేవాసురయుద్ధంబునఁ బ్రయోగించె నెద్ది హుతాశనసమస్పర్శమో, యెద్ది దురావారమో, యెద్ది శరీరాంతకంబో దాని నైంద్రంబును దేవసంఘసమర్చితంబు నస్త్రశ్రేష్ఠంబు ధనుశ్శ్రేష్ఠంబున నరశ్రేష్ఠుం డనుసంధించి దాశరథియైన రాముండు ధర్మాత్ముండు సత్యసంధుండు పౌరుషంబున నప్రతిద్వంద్వుండు నయ్యేనేని యిది రావణివధంబు సేయుఁగాత యని వదలిన నది యింద్రజిచ్ఛిరంబు శ్రీమంతంబు జ్వలితకుండలంబు సశిరస్త్రాణంబు తెగనఱికిన నతనిశిరస్సు భూమిమీఁదం బడియె. 408

మధ్యాక్కఱ

అన్నిశీథమునందు నంత యసురసంహారంబు జరిగె
నన్నది తెలిసిన యంత నఖిలదైత్యశ్రేణి జలధిఁ
జన్నది తెలియక యుగ్రశైలాగ్రసంపాత మన్న
దెన్నక భయమునఁ జచ్చి రిట్లని యెఱుఁగక చావు. 409

తూరుపుదెస నబ్జహితు నెదుట గెల్పుతోఁ దూగు తమ్ము
శ్రీరాఘవుఁడు పొంగి కనులు చెలువారఁ జెన్నారఁగాంచి

హేరాళముగ నర్ఘ్య మిచ్చి యినదేవు నెఱుపులు విఱిచి
యార్చఁ జికిత్సచేయించి యనుజు గాయమ్ములు మాన్పె. 410

ఉ. ఎప్పుడు పోలెఁ దూర్పుదెసనే యుదయించెను సూర్యుఁ డేగతిం
జొప్పడు నింద్రజేత యగు సూనుని నొక్కఁడు చంపె మానవుం
డిప్పలు కెట్లు నమ్మఁదగు నీదఱు మంత్రులు మాటి కందఱుం
జెప్పఁగ నమ్మకున్కి యిది చిత్తము స్థైర్యము తప్పినట్లగున్. 411

శా. అయ్యయ్యో! దశకంఠ! ముజ్జగమునం దాజ్ఞాప్రభావావగల్
కయ్యల్ కోయుట వానిదై చను భుజాగర్వంబు కా! రామ! నీ
నొయ్యన్నేర్చిన మాయకుం బరిధి లేదో! శల్యమార్గానుసం
ధాయ్యోమధ్యతిశాయితామహిమ సానాధ్యాతిగాధ్యాయమై.

శా. నన్నున్మత్తునిఁ జేయుచుంటివి సుమీ. నాతప్పు లేదింక, నే
నిన్నేమన్నను దోసముండదు సుమీ, నిన్గూర్చి యేమైన నే
నన్నిక్కమ్ముగఁ జేయవచ్చునుజుమీ, నూల్కొన్న శత్రుత్వము
న్నన్నిన్నోవలెఁ గుజంబుజోద మిగిలెన్నా నిట్లు ఛేదింతురే. 413

శా. అమ్మారీచుఁడు మున్నె చెప్పఁగద దైత్యాత్మప్రశాన! యా
శమ్మం దుండఁగ రాము నోర్వఁగునే? తానై యసాధ్యమ్ము సా
ధ్యమ్మం జేసెడువాఁడు, చూచెదవుగాఁ దద్వైరయాత్రాస్థితిన్
నమ్మంజాల వటంచు, నమ్మెదనయా, నమ్మంగరా కెట్టులా. 414

శా. తానేఁడో పదమూఁడగున్ సమలు నిద్రాహారముల్ లేనివాఁ
డై నంగాని వధింపలేఁ డనిరి యాహా! వాఁడు వీఁడా? మరు
త్సూనుం డొక్కఁడు వీఁడొకండు రఘునాథుం దమ్ముఁడై బంటునై
కానంజొచ్చిరి లంకఁ జొచ్చిరిపరాకాష్ఠామతిక్రూరులై. 415

చ. అతఁడు కిరాతుఁడం చెజేఁగి యాతనివద్దకుఁ బంపితిం జుమీ
సుతులను వహ్నిరూపముగఁ జొచ్చుక వచ్చుచు నున్న మృత్యుదే
వతఁ గని భీతిఁ దప్పికొని బాలుర నందఱఁ బేరఁ బేర నా
హుతి యిడినట్లు, లజ్జయని యున్నది రావణుఁ డన్నవానికిన్. 416

శా. ఇంకం దా నతఁ డేమి సేయఁగలఁ డో నే సేయఁగాఁ గల్గుదున్
శంకాదూరముగాఁగఁ జేయుదు సహస్రంబైనయేడుల్ నిరా
తంకంబౌ తపమాచరించి తుది తత్ త్రైవ్యాఘ్రుఁడౌ వీనిబా
ణాంకంబందున వాఁడు లేడి యయి, నే నా కాక యిల్లాదుమే.

వ. అని రావణుండు కోపవిశుండయి నిశ్చయించి. 418

ఖండాంతము

గీ. ఇంద్రజిత్తండ మిద్ది మహేంద్రనీల
కాంతికలితోరుమంజులకంఠదేశ!
శ్రోతమైన ముక్త్యాలధరాతలేశు
వెండికొండపైఁ బదిలించిపెట్టు మభవ!

చ. నిను మది నెంచుకొంచు శయనించినఁ గట్టియ మేను నాది కా
దనియును నుండె లేదనియున్ దలపించెడు నట్లుగాఁగఁ జే
సినయది చేతయా! స్మరణచేసెడు చిత్తము నిత్యమానె? నా
కను లనినట్టిచోటఁ గలుగన్వలె నీ వెలుఁగింత మత్ప్రభూ!

శిఖరిణి

పురస్తాదాగచ్ఛద్ధవళ సుషమాభోగ దివిష
త్పరీవాహోద్ధ్వాధః ప్రసరణ యుగీభావ సువహః
ధరాభృత్కన్యోద్యత్కనకిరళనా తర్జనభయ
ప్రరోహాద్ధాసశ్రీ ధవళిత దిశాభాగనివహః!

# నిస్సంశయ ఖండము

క. శ్రీమంత్రాదిప్రాప్యా
కోమలవరమాణుభావగుంఫితతను ! నా
నామంత్రానభిగమ్యా
ప్రామాణ్యమహాంబురాశి ! ప్రభు ! విశ్వేశా !

సీ. మాణిక్యకాంతి కుగ్రాణంబు లైనట్టి
కుండలద్వయము చెక్కులఁ జలింప
గాణిక్యవిద్య మాగాణంబుగా నైన
రుద్రాక్షమాల పేరురముఁ గలఁచ
వాణీవిలాసనిద్రాణంబుగా నున్న
వదనాంతములను గోపమ్ము విరియ
రీణాప్రభానపారీణంబులై యున్న
లోచనంబులు రక్త మాచమింప

నానఖశిఖంబు కంపిత మైన మేన
జానకీదేవి యెదుట సాక్షాత్కరించె
రావణుండు దైవతజగద్రావణుండు
రావణుండు మానుషజగద్రావణుండు. 1

ఉ. ఆతని పాలభాగమున యందువ నౌష్ణ్యము గ్రక్కుచున్న ప్ర
స్ఫీత విషోన్నమద్భుజగభీషణదంష్ట్రిలువోని యూర్ధ్వరే
ఖాతత రక్తవర్ణ పరికల్పిత వహ్నిశిఖాద్వయంబు లో
కాతిభయంకరంబుగ దృశాతివిదారక మౌచుఁ గన్పడెన్. 2

ఉ. ఆతని నేత్రయుగ్మమునయందునఁ గన్పడె మృత్యుదేవతా
దూత సమస్తజీవులకుఁ దోచెడు వాఁడు గమించువేళ శ
య్యాతల పార్శ్వభాగమునయందు నిలంబడి యున్నయట్లుగాఁ
జేతము విస్మృతిం బడఁగ సీతకు నాగతిఁ దోచె దైత్యుఁడున్. 3

చ. అరయఁగ నేకచిత్తతతి ముఖాంత దృశాంతములందుఁ దీవ్రమై
వరగు కటారికానివలె వచ్చెను బూర్వము నన్నుఁ జంప వే
గిరపడు లక్షణంబదియుఁ గేవలనాటకమై కనంబడెన్
దిరమయి యొప్పుచున్న యొకతీవ్రత క్రూరముగాఁగఁ దోఁచెడిన్.

చ. మునుపటి తీరు ఫే ఱిపుడు పూర్తిగ స్వీయము సర్వశక్తిచా
లని దని నిశ్చయించి యిక లాభము లేదనుమాట తేలిపో
యిన సకలాశలున్ మఱలి యేమియుఁ జేయఁగలేని వట్టిదు
ర్జనతయుఁ గ్రూరభావమును సాహస మొప్పెడు వీనియందునన్. 5

చ. పలుకు పెగల్చరాని దగు ప్రాణము పట్టినపట్టుతోడ నీ
వెలలినయట్టి వీనిదగు వెట్ట ననున్ మఱి సంహరించు దో
హాలత నెసంగు నాదయిన ప్రాణము నేటికి సంశయంబునం
బొలసెడు నాహావస్థలిని బుట్టిన దెట్టివిశేష మయ్యెనో. 6

చ. తొలుతను కామినీపరివృతుం డయి వచ్చెడువాఁడు నన్నద
మ్ముల వధియించి యున్న యెడఁ బొల్చెడి యుబ్బది వేఱుదీఱిగాఁ
బొలిచెడు రాముఁడున్ సకలపుత్త్రుల బంధుల సంహరింపఁగాఁ
దెలివి సమస్త మొక్కట గతించిన వైఖరి గోచరించెడున్. 7

ఉ. మారుతియున్ బుజంబువయి మున్ననఁ గైకొనిపోవఁ జెప్పఁగా
నేరిచితిన్ రఘూత్తముని సీతిని నాతివధంబు సేయనా
క్రూరత లేదు వీని కనుఁగొంటిని దాదృశమైన క్రూరతన్
నేరిపె వీని కే దొసఁగొ, నేరగ నయ్యెద యుద్ధవార్తలన్. 8

ఉ. వచ్చుచునే విదల్చి కరవాలము కుత్తుక వ్రీల్చవచ్చు నీ
యిచ్చటిరాఁక దైవ మెలయించెను జాగును జేయు మృత్యువుం
దెచ్చునొ యింతలో ననుమతించని మృత్యువు దవ్వుసాగునో
యిచ్చట నిల్చియుండె నితఁ డెత్తనికత్తిగ వహ్నిమూర్తియై. 9

క. ఆరాజు లెల్ల యుండఁగ
నీ రక్కసి నన్నుఁ జంపు నేమో యకటా!
ఆరాజులు మరణించిన
నీరక్కసి నన్నుఁ జంపఁ డేమో యకటా! 10

మ. అనుకొంచుండ సుపార్శ్వుఁ డన్న సచివుం డా దేవతారాతితో
ననె వాచ్యంబుగఁ జేయరాని యిది భగ్నాలాన మైరావణం
బును బిట్టార్చుచు భీతిగన్న నయనంబుల్ దిక్కులార్వన్ బలా
యనసూత్రంబు పఠింపఁ జేయుటయె గంగావిఘ్నకూలంబులన్. 11

ఉ. దక్షుత వెండికొండ భుజదర్పమునం బయికెత్తఁ బర్వతా
ధ్యక్షునికూఁతు వాహనము దందడిగా గిరి డిగ్గివచ్చి యే
యక్షులఁ గాంచి భీతిమెయి యాత్మబిలంబునయందు డాగె నా
యక్షులయం దయోగ్యమయినట్టి తలంపుల కాంతు లొప్పునే? 12

ఉ. పక్షిశతారివాహనుఁడు భామిని భాగ్యముపట్టి పుండరీ
కాక్షుఁ డటన్న కీర్తిగనె నయ్యది రావణుఁ డన్ననో భుజా
దక్షతఁ బౌరుషోజ్జ్వలపథంబున నిచ్చలు నొప్పఁ బుండరీ
కాక్షతఁ దాదృశంబులగు నక్షుల క్షుద్రతరాంశు లొప్పునే. 13

శా. ధుర్యంబౌచు జగత్స్థితిప్రకటహేతుత్వంబు దీపిల్ల ధీ
కార్యత్రయ్యనువాకశబ్దగతసంఖ్యానిర్ణయప్రక్రియా
పర్యాలోకనదక్షమైన నయనప్రాగల్భ్యసుశ్రీకి ప్రా
దర్యం బంచును జెప్పనైనదియె యేతద్భావనాకాంతియున్. 14

చ. మఱియు నిరాకరించినను మానిని దుర్గుణవంతుఁ డైనచో
నెఱియు నెడంద ద్వేషము వహించును సజ్జనుఁ డైనచో నిరా
దరణము చేయ దెప్పుడును దామరసేక్షణ పొందకున్న నా
దరమతి గౌరవించుటయు దాని కదే యగు వాంఛనీయమై. 15

వ. అనివంత రావణుండు చేతిలో నున్న కత్తి నొరయందుఁ జొనిపి వెనుదిరిగిపోయి పరిశిష్ట మంత్రిసేనాపతుల రావించి సభదీర్చి సుపార్శ్వునవంకఁ జూచిన సుపార్శ్వుండు లేచి నిలుచుండి యిట్లనియె. 16

మ. మనమే రాక్షసజాతి, యింత కెగువై మాయావి యన్నట్లుగాఁ
గనిపించున్ నరుఁ డెత్తివచ్చి మన లంకారాక్షసస్తోమ మయిన్
దన యిందాఁక హానర్చినట్టి పనులే తారాక్షణమై పొల్చుఁ జ
చ్చినవా రెచ్చటనైన లేచెదరె? లేచెన్ వానరశ్రేణియే. 17

మ. జ్వలదాకారులునున్ జగత్త్రితయగర్జా మేఘనాదుల్ సుతుల్
బలకుంభీనసచక్రవర్తులగు నా భ్రాతల్ యదాభీలవృ
త్తుల ము న్నిల్వఁగలే రహో దిగధినాథుల్, వార లొక్కొక్కరున్
విలయం బందుట మాయకాకయ భుజావీర్యం బనం జెల్లునే? 18

ఉ. అందఱి మాటయున్ వదలి యా మకరాక్షుని యంత ధన్వి యీ
సుందరుఁ డించుఁ జెప్పినను సొంపవు మాటగునే, పురంబునన్
మందరపర్వతం బనిన మాద్రి విమానము చాపవిద్యయం
చందుమె, యయ్యొ, యెత్తువడి నావువిధంబునఁ గుప్పకూలఁగా. 19

మ. బయటన్ వారును నారి మ్రోసెదరు భూపాలుండు లోగుండియన్
బయలై దుఃఖభరంబు మోసెడి రణప్రాలంబయా లక్ష్మి య
గ్రియవృత్తిన్ మఱి యెవ్వఁ డే దెసకు లంఘించున్ శివుండైన వి
స్మయచిత్తుం డెఱుఁగంగ రానియవి రక్షస్సైన్యరక్షావిధుల్. 20

ఉ. నేను సిద్ధమై యిచట నిల్చితి దైత్యచమూపతుల్
దానవచక్రవర్తి ముదలం దననోట వచింపలేని దుః
ఖానతమూర్తియై యెసఁగు నాతని యుప్పను దిన్న దానికిన్
ధీనిధులార! యీఋణము తీర్చుట జన్మము చారితార్థ్యమా. 2

సీ. కీర్త్యంబునిధి త్రిలోకీజేత రావణు
రాజ్యంబులోని వారన్న గొప్ప
మన మేపనిం జేసినను సాగునన్నట్టి
ధార్ష్ట్యంబుతోడిది దర్పగరిమ
యమరావతీపట్టణము చూఱగొన్న సం
పద పంచికొన్న సౌభాగ్యమహిమ
మనమే దశాస్యుల మనుకొను నంతటి
గుండెలలోపలి దండితనము

దితిజపతి సాహసౌదార్యదీప్తి వలన
వేయియేండ్లుగాఁగ ననుభవించినాము
యిపుడు సమయంబు వచ్చిన దీ ఋణంబు
వడ్డితోఁ దీర్చవలయు నన్యారిగాఁగ. 22

గీ. అక్కటా! మేన శక్తి యున్నంతవఱకుఁ
బూని తనయది రక్షించుకొను వలయు
చూచుచుండె గృహాళిఁ గాల్చుటయు జరిగె
సుదతిజనుల యేాలువులు ప్రేల్చుటయె మిగిలె. 23

చ. అతిశయబాహుగర్వమున నాహవమాడుచునుండు నింతలో
దితిజమహేశ్వరుండు చనుదెంచును వచ్చినయంతలోన నా
మతకరిమానవుండు తనమాయ సమస్తము డుల్చికొంచు ని
ష్కృతిఁ గనినట్లు యుద్ధమున గింజలురాల్చిన కంకెయై చనున్. 24

సీ. పదివేలరథములు పదియునెన్మిదివేల
ద్విపములు పదునాల్గువేల గుఱ్ఱ
ములు మఱిరెండులక్షల పదాతులు నైన
సైన్యమ్మువారు తత్సైన్యపతులు

గుఱ్ఱాలు నారాచకోటులు ద్విపములు
పక్షనదంజనపర్వతములు
నశనిగర్జాప్రపాతాభీలమూర్తులు
రథములు రథులు సారథులు హయులు

వారు పాదాతులే కారు వారు పులులు
నాఁగ దోశ్శల్లు కసిఁ గొఱనాసిగండ్లు
నాఁగ జెప్పంగఁదగిన జనంబు చంపి
పీకికొని తింటయేగాని వేఱెఱుఁగరు. 25

చ. మొదలిఁటి సైన్య మంతయును మూలబలం బది యొక్కొకండు నొ
క్కదెసను గోయుచుండగ నొకంటను స్వీయము నెత్తు త్రావు న
ట్టిది యొక చండశిక్షణకు లొంకె మనస్సున నూహ యన్న సం
పద యని లేక జంతుగుణమాత్రము శిష్టముగాఁగ నైనదిన్. 26

ఆ. కూడి యొక్క యొక్క గుంపుగా నేర్పాటు
గుంపునకును నాయకుం డొకండు
నాయకుండె వారి నాథుండు రావణుం
డొక్కఁ డుండె ననుటయును నెఱుఁగరు. 27

చ. తినుటయుఁ గాముభావపరితృప్తియు నాయకు సేయు సంజ్ఞపైఁ
దినుటకుఁ గాను జంపుటయుఁ దెచ్చిన నాల్గవయూహ లేని యా
దనుజులు రెంటులక్షలను దాదృశపటా గజవాజియూథమున్
మనుజులు వానరుల్ మఱియు తిర్యగతజంతువు లెట్టు లోర్చునో. 28

మ. అతనిం జంపెను, చంపులోన భవదీయంబైన దేహంబులో
నతమై మాంసపుకూడు చేసికొని తిన్నన్ వాఁడు నీకేదియా
గతి? యా బొక్కను బూడ్చికో నెఱచి ముక్కన్ వేఱయంటించుకో
మతి సేయన్ వలయున్, విదల్చికొన బ్రహ్మల్ చాల రా వాహినిన్.

ఉ. చచ్చినవాని క్రిందబడి చచ్చుచు నుందురు చావనట్టివా
రిచ్చట నంచు లేదు, తను వెచ్చట నందిన నచ్చటే మఱిం
బెచ్చును దీసి నీయొడలఁ జేర్చిన మాంసము తించునుందు రా
త్రిచ్చెడు నట్టితీ రెలుక త్రవ్వుట పీకుట రేచుచుక్కలై. 30

చ. మరియును బూర్వదానవుల మాదిరి వారలె వీరటంచు వా
నరపతులున్ ధరాకుమాసనాథధరాధరపాళిఁ జంపుచుం
బరిఘులఁ బట్టిసంబులను బ్రాసములన్ గదలన్ ఖరాసితో
మరముల ముద్గరంబులను మానక దానవపాళి చంపుచున్. 31

గీ. రాక్షసులు లక్షలే వానరవ్రజంబు
కోట్లుగా నోటఁ జేసి యొక్కొకని నొక్క
వందమందిగా వేయిగాఁ బట్టికొంచు
సంహరింతురు సముదదోశ్చండు లగుచు. 32

ఉ. మూగిన వందమందియును ముష్టినిపాతములన్ నఖంబులం
దాగరమీఁదఁ బెట్టి యొకదానవు సాగఁగఁ గొట్టులోపలన్
మూఁగయి చచ్చులోపలను మువ్వురినైనను గోఁతులన్ బుభు
తాగతి వాఁడు నస్థులును చర్మము మాత్రముగా మిగుల్చఁగన్.

ఉ. ఒక్కనిచేతిలోఁ బరిఘమో గదయో యసియో ధరం బడం
జొక్కని శౌర్యరేఖ విరచించిన వానరుఁ డొక్కఁ డంతలో
దక్కనపట్టు పట్టికొని రాక్షసుఁ డాతని మేనియందునన్
బొక్కను జేసి మాంసమును భోజనముం బొనరించుచుండగా. 34

క. ఎలుకలు త్రవ్విన గాదెల
వలె నయ్యెం గీశసేన వానరులును దై
త్యులకడఁ జని తినఁబడెదరు
ఫలములు తఱిగికొని తిన్న వడువున నయ్యెన్. 35

గీ. వాజిసైన్యంబు ఝుంఝుగా వచ్చుచుండ
నగ్గుచునుండెఁ గపిసేన మొగ్గుటకును
మిగులుటకు వీలులేకుండ మింటియందు
నాశ్వికుల ఖడ్గనిచయకుడ్యములు కలవు. 36

క. దంతంబులు తుండంబులు
కృంతనమై యేన్గుపిండు బృంహితములు లే
కింతటఁ గబంధములుగా
వింతగ దొరలెడు శిలాళివిధమున రేఁగున్. 37

క. రథములు చక్రభ్రమణో
త్పథమునఁ జరియించు వారి బాణచయంబుల్
పృథుతర తాళద్రుమ న్యూ
ర్జథు రావాభీలముగను సంహరించున్. 38

చ. కడుకొని చావు చచ్చుటయె కాని విచిత్రపు దైత్యసేన బిం
దెఁడుదధి నొక్కకవ్వము మథించెడు సందెడు కీశసైన్యముం
బిడికెఁడు దానవుల్ బిగువు ప్రీలఁగఁ జేసిరి కీశులుం దినం
బడుచును బీకికొంచుఁ దిన మారిమసంగిన యట్లు బెగ్గిలన్. 39

ఉ. అయ్యయొ! కుంభకర్ణుఁ డనునట్టి మహాగిరిదాటి దొంగగాఁ
గయ్యలు కోయ నింద్రజియుగాఁ జను ఘోరనదిం దరించి తా
మొయ్యన వేలుగుట్టలును నూఁటలు వాఁగులుదాటి వచ్చి నేఁ
డిప్పుడ దొంగయూబి పడి యీగతిఁ జచ్చుట చిత్ర మయ్యెడిన్.

ఆ. ఒగిఁ గళేబరమ్ము లున్నవి సంధాన
కరణియో విశల్యకరణియో యగస్త్య
మాని వచ్చి యేమి మన్నించు జీర్ణించి
నట్టి పాడుకపుల ప్రాణములను. 41

సీ. ఇదమిత్థ మని వచియింప రాని మహోభ
యంబున వానరు లావటిల్లి
మిగిలి లాంగూలంబు లెగఁబట్టికొని శ్లాఘా
ధరపత్స్మ కాచును బరువు లెత్తి
రఘువంశపతి పాదరాజీవములయందు
నిర్వ్యాక్కు లగుచును నిశ్వసింప
కోదండమును బూని గుల్మంబు వెలువడి
రామచంద్రుఁడు గాంచె రాక్షసాళి

రాక్షసాళి చూచె రామచంద్రుని వాఁడె
వాఁడె యంచు సైన్యపతులు పలుక
వాఁడెవండో చూడఁబడువాఁడు నెవ్వండో
చూచువాఁ డెవండో తోచకుండ. 42

సీ. నిభృతపశ్చాన్నీరనిధి సూర్యకిరణపా
రీధారలం దేర్పరింపరాక
పైనుండి సన్నజాల్వాఱు మొయి ల్కాన్గు
చివురుకాంతులను బోల్చికొనలేక
తూఁగుమేఘాన సేతువు నీడకును వార్ధి
ప్రతిబింబమందుఁ జావం బెఱుఁగక
ఎఱుపులు విరిగెడు తరణికాంతులలోనఁ
గావిగుడ్డలకాంతి కానఁబడక

సాగి గగనంబు నీరధి జలధరంబు
తరణిగాఁ గానిపించి లోఁబురుషమూర్తి
కనుల మిఱుమిట్లు తొలఁగఁగాఁ గ్రమముగాఁగ
చాఱగా నేర్పరించుకొన్నారు జనము. 43

క. అతనిని భుజింపవలయున
బ్రతివానికిఁ గోర్కి కలిగె రాక్షసు లందున్
మతి చెదరి దైత్యసేనా
పతులును చమువులును భ్రాంతిపడి రాకవేళన్. 44

శా. ఆసైన్యంబును నప్పుడప్పుడు రథాలం దెక్కి హేమావళీ
భాసుల్ సన్ననిపట్టువల్వలు జరీతా దుస్తులై భోగరే
ఖాసంపన్నులు పోవఁజూచిరి, మఱీ యందంబు కాషాయశో
భాసంపన్నత జాట మాధురియు నే పట్లన్ విలోకింపకున్. 45

గీ. మఱియు వెలగల భక్ష్యముల్ మక్కువగను
పూఁతబంగారు రేకులఁ బొదుగుచుండ్రు
రథగజతురంగపాదాతపృథులసేన
యొక్కసారిగ వాంఛించె నోగిరంబు. 46

శా. కోదండంబును వామహస్తమునఁ గైకో లెప్పుడయ్యెన్ ధను
ర్జ్యాదీర్ఘీకృతి యెప్పుడో శరలసత్సంధాన మెప్డో జ్వల
న్నాదంబున్ ఘటవర్ష మొక్కపరి యన్నట్లయ్యె నాముంపులోఁ
బాదం బీతలఁ బెట్ట వీల్పడక నిర్బంధంబుగా నయ్యెఁబో. 47

ఉ. అక్కడ నొక్కచాపి కలఁ డాయన చేయు శరప్రయోగ మీ
ఫక్కిగ సాగుచున్న దను భావమె సాగదు రాక్షసాళి కా
దిక్కున నొక్కచక్ర మది తిర్గుచునున్నది దానిలో మహా
స్నప్రక్కగు నొక్కమూర్తి వివరించెడు నగ్నులటంచు నెంచుచున్

మ. రథముల్ నుగ్గుగ నయ్యె నేనుగులు శీర్షచ్ఛేదముం బొందగాఁ
బృథులాశ్వంబులు కంఠకర్తనము ప్రాపింపన్ బదాతుల్ తనూ
మథనం బందుచుఁ గూడఁ జిత్తముల రామశ్రీశరీరాభిజ
ద్ధి ధురాభావనతోడఁ జచ్చెదరు ధీదిగ్ధాశనాయాజనుల్. 49

మ. దనుజవ్రాతము పైని రాఘవుఁడు గంధర్వాస్త్ర మేసెన్ మఱిన్
దనుజుల్ భ్రాంతినిబొంది యొక్కొకఁడు చిత్తంబందునం బక్కవా
నిని రాముండనుకొంచుఁ జంపికొనుచుం డించున్. మఱింకొక్క యా
తనిచేతన్ వధియింపఁగా బడుచుఁ జిత్తస్థైర్యముం బాయుచున్. 50

గీ. బండిపై నున్నవారలు బండిచక్ర
మల్ల కనిపించు చక్రమటంచు దాని
క్రిందఁ మెడపెట్టి దాని నక్రింపఁజేయు
చుంటి మనుకొంచు మృత్యువు నొందుచుండ. 51

చ. తెగిపడఁబోవు వాజితల దీర్ఘుఁడు రాముని శీర్షమాతలన్
బిగియుచునున్న దంతములు ప్రీల్చివ నంచు నొకండు చేత షే,
యగ నది కోటిలో నిజకి హస్తము లాగి పైకల్చి యెంతయున్
సాగసి తుదిన్ మృతింగనియె శూరుఁడు సేసుఁడు రామశత్రువై.

మ. ఇదియున్ రామునిపక్షమంచుఁ గననయ్యోన్ ప్రామజం బింతయుం
గదలంబోవదు దీని కాళ్లు విఱుగన్ గన్గొంచు వేడిగ్గి త
త్పదమున్ విర్వఁగఁబోవ వానితనువున్ బాదాన మట్టించె ను
న్మదమత్తేభము నిత్యమై మఱిమఱిన్ భ్రాంతుల్ చనున్ సృష్టిలో.

సీ. ఒకచోట నుంత యుంటుకొని దూదివిధాన
మంతయు సురసురలాడిపోవు
నరదముల్ చూపించి నంత నూనెవిధాన
మాటలో భగ్గున మండిపోవు
పొగరేగి మండి గుప్పుమని యారి మఱంత
జ్వాలియుంచి మఱియును నిలిచికాఁ
గుత్తాల యేన్గుల గునుకుఁ బెళ్ళలువడి
కూలఁద్రోసి మఱింత కుములఁబెట్ట

కనఁగ నిది సేనయా లేక కాననంబ!
బాణచయమా మఱిద్ది దావాగ్నియా! శ
రత్తొ గ్రీష్మంబొ యిది సమరంబొ దివ్వి
టీలతో నాల్గుదెసలు ముట్టించిచనుటొ! 5

గీ. నాల్గులక్షల దైత్యసైన్యంబు నమ్ము
క్రుమ్మి దంతర దంతర కుమ్మువెట్టి
వండఁగాల్చెను గుమ్మరావంబు వోలె
క్రమ్మి తద్దివసాష్టభాగమ్మునందు. 55

ఉ. ఆతఁడు రామచంద్రుఁ డగునా! మఱి యాతనిచేతఁ జాపమే
నా! తగ నిర్గతంబు లగునట్టివి యక్కట బాణరాజియే
నా! తమనేత్రముల్ మఱియు నమ్మగజాలరు వానరేశ్వరుల్
సీత గ్రహింపఁ దెచ్చెఁ గపిసేన నితం డిది నాటకంబుగా. 56

వ. శ్రీరామచంద్రుం డంతఁ గోదండంబు డించి తనవంక నివ్వెఱ
నోయి చూచుచున్న సుగ్రీవ విభీషణ నల నీల సుషేణాంగద
మైంద ద్వివిద కేసరి దధిముఖ శతవలి మారుతి జాంబవత్ప్రముఖుల
వంకఁ జూచి నవ్వి యిట్లనియె. 57

క. కలన నిది నేన సేయం
గలుగుదు శ్రీకంధరుం డొకండును జేయం
గలుగును మూఁడవవానికిఁ
గలుగ దసురమూలసైన్యఘట యిది యింతే. 58

శా. పారాడెన్ దరుణాతపంబులు సితప్రావారముల్ గాలిలో
నారంబట్టినయట్లు దాశరథి చూడాభోగరోచిశ్ఛటా
సారాకారము లట్లు ప్రాగ్గగనగోష్ఠత్సొమ్మనోజ్ఞంపు కీ
లారంబందునఁ బాలబిందియులు నొల్కంబోసికొన్నట్లుగన్. 59

క. నడి మధ్యాహ్నపు టెండలు
కడలిజలమ్ము తడిపట్టె కడమాత్రము వె
న్కడుగయి సుంతగ దవ్వగు
పుడమిని సైతమ్ము తాపములు కలిగించున్. 60

వ. గడ్డిపరకయు వదలకుండ సకలమ్ము వినిన రావణుండు. 61

శా. కైలాసంబున నున్న స్వామికిని నిక్కం బింతగా నాపయిన్
వేలాతీతము కోప మెందులకొ? తా వేంచేసె రాముండుగా
హేలాక్రీడగఁ జేయుఁ ద్ర్యంబకుఁ డొకం డిప్వాసనామ్నాయవి
ద్యాలీలాకృతి ప్రాణకాలయుగసంధ్యామర్మవిజ్ఞాతయై. 62

గీ. శివుఁడు కేశవుఁ డిద్ది పంచికొనెదరు ప్ర
ధానమున నిద్ది శివునికృత్యంబు తత్త్వ
మం దభేదము చేయు కార్యములు విడివి
వార లిర్వురె యీ జగత్కారణములు. 63

శా. సీతం గొంచునుబోవ సీతఁ డిట వచ్చెన్నాగ వ్యాజంబు వి
ఖ్యాతిన్ దానవవంశనాశనము కార్యం బీ శివాద్వైతికిన్
సీతం గైకొనిపోవ వే విధములం జేయంగవచ్చున్ మహా
దైతేయోన్మథనంబు ముఖ్యము సముద్రాంభోవ్యథాకారికిన్. 64

ఉ. అచ్చట నొక్కఁడుండును రహస్యము చెప్పఁగ వారి వారి నా
యచ్చట నచ్చటన్ నిలిపి యాయన ధాత్రికి డిగ్గి వచ్చుఁబో
వచ్చినవాఁడు వాఁడె యని బంధురముల్ మఱి యీదృశంబులౌ
నచ్చెరువుల్ వచించెడి నహో! యది నేర్చిన నాటికిన్ వృథా. 65

గీ. నాల్గు తలుపులు మూసి లోనన్ బిగించి
యమర నున్నములోనికి బొమికలేని

యట్టి ప్రీ సేఁతయేమి క్రౌర్యం బిదేమి
యిద్ది యూహాన చేమి యిదేమిసూడు. 66

వ. నా కొడలు మండిపోవుచున్న దనుకొంచుండ బయట హాహారవం
బులు వినిపించి వెలికిరా, మరణించిన మంత్రులయు సేనాపతు
లయు మహోద్యోగులయు భార్యలు కూతుండ్రు కోడండ్రు
వేలాది స్త్రీ జనంబు విలాపించుచు నతనిపాదములపైఁ బడి యింత
దుఃఖించి యిట్లనిరి. 67

శా. రాజా! నీకృపచేత నేల్నములుగా రంజిలినామయ్యా! యా
యాజానేయములున్ సుభద్రగజముల్ హార్యగ్రరత్నంబులున్
భ్రాజద్దేమమయంబులౌ వసనముల్ రాజ్యంబులున్ భోగముల్
రాజా! నీదయలేక నేటికి సముద్రా లయ్యె మా గుండియల్. 68

ఉ. మస్తకముల్ మసుంగులయి మా బ్రదుకుల్ మఱియేమి! యేమి మా
నిస్తులమైన యాలువులు నేటను తేపట నయ్యె! రాహుసం
గ్రస్తములైన మా వగు ముఖంబులు చూడుము రాజ! నీకు మా
పుస్తెల త్రాళ్ళమీఁదఁ బగపూనిన జానకి యెందుఁ గన్పడెన్. 69

గీ. అచ్చరలు వేలుగాఁ జాలరాయె స్వామి
రాజ్యమున నుండిన సమస్తరత్నములును
జాలవాయెను నేటికీ శక్తి వలసె
విఱుచుకొని తిన్నది సురారివీరచయము. 70

చ. అకట! యపేక్ష యొక్కటి యనర్థము కోరినయంత తెచ్చె, నా
యక ప్రియశిష్యుఁడైన మకరాక్షుని కిచ్చకమైన యత్తవా
నికిఁ బ్రియ మంచు శూర్పణఖ నేర్పిన నేర్పులు నేర్చినావు, వం
చకమగు తోఁకచిచ్చిడితి సర్వసురారికులంబులందునన్. 71

వ. కులకులంబులందలి పరోక్ష నిందాగర్భ దుఃఖోక్తుల సారాంశంబు
రావణుండు విని రాముఁ గన్నచో. 72

మ. నగవున్ గన్నులకెంపుగాఁగఁ గనుచు న్నారీవ్రజంబున్ భగా
భగమంచున్ బదిమోములన్ నఖశిఖాపర్యంతమున్ మండె మం
డిగముం గంచును జారి రోకొక్కకరుగా నీరేజపత్రేక్షణల్
చిగురుంగన్నుల కెంపులున్ మిణుఁగురుల్ శిఖ్యుజ్వలజ్వాలలై. 73

ఉ. పోఁడిమిఁ బావకుం డనగఁ బొల్చెను వానివిలోచనంబులన్
వేఁడివెలుంగు ప్రాగ్ధరణిభృత్స్థితి వెల్గులు రెండుజాము తా
వేడిమియున్ గనంబడియె వెక్కసమయ్యెను వానిఁ జూడ నా
పీడిత దిక్తటీగగనబృంహిత చైత్రమహోత్సవంబులై. 74

ఉ. వంచితసాంధ్యమేఘతనువర్ణుఁడు సూర్యుఁడు వెన్కఁతట్టు తా
డించిన యెఱ్ఱవెల్గులు కడిందిగ నంచులయందుఁ గ్రుమ్మి ము
ద్రించినయట్టులై యతని హృద్గతకోపము గ్రుమ్మి వాని దే
హాంచలమంచునం బరిధి యయ్యె మహోల్బణపావకచ్ఛటల్. 75

చ. అది యొక యగ్నిగోళ మరుణాసితమైనది దానిలోపలన్
బెదవులు కన్నులుం బొమలు భీషణమై తగె, మున్ను బిట్టు రే
గి దినము నంటుకొన్నపుడు కేవలపావకభావ మిట్లు లే
దిది యొక యచ్చునివ్వు తన యే తొలిరూపము నేఁడు తాల్చెనాన్.

చ. ప్రతిభయొ కోపమో దయయొ బంధురబాహుబలంబొ శౌర్యమో
యతిశయ మౌచు నొక్కొకనియందున నుండును, దాని యున్నతో
న్నతపరిణామమౌ స్థితి కనంబడ దెవ్వని గాని, పించు సం
గతి సమకూడు టొప్పు దశకంఠుని యప్పటికోప మట్టిదై. 77

చ. భృశము దవాగ్ని మింటికిని రేగును జ్వాలలు, జ్వాల లింధన
స్పృశములు, నస్పృశంబులు చరింపవు జ్వాలలు, కాని, గాలి బా
లిశముగ నొక్కొ కప్పు విదలించును మింటను జ్వాలరేఖ న
స్పృశముగ, నద్ది యగ్ని కురరీకృతమా సహజస్వరూపమై. 78

సీ. ఇదియుండు నదియున్న, నిది లేద యది లేక
యిద్ది సంబంధ మగ్నీంధనముల
కా గాలి విదలించి నట్టి యగ్నిజ్వాల
యది యథార్థంబైన యగ్నిమూర్తి,
కోపమ్ము కూడ నట్లే పొల్చు, నది సహే
తుకముగాఁ బుట్టి హేతువు నశింప
నుడుక మనోవీధి నూగాడు జ్వాలగా
నద్ది కోపాభాస మది యహంక్రి
యా ప్రథమమూర్తి, బంధులు ననుజసమితి
సుతులు నందఱు చచ్చిరి, సురవిరోధి
కోప మెవ్వరికోసము? కోరి మఱల
నేమి సాధింపఁగలఁడు? వారెట్లు రారు. 79

క. వారు వినా యీ భోగము
లీరాజ్యము నుండి లేనివే యగు లోకం
బార! పగతీర్తు నం చను
తీరిన పగ కోపమున కుదించుటయె కదా! 80

గీ. ఒక మహాగ్ని రామాఖ్యమై యురవడించు
శలభములఁ బోలె సర్వబంధుల దహింప
నందులోనికి తా సైత మరుగుచుండె
తెలివి యిది కోపమును బగదీర్చుకొనుట. 81

క. ఈ యచ్ఛమైన కోపం
బే యాత్మపదార్థనాశ మెంచియొ దానం
బోయి ప్రవేశించుటకయి
యీ యమలినభావవృద్ధి యేలో యకటా! 82

వ. దుర్విషహ్యంబై దుర్నిరీక్ష్యంబై యేతాదృశం బయిన జననకాల సంగత జీవగతాహంకార హేతుకంబయిన కోపంబున రావణుండు మండిపోవుచు సమీపస్థులయిన యంగరక్షకులు పరిశిష్టసేనాపతులు మహాపార్శ్వ మహోదర విరూపాక్షులను గాంచి. 83

క. రథ మాయత్తం బఱుపుఁడు
పృథువగు మత్సేన సవదరింపుడు మీరున్
రథులు నను ననుసరింపుడు
పృథివీచక్రంబు నడ్డ విఱుతును నేనై. 84

సీ. దృప్తకాకోలజగ్ధి యవసధీభూత
గిరి మూపురమున నూగించినాఁడ
పదికంఠములు పదిపదిసార్లు శివునకు
వెగటుగా నారగింపించినాఁడ
దిగుపదిక్పతులమోదిన చదలి యిరమ్మ
దపుచెర్వు నీళ్ళులఁ దాపినాఁడ
సకలత్రయీశబ్దసంఖ్యా పరిజ్ఞాన
దీపమ్ము లోకానఁ దెచ్చినాఁడ

వేలయేండ్లుగఁ దపము తపించినాఁడ
నూల్కొనినయట్టి యల్పమానుషపుశక్తి
న న్నెదిర్చిపో నగునె ప్రాణములతోడ
యిపుడు రావణుఁ డెవఁడో తా నెఱుఁగఁగలఁడు. 85

శా. అన్నాదమ్ములు మచ్ఛరప్రహతులై ప్రాణాంతకాలంబునం
ద న్నేలం బడియుండి రాత్రిసమయం బై చుట్టునున్ మూఁగియు
న్న న్నక్కల్ కనులున్ మిణుంగురులుగా నా బాణపుంఖంబులం
చు న్నేత్రంబులు మూసి ప్రాణములయంచు ల్పూతురున్ భీతులై.

మ. కపిసేనాశనముల్ పరిస్ఫురితలంకావార్ధి వేలావనీ
విపులక్ష్మాజచయాలవాలములలో విస్ఫారమై తత్ఫలా
నుపమశ్రీరుచిహేతుకంబు లగుతన్ నూలొక్కన్న మద్దీన్యద
త్ర్రప్రవహ్నిన్ మతి పాళమైయుడికిమాంసంబుల్ రుచింబొందగన్.

శా. నేనున్ వానరవాహినీచయముల న్నేతున్ బ్రమూర్ఛాగతం
బై నింగిన్ మఱి నేలయుం దెలియరాన ట్లాచరింపన్ మద
స్త్రాగ్నీతానలదగ్ధు లయ్యురువు రాహా చూర్ణితాస్థుల్ మను
న్నానాధ్వంబులలో నణుప్రతతు లైనం గానరాకుండఁగన్. 88

ఉ. మున్నొకరెండుసార్లు మృతిపొందిరి లేచిరి నేఁడు మచ్ఛరో
త్పన్నులు లేచు టెప్పగిది సంభవమౌనో, విదగ్ధచూర్ణితా
స్థ్యన్నమితాణుదేహు లయి యూరక పంచిన పంచభూతసం
పన్నతఁ దూపరాణు లయి పట్టిన మచ్ఛరసంచయమ్ములన్. 89

ఉ. దిమ్మయి ప్రాణముల్ బయలుదేరియు మచ్ఛరకల్పితాంధకా
రమ్మున మార్గముం దెలియరాక సమీహితలోక మేగలే
కి మ్మొఱఁగంగరాక చరియించుచు నట్టె నిరంతపంచభూ
తమ్ములయందుఁ జొచ్చుటయొ తా నది ప్రాసెను వారి కిచ్చుటన్.

వ. ఇట్లు నిరంతరితసాంపరాయభావనాపరంపరాపరిమిళిత చిత్తవృత్తియై
సమాయత్తపడుచి తేఁబడిన తేరెక్కి ధనుస్సుం జేఁబూని. 91

గీ. క్రూరమహా త్రాటితుదియుచ్చు కోటి వంక
రకు లగింపఁబో మాటిమాటికిని జారి
యాతఁ డెంచె నుద్వేగ మైనట్టి వేళ
నే పనియుఁ దొందరగ సాగనీ దటంచు. 92

గీ. వామబాహూరుయుగపరిస్పందనమున
నెంచె దశకంధరుండు న దిట్లొకాదె
పదియునేడు దినంబులు పట్టరాని
నిద్రయు సయించఁగాని తిండియు నటంచు. 93

గీ. కేతుదండోపరి విషాదకృద్గరు చ్చి
క్షీరి ఘోర్జితానుస్వారగృధ్రచయముఁ
గాంచి యతఁ డెంచె మది నావరించెఁ గపిశ
వాదఖగరాజి లంకావియ త్తటంచు. 94

గీ. గగనమున నుండి నెత్తురుగాఁగఁ గురిసె
నవ్వుకొ నె రావణుఁడు గగనంబునందుఁ
దరణికిరణావృతము లంబుదములు ర క్త
దంబు లగుటలో లేదు చిత్రం బటంచు. 95

గీ. రామలక్ష్మణు లున్న ద్వారంబునుండి
రథము తోలించె దానవరాజు రాజి
తాంతరాగ్నిశిఖా లోచనాంశుఁ డగుచుఁ
దన కిరీటచ్ఛవుల్ మిన్నుఁ దన్నుచుండ. 96

క. తోరాలు త్రొక్కె సరదం
బారూఢిగ ఘోరవానరానీకినిలో
వీరకపులు దాని త్వరా
ఘూరాధూతిఁ జన దూరదూరంబులకున్. 97

సీ. ప్రళయఝంఝామరుత్పాతంబు పోలిక
రాక్షసురథము దూరాలు తోలె
యమదంష్ట్రికాహంక్రియాక్రియవలె దైత్య
నారాచసమితి ప్రాణములు తీసె
గిరిశేఖరము పెల్లగిలి దూకు గతి వాని
ఖడ్గపాతము బొమికలను నూరె
ఘనమహాజలపాత మన వానిశౌర్యవా
హిని యధఃపాతాళమునకుఁ ద్రొక్కె.

రాక్షసు చరించినంత పేరయుఁ గపీంద్ర
సమితి సమితింజయుని వాని శౌర్యవహ్ని
ప్రమితి లేకుండఁ జచ్చె దీప్రమతులైన
విపులా కపులెల్ల నివ్వెఱ భజింప. 98

సీ. రక్షశ్శరాంతకార్యముగఁ జెవుల్ తెగి
పడిన సంగీతమ్ము పాడె నొకఁడు
అసురేశ్వరుని వాలుట మ్మూరువులను ఛే
దించ మద్దెలను వాయించె నొకఁడు
అసుర శరాళి సర్వాంగమ్ములను రట్టు
సేయఁగా నాట్యమ్ము సేసె నొకఁడు
అరచేతులను దైత్యవరుఁడు మండింపగా
విలవిల తాళంబు వేసె నొకఁడు

రామభూపాలరాగపర్యాప్తగళులు
వేలకొలఁదిగఁ బాడిరి వెనుక హంగు
రావణుండు శరాంతకార్యముగ రామ
భజన చేయించె వానరవ్రజముచేత. 99

సీ. లంఘించుచున్న గోలాంగూలు పాదముల్
ఖండించె నొక్క రాక్షసుఁడు కడిమి
నిగిలించుచున్న కపీంద్రుని దంతముల్
రాలఁగొట్టె మఱొక్క రాక్షసుండు
వృక్షంబు విసరు కపిశ్రేష్ఠు పృష్ఠంబుఁ
దాడించెఁ బరిఘతో దానవుండు
చేయెత్తిపట్టి కీశేను బాహామూల
మగలించె నొక్క దైత్యప్రభుండు

పొడిచి పనిచేయఁజాలక పోయె వంద
వానరుల గుంపు నొక దైత్యవరుని ముందు
నింగి నెగిరెడు వానరుల్ నేలపాలు
జాతిగా మాఱె మూలరాక్షసుల యెదుట. 100

చ. మరియును గడ్డుగా నగు సమస్యయె యియ్యది యెప్పుడైన ను
ద్ధురుఁ డయి రావణుం డనికి దూఁకిన నాతనివెంబడిన్ మహా
పరమపరాక్రముల్ కదలి వత్తురు రాక్షసవీరు లా ధురం
ధరులను గెల్వఁ గష్టమగు దానికి వేఱ ప్రయత్న మొప్పనాన్.

శా. సుగ్రీవుండు స్వసైన్యముం గనుచు సంక్షోభంబు పొందంగఁ గ్రూ
రగ్రావంబులు వృక్షముల్ గొని మహారక్షశ్చమూవ్రాతమున్
దృగ్రక్తాంశులుగా నెడంపెడగ మోదెన్ మోదినన్ రాక్షసుల్
ప్రాగ్రూక్షత్వము తూలియున్నను విరూపాక్షుండు సక్రోధుఁడై.

శా. మత్తానేకప మెక్కి సూర్యసుతు నున్మత్తేభసంతానసం
పత్తిన్ వక్షము వ్రచ్చి యాతఁడును దిగ్భ్రాంతిన్ వహింపన్ గపుల్
మొత్తంబున్ గదలింపు లూఁచి విదలింపుల్ గాఁగ బాణంబులన్
మిత్తిం జేర్చుచునుండె వందలుగ నున్మీలద్భుజాదీప్రుఁడై. 103

ఉ. ఈ విలయంబు దాటు టిది యెట్టులు కన్పడు వీరు మువ్వురున్
రావణు నంగరక్షకు లరాతిభయంకరు లందుచేత, నీ
మూవురు చావకుండ దశమూర్ధుఁడు లోఁగుట లేదటంచు సు
గ్రీవుఁడు నిశ్చయించె మువురిన్ మునుముందుగ సంహరింపగన్.

గీ. కడఁగి రథము వదలి గజము నెక్కెను వీఁడు
గజము మీఁది మొకుపు కలఁడు వీఁడు
రథము చావకళకుఁ బ్రథితవాహనమైన
నితని కేమొ యేను గెక్కెరింత. 105

మ. అని సుగ్రీవుఁడు వాని పెన్గజము కుంభారామముం జొచ్చి యా
తని బాణంబును దూయనో నెడము చింతల్ వీలు లేకుండఁ బె
ల్చన నయ్యేనుఁగు కుంభమున్ నఖములం జక్కాడి పెన్గ్రిద్దుచే
ననిచెన్ దానిని స్వాగ్రజావసథమున్ హారిప్రమోదాకృతిన్. 106

ఉ. అక్షుల కోఁగలందుఁ గన లగ్నికణంబులు రాలఁగా విరూ
పాక్షుఁడు డాలు వాలు గొని యాకసమం దెడమున్ సహించి ఫా
లాక్షుఁడు చేతి ముమ్మొనలయమ్మును వాల్చిన యట్లు వాల్చెఁ ద
ద్వక్షమునందు సూర్యసుతు వక్త్రము వక్రముగాఁగ బాధచే. 107

ఆ. సొక్కువచ్చెఁ బోయె సూర్యసూతికి లిప్త
లోనఁ దెలియు నంతలోనఁ దెలిసె
నాయుధములయందు నసహిష్ణు వీతనిఁ
జంపుటకును వేఱ చంపవలయు. 108

చ. కలియఁబడెన్ సరోజసతికాంతునిసూనుఁడు దేవతారితోఁ
బలకయు వాలు లాగికొని పాఱఁగవేసెను దవ్వనందునన్
నెలయఁగ మల్లయుద్ధమున వీడిన వాలినిగాని ముజ్జగం
బులఁ దనయంత వాఁ డెసఁగబోవఁడు నాఁగ నెఱింగి గుండియన్. 109

చ. కలియుచు దవ్వుపోవుచును గ్రమ్ముచుఁ గ్రుమ్ముచుఁ బాణిపీడనో
జ్వలతను గంచుఁ దాఁచుచును సౌర్యుఁడు వానిశరీరమందు నే
వలనునఁ దీవ్రఘాతమును బట్టఁగ జాలఁడొ చూచి చూచి య
గ్గలముగ శంఖదేశమున గాఢముగాఁ బ్రహరించె ముష్టితో. 110

క. అది యతని ప్రాణనిర్గతి
పద మి దితని సర్వశక్తిబృంహకముష్టి
ప్రదము విరూపాక్షుఁడు యమ
సదనంబున కింతలోన సాగినయంతన్. 111

గీ. అంత మదిలోన రావణుఁ డనుకొనియెను
వాలి బలశాలి యితఁడు ధీశాలికూఁడఁ
దెలివిగా వానిచేతిలోపలి నవాయు
ధమ్ములు తెమల్చి మల్లయుద్ధమున దించె. 112

చ. బవరను గల్గెనే నుభయపక్షములందున వీరు లుండ్రు వా
రవిరళశౌర్యవంతులును నక్కట గెల్చెడినట్టి పక్షమం
దు వెలయువా రెదో తలఁపఁ దూఁగి ఫలించును గానిచోటఁ గా
దు విమలశౌర్య మెందులకు దుష్టము దైవము చేయుచుండఁగన్.

శా. నన్నున్ వీఁడొకరెండుసార్లు మును పెన్నం బోర రక్షించె వీఁ
డన్నన్ గుండెదిగుల్ సురేశ్వరులకే నా వీరుఁ డీ వీరుఁడై
చెన్నేదన్ మును వాలి నన్నుఁ దినిపించెన్ వేనిచే వానిచేఁ
జన్నే యీగతి నయ్యెనంట కృతే మాశ్చర్యంబు కల్పించుచో.

శా. మాపక్షంబున వీరు లెల్లరు నసామాన్యుల్ త్రిలోకీజిగీ
షాపర్యంత పరాక్రమాంబుధులు నాశ్చర్యం బగున్ గీర్తి యేఁ
డో పై వాని పరాక్రమక్రమము దిగ్వ్యూహాంబునం జొచ్చి బా
హాపర్యాప్తుఁడు క్రిందివాఁ డతని ఛాయాగ్రస్తుఁడై పోయెడున్. 115

క. కోపమ్మును గోపముగా
దీపించును జీవులకును దెలివి తెలివిగా
దీపించును దీపములకు
లోపించని వెలుఁగు నీడలుం బలె నకటా! 116

వ. అంత రావణుం డూరక కోపమ్ముతోఁ జెరిగిపోయి రామలక్ష్మణ
సుగ్రీవులు మరణించితీరవలయు నన్న కోపముతో మహోదరునిఁ
గాంచి యిట్లనియె. 117

ఉ. వీఁ డొక చెట్టకోఁతి మనవీరుల నెందఱినైనఁ జంపెఁబో
పోఁడిమి నెట్టులైన మృతి పొందఁగఁ జేయుము వీనిఁ బోరిలో
గోడిగ మల్లయుద్ధమునకున్ దిగు నీతఁడు నిన్నుఱుంగకన్
వాఁడిమగండు మృత్యువును వాఁకిటికిం గొనితెచ్చుకొన్నటుల్.

శా. ఈ దుర్మార్గుని నేనె చంపుటకుగా నెంతున్ మఱిన్ నాకు మ
ర్యాదానష్టము వీనితో నెదిరి పోరాడన్ ధరాకృత్స్నమ్ము
త్సన్నద్ధాంగుఁడ నేలపై బొరలి క్రిందన్ మీఁద నాఁటేమి? యా.
హా! దైతేయకులాధినాథునకు నీవై యుండ నా మాఱుగన్. 119

శా. వీనిం గుత్తుక కత్తిరింపుము ధనుర్విస్ఫార నారాచమా
ర్గానన్ నేనును రామలక్ష్మణుల వా కంఠంబులన్ గర్తరీ
స్థానంబుం బొనరించెదన్ గగనపుష్పం బామరీ కిన్నరీ
నానోచ్చైః పరిదేవనాకృత మిళిందస్వాన పూర్ణంబుగన్. 120

చ. అనుడు మహోదరుండును సహుంక్రియ హుంక్రియగా వెలార్చుచున్
గనుకని సూర్యసూతికి మొగంబుగఁ జాపవినిర్గతోగ్రమా
ర్గణములు నీటివెల్లువలుగా వెలలించుచు విల్లు రామచం
ద్రునివలెఁ జక్రమట్లుగఁ గనుంగొనఁ జేయుచునుండఁ జూచుచున్.

గీ. ఒక మహాశిల్పి యగుటకు నొక్కవేయి
లక్షణము లుండు నే రెండులక్షణములొ
యమరియుండిన వాఁడు తనంత శిల్పి
సృష్టిలో లేఁడటంచు గర్వించుచుండు. 122

అయ్యో! రఘూత్తముండు ధనురంతమునందున నాల్గులక్షలన్
ద్రయ్యఁగఁ జేసె దానవుల వానరసైన్యము నిన్నికోట్లు తాన్
ద్రయ్యఁగఁ జేసె నిప్పటికి రావణుఁ డచ్చెరునంది చూడఁగా
నియ్యసురేశుఁడున్ మఱియు నింతటిసైన్యము నందు నేటికిన్. 123

క్రేవల వానివిల్లు పచరించిన ద్రోహము చాలనట్లు సు
గ్రీవుని ఫాలమున్ శరయుగీవినికీర్ణము చేసినంత సు
గ్రీవుఁడు వన్నుఁ జంప నుఱికించెను వీనిని రావణుండు వీఁ
డావల మల్లయుద్ధమున యందున నేర్పరియేమొ కావలెన్. 124

ఐనను దాను చాపమున యం దధికుండ నటంచు నెంచు నేఁ
డైనను నొక్కవిద్యను మహానిపుణత్వము కల్గి వేఱవిద్యలోఁ
దాను ప్రవేశముం గలిగి దానను గొంచెము నేర్చి దీనియం
దైన మఱంతవాఁడ నని యచ్చపు గర్వము కండలించెడున్. 125

అనుకొం చొక్కవిలి పత్త్రోన నితఁడాహా! యిట్లుగాఁ జేయఁ బొం
దునటం చెంచగ రాని దా నిముసమందున్ బండిపై దూకి యా
తని గుఱ్ఱంబుల కంఠకర్తనముగాఁ దత్సారథిం జంపి యా
తని చాపమ్మును నమ్ములన్ విఱిచి దంతక్రీడగా నిల్చెనన్. 126

అంత మహోదయుండు ప్రభు వాడిన నిక్కము నెంచి వానికే
ల్వంతము మీఁజుఁ బట్టుకొని లాగి ధరాస్థలికిం గపీ! మఱంత దు
ర్దాంతుఁడ వేమి చూచెదను తమ్మని యాతని గుండెపై భుజా
దంతురముష్టిపాతముగఁ దాడనముం బొనరించె నుగ్రతన్. 127

చ. ఇరువురు రొక్క నొక్కరి సహించుచు వెక్కసమందుచుం గ్రుధా
భరమునఁ గక్కసించుచును బట్టి యొడళ్ళను బ్రక్కలించుచున్
మిరమిరలాడఁ జూచుచును మింటికి నెత్తుచు నేల వ్రేయఁగా
సరగున లేచుచున్ మఱియు సాగుచుఁ జాదుమ బిట్టు మోదుచున్.

మ. మది సుగ్రీవుఁ డెఱింగె వానిదగు సామర్థ్యంబు బాహాబలో
న్మదవృత్తిం గొనిగాని కై నసిమొదల్ మన్నించినంగాని యా
పద పొందింపనురాద యేమఱిలకన్ వానిన్ వధింపంగ రా
దది వాఁ డేమఱుపాటునుంగలఁడ తానై దూకుటన్ నేర్వకన్. 129

వ. అగ్రదృష్టి మహోదరునిపై నిలుపుచుఁ గ్రేవల జాగ్రత్తగాఁ బరి
కింపుచు నంతదూరాన నున్న పరిఘంబు చూచి వానిచేతఁ
ద్రోయంబడి యందు వ్రాలి వాఁడు వెంబడిఁబోడువరాఁ బరిఘతో
లేచి దానితో వానిమెడ తెగనఱకిన 130

క. హాహాకారోచ్చైర్నా
దాహృత బహుదనుజకంఠమై మిన్నొరసెన్
సేహాజయనాద లసత్
హీంహీంలఘుహాస మొప్ప నేచిరి కపులున్. 131

గీ. రావణుఁడు సుంతగా నివ్వెఱన్ భజించి
యింతలోఁ దెల్వివచ్చి తానిట్లు తలఁచె
వలయు విద్యకై కాగ్ర్య మభ్యసనవేళఁ
జనును బహుముఖత్వము ప్రదర్శనము వేళ. 132

చ. నరుల వివేక ముజ్జ్వల మనంతముఖంబుగ నుండు నల్లె వా
నరులదిగాఁగ నెంతయుఁ గనంబడు హన్మ యొకండు తీవ్రసుం
దరమతి వీఁడు నైనఁ గలనం దెలివిం గనిపించు పట్టియా
శరమతి బిట్టుమందగొడి జంతుబలంబున సంతసించెడున్. 133

ఉ. ఏనొక పెద్దపర్వతము నెవ్వఁడు నెత్తఁగలేఁడు నన్ను నాన్
దానవుఁ డెంచునొక్కఁడు యథార్థము వానిని నందమందియుం
బూని కదల్చలే రొకఁడు బుద్ధిబలంబున లేపు సుల్వుగా
మానవజాతి నూత్న్మ్రుచుతి, మాధవుఁ డిచ్చుటనే జనించెడున్, 134

క. అనుకొంచు నున్న రావణు
మనమున నూరకయ పెద్దనుంటలు మండెన్
దమ దాను గాలిపోవక
వనజాతేక్షణునిఁ గాల్చువంక మఱల్చెన్. 135

శా. ప్రాంతంబందున యుద్ధమాడెడి మహాపార్శ్వున్ సమీపించి వృ
త్తాంతంబున్ విధిపింప నాతఁడు సమీపారణ్యదావానల
స్వాంతుండై యొసఁగన్ దశాస్యుఁడు నిజస్వాంతంబువించెన్ గ్రుధా
సాంతత్యం బెసగంగఁ గోపము ననోత్సాహంబు కల్పించుచున్.

ఉ. నా దుముదారులఁ మిగిలినాఁడవు నీవొకఁ డీ కపీంద్రసే
నాదళనంబు నీబుజమునం గొనసాగవలెన్ మఱింక నీ
వాదిప్రచండదైత్యకులమం దుదయించితి దైత్యరాజ్యమ
ర్యాద సమస్త మిప్డు భవదంసము పట్టెను వీరశేఖరా! 137

చ. దళముగఁ గీర్తిలక్ష్మి యొక తారువుఁగత్తెయ యాత నీకు ని
ర్దళనము పొంది రా నిఖిలదానవవీర్యులు నీవుగా నిర
ర్గళముగఁ జొచ్చి యింత సమరావసథంబు జయేందిరాసుధా
గళమువ హేమసూత్రమును గట్టు స్వయంవరగాఢసూత్రమున్.

ఉ. మొక్కలుపోయి యింక నయిపోయిన దన్న సురారిలక్ష్మి నీ
వొక్కఁడు దండిపై నిలుపుమోయి చమూపతి! పౌరుషంబె నీ
దిక్కగుఁ గుత్తుకన్ విసము తేరిన సామిని నమ్మి నేటి కీ
ఫక్కికి వచ్చినారము కరవాలమె నీకు శరణ్య మన్నిటన్. 139

క. నన్నడిగినచో గెలుచుట
యన్నది లేదిపుడు గెలుచు టది యేలా నే
నున్నది చివరకు గెలిచితి
మన్నది కన్నీళ్ళు తుడిచినట్టులు కాకన్. 140

ఉ. ఈకపులున్ నృపాలకులు లిద్దఱు నింద్రజి చేత రెండుసా
ర్లాకడఁ జచ్చిరిం బ్రదికి రయ్యది చిత్రముగాఁగ నీవు నే
నీకడఁ జంపినన్ బ్రదుకు టెట్టులొ చేయుదు రైనఁగాని నీ
నా కరవాలముల్ రణమునన్ వధియింపక వీరిఁ దప్పదున్. 141

మ. నునుపౌ మక్కువ వేఱజాతివయి యర్ణోరాశినీళ్లుల్ మథిం
చిననాఁ డేమొ విరించి నెన్నొనసట వ్రాసెన్ దైత్యమహా జాతికిన్
మన మేమో మనశత్రులన్ గెలుతుమ న్మాటే తుదిన్ వారు ని
న్నును నన్నున్ వధియింత్రు గెల్చుటయు నెందుం జచ్చు టీజాతివై.

క. అమరులుఁ సగే సురాసుల
కమరిన సర్వారిచయము నమరు లగుటా? వ
ట్టి మనుజులుం గపులున్ వీ
రమరు లగుట యేమి? బ్రహ్మ ననవలెఁ గాకన్. 143

వ. అంతకు ముందు మహాపార్శ్వుం డంగదుని సేన కభిముఖుండై గుఱ్ఱమ్ము నెక్కి ధనుఃఖడ్గక్రీడాప్రచండుండయి కపిసేనాదుర్నిరీక్ష్యుండై యంగదాదులు వాని ధాకకుఁ దాళలేకుండనుండ. 144

ఆ. గిరులు తరులు వాని శరములఁ జూర్ణమై
వానిపైన దూఁకరాను రాక
యతని చాప మాడినంత మేరయు మృత్యు
దేవతావిహారతీర్థ మయ్యె. 145

క. నిలచినచో నిలువక యు
జ్జ్వలసౌదామనివిధాన నల్గనపటువై
జ్వలియించె వాని యశ్వము,
నలయశ్వము వాఁకు, వాని నశ్వము పెనుపన్. 146

ఆ. అతని పార్శ్వవర్తు లతనికంటెను గూడ
నధికు లగుటచేత నంగదుండు
మఱియు జాంబవంతు మఱియు గవాక్షునిఁ
దోడు తెచ్చికొనియెఁ దూఁగలేక. 147

క. మువురకు బరువై యాతని
బవరమ్ము గవాక్షుఁ డనియె వాఁడును మనకున్
మువురకు నసాధ్యుఁ డగుఁ గీ
శపీసుల మఱెవ్వరికి నసాధ్యుఁ డనంగన్. 148

మ. అనినన్ వాలిసుతుండు నవ్వి, యటులా? యట్లెన్నఁడుంగాద, యీ
దనుజశ్రేణి నెవండు నేన్ మన కసాధ్యంబైనచోఁ దానెఱుం
గునుసూ మారుతి, తానె వచ్చి యిట నీకుం బర్వు తగ్గించు, మిం
చినచోఁ దాన యెఱింగి స్వామి ధనువుం జేఁబూని యేతెంచెడున్.

గీ. అందుచే నసాధ్యుండు కాఁడని వచించి
మఱి మహాపార్శ్వుఁ డన్నట్టి మాట కేమొ
పార్శ్వగతరత్షుఁ దొలుతను బాయఁజేయఁ
గా వలయునంచుఁ జెప్పి యంగదుఁడు మఱియు. 150

క. యుగపత్క్రియాప్రచండులు
నగు నమ్మువ్వురను నాతఁ డాగికొనన్ లే
డుగఁజెప్పి పార్శ్వగుల నే
చి గవాక్షుఁడు తాఁకుటయుగఁ జెప్పి మఱియునున్. 151

గీ. తోడ లంఘించి జాంబవంతుండు వాని
గుజ్జమును జంపుఁ బరిఘుఁ గైకొంచుఁ దాను
నెగిరి వానిఁ దాఁకుట నిర్ణయించి రావ
ణుఁడు చనుదెంచి మాటాడుచుండ నాగి. 152

వ. విషయంబు తెలిసికొని యిది తనపినతండ్రికి బరువగుట మఱియుఁ దొందరింప రావణుం డటు మఱలుటయు నిటు తననిర్ణయంబు ప్రయోగించుటయు నై మహాపార్శ్వుండు నిర్వేఱపోయి వాహనంబుపోయి పార్శ్వరక్షపోయి ముసలంబున నమ్మువ్వురను మూర్ఛనొందింప నంగదుండు తెలివి పొందుటయు మహాపార్శ్వుండు వాని యెడమబుజంబున గొడ్డలితో వేయ నంగదుండు బుజము తెగియు నది లాగికొని దానితో వానిశిరస్సును ఖండించిన. 153

గీ, ఒక మహాసాగరము మధ్య నొక్కపెద్ద
కంబమును నాటి చుట్టును గట్టియున్న
సౌధమున నొక్కఁడొక్కఁడు జారిపోయి
యల్ల కంబము మిగిలిన యట్టులయ్యె. 154

శా. ఒక్కొక్కప్డు మనస్సె యూడద యెదో యూహన్ బయ ల్దేరు నా
యొక్కొండై చను నూహయోయదియె వేఱొక్కండు రానీయకన్
ఇక్కల్ గాఁ గొనసాగ దేపనియు నీచిత్తంబు స్తంభించు నా
యొక్కండే తొలియూహ నిల్చి చనుఁ దా నుద్భూత మైనట్లుగన్.

గీ. రాముని౦ జంపవలయును రామలక్ష్మ
ణులవలన నీ మహావిపత్తుల పరంప
రలు ఘటిల్లె రాముఁడు చావవలయు ముందు
లక్ష్మణుఁడుగూడఁ జావవలయుఁ బిఱుంద. 156

శా. రాముం డెవ్వఁడు లక్ష్మణుం డెవఁడు నారా! వేల్పులా? దైత్యులా?
యేమీ! దిక్కుల నేలునట్టి దొరలా ? యే వేలయేండ్లైన ని
స్సీమప్రౌఢి సరోజసూతినిఁ దపశ్శ్రీచేత మెప్పించిరా?
తా మెవ్వా రొక మంటిముక్కదొరసంతానంబ, యాశ్చర్యమై.

గీ. నిన్న మొన్ననా వీరు నాకన్ను లెదుటఁ
బుట్టినా రింతలోపలఁ బొడుచుకొంచు
వచ్చినా రెట్లుగా గ్రుడ్డువచ్చి పిల్ల
వెక్కిరించిన యట్లైన విధము తోఁచె 158

గీ. గాలితోఁ బుట్టుచుండును గాలితోడఁ
జచ్చు నీఁగల దోమల చాయఁ బుట్టు
మంచు వందేండ్లు బ్రదుకని యట్టి మనుజ
లోక మహావృక్షముం బలె నూగుచుండ్రు. 159

గీ. ఇంతలోఁ ద్రుంచికొనిపోవు సీతఁ డొక్క
గట్టిజీవునివలెఁ జెట్టుకట్టినాఁడు
వీని చెట్టుతనంబును జెల్ల గింతు
వీని చెట్టుతనంబును విద్ధపఱతు. 160

మ. ఇది నారాయణమూలమౌ తరువు నా యీ రాముఁ డన్బోదయొ
ప్పిదమై లక్ష్మణుఁ డన్న పంగయు మహాభీష్మంబులౌ శాఖలై
ముదివగ్గైచను జాంబవంతుఁడు మరుత్పుత్త్రుండు సుగ్రీవుఁ డం
గదమైందద్వివిదుల్ గవాక్షగవయుల్గా వందలౌ వానరుల్. 161

మ. ఇది యీ కొమ్మలు సాగకున్న మునుపే యే దీని భేదింపఁగా
మది నూహించితి జానకీహరణ మన్మందుం బ్రయోగించి మొం
డిది యీచెట్టును కొమ్మలన్ విరిసి నిండెం బూలతోఁ బండ్లతోఁ
జదలున్ సాగర మావరించినది యాశాసంతతిం గ్రుమ్ముచున్.

శా. అస్మద్బాహువిలంబి చాపగళితోద్య ద్బాణవహ్నిచ్ఛటన్
భస్మీభూతముఁ జేతు నీదృశమనోభావంబు దర్పంబునున్
విస్మేరావహమైన యీదృశధనుర్వృత్తంబు నృత్తంబుగా
నస్మద్బాహుపరాక్రమేందిరకు దీవ్యద్దిగ్యశోమూర్తికిన్. 163

శా. ఖండింపన్ దొరకొన్న గొడ్డలుల మొక్క ల్పుచ్చు నీకొమ్మలన్
మండింతున్ బహుశస్త్రవహ్ని దివిలో మంటల్ ద్విధాభూతమా
ర్తాండజ్వాలలు గాఁగ బొగ్గులకునేన్ రాకుండ న న్నీ మహా
ఖండక్రోధమహాగ్ని మండలముగాఁగం దీర్చె వీఁడద్దిరా! 164

శా. ఓయీ! సారథి! నేను నారథముతో నున్నాను నీతోడ దై
తేయంబైన సమస్తఘోరకధరిత్రిన్ శిష్టమై, యింకఁ బో
నీ యారాముని గుండె కెట్టయెదురై యేరీతిగాఁ బోవు నా
యీ యమ్ముల్ మఱి యంత సూటిగ మహోహిక్రూర వేగంబునన్.

శా. ఓయీ సారథి! మున్ దిగీశ్వరుల నే నొత్తన్ సురగ్రామముల్
పై యుగ్యంబుల మింటఁదోలితి మహాప్రౌఢిం బ్రతోదింపు మా
తోయం బొప్పఁగ రాముఱొమ్ము పగిలింతున్ నేను దోడన్ సుమి
త్రాయోషాసుతుఁడన్న యాతని యెడందన్ వ్రక్కలింతున్ మఱిన్

శా. సారించెన్ దితిజాధినాథుఁడు ధనుర్జ్యావల్లి దిక్కుంభిక
ర్ణారూఢం బగు మింటి శబ్దగుణ ముగ్రంబై ప్రమాణాతిగం
బై రంహఃపరిసర్పణంబుగ విశీర్యత్త్వంబు సంధించుచుం
బారావారములోని వారణపరిస్పందంబు కుంభింపఁగన్. 167

మ. డిమభూతంబుగ బాణసంతతి నిగిడ్చెన్ దిక్కటాహంబులం
దమరారాతిజగన్మహేశ్వరుఁడు వ్యోమాపూర్ణ నానామహీ
ధ్ర మహాకానన భూమిజాతచయ పత్రశ్రేణులుం డుల్లగా
భ్రమరీసంచరణాభిరామ కుసుమవ్రాతం బపేతంబుగన్. 168

మ. శితికంఠార్చనదక్షుఁడా నసుర చేసెన్ సింహనాదంబు వి
క్షతమై భూతహృదంతరం బది ధరాసంలగ్నకక్షత్రసం
తతిప్రాణాంగణధర్మభావము వియత్సంలగ్ననక్షత్రస
తతి నిత్యభ్రమణోద్గిర త్కిరణసంతానచ్ఛవిచ్ఛేదమై. 169

గీ. ఎగిరి గుఱ్ఱాలఁ దోలించె హేష లొప్ప
తగిలి రథమును దూఁకించె ధరణి కదల
రగిలి జ్యావల్లి మ్రోగించె గగన మద్రువ
మిగిలి శరములు విదలించె మిన్నుమండ. 170

ఉ. సత్తు నసత్తు రెం డివియు జంట సదా చనుఁ దోడుతోడుగాఁ
గత్తియు వర్మమున్ ముసుగు కాల్వయు వెంబడిఁ బంటకాల్వగా
నెత్తిన ప్రాణసంతతి వహించును వీనిని, స్పర్ధపూనెడున్
సత్తువయిన్ నిరంతర మసత్తు నసత్తును దొత్తు లేనిదై 171

గీ. సత్తు భావము వెలుఁగు, నసత్తుభావ
మిరులు, తొలిమూఁడు నిజము చివరి వబద్ధ
మిచటఁ గొంతది కొంతిది, సృష్టి సత్తు
నకు నిరతభీతియ యసత్తనంగ నకట. 172

చ. తవిలి యసత్తు సత్తివి యధర్మము ధర్మముగా నెసంగుఁ దా
నవిరతమై యధర్మము దురాగ్రహి, సత్తున కైన యీ యస
త్తువలని భీతి మానవులతో సుర యక్ష పిశాచ దైత్యదా
ననతతితో నెసంగెడు, మనఃక్రియ లొప్పెడుఁ బ్రాణిరాజితో. 173

ఆ. భయ మనఁగ నాంతరము పరిస్పందనంబు
పంచభూతముల్ సైతము భయమునందు
రావణుని యీ పరాక్రమారంభమునకు
క్షితి గగన వార్ధులును విహ్వలత వహించె 174

ఆ. అరయ సత్పదార్థ మన్నింటిలో నుండు
నదియు లేక యున్కి యనుచు లేద
యున్న సత్పదార్థ ముదధి ధరా గగ
నాదు లందు దైవమునఁగ నుండు. 175

ఉ. దీపితమూర్తియై వెలుఁగు తెచ్చిన ధర్మము సత్తునైన సీ
తాపతి నాశనార్థముగ దానవలోకమహేశ్వరుం డహో
చాపము నెత్తగా భయవశంపద మయ్యె ధరాధరాబ్ధిధా
త్రీపరిణామభూతములు వృక్షసరిద్బహుజంతుసంతతుల్. 176

చ. అమలినమైన ధర్మమున కంతటిభీతి ఘటింపగా నధ
ర్మమునకు నంతశక్తి యవురా! యెటులన్ ఘటియిల్లు నాఁగ, లో
కమిది క్రియాజగత్తు, క్రియ కల్గినయట్టి ఫలం బొసంగు ను
త్తమఫల మే క్రియం గలుగు దాని క దే ఫలమున్ ఘటించుచున్.

క. అతఁడు తపోవంతుఁడు మఱి
వితతమహాశౌర్యజలధి వివిధాస్త్రమహా
తతి గలఁడు సర్వదివిష
త్తతి నోర్చినవాఁడు మఱి యధర్మమతియునై. 178

మ. అమరన్ భూతహృదంతరస్థము నధర్మాపేతమున్ సత్పదా
ర్థము ధర్మప్రవణంబు భావగతమున్ రామాభిమానంబు దై
త్యమహోగ్రం బగుశక్తి రావణభుజావ్యాపారదోశ్చండరూ
పముగా నెత్తిన నంతరావిలపరిస్పందంబుగా నూగెడిన్. 178

ఉ. సద్గత మీ భయంబును నసత్తును గూఱిచి, యచ్ఛమైన దా
సద్గతపూ భయం బని యెసంగదు సద్బృషాళిశాసుసంతతిన్
హృద్గతమై భయం బిది చరించును జిత్రము సాధుహృత్స్థమై
సద్గతమైన బాధయె యసత్పరిభావనిదానమై చనున్. 179

ఉ. వానరవీరులుం గనిరి వానిరథంబును వాని నూర్జితై
నోనిరతాంధ్యభాగవఘనున్ సహసావరిదీపితోగ్రతే
జోనిబిడస్వరూపుని నిషూదితశత్రుని దీర్ఘచాపవ
ల్లీనినదప్రపూర్ణవిరళీకృతభూతమహాణుసంతతిన్. 180

క. పెఱ రక్షోవీరుల వగు
శరతీవ్రత యెఱుఁగుఁ గీశజాతియు దశకం
ధరుని నిగిడించు శరములు
నరుంతుదము లయ్యె మివుల నధికార్తిదముల్ 181

ఉ. శ్రీరఘురాము బాణముల శీఘ్రత వహ్ని యెఱుంగ రీ కపుల్
శ్రీరఘురాముసత్కరుణచే నవి వార లెఱుంగు టుండదున్
క్రూరుఁడు రావణుండు నిదిగో శరముల్ నిగిడించు నయ్యయో!
శ్రీరఘురాముబాణముల శీఘ్రత వహ్నియు వీని మించునా? 182

శా. క్రోధాకారుఁడు దైత్యనాయకునిఁ గన్గోరాద యట్లయ్యె సే
నాధర్మంబుగ వానరాళి శిలలున్ త్మాజంబులున్ రువ్వ న
య్యో ధాత్రీధరముల్ మహాకుజము లెన్నో వేలునున్ లక్ష లా
రా ధారాగతి దైత్యనాయకునిచే వ్రయ్యల్ వొనర్పంబడున్.

ఉ. పూర్వసురారిరాజి శరముల్ నిగిడించుచు నుండఁగాఁ గపుల్
గర్వమహోగ్రతన్ దరులు గట్టులు వేయుచు నుండ నల్ల సౌ
పర్వవిరోధి గుఱ్ఱములో బండిరియొ వ్రీలుచునుండు నీమహా
ఖర్వధనుఃకళాపటిమ కానఁగరాద పురాహవంబులన్. 184

చ. ఇదియొక లీలగాఁ గలద యీతని కీ కదనంబు బాహువ
ల్గదమలశౌర్యరేఖ సురలన్ మఱలంబడఁ జేసె నన్న వా
క్పదమున లేద యచ్చెరువు కార్ముకచండుఁడు వీఁడు రాముతోఁ
గదనము సేయ కే నడుమగా విఱువంబడునట్లు సేయనా. 185

మ. అనుచున్ వానరవాహినీపతులు క్రోధాకారులౌచున్ మహా
ఖనులై చెట్లును దైత్యముక్తపరిఘల్ ఖడ్గంబులున్ బ్రాసముల్
గొని యొక్కుమ్మడి వానిపైఁ గవిసినన్ గ్రోధంబు నిప్పన్న వ
ల్కున నున్నట్టి నిజంబు చూచిరి కపుల్ కుద్దాలదీవ్యన్నఖుల్.

శా. ఈయల్పుల్ నను రాముమీఁదఁ జనగా నీవంత శౌర్యాంబుధుల్
గా యోజించుకొనంగఁ దమ్మిదియు నిక్కం బబ్బమై పొల్చె దై
తేయుల్ పూర్వుల పేర లోకొక్కకఁడు సాధించెన్ ననుం గూడ న
ట్లే యూహింతురు వీరి నందఱను మెల్లెక్కింతు స్వర్గానికిన్.

గీ. అని తనకు బ్రహ్మదత్తమైనట్టి తామ
సాస్త్రముం బ్రయోగించెఁ గీశాధికోగ్ర
సర్వసైన్యాధిపతులపై శస్త్రపాణు
లఖిలకపులు నిర్వీర్యులై యటమటింప. 188

మ. గదలున్ బ్రాసములున్ మహాపరిఘలున్ ఖడ్గంబులుం దాఁకినన్
మదముల్ డిగ్గి శరీరముల్ దునిసి ధీమాంద్యంబు వాటిల్లి వా
రిదముల్ క్రుమ్మిన తమ్మిపూఁ జెఱువుగా శ్రేయోఽతిదూరంబుగాఁ
జెదరెన్ వానరసేన సర్వమును సంక్షీణాత్మతేజస్కమై. 189

క. తూలి నిరాఘాటంబుగఁ
దోలించెన్ బండి రామతోయదముదెసన్
గాలివలెం బటురఘుంరఘూ
భీలంబుగ రావణుండు భీషణమతియై. 190

సీ. శ్రావణాంభోధరచ్ఛాయా మనోజ్ఞాసి
తస్వాదునీలసుందరశరీరు
సంవ్యాప్తిప్రాతస్తుషారాపనయన భా
స్వరవారిజాత విశాలనయను

మధురప్రాతఃకాల మహీరుహాధశ్చ్యుత
పున్నాగకసనాళ పుష్పనాసు
పరిసితారగ్వధావనిజాత కిసలయో
పరిసాంధ్యరాగ సంవ్యానయుగళు

బాలవల్మీకవరజటాభరకిరీటు
నవకుటజకోరకాగ్రకాంత్యాభసహజ
సూక్ష్మమృదుమందహాస భాసురకపోలు
రామచంద్రునిఁ గాంచెను రావణుండు. 191

సీ. పీనాంసయుగదృశ్యమానతూణీరేషు
వతగరుద్భ్రమర సేవితముఖాబ్జు
కోదండప్రాగ్దిశాకుంభిశుండాదండ
భాస్వరస్వర్గ లక్ష్మీస్వరూపు
ఆయసవల్లీ సమాశ్లిష్టకవచ దీ
ప్తోరువక్షో మహామేరుభూతు
ఫాలద్యుతిచ్ఛటాశ్రీలీనశితలోచ
నప్రభావృతగగన పరిణాహు

ఘోర ఫణి పరీభావజకోపలిప్త
లిప్తనవ వివృత్యభిముఖలీన సూక్ష్మ
చలనపటు ఫణాసదృశ హస్తములవాని
రామచంద్రుని గాంచెను రావణుండు. 192

సీ. శైవశరాసలస్తక హస్త సంత్రుట
నాత్త కీర్తి ప్రథమావతారు
పరశురామాభీలబాహుగర్వవిభంజ
నజ్ఞాత దోరనంతప్రభావు

ఖరదూషణాది రాక్షస చతుర్దశచమూ
లీలావిధూనన క్లేశకారు
సప్తతాళీ ప్రభంజన కార్యచాపక
శ్లాఘ్యక్షుణ్ణతరకౌశల ప్రశస్తు

దర్పితాసుర వీరవధ ప్రచండ
కృతికృతమహోపకారు దూరీకృతోగ్ర
మూలసేనామహాక్రూరు మోహదూరు.
రామచంద్రునిఁ గాంచెను రావణుండు.

సీ. నఖశిఖా పర్యంతముఖరితబంభరీ
కమనీయవనమాలికామనోజ్ఞు
వక్షస్స్థలీ మార్దవగుణసమాకృష్ట
మృదుమందహాస లక్ష్మీసనాథు
రాక్షసవ్రజ సంహరణ కార్యచక్రీభ
వత్క్రూర కార్ముకబాహుయుగళు
ఇందిరాసిత కపోలేందుగోచిఃవరి
స్పందనానందిత మందహాసు

నిబిడితాకాశనీలకాంతిప్రరోహ
కందళీకృతమంజులకాంతదేహు
వినిహతసమస్తలోకమోహుని నిరీహు
రామచంద్రునిఁ గాంచెను రావణుండు. 194

సీ. గిడసపాటినకైక గడుసుదనమ్మునఁ
బంపఁగా నడవులఁ బట్టువాని
జడదారిమూఁక వెన్బొడిచి యొక్కింపఁగా
నంతంత వింటిచాఁ డైనవాని

ముల్లోకములయందముం జూఱగొన్నట్టి
చాన రక్షించుకో లేనివాని
కోఁతిమూఁకలను వెన్కొని లంకపై నెందు
నెఱుఁగని సేఁతగా నెత్తువాని

నేది యెల్లెనఁ బోవు నదేమి తనకు
నన్న రీతి బైరాగిగా నున్నవానిఁ
బ్రకృతి తనకును ననుకూలపడెడు వాని
రామచంద్రునిఁ గాంచెను రావణుండు. 195

క. ఒకసాయకమ్మె చాలున
యకటా! యీతని వధింప నాశరవీర
ప్రకరము వచ్చె నితని నీ
తికి నొక్కొక్కండు గుండె తీసిన బంటుల్. 196

క. ఇదియును జిత్రముగా ను
న్నది నది తలపైనిఁ దాల్చె ననగా ననఁగా
నెదఁ జూఱగొన్న దేవర
యిది యింతగఁ జేసె మఱియు నేమనవలయున్. 197

క. మాయిద్దఱ లోపల మఱి
యీయన గెలుచుటయె మంచి దిప్పుడు తనకుం
బోయెడి దేమీ? నాకుం
బోయిన దిప్పటికి సర్వమున్ మాయయుగా. 198

ఉ. ఆ పదిశీర్షముల్ గల మహాహీంకిఁ జూచుచుఁ జూచుచుండఁగా
గోపము వృద్ధిఁబొందెఁ బదికోట్ల గుణంబులు పెన్విషాగ్నులం
జాపము నెత్తి క్రక్కె శరజాలమిషంబున వైరిచేతిలోఁ
జాపము లేదటన్నదియుఁ జాలని నీతిగ యుద్ధభూమిలో. 199

గీ. ఎంత యశ్రద్ధగా నున్న నేమి స్వామి
చెంతఁ జేరవు దనుజు దూసిన శరములు
నెపుడు కోదండ మెత్తెనో యెపుడు దూసె
నడుమ విఱుగుచు నుండె దానవుశరములు. 200

ఉ. వంచన రూపముం గొనినవాఁడును కొంచెము యుద్ధనీతి పా
టించని దైత్యరాజు వికటించిన బుద్ధిని గాంచి బిట్టు కో
పించిన లక్ష్మణుండు వెనువెంటనె చాపము పూని వాని ని
ర్మించుచునున్న యమ్ముల హరించెను మించిన వింటినేర్పునన్.

ఉ. ఈతఁడు మేఘనాదు వధియించెను ముందర వీనిఁ జంపుటా?
యాతఁడు సర్వకారణము నాతనినే మును సంహరించుటా?
చేతమునందు నిశ్చయము చేయక కొంచెముసేపు రావణుం
డాతని మీఁదికిం జనియె నంజలపైఁ బెడఁద్రొక్కి లక్ష్మణున్. 202

ఉ. ఏ యొకయమ్ము చాలునని యెంచెనొ రాముని సంహరింపఁగా
వేయియు రెండుమూఁడయిన నేలుగఁ దాదృశబాణసంతతిన్
దూయఁగ వైరి రాఘవుఁడు దోసిళులన్ విరఁజిమ్మినట్లుగా
నా యశులమ్ము లమ్ములను నమ్ములఁ జిమ్ముచుఁ గ్రమ్మరింపగా.

క. రెక్కలు తెగిపోయినయవి
ముక్కులు విఱిగినవి నడుము మునిఁగినయవిగా
నక్కట పక్షులవోలిక
నక్కాండచయమ్ము పరియలై చనుచుండెన్. 204

చ. ఇరువురు సేయు బాణముల నెల్ల వియత్తును నిండిపోవఁగా
విరిగినయట్టి బాణములఁ బృథ్వి సమస్తము నిండిపోవ నొ
క్కరి నొకరున్ శరమ్ములను గ్రమ్ముట సాధ్యముకాని దంచు బం
ధురతరమైన మంత్రములతో బవరంబును జేయ నెంచుచున్. 205

మ. ఇది శస్త్రం బిది యస్త్రమంచు మదిలో నేర్పాటుగా లేక య
క్కదనం బాడఁగరాద దేని ప్రతిగాఁగన్ దేనిసేన్ వాడనౌ
నదియున్ నేర్వఁగలేన్ బరాస్త్రమునఁ బేరైనన్ మఱి న్నేర్వ కొ
ప్పను వా రిద్దఱు సర్వవేత్తలు దురాపప్రౌఢబాహాబలుల్. 206

చ. కటకట! నొక్క రొక్కమును గాంచిన కోప మదింతకాద తొ
ల్తటి యపకార మట్లునివి దానికిఁ జేసెను వేయిరెట్లు ధూ
ర్జటి పదసేవకుం డయిన రావణువందున రామచంద్రుఁ డిం
తటిదగు కోప మేచుననిశం దశకంధరువందుఁ బట్టునే ? 207

ఉ. ఒక్కని భార్యఁ గొంచుఁ జను టుక్కివుఁడౌ దనుజాధినేతకున్
మిక్కిలి గోటిమీఁది పని మేదిని కన్యక నట్లు తెచ్చె వీఁ
డొక్కఁడె త్తివచ్చి యది యోపనివాఁడయి వచ్చి లంకలో
మొక్కలు డెంతచేసె చిఱుమొక్కల సైతము పెల్లగించెఁబో 208

శా. బాహాధూర్జటు లిద్ద ఱిద్దఱు మహేష్వాసుల్ కృతాస్త్రుల్ రణ
వ్యూహాభిజ్ఞులు శత్రుసంహరణకార్యోత్తాలధీకుల్ ద్విష
ద్దేహాన్యాహృతిమష్టుఁ డొక్కఁడు ద్విషద్దేహానలుం డొక్కఁడున్
సేహుల్ శత్రువధైషు లుగ్రు లపరిక్షీణాత్మతేజుల్ బలుల్. 209

ఉ. మిన్నని శోచకున్నయది మిన్నది యమ్ములగూపు వెల్లువై
చన్న విధాన నొప్పె సహసావినిపాతితబాణజాలసం
ఛన్నతఁ బృథ్వీభాగము దిశాతతి శాతశరాహతిన్ సమి
హా న్నతకాంతి యూచును గవాక్షిత నవ్యో నభంబు బిట్టుగా.

ఉ. అంతట నంత రాత్రిపడె నంబుజమిత్రుఁడు క్రుంకెఁ జీఁకటుల్
వింతలుగాఁగ వారినిధి వీచికలం బ్రతిబింబితంబు లౌ
కాంతములైన తారకల కాంతులు క్రొచ్చిన యిర్గ్లపిండులం
గ్రంతలు పొల్చె నల్గుల పరంపర లంటు మిణుంగురుల్ బలెన్.

ఆ. సాగరంబు లేదు రేగు చీఁకటి లేదు
మిన్ను లేదు మఱియు మన్ను లేదు
వారె కలరు బాణపంజరంబున యందుఁ
బోరుచున్న రెండు పులులనంగ 212

చ. కవచసురక్షితంబులగు కాయములందున బాహులందునం
దవిలిన యమ్ము లే దలుగుతండము దవ్వనయందె విస్ఫుచం
డ విధృతకోపియై దితిజనాథుడు నేర్పున నైదునమ్ములన్
రవిలిచి రాము నెన్నొసట రక్తము జిమ్మన లేవ నేసినన్. 213

శా. కోపం బేచి రఘూత్తముండును వెసన్ గోదండమున్ జ్యాలతా
క్షేపంబై యొసఁగంగ రావణునిపై శీర్షంబునన్ మోమునం
దోపన్ రాని శరంబులన్ నినిచెఁ దా నోపెన్ సురారాతి హే
లాపద్మాత్ముఁడు రామమూర్తి కతివేలంబైన యాశ్చర్యమై. 214

గీ. వాలి యొక్క యే యమ్మున వాఁడిమికిని
నూపునకు నిల్వలేదొ యా యులియలుగులు
పదికి నిర్వదికిని వీఁడు కదలఁబోడు
వీఁడు పదిపర్వతంబుల బిగువు కలఁడు. 215

సీ. అసుర ప్రయోగించె నాసురాస్త్రము బ్రహ్మ
నిర్మితంబును తనూమర్మభేది
దానినుండి సముద్గతం బయ్యె ఖడ్గముల్
ప్రాసముల్ పరిఘులు పట్టిసములు
నలుగులు తోడేళ్ళు పులులు భుజంగముల్
ముఖములు గలవి యమోఘములును
ఘోరదంష్ట్రిలు మహాక్రూరరావంబులు
రక్తాక్షములుగా భరంబుగాఁగ

నొక మహాంధకారంబైన యుగ్రమైన
యట్టి కాంతారమునుబోని దడుగుతీసి
యడుగు వేయగరానిది యడుగడుగునఁ
బ్రాణమును దీయు నట్టి యస్త్రంబు నేసె. 21[illegible]

సీ. దండకాటవిఁ ద్రయోదశవర్షములుగాఁగ
సంచరించిన రాచుచంద్రుఁ డేసెఁ
బావకాస్త్రంబును బ్రబలనక్షత్రముల్
గ్రహములు వహ్నిశిఖాసహస్ర
ములును దావాగ్నులు పొడిచిన చంద్రులు
విరిసిన సూర్యులు వెక్కసముగ
నయ్యస్త్రముననుండి యావిర్భవించి కాం
తారాస్త్రమును సర్వనాశనంబు

చేసినం జూచి దానవశేఖరుండు
మనసునందునఁ బదిరెట్లు మండిపడియె
తన సహస్రవర్షంబుల తపమువలనఁ
గృచ్ఛలబ్ధ మస్త్రంబు వికీర్ణమైన. 21[illegible]

సీ. అమర లంకాపట్టణము వినిర్మించి
నపుడు తానిచ్చిన యుపదలకును
మఱియు సుప్రీతుఁడై మయుఁ డిచ్చినట్టి రౌ
ద్రాస్త్రంబు నేసెను రావణుండు
ముద్గరంబులు శూలములు మొదల్ గాఁగ నా
యుధము లందుండి సముద్భవింప
దశరథసూతి గాంధర్వాస్త్రమును నిచ్చె
నది జంపముల వోలె నరుగుదెంచి

ముద్గరముల శూలమ్ముల ముసలములను
గడఁగి కణుపులు కణుపులు గాఁగ రాచె,
దైత్యకోపాగ్నిచలితచేతంబు వేయి
గాఁగ విఱుపులు విఱుపులు గాఁగ విఱిచె. 218

సీ. తనవద్ద నొక్క యస్త్రం బున్నయది దానిఁ
జూర్ణించుటకు వీలు సుంతపడదు
తనర సముద్భవించును దానినుండి చ
క్రమ్ములు స్థూలసూక్ష్మమ్ము లగుచు
వాఁడియంచులతోడి వేఁడిమంటలతోడఁ
గదియఁగా రాని వేగంబుతోడ
గిరగిర తిరిగి తాఁకినచోటఁ గత్తెర
వెట్టు చాపఁగరాని వేగ మొప్ప

దానిపేరు సౌరాస్త్రంబు దాని నెంచి
రావణుఁడు ధ్యానమగ్నుఁడై రాముఁ డింక
దానితో నంత మగునని తలఁచి యేసె
నదియు రోహిణికార్తెనా నడుగుదేర. 219

సీ. రాముండు చూచి మంద్రమృదుహాసముచేసి
ప్రతిలేని యట్టి యస్త్రము నెఱింగి
కైకేయి నేర్పిన కార్ముకశిక్షణవి
ద్యాప్రభావంబున నమ్ము లేసె
చికిలివా నమ్ములు జిలుగుతా నమ్ములు
ప్రక్కవాటమ్ములు ప్రచ్ఛ నమ్ము
లింతవేగ మ్మంచు నేర్పరింపఁగరాని
యత్యుగ్రానిలములతో నుఱుకు వాని

వేగి చక్రాలవేగమ్ము వేగపఱచి
వేగము వృథాపఱచువాని వేగముందె
శీతలింపించి వాఁడిమిం జెఱచువాని
బల్లపఱపుచు మొక్కఁబోఁ బఱచువాని. 220

బమ్మెరపోయె రావణుఁడు బ్రహ్మయుఁ జేయఁగఁజాల డీ పనిన్
నమ్మఁగరాని వయ్యె నయంబులు వేలును లక్షలైన చ
క్రమ్ములు సూక్ష్మముల్ శరపరంపర వమ్ముగఁ జేఁత, చేతఁజ
క్రమ్ము కలాఁడు చేయవలెఁ గాని యొరుం డొనరింపఁజాలఁడున్.

అప్పుడు రామచంద్రుఁ గన నాయన చేతి ధనుస్సు చక్రమై
యొప్పెను శీఘ్రశీఘ్రముల నుగ్రశరంబుల నేయు వేఁడిలోఁ
ద్రిప్పుచుఁ ద్రిప్పుచున్ విలు ధరింపఁగ నద్దియె నాల్గుబాహులై
కొప్పెను శంఖమై విరిసికో ల్వహియించెఁ గనుల్ భ్రమింపఁగన్.

తొలుత సుమిత్రబిడ్డఁ బెడఁద్రొక్కిన యప్పటినుండి రామునిం
దలపడి యుద్ధమాడుట ప్రధానముగా నయినన్ సురారి వం
తులు పడుచున్న లక్ష్మణునితోడను బోరును జంపలేద య
మ్ములు నిగిడించు చాప్పుచును బోరుచునుండెను మధ్యమధ్యలో.

కార్యము దుర్ఘటంబయినఁ గల్గు ఫలానికి దేని పైననో
ధైర్యము పెట్టుకొంచు నది తాఁ జెడిపోయిన జారు గుండెయై
వీర్యము మాలినట్లు కనిపించును రావణుఁ డట్లు తోప ధీ
ధుర్యుఁడు లక్ష్మణుండు తఱితోఁ బరగించుచుఁ బెక్కులమ్ములన్.

సౌరాస్త్రోద్గతచక్రసంచయములన్ జాపక్రియాప్రౌఢవి
ద్యారూఢిన్ విదళించు నగ్రజుని దైత్యస్వామి శస్త్రంబులన్
వారింపం దలపెట్టకుండఁ బరగింపన్ దీవ్రనారాచముల్
వే రక్షఃపతి వీనివంక మఱలెన్ విస్ఫారకోపంబునన్. 225

మ. నృకపాళో గ్రము దైత్యకేతనము తా ర్చెన్ నేలకుం గోపియై
వికటాస్యుండు దశాస్యుఁ డూర్జితముగా విడ్చెన్ మహాభీలశ
స్త్రకదంబంబుల లెక్కసేయక సుమిత్రాసూతి దుర్వారశ
స్త్రిక నొక్కండు కదల్చి సారథి శిరశ్ఛేదంబు గావించినన్. 226

ఉ. మిన్నులన్ మండిపడెన్ దశాననుఁడు సౌమిత్రిన్ విలోకించి దా
నవుఁ డేదేని బెడంద యొంచు నను చింతంగూరి తత్రత్యుఁడౌ
వ్యవధాబుద్ధి విభీషణుండు గదతో నహ్వాని గుఱ్ఱంబులం
గవిసెన్ వాని తల ల్పగిల్చెను దురంగంబుల్ ధరన్ వ్రాలఁగన్ 227

సీ. వీఁడుగా యింద్రజి వేల్పుకందువ చెప్పె
వీఁడు దైత్యకులంబు వేరుపురువు
నచటి రహస్యంబు లిచటఁ జెప్పుచునుండె
నది చాలనట్లు దురాత్మకుండు
వీరి పక్షంబున వీఁడె యుద్ధమా
డుచునుండె సిగ్గుపడుటయొ కాక
భయము లేకుండంగ వచ్చి నాతోఁగూడఁ
గదియంగ నింత కొంకఁడు బికారి
వీని వధియింతు నంచును దానవేంద్రుఁ
డెద వినిశ్చయపఱచుచు నెద పగుల్చు
పనికి నది యొక్కఁడే చాలు ననినదాని
శక్తి నేసెను వే విభీషణుని పైన. 228

ఉ. దాని నెఱుంగు లక్ష్మణుఁడు తాను విభీషణుఁ డింద జోక్యముం
బూనఁగరాద శక్తి యిది ముక్కలు ముక్కలుగాఁగ నయ్యెఁ బ్రా
ణానికిఁ దెచ్చునంచును ఘనంబగు స్వీయమహోగ్రదోర్బల
ధ్యానము చేసి నారసము లైదిఁట శక్తి నశక్తిఁ జేయఁగా. 229

ఉ. కాంచుచు నున్న రావణుని కన్నులయందున లోన లోన వ
ర్తించుచు నున్న వహ్ని వివరించిన మంటలు లేక వెట్ట జ
ల్లించిన యట్లు గాఁగఁ గదలించని చూపులు సూదు లౌచు యో
జించిన కార్యపున్ ఫలము చేతికిఁ జిక్కినయట్టు లెంచుచున్. 230

సీ. అడవి భార్యావిరహమునఁ జానకయుండ
నన్న నోదారిచికొన్న యదియుఁ
లేడిరూపా మారీచు లేడి కన్నులను జ
రించు దానవత గుర్తించినదియుఁ
బదుమూఁడుసమలు వ్రాల్పక తెప్ప నింద్రజి
మృతికోసమై నిగ్రహించినదియు
దన యన్న శరణమిచ్చిన విభీషణుని ర
క్షించు ధర్మంబు యోజించునదియుఁ

గామమున్ గెల్చినదియును గౌర్యమునకుఁ
బోలముగా నైనదగు వీని తెలివి యెల్ల
నేటికిఁ బరిసమాప్తిఁ బొందింతు ననుచు
నెంచి రావణుఁడిట్లు వచించె నతని. 231

క. అతనిని నిజముగ రక్షిం
చితి వగు నిను నీవ రక్షచేసికొనుము నీ
మృతిలోన నీదు నగ్రజు
మృతియు నిమిడియున్న యది సుమిత్రాతనయా! 232

అంత మయనిర్మితం బష్టఘంటాకమ్ము నశనిమహాస్వనంబు ప్రళయకాలాశీవిషాకృతిఁ దాల్చిన రుద్రుని వంటిదియు రావణ బాహుసర్వవేగోత్సృష్టంబు నయి మహాశక్తి లక్ష్మణుని గుండి యకు సూటిగా వచ్చుచు. 233

చ. గణగణలాడు చెన్నొదగు గంటలతోడ మహాహివోలె ల
క్ష్మణు దెస వచ్చుచున్న దగు శక్తిని గాంచి రఘూద్వహుండు ల
క్ష్మణులకు నెల్ల స్వస్తియగుగాక యటంచనె నంతలోన ల
క్ష్మణుని యురంబు భగ్నముగ సల్పెను శక్తి యతండు ద్రెళ్ళఁగన్

చ. నిముసములోపలం దెలియనేరఁడు తానును రాముఁడంచు వి
క్రమనిధి మేన గ్రుచ్చుకొను రావణు నమ్ములచే నెఱింగి తా
నమరిన దుఃఖమంత హృదయంబును నిండఁగ దైత్యనాథు బా
ణములు నరుంతుదమ్ము లయి నాటుచు నుండ శరీర మంతటన్.

గీ. అంత రాముఁడు తమ్మున కడ్డు నిలచి
చేత విల్లూని దైత్యుఁ గాంచెను దృశాగ్ర
వహ్ని రావణు మేను గంపంబునొంద
నసుర యమ్ముల నేయుట యాపలేద. 236

శా. రాముం డొక్క విలిప్తలో శతసహస్రంబుల్ శరంబుల్ మహో
ద్దామంబుల్ పరగించి వాని నగు శస్త్రంబుల్ విదారించి త
ద్భీమంబైన శరీరమంతయును గప్పెన్ బర్వతంబున్ బయ
శ్శ్రీమంజూషికవోని మేఘము వలెన్ దృగ్ధార వానల్లుగన్. 237

వ. అంత రాముండు మహోకపులు నివారింపరాక ధరాతలంబున
దూరిన యా శక్తిని బాహులతోఁ బెకలించి దానిని విఱుచుచుండగా
రావణుం డంపమొయిలు విరియించి మఱల రామునిపై బాణ
ప్రయోగంబు చేయుచుండ లెక్కసేయక. 238

ఉ. కుట్టిన తేలు కాచుటయుఁ గ్రొచ్చిన యమ్మును విర్చి పెట్టుటల్
ముట్టిన పుర్వుఁ జంపుటయుఁ బుట్టిన బాధ సగంబు త్రోయుచై
నెట్టన శత్రుకార్యము గణింపక పై నవమానపుచ్చుచై
యట్టుల రావణుండును శరావలి గుప్పుచునుండె రాముపై. 239

వ. అంత రాముండు కోదండదండంబున వానియస్థులం దొలంగం
ద్రోయుచు సుగ్రీవాంజనీసూనులం గాంచి యిట్లనియె. 240

క. తానేమొ చూచుచుండంగం
దా ననుజుని కేమొ యింత దగ్గరనుండన్
దానవుం డింత యొనర్చెను
తానా! రాముండు, వాండు దైత్యుడు కాకన్, 241

మ. పరిరక్షించుచు నుండుండీ యనుజునిం బాకారి నిర్జించె న
య్యరి, పాకారిని గాంచన ద్దనుజుం బ్రేతాకారుం బంపించెదన్
సిరిం గైకొన్నది చాల కీ యపకృతుల్ సేయంగం జొచ్చెన్ మఱిన్
మఱి యీ ధాత్రి యహో యరావణ మరామం బేదియో కావలెన్

ఉ. నా పినతల్లి యీతని వనంబుల కంపెను నేను వద్దుర
న్నా! పని కాని యీపని యటన్నను వచ్చె నితండు, వచ్చినాం
డో పదునాల్గువత్సరము లోపితినో పితృవాక్యపాలనం
బీ పరమాసురుండు ఘటియించెను సర్వఫలంబు నేటికిన్. 243

చ. ఇంకం గనుగొండు చాపమున నింతగం జేయంగ వచ్చు నన్నదా
నికిం బరిధీకృతంబుగను నేం బొనరించెద, దైత్యమూర్తి వీం
డొకరుండు కాద, యింకం బదియుం బదియుం దలలైనవాండు గా
ర్మికి నయినట్టి నాదయిన ముందర నిల్వను గల్గు టుండునే? 244

ఉ. నాదయి నట్టి రామునితనంబును జూడుండు మీర లెల్లనే
నూదిన విండ్లు వేలు మఱియుం గరముల్ పదివేలుగాంగ దా
నీ దనుజేశ్వరుం డనుచు నెవ్వండో రావణుం డంచు నుండం డా
హా! దురితాత్మకుం డయి మహాహవమున్ విడి పాఱిపోనిచో. 245

గీ. అని విలుఁగొను రామునకుం
గనుగొనం బదివేలు నైన కరములు వేయా

ధనువులు గాఁగ మహాభయ
మునఁ రావణుఁ డంతఁ బాఱిపోయెఁ జాలుకనై. 246

వ. అంత శ్రీరామచంద్రుండు లక్ష్మణపర్యవస్థితుండైన సుషేణుం గాంచి యిట్లనియె.

క. నా తమ్ముని బ్రదికింపుము
సీతావిరహమున నేను సేగిం గనకన్
నా తమ్ముఁడు రక్షించెను
నాతో వనములకు వచ్చినాఁడు కపీంద్రా! 248

గీ. ఇతఁడు చనిపోవ లేదని యీవు చెపుము
యితని బ్రదికింతు నంచును నీవు చెపుము
యితఁడు బ్రతుకక యున్నచో బ్రతుక నేను
నాకు రాజ్యమ్ము వలదు జానకియు వలదు. 249

ఉ. ఎచ్చటి యోషధీలతలు నీవ యెఱుంగుదు కానలందు భూ
భృచ్చయమందు నీవయి చరింతువు చూతు గుణంబెఱింగ దా
యెచ్చటి యౌషధాల్ తెచ్చి భరియింపుము నాయనుజన్ము ప్రాణముల్
తెచ్చిన నీదు పుణ్యమును దీర్తు భవంబుల నైన నో కపీ! 250

శా. ఇంకన్ రావణు నే వధించవలెనం చేమున్న దా సీత నా
వంకన్ వచ్చియు రాక యొక్కటియె నా ప్రాణంబులన్ బ్రాణ మీ
కైంకర్యప్రథమానమూర్తి విడి నాకంటెం బ్రదపాహీనుఁడై
యింకన్ సౌఖ్యము కోరు నెవ్వఁడును వాఁ డెవ్వాఁడో దుర్జివియై.

క. మునుపటి బంధ మ్మనుజుఁడు
వనితాబంధమ్ము నేటి బంధము సంత
త్యనుబంధము లేనియెడన్
వనితాబంధమ్ము కూడఁబట్టదు దీనిన్. 252

శా. రానీ! పంక్తిగళున్ గృకీటధరధారాధోరణీసారణుల్
గా నమ్ముల్ కురియింపనీ! యనుజుఁ డీ కాండీరరత్నమ్ము లేఁ
జేనిన్ రాముఁడు లేఁడు కానియెడ నే నిందుంటి వాఁడున్ సుషే
ణా! నీవుం బరికించి చెప్పఁగదె యున్నాఁ డంచు వైద్యోత్తమా! 253

వ. అని కోదండంబు బుజంబు జార్చి నిర్వ్యాపారునివలె విషణ్ణుండైన రామచంద్రునిఁ గాంచి సుషేణుం డిట్లనియె. 254

చ. మఱి వదనంబునందుఁ గళ మాయదు వెచ్చదనంబు మేనునం
గొఱవడ దెందు కిట్టు లనుకొంటె? నవారుణపద్మపత్రసుం
దరములుగాఁ బ్రవాళములునా నవుబో! యఱచేతు లేగతిం
బొరసె నితండు మృత్యు వనఁ బోలును? నా కనిపించ దా గతిన్.

మ. అణుమాత్రమ్మును లేదు సంశయము దీర్ఘాయుష్కుఁడౌ వాని ల
క్షణముల్ సర్వము గోచరించు నిట మీ కాండీరరత్నమ్ము ల
క్ష్మణుఁ డింతేనియు సేగి పొందఁడును దుఃఖం బూన నైనట్టి కా
రణముల్ లే విఁట రాఘవా! సుశరధారాకృద్ద్విషల్లాఘవా. 256

శా. నీ యీ దుఃఖమె చాల ముచ్చటగ నుండెన్ రామ! విల్కట్టుఁ జే
దోయిం జార్పుము రావణుండు జయముం దోకొంచుఁ బోవున్ మఱిన్
నీ యీ తమ్ముఁడు నేట తేపటను దానే లేచికూర్చుండు మే
మే యీకోఁతుల మంబుధుల్ నడుమ సామీ! చిక్కుకొన్నట్టులై.

ఉ. ఓరఘురామ! నీవలుకుచుండినమాటల లోని సవ్వడుల్
దారులుకొట్టి ప్రాణపుఁ బథంబున లక్ష్మణు నేనియందునన్
జేరుచునుండెఁ బ్రాణములు శ్రీపతి! నిక్కపు దుఃఖమందినన్
దీరిన ప్రాణముల్ తిరిగితెచ్చును గాద కె ప్రాణబంధులన్. 258

చ. తడఁబడకుండఁగా మివుల ధైర్యముతో నిటు లాడఁగా సుషే
ణుఁడు రఘురాము నాననమునుం దళుకొత్తెను దమ్మునందు నే
ర్పడిన యొదేని కాంతి కనవచ్చెను శ్రీరఘురామమూర్తికిన్
వడిగ సుషేణుఁడున్ జలధివాఃపరిలంఘనదోఃపటిష్ఠునిన్. 259

చ ప్రవిమలధీవిశాలపరిభాసితు మారుతిఁ గాంచి యయ్యా! జాం
బవదుపదిష్టమైన హిమవద్గిరిసానుగతంబు నోషధీ
ప్రవిమలపర్వతంబునను భాసిలు నక్కరణుల్ గ్రహించి ర
మ్మవిరళరామకార్యకరణాద్భుతబాహుబలమాధురంధరా! 260

వ. నీ వెఱుంగుదు కద, సంధానకరణి సౌవర్ణకరణి విశల్యకరణి సంజీవ
కరణి యనునవి. నే నీ లోపున నితని మేన నున్న యమ్ములు
పెకలించి చికిత్సించుచుందు నన 261

క. మిన్నందెన్ హనుమంతుఁడు
ము న్నీతని మింటికి కెగుకు పోడిమి కనఁడున్
గన్నాఁ డిప్పుడు రాముఁడు
వెన్నంటిన వృక్షసమితి వెనుకం బడఁగన్. 262

క. చన్నాఁడు హనూమంతుఁడు
మిన్నింతటి చిన్నదైన మేరయె యనఁగాఁ
గన్నులు నమ్మఁగ రాకయ
యున్నవి మనసేమొ నమ్ముచున్నది మఱలన్. 263

శా. వచ్చెన్ మారుతి తెచ్చెఁ బర్వతము సంభావింపఁగా లేన నే
నెచ్చో నున్నవొ యోషధుల్ కనుక భూభృత్తెల్ల భూభృత్తుగా
నిచ్చోఁ దెచ్చితిఁ జూచికొ మ్మనఁగ దా నే యోషధుల్ కోరెనో
త్రొచ్చెన్ వాని సుషేణుఁ డంతఁ గొనిపో క్షోణీధరం బన్నచో.

ఆయన కొండఁ దెచ్చుటయు నాయన కొండను గొంచుఁబోకకఁ
దోయిని విప్పిచూచుచు మనోహరణంబుగ వారు వీరు దై
తేయులు వానరుల్ మనసు తెప్పిరిలంగను జేసికొను లే
కాయన పర్వతం బునిచి యచ్చట వచ్చెఁ బుంశప్రయాతుఁడై.

చెలువొప్పన్ నిదురించి లేచె నన లేచెన్ లక్ష్మణుం డబ్జగం
ధిలవిస్ఫారదృశాభిరామముగ నై దేహీమనోనాథుఁ డ
ర్మిలి బాహాపరిరంభణమ్ముగను సౌమిత్రిం గ్రహించెన్ ద్యుతుల్
పులకల్ పొందినయట్లు సోదరుల నవ్వుల్ పండఁ జింతామణుల్.

మఱియు శ్రీరామచంద్రుం డిట్లనియె. 267

అన్నా! నీవును జన్న నా కిఁకను రాజ్యం బేల? యేలా మకు
త్పన్నద్ధంబగు జీవితంబు ధరణీజాతాసమాయోగసం
పన్నత్వం బది యేల? యేల జయ మీ వారాశివేలావరి
స్కన్నక్ష్మాజచయాల్పపర్వత శిలాసంకీర్ణ లంకాతటిన్. 268

విపినము రామలక్ష్మణులు వెళ్ళిరి, వచ్చెను రాముఁ డొక్కఁడే
యపయశ మింతయుం బొసఁగ, దైనఁ బొసంగునొ యన్న కారణ
వ్యపగతమైన భీతి మనసందునఁ గొంతటి వేళ నుండె, నీ
వుపహితజీవితుం డయితి వోయి మదంతరప్రాణవర్తికా! 269

అత్తఱి నీవు లేక భయమయ్యెడి నిష్టనుకో నయోధ్యలోఁ
దత్తరపాటు పొంది పినతల్లి నిఁ జూడగ, నామె నన్ను వి
త్తిత్తుగఁ జూచుచున్ భయములే దనుకొన్నది నిన్నుఁబంప లో
కోత్తరవర్తనుండ నయియుందునఁ దా నది యట్టులైనచో. 270

అనినన్ లక్ష్మణుఁ డిట్లనెన్ దనుజు నేమైనన్ సరే నేవధిం
తు నటం చీవు ప్రతిజ్ఞ చేసితివి నీ దుఃఖంబు చేతన్ బ్రతి

జ్ఞను భంజించుట చన్నె? యందునఁ బ్రతిజ్ఞామూర్తి పేర్చై, యెవం
డును దుఃఖంబున కొగ్గు? వేసముపపన్నుండై ఋతార్థ్యంబునన్.

ఉ. జానకి వేఱుచేసినది చాలక నన్నును వేఱుసేయఁగా
దానవుఁ డెంచు మండె నతిదారుణుఁ డంతకు మించి నాస్తికుం
డైన నధర్ముఁడైనఁ బరమార్థరహస్యవిదూరుఁ డైన ను
న్నే? నిను నన్ను వేర్పఱచు నెన్నడు కానిది యేర్పరించుచున్.

ఉ. నక్తములం జరించుచును నన్నును జానకిఁ బాపి నిర్ క్రియా
శక్తులు లేనివానిగను సల్పి స్వతంత్రతవఃప్రభావసం
సక్తత నిన్ జయించుటకు జాల్మ్కఁడు లోనఁ దలంచుఁ దర్పునుత్తుం
డు క్తపథంబునం జన ననుక్తపదంబున వానిఁ జేర్చితిన్. 273

ఆ. ఇపుడు కర్మసాక్షి యపరాంబునిధిఁ గ్రుంకు
టకును మున్న వేసడములకొఱకు
బండికొఱకుఁ జన్న పాలసుం డగు వాని
నాజిఁ బంపు యముని రాజధాని. 274

ఉ. ఆ యనలాక్షుఁ గొల్చుటయు నద్ది మృపారచనంబు వల్కు శా
క్తేయుఁడు దుష్కృతిప్రభవదీధితి నీ తలమీఁదఁ బెట్టు దై
తేయుఁడు వీనిపుత్త్రికుఁడు దీధితిరూపగిరీంద్రకన్యకా
జ్ఞేయమహస్సు మీఱగుట చేతము చేయఁడు దుష్టబుద్ధియై. 275

మ. సరథుండై చనుదెంచె రావణుఁడు దీక్షాస్వీకృతేష్వాస ని
ష్ఠుర దీవ్యద్గగనస్పృశ త్తనువు గండూషించి సద్యస్తపః
పరిచిత్యోగ్ర మహోగ్రసంస్మరణ తీవ్రాకారుఁ డౌచున్ ధరా
భర మంతంతన బండిచక్రములదా బర్హ్వానఁగా నూగఁగా. 276

సీ. ఫాలభాగవిభాసి భసితత్రిపుండ్రదోవ
రివిలిప్త కుంకుమశ్రీలు నెఱయ
కంఠగతైకముఖ శివాక్షపరిగూహి
తార్ద్రకుంకుమదీప్తు లవఘళింప
శ్రవణాగ్రమకుటాంత సమ్మ్రష్టనవకదం
బకపుష్పవాసనల్ పరిమళింప
జ్యాసంగతాంగుళీయక భోగిభోగాగ్ర
మాణిక్యకాంతులు మాఁగుదేర

విఱిచికట్టి నష్టాపదాంబరము మరక
తాంచలాంశులు దెసలందు సఞ్చరింప
పంచభూతమ్ములును బట్ట బయవుగాఁగ
రావణుఁడు వచ్చె యుద్ధసంక్రాంతబుద్ధి. 277

ఉ. వచ్చుచునే దశాననుఁడు బాణములన్ రఘురాము మేనునన్
గ్రుచ్చుచు వచ్చెఁ దీవ్రము లరుంతుదముల్ మణిరుక్మపుంఖముల్
త్రచ్చిన నిప్పులై వవియు రాముని పచ్చికపట్టు క్రొంజిగుల్
ముచ్చటకొల్పు నే నెసఁగె బూచిన తంగెడుచెట్టు పోలికన్. 278

ఉ. అంబుదముల్ ధరాధరము నట్టుల వాహిని పల్లమట్లు బా
ణంబుల నావరించె రఘునాథునిఁ జందనభూరుహాంబు స
ర్పంబులు పోలె నందు రఘురాముని కందువ తోఁచె వింటియు
గ్రంబున వార్షికం బయిన రాతిరి మిన్నులు మెర్పుచే బలెన్. 279

మ. విరియించెన్ రఘురామచంద్రుఁ డసురోర్వీనాథు బాణంబులన్
కురియించెన్ రఘురామమూర్తి దనుజక్షోణీశుపై నమ్ములన్
హరియించెన్ రఘువీరుఁ డన్ తరణి క్రవ్యాదాంధకారమ్ములన్
మెరయించెన్ ప్రభు వంపవానల సమున్మీలద్గురుచ్ఛంచలల్. 280

ఉ. దేవతలున్ సురల్ ఋషులు తెచ్చిన భేదము చూచి బండిపై
రావణుఁడున్ ధరిత్రిపయి రాముఁడు నిత్యసమూర్ధ్వదృష్టిగాఁ
గావలెనంచు వారడిని గ్రమ్ముకొనన్ వలె నమ్మునమ్మునన్
శ్రీవిభుఁ డంచు మిక్కిలియుఁ జింతవహించుచు నుండు నంతలో.

క. ఒక యొయ్యారపుఁ బాగయు
నొకప్రక్కలఁ జూచు చూపు నొసరఁగ మోచే
తికడ బిగియు నంగీ కల
యొక దివ్యుఁడు వచ్చి రాము నొగి దర్శించెన్. 282

చ. అపుడు సుతీక్ష్ణు నాశ్రమమునందున దూరమునందు లీలగాఁ
గపురఁపుఁ గ్రొమ్మెయిల్ నడుమఁ గాంచిన బంగరురేక లొప్ప దే
వపతి రథంబు కన్నులకు స్పష్టముగాఁ గనిపించె ముందరన్
బ్రపవలె రామచంద్రునకు రావణయుద్ధ మటన్న వేసఁగిన్. 283

మ. మును మా పూర్వుల కింద్రుకోసమయి, యిప్డో నాకు నాకోసమై
నను మన్నింపఁగదే ఋణంపడెద నన్నా దేవతాసారథీ!
యనినన్, మాతలి యిద్దియున్ మఘవుకార్యంబే యనన్ బిన్నన
వ్వున రాముండు ప్రదక్షిణించి రథముం బొల్పొందె దైత్యారియై.

వ. ఇంద్రప్రేషితంబు మహాచాపంబు స్వీకరించి తత్కవచంబు ధరించి యతఁడు పంచిన మహాశక్తి నవధరించి కాంచనచిత్రాంగద భూషితంబు కింకిణీశతమధురనాదంబు వైదూర్యమయకూబరంబు రుక్మవేణుధ్వజంబు హేమజాలవిభూషితహరిసమాయుక్తం బైన రథంబు రాముం డారోహించిన. 285

శా. లోనన్ మండిపడెన్ దశాననుఁడు సోలుంతంబు గాగన్ ద్రిలో
కీనాథుం డతఁ డెక్కె నెక్కియుఁ ద్రిలోకీరావణుం గెల్చు వీఁ

డీ నారంబును పౌర మెల్ల పుడు వాడే వీడు వీర్వారు దై
త్యానీకంబులకున్ విరోధులు పరీహాసాస్పదప్రక్రియుల్. 286

శా. ఆం చూహించుచుఁ గోపమంతయు రథంబం దైంద్రమహా వాజులం
దంచత్కాంచనవేణుకేతనమునం దా మాతలిన్ గాఁగ ని
ర్మించెన్ సాయకసంచయమ్ము లురరీకృద్వజ్రసారంబులన్
మించెన్ రావణు నంపగాలి దెసలన్ మింటన్ మహాభీలమై. 287

శా. కంచున్ గైకయి చెప్పినట్టి గతులుం గాఁ జెప్పి రాముండు తో
లించెన్ బండిని గింకిణీనినదవల్లీకంబు వారాశి వే
లాంచన్మంజు మరుద్రవాభినవ హేలాకాననం బిద్దితో
యంచున్ జూడఁగనొప్పె రావణునియీర్ష్యాక్రోధముల్ పొంగఁగన్

ఉ. ఆస్యము నాస్యముం గదుర నాహవ మాడుచునుండె నా నమా
వాస్యయుఁ బూర్ణిమానిశయు బద్ధవిరోధులు రామరావణుల్
లాస్యము సేయు నా శరములం బరగించి రొకా ళ్లొకళ్ళపై
నస్యతిశాతముల్ ఘనశిలావలిఘోరనిపాతవేగముల్. 289

ఉ. ఆ దివిషద్విషత్పతి శరావళి రాముని ముంచె ముంచెనా
కా దిది కాదు రామవిశిఖంబులు గండ్లను గొట్టు నెల్లచో
నాదట రాక్షసేంద్రు విశిఖాగ్నులు మండెడు మండునాఁగ దా
మోదరమూర్తి రాఘవుని ముల్కులు మంటల నెల్ల నార్పెడున్.

వ. అంత రావణప్రయుక్త సర్వాస్త్రంబులు విఘటితము లగుచుండ నతఁడు గాంధర్వంబు ప్రయోగింప రాముండు దానిని గాంధర్వంబుచేత వారించె దైవంబును దైవంబుచే నుపశమింప రావణుండు మండిపోయి. 291

సీ. అసురాస్త్రంబు జేసె నాశీవిషంబు లా
గ్నేయముల్ జ్వాల లాకృతులు గాఁగ
వమదుగ్రకాకోలవదనంబులును నుగ్ర
దంష్ట్రాకరాళవక్త్రములు నగుచు
పుచ్ఛతాడనసముద్ధూతరావోగ్రముల్
వివృతఫణావిద్ధవిదిశములును
చూపులు విరియించు సురియలై దిక్కు లం
టించు జ్వాలలను మండించుకొంచు

సూర్యకిరణంబులే దందశూకము లయి
రోదసి సమాక్రమించిన రూపుగాఁగ
దానవు యథార్థరూపంబు ద్రాఁచుపాము
నాఁగఁ జనుదెంచుచుండగా నారసములు

సీ. ఒక వందపాముల నొకచోటఁ జేరిచి
చిత్రమ్ముగా వధ చేయునవియు
విరియించు ఫణములు ప్రీలఁగాఁ దన్నుచు
ముక్కుల శిరములు పొడుచునవియు
నడుములు తునియంగ నఖములఁ దన్నుచు
లేచు ము న్ముక్కుల రాచునవియు
పక్షానిలాధూతిఁ బాఱిపోవుచు నుండ
సగములోవలఁ బట్టి చంపునవియు

చిన్నవానికిఁ జిన్నవి పెద్దవాని
కేమొ పెద్దవి గరుడులు నేగుదెంచి
రామచాపశరాంతనిరతము లగుచు
రావణాస్త్రభుజంగుల రాచి పెట్టె.

శా. ఆనందంబును గొల్చె వేదపురుషుం డంతంత యంతంతగా
నానాజీవులకైన కోపపరిమాణం బింత యింతంచు నె
ల్లా నేర్పాటుగఁ జెప్ప, నప్పరిధి బ్రహ్మానంద మం చన్న వో
నా నాడంగను నేటి కిప్పరిధి దైత్యస్వామి కోపం బనన్. 294

శా. తారాగోళములున్ గ్రహంబులు వియత్స్థానంబు నిర్ణీతచ
క్రారాధ్వంబున నేగుచుండు, భువనన్యాసాత్మయా దేవి, శ
క్త్యారూఢక్రియ దేవ్యుపాసకులు రక్షోఽధీశులో దేవతా
స్వారాట్సంతతియో సమస్తభువన వ్యాపారపారీణులై. 295

శా. వీరశ్రేణి కిరీటనీలమణి దేవీదక్షిణామ్నాయవి
ద్యారాజీవభవుండు రావణుఁడు నైంద్రంబైన యస్త్రాదిసం
భారంబున్ గని ఖడ్గరావణమహామంత్రాగ్నిదైవంబు త
త్సారం బెల్లను శీర్ణమున్ శిథిలమున్ గ్రస్తంబుగాఁ జేయఁగా.

ఉ. మాతలి డస్సె నైంద్రములు మావులు గ్రుస్సెఁ బతాక వ్రస్సెఁ దా
జేతమునందు రాఘవుఁడు సిగ్గిలె, సిగ్గిలి నంతలోన స
ర్వాతిభయంకరంబులు ధురాప్రసభంబులు వహ్నికల్పముల్
శాతములైన బాణము లసహ్యము లంటెను రామచంద్రునిన్.

శా. ఐదమ్ముల్ సనుదెంచి రాఘవుని ఫాలాగ్రంబునన్ నెత్తురుల్
బోదెల్ ద్రవ్విన యట్లు వెన్కదెసకుం బోయెన్ రఘుస్వామి కై
కోదండంబునఁ బట్టునిల్వదును గైకో నమ్ములన్ రావు వి
చ్ఛేదం బందిన సర్వశక్తి యయి పోల్చెన్ రాముఁ డాలిప్తలో.

వ. ఇట్లు రావణరాహుగ్రస్తుండు రామచంద్రుండు కాఁగా, శశిప్రియ
మైన ప్రాజాపత్యనక్షత్రంబును రోహిణిని ప్రజాశుభకరుండైన
బుధుండు సమాక్రమించె. సముద్రంబు సధూమపరివృత్తం
బయ్యె. నగ్నులతో మండె. సూర్యుండు శస్త్రవర్ణుండై పరుషుఁడై

మందరశ్మియై కబంధాంకుండై కేతుగ్రస్తుం డయ్యె, ఇంద్రాగ్ని దైవత్యం బైన కోసలదేశనక్షత్రంబును విశాఖను కుజగ్రహం బాక్రమించిన. 299

ఉ. కోపము పొంగులై యుబికెఁ గోసలరాజకుమారమూర్తికిన్
దాపితచంద్రసూర్యుల విధంబునఁ బొల్చెను నేత్రయుగ్మమున్
జాపము కోటియం దెసఁగు జ్యాప్రతిశబ్దము లీనె వచ్చినం
గోపము లక్ష్మణాగ్రజునకున్ ధరణీతనయాధినేతకున్. 300

గీ. పృథివి కంపించె నద్రులు విరియఁబడియె
మఱియుఁ దేజస్సు మంటలు మంటలయ్యె
వాయువీథులు ఘూర్ణితావర్తములుగ
గగనసీమ ఛిద్రచ్ఛిద్రముగ విరిసెను. 301

చ. మిలమిలఁ బంచభూతములు మేనుననుండి వినిర్గమించి ది
క్కులఁ గనిపించె, రావణునకున్ భయమింతనరాని దయ్యె, లోఁ
దెలిసె నితండు పో సుసమధిష్ఠితదిక్చయపంచభూతని
ర్మలగ్రహరాజిరాజితుఁడు రాముఁడు నేటికిఁ గోసలంబులన్. 302

గీ. నెఱి నెచటి వందు పద్దుకొనెం గ్రహాళి
రాముడుం దేలుకొనియెను రావణుండు
సుందరుని రాము సంహారింపం దలంచెఁ
దత్సమయశక్తిహీను నుద్భ్రాంతచిత్తు. 303

క. ఏ లక్షణములు కలిగిన
దై లక్ష్మణుఁ జంపె శక్తి యనివార్యంబై
యా లక్షణములు గలిగిన
శూలము చేఁబూని పాలసుఁడు రావణుఁడున్. 304

వ. వజ్రజస్వనంబునుమహానాదంబును మహాగిరిం బోలెఁ గూటమ్ములు కలదానిని యమునకేని దురాసదం బైనదానిని సర్వభూత భయంకరం బయినదానిని, జీల్చు దానిని, ముక్కలుసేయుదానిని బరమ రౌద్రంబు నడుమ నూని యిట్లనియె. 305

చ. అరయ దయన్ విభీషణున కడ్డము పోయి నుతేమియయ్యె ని
ర్భరమతి లక్ష్మణుండు? మఱివానికి నడ్డము పోయి నీవు న
క్కరణిన యూడు, దీని నిదె కాచుకొనందగుఁ దీవ్రశూలమున్
విరవిరలాడు ప్రాణముల విచ్చెడు నట్టి సకూటశైలమున్. 306

క. ఏ దానవుఁ డరుదెంచిన
నాదానవు నీవు చంపి తది పన్నుచు సం
ఛేదము చేసితి వంశము
కోదండాంతమ్మునన్ మిగుల్చ నొకనినిన్. 307

శా. నిన్నుం జంపుట గోటిమీఁది పని వానిన్ మారుతిం జంప వీ
లున్నన్ లక్ష్మణు నైనఁజంపుటకు వీలున్నన్ మఱిన్ సీతయున్
నిన్నే భావనఁ జేయకున్న, నిదె మండింతున్ నినున్ శూలని
ర్భిన్నోరస్కుని నిత్య మందహసన శ్రీ దర్పణ ద్గల్లునిన్. 308

శా. ఈపై నవ్వులవారె రాక్షసులు నే నింతేనియుం గాన నీ
చాపంబుం బనిసేయ దిందు నపరిస్కన్నోగ్రమా మృత్యుచేఁ
జూపీ! శూలము చేతఁ జావు మని దోస్సంధామహావేగదీ
ప్తాపద్మాసనుఁ డైన రావణుఁ డుదంచచ్ఛూలమున్ విడ్చెనన్. 309

క. ఒక వేయి బాణములఁ జీ
ల్చుక వచ్చుచు నున్నయట్టి శూలము రాముం
డకుటిలవేగుఁడు బాహుల
వికలంబుగఁ బట్టికొంచు విఱువం దలఁచెన్. 310

ఉ. అంతట నైంద్రశక్తి పయి నక్షుయు ప్రాలిచ దాని గొంచు ని
శ్చింతుడు రామచంద్రుడు నశీకృతచిత్తుడు శూలముం బ్రతా
రింతు నటంచు నేసె వివరించిన యంటలు గాఁగ శూలమున్
గాంతము భస్మసాత్కృతముగా నొనరించెను శక్తి యంతటన్. 311

క. ఇంద్రపురాప్రేషితమై
సాంద్రమహాశ్శక్తి యిట్లు చాలనియది నే
డింద్రుల కింద్రుడు శ్రీరఘు
చంద్రునిచే శూలదమనశక్తిం బడసెన్. 312

క. రథగమయిత్ర్యనూడామణి
పృథులగతులు గాఁగ సంచరింపించె నహో
రథి రాముఁడు రావణుని వి
తథతేజునిఁ జేసెఁ దార్చ్య తార్చ్య శరమునన్. 313

ఉ. వాజివిధంబునన్ రథము వల్గనన్నృత్యము చేయుచుండె వి
భ్రాజితతేజుఁడైన రఘురాముఁడు నేస్పుచు నున్ననొ శర
వ్యాజముచేత రావణుని యంగము లందున నిప్పు లుంచె నీ
రాజితదేహుఁ డయ్యె నసురప్రభుఁ డెంతయు యుద్ధలక్ష్మికిన్. 314

క. ఆపాదమస్తకమ్మును
వ్యాపారితశరునిఁ జేసె నసురేశ్వరునిన్
శ్రీపద్మాక్షుఁడు రాముఁడు
కోపాటోపమున గ్రుచ్చి గ్రుచ్చి శరమ్ముల్. 315

క. నొసలన్ త్రిశరమ్ములచే
వసలును ద్రవ్వుకొని వచ్చు నసృగాపగఁగా
విసురుకొనివచ్చు నమ్ముల
నసుర దిగులుపడియె తాళునట్టులు లేకన్. 316

మ. చుఱియున్ దానవచక్రవర్తి మది సంబాళించుకొన్నాఁడు ని
ర్భయుఁడై యేనును గూఁచి చేసితినిగా రాముం బ్రతాపించి, సం
గరమం దొక్కపు డొక్కడొక్కఁడు సంక్రాంతాత్మతేజః ప్రభా
కరుఁడై పొల్చు, దిగుల్పడం జనునె దుఃఖంబైన యవ్వేళలన్. 317

క. ఇరువురు సమానముగు శౌ
ర్యరమగలిగినట్టివార లయినం దానై
యరి పొంగు, నీవు పొంగెదు
దురమాడెదు నవ్వ డిట్లు తూఁగుచునుండున్. 318

క. నే నధికుం డై నవ్వుడు
మానవపతి కోపమూనె మఱి నేను దిగుల్
పూనం దగునే కోపము
నూనెద నని యతఁడు కోప మూనెం బెలుచన్. 319

మ. ఒక కోపంబని కాదు స్వీయప్రతిభోద్యోగంబు చెల్లింపఁగా
నకటా! కోపము గాని కోప మది యాత్మావిష్కృతిం బొందు, దా
నికి జీవుండును మాటిమాటికి నెదన్ నిండించుకోఁ గావలెన్
ప్రకటోత్సాహనిదానభావములతోఁ బాలార్చు భావాళితో 320

మ. సహజంబై చనునట్టి కోపమును రక్షస్స్వామి యీరీతిగా
విహరింపంగను జేసికొనగుట కన్పించున్. మహాశ్చర్యమై
సహసా రాఘవనేత్రయుగ్మవిహర చ్చంద్రార్కసందర్శనం
బు హరించెఁ దనుజేంద్రు దానవతఁబోఁ బొంగైన రక్షస్త్వమున్.

సీ. రామచంద్రుని శరీర మను కుడ్యమున దై
త్యపతి జేగురు పరదాలు కొట్టె
రామచంద్రుని శరీర మను మిన్ను నను ర
క్షఃకులేశుఁడు వానకాళ్ళు దింపె

రాకాసి రామపర్వతసానువుల నెత్తు
రేచు వాఁగులఁ బ్రవహింపఁ జేసె
అసురుఁడు రామగిర్యగ్ర సీతావియో
గవ్యథా స్నానోదకములు నింపె

రావణుండు ప్రచండసంగ్రామశీలి
తన మహాశక్తి రూపంబు తాల్చినట్లు
నుర్వీజాపతి నిల్వనీకుండఁ జేసె
రామచంద్రుండు నిలచెను రథమునందు. 322

శా. ప్రత్యస్త్రంబుల రామచంద్రుఁడు సముద్రం బట్లుగాఁ బొడ్చినన్
దైత్యుండున్ గిరిరాజువోలె నిలచెన్, దైత్యుండు ఝంఝానిలా
గత్యుగ్రంబుగ నైన రాముఁడు చలత్కంధింబలెం బొల్చినన్
దైత్యోర్వీతనయాపతుల్ గిరిసముద్రంబుల్ బలెం బొల్చుచున్.

శా. అమ్ముల్ నిండిన మింట నిద్దఱును దృశ్యాదృశ్యమూర్తుల్ సమీ
పమ్మున్ దూరమటంచు నేర్వక ధనుర్వ్యావల్గ దాశీవిషో
గ్రమ్ముల్ చిమ్ముచు నారసంబుల జయాకాంతాసమాసన్నచి
త్తమ్ముల్ గా బవరంబు సేసిరి నదద్దర్పోగ్రసింహాకృతుల్. 324

క. ప్రతిబాణంబును వేయక
క్షితిజాపతి యుండెఁ గొంతసే పట్టులనే
దితిజేశ్వరుండు బాణ
ప్రతతిం బరగించుచుం బ్రవాహముగాఁగన్. 325

గీ. అప్రకంప్యుండు మందహాసాననుండు
సుందరుఁడు కార్ముకోగ్రభాసురుఁడు రాముఁ
గాంచి నివ్వెఱవోయి రాక్షసుఁడు నిలచె
నిట్లనియె రామమూర్తి దైత్యేంద్రుఁ గాంచి. 326

క. అప్పుడు నే నుండినచో
నిప్పుల మండించియుందు నిల్వన నిన్నున్
దప్పించుకొని వచ్చినాఁడవు
నిప్పుడు తప్పించుకొనుము యేదీ చూతున్. 327

శా. నిన్నుం బోల్తన విడ్చిపుచ్చితిని మన్నీఁడౌచు లజ్జాపరి
స్కన్నుం డౌ మఱి వేఱవచ్చితివి నీ సంతానమున్ బంధులన్
మన్నుం జేసితి మిన్ను జేర్చితి నిలింపద్రోహీ! యింకైన సి
గ్గు న్నిక్కంబుగ నేర్చికోవలయు దిక్కుల్ భూతముల్ నిల్వగన్.

శా. సిగ్గన్నట్టి దపూర్వమహా దినుపగున్ జీవుల్ త్రపావంతులై
లగ్గుం బొందెద రెగ్గు గాంతురుసుమీ లజ్జావిహీనుల్ ఛవుల్
కగ్గన్ జీవు లధోజగత్తులకుఁ బోగా నేల లోకంబునన్
సిగ్గన్నట్టిది ధర్మమున్ వినయమున్ జెందించు భావంబుసూ. 329

ఉ. శూరుఁ డటన్న ధర్మమున సొంపు నెఱుంగుట కాని చేతిలా
వై రచియించు కార్ముకమునం దసియందున నేర్పుకాదుసూ!
నేసుచు విద్య యంతయును నేలను మన్నగు ధర్మబుద్ధి చే
కూరనిచో హతిం బొరయు కోసమదిం బయిమెట్టు దానవా! 330

ఉ. దైవము సాగనిచ్చిన యధర్మము నీ మినుముట్టుదాఁక నీ
వీవల లౌకికంబుగ వహించిన దంతయు గొప్పయంచు దు
ర్భావన సేసె దన్నియును వచ్చి పయింబడు నొక్కమాఱుగా
నా వలమానకార్ముకమునా నిది దైవముసుమ్ము దానవా! 331

క. నీతో మాటామటయును
జేతోదోషంబుగాఁగ సిగ్గుచుండెన్
నీ తెన్నె గెదు నిలుమీ
యాతోద్యం బయిన జ్యారవాభీలముగన్. 332

మ. అనుచుండన్ రఘురామచంద్రుఁడు, సమభ్యస్తంబు విల్విద్య నే
ర్వని యట్లయ్యెను రావణాసురునకున్ వైదేహినిం బూని తా
వనమం దెత్తుకపోనియట్లు తలఁచెన్ నవ్యంబుగా మానసం
బున లజ్జోదయ మయ్యె స్వామి కెదురమ్ముల్ తీర్చ లేనట్లుగన్.

మ. శవముం గొట్టినయట్లు గొట్టె రఘువంశస్వామి దైత్యేశ్వరున్
శవముం బ్రాణసమేతమున్ గలితలజ్జాకంబునుం సంస్కృతి
ప్రవణంబున్ భయహీనమున్ సుశరసంపద్వ్యాప్తమంబున్ సము
ద్భవవైరాగ్యవిదూషితాత్మము నసంభ్రాంతంబు క్రాంతంబునున్.

క. రావణసారథియును యు
ద్ధావనిఁ దొలగించెఁ దద్రథంబును రక్ష
స్సేవాపాఙ్గీణుం డయి
రావణుదేహంబు నపుడు రక్షించుటకై. 335

గీ. తెలిసి రావణుఁడును సారథీ! యిదేమి
చేసితివి ? నన్ను నిచట తెచ్చితివి నీవు
నంగనలు సాంధ్యవాహ్యాళు లరుగుచోటఁ
గంధితరఁగలు బండలు క్రచ్చుచోట. 336

ఉ. చూచుచుఁ జూచుచుండ రిపుసూదనకృత్యమునన్ మఱల్చి వీ
రోచితకార్య మిద్దియె ? యెఱుంగవు బండిని ద్రిప్పికొంచు నీ
వీచికలన్ మరుత్తు వలవించెడి చోటికిఁ దెచ్చినావు మై
త్రీచరణుండ వౌదువె యరిప్రియకృత్యమునం జరించుచున్. 337

చ. తెగఁబడి పీడి చన్న పొలదిండి విభీషణుగుంపు లోపలన్
మిగిలినవాఁడ వౌదువా? యమిత్రుల పక్షమువాఁడ వౌచు నా
నొగలున్ననుండి యుద్ధమునునుం గికురింపఁగ నిన్ను నుంచిరో?
సగమునయందునన్ విరిగి సాగరవేలకుఁ దెచ్చి సారథీ. 338

మ. అపుడే రాముని బిట్టు నేర్చితిని దానై నిందకుం జొచ్చి నే
రపుమాటల్ రచియించె రాఘవుఁడు శౌర్యప్రక్రియన్ మాలి యా
కృపణుండున్ దనభార్య పోయెనని దుఃఖించున్ మఱే నెంత దై
త్యపుభావంబున నున్నఁ జంపుదునె భార్యాదుఃఖశీలాత్మునిన్.

మ. మరియున్ రాముఁడు నన్నునోర్చినిలచెన్మాహాత్మ్య మన్నట్లుగన్
తిరుగన్ నేనును నిల్చినాఁడఁ జుమి నాతీరున్ వివేకించు నే
ర్పరి వింతైననుగాక తెచ్చితివి నాబండిన్ సుమీనాంబుసుం
దర వీచీ జలరాశి తీర పవమాన శ్రీ వనీ వీథికిన్. 340

చ. పొలుపఱి నాదు కొమ్మ పడిపోవుచు నున్నది యూర! భద్రజీ
వులు మఱియున్ గృతజ్ఞులయి పొల్తురు, తక్కినవారు జీవనం
తులు పరిశిష్టమా బ్రదుకు త్రోవల నెవ్వడు చూచికొంద్రు, నీ
వలయిక వారిలోన నొకఁ డౌదువా? న్యాయమె యద్దియైననున్.

మ. అనినన్ సారథి బిట్టు ఖిన్నుఁడయి యేలయ్యా మహారాజ! నే
నును వేలేండ్లుగ బండితోలు కులమందుం బుట్టితిన్ నీకుఁ బూ
నిన నా యీ కళ నాదు తాతయునుఁ బూనెన్ దైత్యలోకేశ! నా
తనువందుం బ్రవహించు నీకు ననురక్తంబైన వారక్తముల్. 342

గీ. నేఁ గృతఘ్నుఁడగాను బండితుఁడ నేను
కడు నమిత్రుఁడఁ గాను శూరుఁడను నేను
నా కులంబునవారు చన్నట్టి త్రోవఁ
బయనమై వచ్చినాఁడ నీబండి నడుప. 343

చ. తతముగ బండియుం దిరుగు ధారుణి నంతయు బీట్లు బీట్లుగా
శితశరసంతతిన్ విరియఁ జేసెను రాఘుఁడు సూటిఁ ద్రోలినన్
గతుకుడు పొందు లక్ష్య మఱఁ గాదని ప్రక్కకుఁ ద్రిప్పితోలఁ దా
నతుకక పోయి యొడ్డగెడవౌ దిగి చక్రము గుంజుకోవలెన్. 344

ఉ. ఘోషణమైన యస్త్రమును బుచ్చెను రాముఁడు నేను గుఱ్ఱముల్
ఘోషణ మొప్ప దప్పికను గొంటిమి మాకుశివైపు గోడ వి
ద్వేషితవృత్తి నమ్ములను వెట్టెను దిట్టరి సందొసంగకన్
దూషితబుద్ధి మావయినఁ దోలఁగ నీయఁడు కంధివాయువుల్. 345

ఉ. ఈపయి నేను జెప్పటయు నింతయు ధర్మముగాదు స్వామికిం
గోపమురానిచో నిదియుఁ గొంచెము చెప్పెద రామునందు నే
దో పరమానురాగమొ దయోదయమో ఘటియిల్లె నీకు నీ
వోపఁగ నెంచినన్ రిపుని యుద్ధమునం దది కోసివేయనా. 346

వ. అంత రావణుండు నవ్వి నీవు నగరములోనికిం బోయి యెట్టినేల
నైన నడచెడుదానిని నీయిష్టమైన రథంబును, డయ్యనివానిని, డప్పి
నోర్చికొనెడువానిని నీయిష్టమైన గుఱ్ఱంబులు కట్టి తీసికొనిరమ్ము
నే నిందె యుండెదను.

ఉ. రాముఁడు చావఁగావలయు రావణుఁడైనను జావఁగావలెన్
హ్రీంమతి సుంతయున్ బెసకనీయను ఘూర్జటితోడి దేమి? దే
వీసుహితానుభావపదవీస్థితి సూర్యకరాలతిరస్కృకా
లామితవేగచంక్రమణ మాపెద నీ విదె పోయిరమ్మనన్. 348

ఉ. ధీమహితంబు సృష్టిని స్థితిం ఘటియిల్లఁగఁ జేయు విష్ణుతే
జోమహితుండు దానవనిషూదనుఁ డంబుజబంధుకాంతి కా
లామితవేగచాలనము నాపఁగ నెంచిన వింధ్యపర్వత
గ్రామణి గుంజు తీసిన యగస్త్యుఁడు రామునిముందు నిల్చుచున్.

గీ. ఇది రిపువధార్థ మాదిత్యహృదయ మన్న
మంత్రము పఠింపుమని యిచ్చి మౌని యేగె
మంత్రము గ్రహించి రాముండు మహితనియతి
కీర్తనీయ తద్భావనామూర్తి యయ్యె. 350

సీ. అహరాగమమునందు నవ్యక్తముననుండి
వ్యక్తంబు సర్వంబు ప్రభవమందె
నాదిత్యమూల మ్మహాస్సు వ్యక్తమెల్ల
నాదిత్యహేతువై యవఘళించు
నాదిత్యుఁ డనగను నగ్ని తేజస్సు చై
తన్యంబు ప్రాణంబు తనుగతంబు
నతఁ డగ్నిహోత్రంబు నాతఁడే క్రతువులు
నాతఁడే యాయువు నతఁడె మృత్యు

వతఁడె కర్మప్రబోధకుఁ డతఁడె నిద్ర
మఱియు ఋతువులు నతఁడె సంవత్సరంబు
నతఁడె పూర్వాద్రియును బశ్చిమాద్రి యతఁడె
పూషుఁడు గభస్తిమంతుఁ డంభోజహితుఁడు 351

సీ. ఇంద్రాదిదిక్పాలు రీశ కేశవ పద్మ
భవులును స్కందుండు వసుమనువులు
మనుజయక్షులు సాధ్యగుండలియు మరుత్తు
లహులు పిశాచమ్ము లదితిసుతులు
శంభుండు ఋగ్యజు స్సామముల్ త్వష్టయు
దైత్యులు నసురులు దానవులును
తిమిరగఘ్నుండు హృద్దీపిత నారాయ
ణుండును మఱియు మార్తాండు డతఁడ

యాతఁడె సృజించు రక్షించు నతఁడె చంపు
చెలఁగి తపియింపఁ జేయు వర్షించు నతఁడె
సర్వభావోద్భవుండు నాశకుఁడు నతఁడ
యల నమస్కారములు సర్వ మతనిఁ బొందు. 352

ఉ. ధీరుఁడు రాముఁడున్ సముదిష్టుఁడు చేసెను ధ్యానమూర్తి ము
మ్మాఱు జపంబు తానుగనె మన్నన జేయుచు నెల్లఁ దానె యం
భోరుహమిత్రుఁడై సకలమూర్తము తానయి సర్వదేవతా
ధారుఁడు తానెయై పరనిధానమునై త్రిజగన్నిదానమై. 353

శా. తనిషాసమయంబునన్ రఘుకులేంద్రస్వామి కవ్యక్తమున్
స్కన్నం బౌచును వ్యక్తరూపక మహాస్సంచారభావంబు నొ
చున్నన్ దోచె నొకర్తు సంసరణభావోద్భూతయై యామె తా
నన్నట్లుండి స్వతంత్రయో యనఁగ సేవాధీనయై యెంచినన్. 354

గీ. ఆమె చేతులు జోడించి యనియె నిట్లు
లంబుజాతాక్ష! యప్పుల కాది వీవ
యప్పులును నీవ యబ్జుఁడ వైనయపుడు
నాథ! సంధిలోఁ గలసికొన్నాను నిన్ను. 355

వ. అంత శతసహస్రసూర్యమండలవిభాసి యైన శ్రీరామచంద్రుండు
దూరాన నరుదెంచు రావణరథంబు చూచె. 356

సీ. కనకమయ మృకుల ఘంటికాస్వనములు
మణికింకిణీ కుణుకుణు నినాద
కములతోడను నాట్యకర్త్రియవలెఁ గేతు
పీతాంబరాంచలాన్విత మనుత్త
రంగంబులను నప్సరఃకామినీచయ
మందాకినీతీర మధుర మధుర
వాహ్యాళివలె, హిమపర్వతకన్యకా
పతిలీల లసి । వాయఁబడుటచేత

రజతశైలశేఖరకందరమ్ముఁ బోలె
ముగ్ధగంధర్వనగరంబుఁ బోలె సిద్ధ
సాధ్య సుర యక్ష కిన్నర జంపతీ స
నక్రిపియానూన మగు విమానమ్ముఁ బోలె. 357

సీ. కాసారవత్పతాకా శార వర్ణప్ర
కాశాభిరంజితాకాశ మగుచు
హేషాప్రఘుష్యద్విభీషా త్త ఘూత్కార
ఘోషాశ్వవదనాంబరీష మగుచు
నేమిత్వరా కేళి భూమిప్లవద్ధూళి
సామిగ్రసద్వియత్సీమ మగుచు
ఘంటావినిస్వాన ఝంటీకుణుక్వాణ
ఘంటాపథీభవత్కంఠ మగుచు

వ్యాళపూత్కృతిగఁ గశాకరాళ మగుచు
ఘోణిప్రోథకూబరవినిద్రాణ మగుచు
మండితాయుధాగారప్రచండ మగుచు
సర్వతశ్చక్రపరికంపితోర్వి యగుచు 358

సీ. వర్షాసమారంభవాలాహకచ్ఛటా
నిర్గతతీవ్రాశనిస్వనాళి
కుంభితకుంభమై కుణుకుణు చిఱుతచ
ప్పుళ్ళ బంగరు చిన్నముువ్వలగవి
యలువంపుటులివుల కొలువుచప్పరమై క
శాచాలనోద్గత స్వనరథోగ్గ
చక్రనిస్వాన కృష్ణమహోగ్ర సైంధవ
హేషా మహాస్వాన పృథులరావ

ముల సభాభవనమ్ముగానై కలితగగన
శబ్దగుణమెల్ల నొకచోట సంతరించు
కొన్న సంయతదేశమై కొండగూడు
తెగిన తేనెటీఁగలస్రోఁత మొగిలునోలె. 359

గీ. వచ్చుచున్నట్టిదైన రావణురథంబు
చూచి శ్రీరామచంద్రుఁడు శూరహాళి
చాపలస్తకనిహితహస్తముగ మాత
లిం బలుకరించి యెదురు తోలించె బండి. 360

ఉ. వంచితబుద్ధి ముంచికొని వచ్చుచున్నది వీనికిన్ విదా
రించితి మూఁడుమార్లు తకరించుచు నెప్పటికప్డు మద్భుజో
దంచితశౌర్యమున్ మఱల నాహవభూమికిఁ గ్రొత్తబండి తో
లించుక వచ్చుచుండెను శిలీముఖనిస్స్వనదంతురంబుగాన్. 361

చ. చదలునఁ బ్రొద్దుగ్రొవ్వెలుఁగు సందుల బండితోలెదుం
జదురు వెలార్చు నో మఘవసారథి! బండిని తోలిపెట్టు నిం
ద్రు దయ సమస్తమున్ ఫలము నూల్కొనఁ జేయుము తిరిగిపోవరా
దు దితిజరాజు, నేఁ డిచట దుమ్మగాయి మిన్నయి నిప్పు గాలియై.

సీ. మనువులు వసువులు మరుదాదులాదిత్యు
లింద్రులు రుద్రులు నీదృశముగ
లిప్తలు యామముల్ దినములు మాసముల్
ఋతువత్సరయుగంబు లీదృశముగ
మహితవర్ణము లాశ్రమంబులు ధర్మంబు
లీడితాచారంబు లీదృశముగఁ
గ్రతువులు వైశ్వానరప్రభ లాహుతు
లిహపరలోకంబు లీదృశముగఁ

బవలు మొదలిడి రాతిరి పడెడు వఱకు
ధర్మపరిణామ మయమైన తరణికిరణ
సమితి నష్టము ద్రిప్పెడు కుమతి వృద్ధి
ఘృతి మహాఘట్టమున సంహరింతు దైత్య. 363

చ. అను సమయంబునందు నుభయంబును ధర్మ మధర్మ మాచు రా
మునిదెస దైత్యరాజుదెస మొత్తము లాచు శుభాశుభంబులై
చను శకునంబు లొప్పె దితిజప్రభు నిల్చినచోట ధాత్రి కం
పనమును బొందెఁ దద్రథము వాల్పడి తూగఁగ భల్లుకంబునాన్.

చ. అరదము కేతుదండమున నాడెను గ్రద్దలు బండికప్పుపైఁ
గురిసెను నెత్తురువాన విలుకోటిని జారె గుణంబు గుఱ్ఱముల్
చరణములందుఁ గుంటువడె సారథి విభ్రమమందె బండికిన్
వఱదులు సూటిగా నెదురువచ్చుచు నూలలు వేసె నుగ్రముల్.

ఉ. దుశ్శకునంబు లెన్నియగు దుష్టము లన్నియు నయ్యె దైత్యు తే
జశ్శమనంబుగాఁ దిమిరసంతతి కప్పెను బండినెల్ల నం
తశ్శుభభావనాచయవినాశకరంబుగ వాని దొక్కఁ స
ద్యశ్శమనాతిథిత్వమున యందలి స్వాగతలక్షణంబులై 366

గీ. శకునములు సర్వజనులకు సంభవింప
వృత్తమత్వ మే లేశమో యుండవలయు
నద్ది సత్పదార్థము కృప నాదరించు
టాదరింపక పోవుట యతని కర్మ. 367

ఉ. రావణు సంహరించుటకు రాముఁడు నిశ్చయముం బొనర్చె నా
రావణుఁడున్ స్వకీయము పరాక్రమమున్ బహుశాస్త్రమంత్రముల్
దేవతలం జయించుటకుఁ దెచ్చినశక్తులు మూటకట్టిన
ట్లై విలయాంతకుం డనఁగ నాహవముం బొనరించుచుండఁగా. 368

సీ. మానిసిదిండి గ్రీష్మర్తువై యెండింప
నలినాక్షుఁ డంత వానలను గురిసె
వానలు కురియ రావణనీలమేఘంబు
రామచంద్రుఁడు శరద్రాత్రి చేసె
పొలదిండి గూడమంచులను బట్టింపగా
రాముండు మృదుశిశిరంబు తెచ్చె
రావణుండును శిశిరము ముదిరింపింప
మాధవుం డయ్యె సీతాధవుండు

నిసువు రేసెడు బాణాల కెగువ దిగువఁ
బ్రక్కలందునఁ గానిపింపక బవరము
చూడవచ్చిన ఋషులును సురలు చూచి
రాత్మమహిమలచే నంతరాంతరముల. 369

ఉ. నల్లనిమేనివాఁ డొకఁడు నారసముల్ కురియించుచుం దళత్
ఫుల్లసరోరుహాక్షుఁడును మోహనమూర్తియు నిల్వ ముందటన్
సుళ్ళుగ సుళ్ళుగా మసరఁ జొచ్చెను దైత్యుఁడు నల్లనో గరు
త్తుల్లసితోజ్జ్వలన్నిశితతుండము లొప్పు శిలీముఖాకృతిన్. 370

ఉ. సంగరమందు రావణుని జంపఁగ రాముఁడు నిశ్చయించె నా
సంగరమందు రాఘవుని జంపినఁ దానును జంపవచ్చు నా
సంగరమందుఁ దాను మఱి చచ్చినఁ జావనువచ్చు నంత ని
స్సంగత నంతరాత్మ దితిజాతజగత్ప్రభుమూర్తి యాడెడున్. 371

ఉ. రాముని కేతనంబును ధరంబడఁ జేయఁగ నెంచె రావణుం
డు ములుకుల్ విఖండితములై చనఁ జేసెను రామచంద్రుఁడున్
రాముఁడు తత్ప్రతిక్రియఁగ రావణు కేతనముం బగిల్చె ను
ద్దామము కోపముం గనఁగ దానవరాజది నేలపైఁ బడెన్. 372

చ. మఘవుని పంపు గుఱ్ఱముల మాతలి నొంపఁగ నెంచె లోన శౌ
ర్యఘనుఁడు రావణుండు రఘురాముఁడు సాధ్యము కానియట్లు చే
సె ఘుమఘుమార్భటీనిశితజిహ్మగసంతతి దైత్యనాథుఁడున్
లఘుతరవిక్రమంబున హాళాహళి చేసె విచిత్రనైపుణిన్. 373

చ. లలితములైన చిత్రగతులన్ నడిపింపఁగ బండిఁ జెప్పి మా
తలి రఘురామచంద్రుఁడును దానవరాజు రథాని కన్ని ది
క్కుల నొకసారి తోఁచు గతి గుఱ్ఱములన్ బెసగించె, బిట్టు టం
గులు తెగిపోన దైత్యపతి కూర్చికొనెన్ హయరాజి యత్నమై. 374

ఆ. రావణుండు ఖడ్గరావణుం డయ్యెను
జయము జయము రామచంద్రునకును
జయము జయ మయోధ్యజనులకు సురలకు
జయ మటంచు భూతచయము పలుక. 375

క. అంతట నిరస్త్రకంబుగఁ
గుంతమ్ములు ప్రాసములును గోలలు పరిఘల్
వింతగఁ బట్టిసములును ధ
రాంతమ్ముగ నెసఁగె దిక్చయాంతంబుగనై. 376

మ. కదలెన్ మిన్నులు భూమి క్రక్కదలె నింకన్ వార్ధు లల్లాడె నీ
చద లీ ధారుణిభాగ మీ కడలి నాఁగా లేక శేషించె న
న్నది లేకుండఁగ ఖడ్గరావణ మహానాగోగ్రదంష్ట్రానలో
న్మదకాకోలము మండఁబెట్టఁ దోడఁగెన్ నాళీకగర్భాండమున్. 377

ఉ. రామశరప్రపంచము విరామము లేక ధరామరేంద్రర
క్షామహనీయమై పొలిచె, సర్వజగత్తును దానఁ జేసి ర
క్షామహనీయమై పొలిచె క్ష్మాస్థలి మిన్నులునుం గడళ్ళునున్
శ్రీమహనీయమై యనుసరించెను రామశరప్రపంచమున్. 378

ఉ. సంగర మీగతిన్ విరతిచాలక సాగుచునుండ సూర్యుఁ డ
స్తంగతుఁడయ్యెఁ బశ్చిమదిశన్ రఘురాముఁడు తా నె సూర్యుఁడై
పొంగినయట్టి వెల్గులుగఁ బూంచిన తీవ్రశరాన దైత్యరా
ట్సంగతకంఠమున్ చునిమె తత్స్మృతిలిఁ గన్పడఁ గృత్తశీర్షమున్. 379

క. తల తెగెనా! తెగినది, భూ
తలమునఁ గన్పించు తెగినతల, యింకొక్కఁడో
తలయున్నది కృత్త మ్మగు
తలయుండినచోట నూళితలముగ నదిరా! 380

ఉ. సంచితసూర్యతేజుఁడయి సంగతధీ మధుసూదనుండు న
క్తంచరరాట్ప్రయుక్తము గదాముసలాదికవర్షమున్ నిరో
ధించుచు నస్త్రమత్తతను ద్రెంచినదా తలఁ ద్రెంచినట్లు ఖం
డించెను నూటయొక్కపరి నిండిన శీర్షము నిండినట్లుగన్. 381

ఉ. రాతిరి యంతయుం గడచె రామున కింతయుఁ బాలువోద యా
హా తన యమ్ము తొట్టతొదయందున భూతచయంబు ప్రాణముల్
ప్రోతములై యెసంగెడిని బూన్చినదా తల పూన్చినట్లుగా
నీతని ప్రాణనిష్క్రమణ మేటికిఁ గల్గదు చిత్రమయ్యెడిన్. 382

వ. అంత రావణుం డిట్లనుకొనియె 383

చ. ఇతనికి దేవికిం దనకు నింతటి భేదము, స్వాత్మభావనా
తతముగ దేవియే యితఁడు తానగు, నన్ను వధింప బ్రహ్మసం
గతమగు దీప్తికాఁ దొలివికారము నందలి తేజమాచు న
చ్యుతుఁడును దాను దేవియు త్రిశూలియు నందఱు నైనచోటునన్

వ. అంత నాస్ఫూర్తి రావణునుండి మాతలికి వచ్చి మాతలి శ్రీరామ
చంద్రునితో నిట్లనియె. 385

ఉ. కోరిక దైత్యులన్ గెలుచుకోసము వృత్రవిరోధి పూర్వ మం
భోరుహసూతి సర్వజయమూలము దేనిని సృష్టిచేసెనో
కోరిక కుంభసూతి తనుకోసము రావణు సంహరింప నం
భోరుహనేత్ర నీ కొసగెఁ బూంచుము దానినిఁ జాపమందునన్.

వ. అది పైతామహంబైన యస్త్రంబు, దేని ఱెక్కలందుఁ బవనుండును ఫలమునందుఁ బావకభాస్కరులు నుందురో, దేని శరీర మాకాశమయమో, యేది మేరుమందరములయంత భారమో, జాజ్వల్యమానమైన యదియు సుపుంఖమును హేమభూషితమును సర్వభూతతేజోనిర్మితమైనదియు భాస్కరవర్చసమును సధూమమైన కాలాగ్నియు మహాశీవిషమువలె దీప్తమైనదియు పరనాగాశ్వభేదనము శీఘ్రకారియు ద్వార పరిఘ గిరిభేదకమును మేదోదిగ్ధమును నానారుధిరసిక్తాంగమును సుదారుణమును వజ్రసారమును మహానాదమును నానాసమితిదారుణంబును సర్వవిత్రాసనంబును భీమంబును నైన దానిని శ్రీరామచంద్రుండు విధివత్తుగా వింట సంధించి విడిచిన. 387

శా. ప్రాణం బెచ్చట నుండు నాస్థలమునం బట్టెన్ మహాస్త్రం బని
ద్రాణంబొచుఁ ద్రిశూల మట్లు హృదయగ్రంథిన్ విభేదించెఁ బా
రీణంబైన సుదర్శనం బన మహాస్పృజ్ఞుడు పేర్చెన్ మఱిం
దూణీరంబును జొచ్చె నస్త్రమును దైత్యుం డుర్విపై వ్రాలఁగన్.

చ. మరియును జల్లనొచుఁ బవమానుఁడు వీచెను లేఁతయెండ భా
స్కరుఁడును గాచె ధాత్రియును గంపము నొందక నిల్చె వార్ధి శీ
కరములు చల్లెఁ దీరమునఁ గందని నీలిమ తోఁచె మింట సం
గర మఖిలమ్ము చల్లపడి కాయము నిర్వృతి పొందె నెంతయున్.

శా. కోదండంబును వాల్చి యొక్కశిలపైఁ గూర్చుండ శ్రీరాముఁడున్
సైదోడుంబలెఁ బల్కరించి చనియెన్ జంభారి మింటన్ లల

న్నాదంబుల్ శుభవాదముల్ మధురగానంబుల్ నదత్కింకిణీ
పాదానూనరవంబులున్ వినఁబడుం బ్రహ్మాన్నభావంబునన్. 390

వ. అంత సుగ్రీవ విభీషణాంజనేయ మైంద ద్వివిదాంగదాదు లొక్కొ
క్కొకరు వచ్చి రాముని పాదంబులు స్పృశించి బద్ధాంజలులయి
యొదిగి నిలుచుండ శ్రీరామచంద్రుండు వారి వంకఁ జూచి మంద
హాసంబు చేసిన. 391

శా. కాసెన్ వెన్నెల లచ్ఛశారదనిశాకల్హారకాంతానట
ద్దాసశ్రీకము లప్సరశ్శ్రయ దృశావ్యాపారసంచారముల్
భాసిప్రోజ్జ్వలవారిధితీరసికతాపర్యంకనిద్రాళుక
న్యాసంగత్యతిభోగభాగహిమదేహాంశుప్రభాచోరముల్. 392

ఖండాంతము

క. ఇది నిస్సంశయఖండము
ప్రదరమనువ్రజసముద్ధికభాసితతత్త్వా !
యొదయుండుఁ జంద్రదహాళిని
బొదలించవె శ్రోతయైన ముక్త్యాలపతిన్ 393

ఉ. ఈ తను వింత శోషపడి యెంతయు నిన్నుఁదలంచుటందు ని
ష్ణాతముగా మెలంగెడిని నాప్రభు! నేను ద్రొలంగిచన్నచో
నీతలఁపుల్ సమృద్ధముగ నిండెడు నట్లుగఁ జేయు భక్తిభా
వాతిథి ! రెడ్డినచ్చె మొదలాడుము నాఁ బొనరింపకే ప్రభూ.

ప్రసగ్రిణి

ప్రాణమూలస్థలీభాసి లింగాకృతీ
స్థాణురూపాంత రాస్పందపాథోనిధీ
క్షోణిభృద్గర్భ వక్షోజ కాశ్మీరసం
త్రాణ చైతన్య నిత్యత్వ తేజఃఖనీ ! 395

# ఉపసంహరణ ఖండము

క. శ్రీద్రుపదాలయపరివ
ర్ద్వేదీ! యైరంమదీయ విమలసరోమా
ర్తీ! దళితాశ్రితజనతా
ర్తీ! దీపితసర్వధర్మకృతి! విశ్వేశా!

గీ. చటుల మవు కార్యము తదుపసంహారణము
శ్రమకుఁ జూడ సమానభారములె యౌన
వెలయ నెక్కువభార మన్పించుచుండు
ప్రథమమైన దవిజ్ఞాతఫలము పొందె. 1

ఉ. భణితము కాని సౌఖ్యమగు భావన మైత్రిపురస్సరంబు ల
క్ష్మణుఁడును దాఁకబోఁ దన కశౌచ మటంచును జెప్పచున్ విభీ
షణుఁడు తొలంగ స్వామి కనుసన్నల దానిఁ గాంచుచున్ విభీ
షణు నని యెన్ సఖా! మిగులు సంగరమంచును లేదుగా యిఁకన్. 2

మ. మరణాంతమ్ములు వైరముల్ ప్రకృతులున్ మన్నింపకున్నన్ సహో
దరభావం బది జన్మతోడ వినిబద్ధంబైన బంధంబు, సు
స్థిరకర్మంబులు సాంపరాయములు నీచేఁ గల్గు నిచ్చోట బ్రం
ధుర మీ రాక్షసరాజ్య మంతయును నీతో నున్న దీ లంకతో. 3

చ. చను మనఁగా విభీషణుఁడు సంగరభూమికి నేగి యన్నఁ గ
న్గొనె వినికృత్తపక్ష మగు కొండను రామమహేంద్రపాతితం
బును నదులన్ లతాతరుసమూహము ధాతుచయంబు భోగిరా
ట్ఫణమణులున్ గుహాచయము మంజిడిగాయము లైనదానినిన్. 4

మ. కనుచున్నంతన వచ్చెఁ ద్రవ్వికొని దుఃఖం బంత దైత్యాత్మజా
తునకున్ మానసమందు లేనిది సముద్ఘాతంబుగా గుండె వం

చ, నితాంతంబు మనస్సు వాహిక, జనిస్థానంబులో నున్న దా
రని దుఃఖాదుల యూబికాలువ సముద్రం బంత వైశాల్యమై. 5

గీ. బాధపడునది గుండియ బడలిపోవు
నది శరీరము భావించునది మనస్సు
నా జనిస్థానమగు రహస్యస్థలంబు
పొలఁకువ యెఱుంగరాద యోగులకు నైన 6

క. నిన్నీగతిఁ గనుచుంటిని
నన్నిటు లెవఁడుం గనుంగొనఁడు నీదెస నే
నున్నన్, రాముఁడు నాదెస
నున్నాఁ డక్కతనఁ జూచుచుంటిని నిన్నున్. 7

చ. అతఁడు తలంప నీప్రతిభ కందఁడు నాఁ జెవి నిల్లు కట్టిపో
రితి, వినినావు కా వపుడు, మృత్యువు వేనికి భీతిఁబొందు నా
మృతికిని నేడు లోఁకు వయి, తింతటివానికి నీకు నిట్టి దు
ర్గతి యనఁ జేతులారఁగను గ్గెడునట్టులఁ జేసికొన్నదై. 8

మ. అలవాటైన యఘం బొకం డెపుడు కార్యంబై తదీయంబు దు
ష్ఫలితంబున్ బహుకాలముం గన కదిన్ సాగించుచుండున్ మఱిం
దెలియన్ రాకయ యొక్కసారిగ మహాద్రింబోలె నాసర్వమున్
దలపై వచ్చి గుబేలునం దుముకగా దైవంబు నిర్మించెడున్. 9

శా. ఈదృశ్యం బగునట్టి దేహ మొకనాఁ డీ మూఁడులోకంబులన్
బాదుల్ త్రవ్వి తదిందిరాతరువులన్ బ్రాలించి బ్రీలించి పెం
పేదం జిట్టచిటారుకొమ్మల పువుల్ బ్రీలించి బ్రాలించె నేఁ
డీ దుష్టంబగు నేలఁ బండుకొనియుండెన్ గాలుసే యాడకన్. 10

మ. ఖరు మారీచుని వాలి నే శరము వేగం బిట్టె యూగించెనో
యరయన్ వేగబలమ్ము లవ్వి పనిచేయన్ లేద యీనేన ని

ర్భరమై సృష్టికి మూలహేతువగు మంత్రంబై విదారించు శ
క్తి రమూవంతము పాంచభౌతికవిభక్తిం బొల్చు మే నియ్యెడన్.

ఉ. ఎంతటివో తపంబులు మఱింతటి వైన వరంబులున్ బరా
క్రాంతియు భోగదర్పములు కల్గిన నొక్క దురాగ్రహంబు తా
నింతటి చేటు తెచ్చు క్షణియించిన నైనను రామచంద్రు చా
పాంతమునంచుననన్ నిలుచుటన్నది యున్నది తత్ఫలంబుగా. 12

ఉ. ఆగడ మంత చేసితివి యాయనయందున దుఃఖ మందు లే
నీ గతి రామచంద్రునకు నిష్టము కానిది నిన్ ద్యజించి నే
నేగితి నద్ది కోపగుణహేతువు నీకును నీవు మెచ్చు వ
ద్ధా గతిమాలి యీ యుభయథా యవివేకపథానఁ బోయెదన్. 13

చ. ఒక పెనుపైన భోగమును యోగము దుఃఖము పొందఁగాఁ దిలో
దకము లొసంగ బంధుజనతావరిశేషము కల్గియుంట యీ
సుకృతము నీవు చేసితివి శూరశిఖామణి! నేను గూడ మృ
త్యుకబళమైన నా సుకృత ముండెడి దింతయుఁ గాదు నాకిటన్. 14

ఉ. కొంచక రెండుశక్తులను గుప్పితి నావయి లక్ష్మణుండు త
ప్పించెను రెండుసార్లు మతివీరుఁడు మృత్యువు నాకు, నీకదిన్
మించిన లాభమై పరిణమించెను చిత్రము కార్యజాత మే
లించెడు స్వామికిం దెలియు లేశ మెఱుంగక సేతు మన్నియున్. 15

చ. అయయొ జగత్తు కామవశమై పొనరించు క్రియాకలావ మం
తయు హరికి న్నివేదనము నాఁ జను దేనిఫలంబు దేనికో
యయి పరమేశ్వరార్పితము నై సకలక్రియ యొంతయొప్పు! నీ
వయయొ పొనర్చు టొక్కటియు నయ్యెడి దొక్కటిగాఁగనైనచో.

గీ. అరయఁ బరభార్య యనుటలోఁ బరునిభార్య
యన్న యర్థంబు తీసిన యట్టియాతఁ

డిన్నికాలాలలోన నీకన్న నెవ్వఁ
డింత ఫలితంబు పొందిన యెవఁడు కలఁడు. 17

ఉ. తమ్ములు మంత్రులున్ సుతులు దానవయోధులు సైన్యనాథులున్
గ్రుమ్మినబంటు లొక్కఁ డనుకోఁ దగినట్టిఁడు లేకయుండ యు
ద్ధమ్మున కీవు వచ్చితివి దానికి నీవొకవేళ రాఘవుం
జిమ్మిన దైత్యులన్ మఱల సృష్టి పొనర్పఁగ నెంచినాఁడవో. 18

చ. తవిలి యెదేనియుం దెగువ తాఁకొను గుండియ రాముచేతఁ జా
వవలయు నంచు నచ్చితివి, వచ్చినవాఁడవు నంత తీవ్రపరా
బవరము చేయ నేటికిఁ దపంబుల పెక్కన చూపి యల్ల రా
ఘువు భయపెట్ట నెంచితివొ, లేదని వానిక గెల్వ నెంచితో. 19

చ. దరిసి నిరస్త్రకంబగు గదాముసలాదికతీవ్రవర్షముం
గురిసితి వెవ్వఁడున్ నిలుచుకోటికి రానిది సర్వసృష్టికిన్
బిరుసు డిగించు దాని నతిభీషణమున్ రఘురాముఁ డెట్టివా
శరముల నొంచె దాని, నది సంశయమున్ విడఁదీసె నీయెదన్. 20

వ. ఇట్లన్నవద్దఁ గూర్చుండి విలాపించుచున్న విభీషణుం దవ్వులఁ
గాంచిన నక్తంచరులు నగరంబున నగరున నీవార్తఁ జెప్పగా జనం
బులకు ధైర్యంబు కలిగి రొక్కరొకరు నంతఃపురస్త్రీలు రావణుని
భార్యలు పెక్కుమంది వచ్చి హైమనప్రతిసీరాంచలసంచిత సరో
జాతాక్షులై వానిమీఁదఁ బడి బిట్టు విలపించుచుండగా వారిలో
నొక్కయచ్చర యిట్లనియె. 21

చ. ననుఁ గొని తెచ్చినా వసురనాయక! నీదగు నల్లరూపునన్
మనసయి వచ్చితిన్ దివిజమానిను లెల్లను కక్కసింప న
న్నును విడిపోయినా వొక యనూతనమైన స్థితిన్ ఘటించి నే
నును సురలోకదూషితను నూల్కొన రాక్షసలోకదూషితన్. 22

గీ. అధమురాలైతిఁ జిత్తవహా విధవరాల
నైతిఁ బెండిలి లే దుభయమున నాద
రంబు మాలిన వగు నగరములు గాఁగ
దితిజపురి కాక యమరావతియును గాక 23

ఆ. ఏ నను ర్త్యాగుట యిది వేఱ యొక బాధ
యవధిలేని విధవరాలితనము
క్షాత్త్రరాజు కూఁడుగుడ్డ యిప్పించునో
యూడిపించునో పురోహితవిధి. 24

వ. అంత నొకవిలాసిని యిట్లనియె. 25

ఉ. నీకును నే నొకప్డు ధరణీసుతఁ దెచ్చి తటంచుఁ బ్రేమ కం
గీకృతిఁ జూపకున్న నది కేవల రూపక మామె తల్లి యా
నాకని చెప్పినావు కలనన్ భృగురాముని వీరశైవు నా
హా కికురించె దాని కిది యంచని యాడి తబద్ధమా నుడుల్. 26

ఉ. కోరిక లేక స్త్రీజనులకూటమికై పురుషుల్ మృషోక్తులన్
ధీరత నాడఁగా వెనుక దీయర యందున నిద్ది యాడనా
నారయ నిద్దియాడఁ దగదంచును లేకయ తత్ఫలంబుగాఁ
గూరిచె స్వామి నీ కిదియుఁ గూరిచె నాకిదియున్ మనోధవా. 27

వ. అంత నొక కులాంగన యిట్లు వందురె. 28

ఉ. బంటులు గాఁగ నీకలనఁ బ్రాణము లేదిన బంధులైన పు
ట్టింటికిఁ బోయి నేను బతిహీనన యందఱివోలె నందుఁ, బు
ట్టింటను మున్ను నీకయిన యింతి నటంచును గొప్ప, నేఁడు నా
కంటెను వారె మేలు, గృహకార్యము లైనను జేయఁగల్గుటన్. 29

శా. స్త్రీలే పున్నెము లాచరించెదరొ పుంస్త్రీచావు చావంగ నే
నేలా వత్సము బాసి చన్నదగు మాహేయీవిధం బొప్ప నం
భాలోలారవ మట్లుగా నరవ నా మండోదరీదేవియున్
రాలే దింకను వచ్చి న న్గనుచు నీర్ష్యాకోపముల్ పొందునో. 30

మ. సుతియుం జచ్చెఁ జత్తు రీ జనములన్ మర్యాద మర్యాదయే
యరయన్ బట్టపురాణికిన్ మిగిలి యన్యస్త్రీ విరోదంబు ను
న్మరమైనన్ సహియింప రాశరజగన్మార్తాండుఁ బెండ్లాడి య
బ్బుర మానాఁడును నేఁడునున్కి యెడదం బొంగార్చికొంచుంబొరిన్

వ. అంతటఁ గుపితసింహనఖకుద్దాలితకుంభదేశంబై పరికాఁడు పడి యున్నచోటికి మత్తమాతంగి వచ్చినట్లు మండోదరి వచ్చి, పులి చంపిన బలీవర్దకళేబరంబు కడ కీహామృగంబురా జంబుకంబు లట్లు పెఱకాంత లవసరిల్లగా నామెకు. 32

మ. మదికిన్ బుద్ధికి గుండెకున్ మిపులఁ బ్రేమస్థానమై యున్న యా
మదనాకారము పూర్వ మీస్థితి తలంపంగూడ దోసంబె యై
నది నేత్రంబుల కొక్కసారిగ సమానద్ధాశనింబోలె నై
నది సర్వేంద్రియచేతనాపహరణాజ్ఞామూర్తియై కన్పడెన్. 33

వ. చాలదవ్వు నిశ్చేష్టయై చేష్ట పొంది పతిశరీరంబుపైఁ బడియుండి నిర్వ్యాక్యై వాక్కు పొంది యిట్లని విలపించె. 34

క. మన కిట్లు వ్రాసెనని నె
త్తిని నోరుం బెట్టు కఱచితిన్ సుంతైనన్
వినినావుకావు చివరకు
ననుకొన్నది యంతయున్ ఫలాకృతిఁ దాల్చెన్. 35

గీ. దేవి నైనను గావచ్చుఁ దెలివి వన్ను
మించి తెలివగా నామె యేమియును గాద
సుదతి భర్తకు నోచుకొన్నదియు సీత
నేను నోచుకోలేద యున్నిద్రచరిత ! 36

చ. కడుపున కొడుకులం గని యొకండు నొకండును బోర నీల్గగా
నెడఁదయు వ్రయ్య వ్రయ్యలయి యింతలు నింతలుగాఁగ నయ్యెనో
పుడమిని ధూళిధూసరిత మోహనమూర్తిని జూచి నిన్ను నా
యెడఁదను గ్రొత్తగాఁగ బలులిచ్చుటకున్ స్థలమున్నదా పతీ! 37

ఉ. రాముఁడు చూడ మిక్కిలి కిరాతుఁడు జోలికిఁ బోకయా పతీ!
నీమది క్రొత్తమోహ మిది నెక్కొనెఁ జిక్కనివాలుటమ్మ వా
లై మన మేల సల్లమునమందున డయ్యుట యంచుఁ జెప్పినన్
నీమది కెక్కదాయెఁ గరుణింపకు స్వామియు నీవు నిద్దురన్. 38

శా. ఈ మండోదరి వీరమాత తనయుం డింద్రున్ జయించెన్ బోరిన్
వే ముల్లోకములన్ జయించిన మహావీరుండునూ భర్త నేఁ
డేమో వచ్చనిలంకలోనికి నసుం డేతెంచి యెవ్వాఁడో పెం
డ్లామున్ గానసమందు నేమఱిన భల్లాకప్తుఁ డిట్లయ్యెఁబో. 39

మ. అవురా ! నాబ్రదు కేమిచేసితివి నాథా! జీవితాంతానఁ బం
డి వృథాపోయిన చేనికంటెఁ దొలివంటే లేని క్షేత్రమ్ము మే
లవునాఁ బండియుఁ బొల్లవోతి నన నేలా? వేళ్ళతో నాకిపో
యె వసీఘూర్తులు వానచుల్ మిడుతలై యూదందు మాలంకలో.

చ. ఇతఁ డొకబ్రహ్మ యీతఁడు మహేశ్వరునిం దల లిచ్చి కొల్చెఁబో
యితఁడును ముజ్జగంబును వహించెను గుప్పిటఁ గాని కామదు
ర్మతికిని సీతఁ దగ్గమయి రామునికోత్తల కగ్గమయ్యెనా
క్షితి నెవఁ డింకఁ గామమును జెందవలెం దలలేని యట్టిఁడై. 41

ఉ. నాకును నవ్వుడవ్వుడు మనంబున మెచ్చువిధానఁ దోఁచెడున్
నీ కిది యంతయున్ దెలిసి నేరిచి నేరిచి సీతఁ దెచ్చినా
వీ కడ వహ్నిఁ బెట్టుటకు నెంచి యటం చెది కోరి చేసితో
నాకు నెఱుంగరాదు, లలనామణి సీత కెఱుంగవచ్చునో. 42

ఉ. శత్రులువచ్చి కోటయును సైన్యము ముట్టడివేసి గెల్చుచోఁ
బుత్రులఁ బెండ్లముం దరలిపుత్తురు వేఱొకచోటఁ జాటుగా
గోత్రము సర్వనాశనము కోరర యెవ్వరునేన్, విభీషణున్
శాత్రవపక్షు నెంచితివొ చాలఁగ రాక్షసవంశవర్ధనున్. 43

ఉ నాపతియుం గుమారకులు నాకముపైకిని దండువెళ్ళిరిన్
ఱే పుదయాన వత్తు రమరీగణకంఠమణిప్రవాళము
క్తావలితాచ్ఛహారములు కానుక దెత్తురటంచుఁ జూతునా
నాపతియుం గుమారకులు నాకమునన్ స్థిరవాస ముండఁగా. 44

చ. హృదయము ముఖ్యమై మఱి శరీర మముఖ్యముగాఁగ భావసం
పద కలవారె దేవతలు వారియెడం దనుముఖ్యతామతిం
బొదలినవారి కాపదలు పుట్టును సీత యరుంధతీముఖుల్
సుదతులు పొల్చ శుద్ధనుగు చోటిది భావనిదానమూర్తియై. 45

చ. తెరలని వ్యాధి మంచమునఁ దీసుకచత్తురు వారి మృత్యువున్
స్థిరమయి గుండె వ్రయ్యలుగఁ జేయద, యట్టులె భావరోగసు
స్థితులను గూడ నిశ్చితము చెందిన మృత్యువు సంఘటిల్లఁగా
నరయ మహాత్ముగా నయినయట్టిది కామి భరింప శక్యమే. 46

ఉ. ఆ దురుసైన కార్ముకి శరాంతము నందునఁ జావు నీకు మం
దోదరి కౌఁగిటం దనరు నూతనసౌఖ్యముకంటె నెక్కువై
కాదని యెంత చెప్పినను గాదని విల్లునుబూని నీవు యో
ధాదుల్లు నేగి తేల్చికొనినట్టిది యేమొ యెఱుంగ నయ్యెడన్. 47

చ. అభినయ మాచరించితి ధరాత్మజయందునఁ గోరి తెచ్చితో?
త్రిభువనమోహనాకృతిని దేవత నోలికఁ దెచ్చియుంచితో?
యభయుఁడ వౌచు వేఱయిన యంగనలందున, సంచరింతు వీ
సభయవిలోచనాంబుజ దెసన్ సభయుండ విదేమి యబ్రమో. 48

శా. ప్రోయాలుం బతి తల్లి దండ్రులు కుమారుల్ కూఁతు లీ లోక మి
ట్లే యాచున్ జనముల్ స్వకర్మవశులై లీలన్ విడంబించుచో
నా యీ బంధము లిచ్చటం దెగిన, నేలా కల్గు వేఱైన చో
టై యిట్లే చను నన్న నిశ్చయము చాలై యున్న లోకంబులన్.

మ. తనరం జిన్నవి మళ్ళుమళ్ళగను క్షేత్రాజీవులుం జేసికొం
చును నీరెత్తుచు మొక్కలం బెనుచుకొంచున్ మంచు మన్నట్లు నీ
వును నే నీ బ్రదుకైన శీలమును బ్రోవుం జేసికొం చేగి చ
చ్చిన నాపై నది యేదియో యతని దాక్షిణ్యంబు దైత్యేశ్వరా!

ఉ. ఓయి మనోధనా! తెలియ నొక్కటి నాకును నిన్నుఁ గూర్చి నీ
లోయెదలోని మెత్తనయు లోకమునందు నెఱుంగరానిదై
యా యముఁ డెంత దిట్టరియొ యంతటి దిట్టరి నీదు వైరియై
నీయెదలోని మెత్తనయు నేర్చుట సాధ్యము కాదు వానికిన్. 51

వ. ఈ చివరిమాటలు వించు రామచంద్రుఁ డచ్చటికి వచ్చిన నతని రాక గుర్తించి మండోదరి లేచి నెమ్మదిగా నేగుచోఁ బెఱరాణు లందఱుఁ గదలిపోఁగా స్వామి తారామండోదరుల ప్రకృతిభేదంబు నెంచి యచ్చెరు వంది విభీషణునితో నిట్లనియె.

మ. అవునా! నే మిఁకఁ బోవఁగావలె నయోధ్యాగ్రామ మ్మెప్పు డా
మివులుం గోఁతులు దండడించెదకు, సామీరిన్ నినుం జెప్పఁ బం
పవలె న్నా నతఁ డేమొ కన్పడఁడ, యీమాటల్ నిను న్నేను జె
ప్పవలెంగా, మఱి పోదు మం చనినఁ బ్రైప్రాణా ల్పయింబోవఁగన్.

గీ. వదినెగా రన్నమాటలు వనజనేత్రుఁ
డయిన యీరామచంద్రుఁ డన్నట్టిమాట
లొక్కదానికి సరిపోయి నొకటి యా వి
భీషణుం డిట్టులనియె నిశ్చయుఁ డగుచు. 54

వ. నేనుఁ గూడ మీరంగీకరించినచో మీతో వత్తును. నా కిం
దేమున్న దన, రాముం డన్నకు సంస్కారమ్ము చేయవలయును గదా
యనిన, నితఁడు పరదారగమనాఘుఁడు, పాపి. నేను సేయ ననిన
శ్రీరాముం డిట్లనియె. 55

శా. ఛీ! ఛీ! యట్లనరాదు కర్మ లిచటం జేయన్వలెన్ లోకముల్
భాసాభాసము లూర్ధ్వముల్ కలవు, నీభ్రాతన్ దురాత్ముండు నాఁ
గా సర్వంబును జెప్పినట్లయినదే? కామారిభక్తుండు, బా
హాసంపాదిత నాకలోకజయకీర్త్యగ్రియుఁ డల్పుండఁటే? 56

క. ఒక్కవ్వా డతని ముందర
నిక్కమ్ముగ నిల్వలేద నేను నతేండున్
మిక్కిలికనుగలవానిని
జిక్కించుకొనెన్ దినంబు శిరము లొసఁగుచున్. 57

వ. అన విభీషణుండు నీయాజ్ఞ, నీవేది చేయు మనిన నదిచేయుదును,
నా దే మున్నదని, 58

ఉ. అంతిపురంబు చేర్పఁబడి నట్టి దశాస్యు కళేబరంబు సీ
మాంతము ప్రాణవంతు లగునట్టిరు రాక్షసు లెల్ల వచ్చి నే
త్రాంతగళద్ఝరీకలుషితాంబులు చూచిరి రాత్రియై యుషః
ప్రాంతమునందు సంస్కరణ కైన పదార్థము లెల్ల వచ్చినన్. 59

శా. హేరాళంబుగఁ బట్టెనుంచయులు నేయే భోగసామగ్రి పా
టీరంబైనది యున్న వన్నియును బాటింపించి పంచెన్ గుసుం
భారాగాంచితదారుఖండశకటుల్ మండోదరీదేవి ర
క్షోరాజార్ధ చితాప్రకల్పనకుఁ బొంగుల్ వారు దుఃఖాక్రోశులన్. 60

చ. మొదట దశాననుండు చనిపోయిన వార్తను విన్న రాణులుం
గదలుచు రాత్రిచట్టులయి కన్నుల నీ రిడ రింత యేడ్వరున్
బదియును రెండునాళ్ళు నెఱవన్ దుది నా విభీషణుండుగా
రొదయయిపోయె నంతిపురి రోదననిస్వనబంధురంబుగా. 61

మ. ఒగి నే కర్మ మతెందుఁ జేయవలె శాస్త్రోక్తంబుగాఁ జేసెఁ దా
నొగి దానంబు లవెల్ల లోప మని లేకుండంగఁ గావించి యే
మిగ నే రాణి నుతెద్ది చేయుమనె సామీచీన్య మేపార నే
నుఁగు తాఁ జచ్చి యదే వెలన్న గతిగా నూల్కొంచు గావించినన్

వ. వియోగదుఃఖ మట్లుండఁ గర్మలు సుష్ఠుగా జరిగె నన్న యొక
తృప్తి బంధువర్గంబున నుండు, నది లంకాపురంబున నభివ్యాప్తమై
విభీషణువం దెల్లయెడల సౌముఖ్య మేర్పడియుండె. నంత శ్రీరామ
చంద్రుండు తనసేనాపటగృహంబుననుండి విజ్ఞాతవిభీషణప్రశంసా
ముఖరితలంకానగరవీథియై సుగ్రీవాంజనేయాది సర్వవానరవరి
వేష్టితుండై యుండ నచటికి విభీషణుండు నరుదేర రాముండు
సుగ్రీవవిభీషణులం గాంచి యిట్లనియె. 63

చ. అలయిక తెచ్చెఁబో యసుకృతాత్ముఁడు పూరితి యయ్యె నంత్యక
ర్మలు సయితంబు వే తిరిగిరాఁ డనుకొందును రావణుండు మీ
ర లిరువురున్ సహాయులయి రాముని గెల్పును జేయ, నొక్కఁడన్
జలనిధి దాటి యిచ్చటను సాయము మాలిన నేమి కావలెన్. 64

చ. సులభముగాఁగఁ జెప్పెదవుసూ జనముల్ దశకంఠు నాజిలో
గెలిచెను రాముఁడంచు నది కేవలవాక్య మతండు నొక్కఁడా
గెలుచుట కే నొకండ నయి, గెల్చితి మందఱ మంతమంది దై
త్యులఁ బని నాదియౌట గెలు పొప్పుఁగఁ జెప్పెద రప్ప! నాదిగా.

వ. అని సుగ్రీవునిఁ గౌఁగిలించికొని మఱల నిట్లనియె. 66

చ. బలితపుగుండెలోఁ దలలపాతర యున్నది దైత్యరాజుకున్
దెలియఁగఁ జాలనైతి తలఁ ద్రెంచుట యన్నది చంపు టన్నదా
పలుకు నిరర్థకంబుగను బంధురధీకుఁడు బండితోలు మా
తలి వచియించె నా సులువు, దైత్యుని నాతఁడు చంపి నట్టులే. 67

మ. అనినన్ మాతలి సుంత నవ్వి, రఘునాథా! నీవు మాటాడఁ గా
దనఁగా నేగతి నౌను? లౌకికము యాథార్థ్యంబు సర్వంబు తూఁ
చినయ ట్లాడెదు స్వామి! యీసకలమౌ సృష్టిన్ సరోజాతయో
ని నితాంతం బొకఁడై రచించెనటె యీ నీ వాదిగా లేనిచో. 68

చ. తొలిజనువందుఁ బున్నెములు తోలితి నా దొర జాలి నీకునుం
బలముగఁ బంపె నీదయిన బండిని దోలితి వేఱుజన్మ మా
తలినయి కాక నీచరణతామరసంబులఁ జేదికోవె, యా
వలన సుమంత్రుఁ డేను నొకబండినిఁ దోలితి మయ్య రాఘవా!

క. ఈజన్మకు నాదొర సుర
రా జాతనికడకుఁ బంపు రాజీవాక్షా!
నా జన్మకు నిను మఱువన
యాజి రథముఁదోలు టన్నయది తెలిసెఁజుమీ. 70

వ. అనిన శ్రీరామచంద్రుండు ననుజ్ఞయిచ్చి యాతఁడు బండి నెక్కఁగా
వాజులఁ జేత నిమిరి యింద్రునకుఁ దన కృతజ్ఞత తెలుపుమంచుఁ
జెప్పి పంపి తిరిగివచ్చి లక్ష్మణునితో నిట్లనియె. 71

చ. అలసి విభీషణుండు తనయన్నకుఁ గర్మలు చేసె దాన దై
త్యులకును గైక నాకును నయోధ్యకుఁ గాదనిచేసెఁ గాన నీ
యిలవయి నాకుఁ గోర్కి కలదేమొ యటంచను సంశయంబునుం
దొలఁచె, విభీషణుండు తజితో ననురేంద్రుఁడు కావలెన్ జుమీ.

ఉ. కావలెనంచు నెంతో సుముఖంబుగ నున్నది యూరు, నీవు సు
గ్రీవుని వానరేంద్రు క్రీకికిం బతిచేసితి మున్ను నేఁడు దై
త్యావనికిన్ విభీషణు సురాధిపుఁ జేయుదు యింద్రజిద్వధన్
నీ వల కేలుగా నిలచె, నీరధి నీరము తేరఁ బంపుమా. 73

ఉ. నిస్తులమైన మైత్రిగొని నీవుగ రెండవుసార్లు సంశయ
గ్రస్తము చేసికొంటివిని ప్రాణము లాతనికోసమై వచెం
బ్రస్తుత మిద్ది సేయు నగు భారము నీయది, దైత్యరాజధా
నీస్తుత! సూర్యసూతియును నేనును జెత్తునదార్ల మిచ్చుటన్. 74

ఉ. ఈవును జెల్మి నీదగు ప్రకృత్యనుకూలత గల్గు వారితో
నే వెలయించికొందు నటులే రఘురాముఁకున్ సఖుండు సు
గ్రీవుఁడు లక్ష్మణుండు వచరించు విభీషణుతోడఁ జెల్మి తా
శ్రేవకు లిద్దఱుం దమకుఁ జెల్మి ఘటిల్లుట న్యాయ్యమై తగన్. 75

మ. పరమప్రీతిమెయిన్ విభీషణునకుం బట్టాభిషేకంబు సం
బర మాకారము గొన్నయట్లు పొనరింపం జేయఁగా లక్ష్మణుం
డరయన్ వార్ధిజలంబు తెచ్చినది దీవ్యత్స్వర్వాశైవాలినీ
ఝరిణీవార్గతబిందుసంభరితమై సంతర్పణంబై తగెన్. 76

ఉ. రాజు విభీషణుం డెచట రావణుఁ డెచ్చట నన్న మాటకున్
రాజు విభీషణుం డిచట రావణుఁ డచ్చట నన్న మాటయై
రాజన శాంతిమంతుఁ డని రాజన సద్గుణవంతుఁ డంచు దై
త్యాజిరభూములందు విననయ్యెను సృష్టిని గ్రొత్తలా నుడుల్. 77

ఉ. ఉపదల్ తెచ్చిరి రామచంద్రునకు దైత్యుల్ తద్గుణాకృష్టులై
కృపణుల్ నేడు విభీషణార్పితధరిత్రిం బ్రీతులై దైత్యు నం
తిపురంబందున సుంతయేనియు నతృప్తిం గాంచగా లేర పూ
ర్వపుమర్యాదలు సాగు నింతయును లోపంబించుఁ గన్పింపకన్. 78

ఉ. మున్ను దవాగ్ని దగ్ధమయి పోయిన భాగము భాగమే పరి
చ్ఛిన్నముగాఁగ నైనఁ బరిశిష్టము కాననమంతయున్ వసం
తోన్నయనంబుగాఁ జివురు లుబ్బిన తేనెల పూలగుత్తులున్
సన్నని చల్లవాయువుల సంచరణంబులు గాగ నొప్పెడున్. 79

వ. అంత నంగద మైంద ద్వివిద గవయ గవాక్షాదు లయిన యువ
వానరసేనాపతులు పారితోషికములుగా వచ్చిన వస్త్రాభరణంబు
లచే నలంకృతదేహు లగుచు లంకానగరవీథులయందుఁ గిష్కింధా
నగరంబునందు వలె సంచరించుచుండ. 80

చ. ఇనకులసార్వభౌముఁడును నీ పదుమూఁడవు రాత్రులున్ బయో
ధినతసుమీమవాయువులు తెచ్చిన చల్లదనంబుచేత బా
ధను బడి యొంటినిండఁ బరిధానము గప్పుచు విచ్చియున్న లో
చనములఁ జొచ్చుచుండగ నుమస్సుమముల్ సిచయంబు వచ్చుచున్

చ. తనర విభీషణున్ దితిజధాత్రికి రాజును జేయకుండగాఁ
దసపని యైనదంచు వసుధాతనయాపతి యెంచలేద, నా
టి నిశఁ బయోధి యంత వికటించెన యమ్ములఁ గొట్టికట్టె నం
చను వగయెల్లఁ దీర్చునన నగ్నులఁ జిమ్మెఁ బయోధివాయువుల్.

వ. మఱునాఁ డాంజనేయ సుగ్రీవ విభీషణాంగద జాంబవత్ప్రముఖు
లైన వీరులందఱు పరివేష్టించియుండ శ్రీరామచంద్రుం డాంజ
నేయునితో నిట్లనియె. 8

శా. ఈ వార్తల్ సకలం బశోకవనిలో నిన్నాళ్ళు కూర్చుండు నె
ట్లో వైదేహికి సర్వముం దెలిసియుండుంగాని న్యాయ్యంబుగా
నీవె యేగి వచింపగా నలయు నిండెన్ రావణాయుస్సు ర
క్షోపీఠిం బ్రభువై విభీషణుఁ డటం మన్ సత్క్రియాహేతువై. 84

చ. తెగి తెగి శీర్షముల్ తెగనితీరున మొల్చెను రావణున్ వధిం
పగ బసనయ్యె నింద్రుఁడును బంపె రథం బది గెల్పు తెచ్చె ని
మ్ముగ దశకంఠుఁ జేసిన యమోఘపుశక్తికి లక్ష్మణుండు మూ
ర్ఛగనె హిమాద్రినుండి విలసత్కరణుల్ గొని తెచ్చినారమున్. 85

చ. మఱియు విరాధు లొక్క పదిమందియుఁ గూడి జనింప నెంతవి
డ్డూర మగు గుండె కల్లఁ గనుషున్ మఱి యట్టిఁడు కుంభకర్ణుఁ డ
బ్బురముగ నింద్రజిత్తసురపుత్త్రుఁడు వానిఁ జావ లక్ష్మణుం
డిరవుగ నాళ్ళు పట్టినది యీ యుఛలంబును జెప్పరాగదే. 86

క. మన మందఱమును గుశల
మ్మని జానకితోడఁ జెప్ప యనుదెమ్మనఁగా
ననిలసుతుఁడు కదలకయుం
డిన రాముని కనులు వానినిం గదలించెన్. 87

చ. హనుమ యశోకవీథిఁ గనె నంబుజలోచన గోళ్ళతోడ గీ
సిన దగు పాపటె వెనుక జేర్చిన దూముడి జుట్టు దానిఁ దా
ల్చిన మలినంపు వస్త్రమును జేతుల దుల్పి ధరించినట్టి దా
నినిఁ గనులందు సన్ననగు నిప్పులు కల్గినయట్టిదానినిన్. 88

చ. తనుఁగని మందహాసముఖతామరసంబునఁ జూచునట్టిదా
నినిఁ దనకూరుచున్న యొక నీటగువైఖరి మాఖరంబుగాఁ
దనదగుకోర్కి యెల్ల ఫలితంబును బొందినయట్లు చెప్పుదా
నినిఁ ద్రిజగచ్ఛిరస్థితమణిప్రవికల్పితదీపికాకృతిన్. 89

చ. సవినయమూర్తియై హనుమ చాగి ప్రణామముచేసి ప్రశ్రయం
బునఁ గనుగొంచు జానకియు మోమున నొక్క బిగింపు కల్మి ని
ట్లనియెను స్వామి రాఘవుఁడు నంపెను నన్ను నినుం గనుంగొనన్
నిను వచియింప యుద్ధమున నీల్గుట రావణుఁ డాది రాక్షసుల్. 90

చ. తనకుశలంబు చెప్పుమనెఁ ద్వత్కుశలంబు నెఱింగిరమ్మనెన్
దనుజజగత్ప్రభుం డిపుడు దానవజనుండు విభీషణుండుగా
వననిధి రెండుతీరములు నల్లభముల్ తినకంచుఁ జెప్పుమం
చనియెను స్వామి లక్ష్మణుఁడు నంజలిబద్ధుఁడు స్వామి చెప్పుచో.

ఉ. యుద్ధమునందు నద్భుతము లున్నవి రాముఁడు చెప్పుమం చనెన్
గ్రుద్ధత రామచంద్రుఁడును గోలల దానవరాజుశీర్షముల్
విద్ధము చేయఁగాఁ దెగినవే మొలిచెన్ తల లొక్కవంద సం
బద్ధము కాకయుండఁ దుది బ్రహ్మమహాస్త్రముచేతఁ గూల్చెఁబో

ఉ. నీవు విరాధుఁ జూచితివి నిక్కము వా ర్పదిమంది యైనచో
నీవలఁ గుంభకర్ణుఁ డగు నీతని చేతులుకూడఁ ద్రుంచితిన్
నా వినుచున్ ధరాతనయ నాల్కఁ గదల్పకయున్న నేదియో
భావన చేయుచుంటివిని బల్క నదేటికిఁ దల్లి యం చనన్. 9

వ. అంత మారుతితో జానకీదేవి శ్రీరామచంద్రుని పరాక్రమము
భావించుచుంటి నంతకు మించి యేమియు లేదన నతం డుభయ
పక్షంబులు గ్రహించి సీతకు సంతోషంబు గలిగింప నెంచి. 9

శా. ఎంతో బాధను నిన్నుఁ బెట్టిరిసుమీ యీరాక్షసీశ్రేణి చె
ల్లింతున్ వీరిని నేటితో ముదల తల్లీ యిమ్మనాన్ సీత నీ
వెంతో వారలు నంతె, రాజయినవాఁ డెంతాజ్ఞగా నాడునో
యం తాజ్ఞం గొని సంచరించెదరు మీ కా దోస మంచుండు నే?9

ఉ. ఇద్ధగుణుండు రాముఁడు జయించెడు వార్తలు వచ్చు టాదిగా
బద్ధనవాదరల్ నను సభాజనభాజనగాఁగఁ జూతురున్
గ్రుద్ధుఁడు రావణుండు కనుగొంచును నుండినఁ దర్జనక్రియా
బద్ధమతిన్ నటించెదకు, వారల దోసము లేద యింతయున్. 96

గీ. అరయ లక్షణసంపన్న మైనయట్టి
తనకు మాధుర్యగుణభూషితంబు నగుచు
నవ్య మష్టాంగబుద్ధి యున్నయది నీకు
విశ్వసంస్తనమతి పృషదశ్వతనయ. 97

ఆ. పరమధార్మికుఁడవు బలమును శౌర్యంబు
సత్త్వగుణము శ్రుతము క్షమయు దయయు
విక్రమంబు నీకు వెలయుఁ గొండంతగా
నంజనీకుమార హర్షరాశి ! 98

క. మఱియు ధృతిస్థైర్యంబులు
మఱియు వినీతిత్వ మశ్రమము తేజంబున్
మఱియుఁ గృతివినిర్వహణము
బొరయున్ నీయందుఁ బూర్ణముగ వాయుసుతా! 99

చ. ధరణిని జంతువుల్ తనువు దాల్చును తుత్తును గల్గు తున్నిరా
కరణము కోసమై కమలగర్భుఁడు వ్రాసినదానినిం దినున్
దురితము కల్గు నోటు బహుదూరము చూచిన నీవు నేను భా
స్కరకులుఁడైన రాఘవుఁ డఘుంబున మన్కిగ నున్నయట్లగున్.

వ. ఇది బుక్షగీత మన, మారుతి తల్లీ ! శ్రీరామచంద్రునితో నేమి
చెప్పుమందు నన, నే నాయనఁ జూడ నెంచుచుంటి నని చెప్పు
మనఁగా, మారుతి తిరిగిపోయి శ్రీరామచంద్రుని దర్శించి యిట్ల
నియె. 101

చ. హానుమ యశోకవీథిఁ గనె నంబుజలోచన గోళ్ళతోడ గీ
సిన దగు పాపపై వెనుకఁ జేర్చిన దూముడి జుత్తుదానిఁ దా
ల్చిన మలినంపు వస్త్రమును జేతుల దుల్పి ధరించినట్టిదా
నినిఁ ద్రిజగచ్ఛిరస్థితమణిప్రవికల్పితదీపికాకృతిన్ 102

వ. శ్రీరామచంద్రుండు చెప్పుమన్న వన్నియుఁ జెప్పి, తల్లీ! నీ వాతని
కేమి చెప్పుమందు వన నతనిని జూడఁగోరు చున్నానని చెప్పు
మన్న దని యూరకుండిన రాముండు కనులువాంచి చాల ద
ప్పూరకుండి విభీషణునితో నిట్లనియె. 103

క. కమలాయతాక్షి జానకి
సమరఁగ నీ వేగి స్నాత ననులిప్తాంగిన్
గమనీయభూషణాంచిత
విమలసిచయధారిణిన్ విభీషణ! తెమ్మా, 104

క. నిన్నున్ నమ్మను జానకి
నన్నున్ నమ్మితివి నీవు, నాతొక నిను న
మ్మ న్నీమాటంబడి వ
చ్చ న్నిక్కంబుగను నన్నుఁ జూచును రాజా! 105

క. పలుకుచు నుండగ రాఘవుఁ
డలఘువు బడబాగ్నికుంభితాంబుధి వోలెన్
జ్వాలదాకృతి సౌమ్యాకృతి
జలభరితాక్షుండు తోచె జనుల కనులకున్. 106

ఉ. అందు విభీషణుం డరిగి యంతిపురంబున స్వీయకామినీ
బృందమునందు నల్లన చరించెడు జానకిదేవిఁ గాంచుచున్
వందన మాచరించి రఘుపత్యనుమోదిత మయ్యె నిన్నుఁ దే
రం దనవద్దకున్ మతిధురంధరుఁ డార్యను నిన్నుఁ దెమ్మనెన్. 107

శా. స్నానంబుం బొనరించి ధౌతపరిధానంబున్ మెయిం దాల్చుచున్
నానాభూషణముల్ ధరింపఁ గొనిరా నాథుండు నన్ జెప్పెనా
నే నిట్లే చనుదెంతునంచనియెఁ దన్వీరత్నమా సీత, ర
క్షోనాథుం డటుకాదు, తల్లి! పతికిం గోపంబు రావచ్చునే. 108

క. నా పలుకు నాదరింపుము
యాపతియును జాల చిత్రమా వాఁడు త్రిలో
కీపాతివ్రత్యశిఖా
దీపాకృతి, భర్తమాట తీర్పవె యనినన్. 109

వ. అంత జానకీదేవియు స్నాతానులిప్తాంగియై. 110

మ. కిణముల్ మానిన దోర్లు గుర్తిడుచు సుగ్రీవుండు పంపించు భూ
షణముల్ తాల్చుచు శుభ్రముంబఱచి వస్త్రంబద్దియే తాల్చుచున్
మణిదీపం బన నిల్వ దైత్యపతియుం బల్యంకికారూఢ స్త్రీ
గణసంసేవిత రామసన్నిధికి వేగందెచ్చె దైత్యేంద్రుఁడున్. 111

వ. అంత నచ్చట సమావిష్టులై యున్న వానరవీరులను దైత్యజనులను హెచ్చరికదార్లను వేత్రహస్తులను వీచోపుదార్లను విభీషణుండు తొలంగిపో నాజ్ఞ యీయఁగా వారియం దొక గొప్ప సంరంభమై. 112

శా. ఏ స్త్రీకోసము దక్షిణాంబునిధి యిట్లీదెన్ రఘూత్తంసుఁ డా
యే స్త్రీకోసము చంపెనో సకలదైత్యేంద్రున్ మహాయత్నమై
యా స్త్రీ స్త్రీచలెఁగాక వేఱ యెదియో యయ్యయ్యొ త్రైలోక్యస
ర్వస్త్రైణాకృతి పూని యంబికవలెం బద్మాక్షి రంజిల్లునో? 113

ఉ. ఈ రఘురామచంద్రుఁడును నీజటలున్ నుతి వల్కలంబులున్
వీరులు తాల్చగా నయిన విల్లును నంపపొదుల్ ధరించి చ

క్షూరరమణీయతాపరిధి శోభ వెలార్చెడు నట్టివాని కిం
పారెదు భార్య పూరుషులయం దితఁ డెట్లటు లౌనొ స్త్రీలలో?

ఉ. ఆ నయనోత్సవంబు గనులారఁగఁ జూడఁగ వేచియుండఁగా
వానరరాక్షసుల్ బలిసి వాఁకిలియందున మూఁగి వారలన్
వే కడకుం దొలంగగ విభీషణుఁ డాజ్ఞ యొసంగ గుంపులై
వే కడలింబలెన్ జనులు విస్తృతరావమునం దొలంగుచో. 115

వ. ఆక్రోశ విని శ్రీరాముఁడు ముంగిలికి వచ్చి జరుగుచున్న యీ యుత్సారణంబు చూచి విభీషణునిమీఁద మండిపడి వారంద ఱను బోవలదని యాపి విభీషణునితో నిట్లనియె. 116

చ. గజిబిజి పౌరభావములఁ గాననవాసుల గ్రామవాసులన్
విజనము చేయ నెంచెదవు వెక్కసపాటును వీరు పొందఁగన్
స్వజనము వీరు నాకిచట, సంగరమందున గెల్పు తెచ్చి, నీ
రజనయనం గనుంగొన ధరాతనయన్ మది నెంతు రెల్లరున్. 117

గీ. ఉత్సవములఁ బెండ్లిండ్లయం దొలయ నాప
దలను నంతఃపురస్త్రీలఁ దగును జూడ
నెల్లవారలు చూచిన నేమియయ్యె
నందఱును జూడవచ్చు ధరాత్మజాత. 118

వ. అంత సమావిష్టమై యున్న మహాసభలోని యచట సుగ్రీవాంగద లక్ష్మణ విభీషణాంజనేయ జాంబన నైంద ద్వివిద గవయ గవాక్ష శతవలి దధిముఖ మహావీరులందఱు నున్న యచ్చోటికిఁ బల్యంకికాప్రతిసీర తొలఁగించి జానకీదేవి మత్తగజమంథరగమనం బున భీతవోలె విరాగిణివలెఁ దిరస్కారభావయుతవలె భర్త్రను రక్తవలె నడుచుచుఁ బ్రవేశించి శ్రీరామచంద్రుని కెదురుగా నిలుచుండిన. 119

సీ. ఏడాది యున్నమ్మ నెఱుఁగదు లలితాంగి
నిద్దుర యెఱుఁగదు నీరజాక్షి
ముడుచుక కూర్చున్న యొడలుగా నంసభా
గమున వంగినయట్లు కానిపించు
మొగి నిరంతం బెడ తెగని యేదో భయం
బక్షుల వెనుభాగ మావరింపె
నఖిలలోకాతీత మైన సర్వాంగవి
న్యాసపౌభాగ్యసౌందర్య మొప్ప

తన్ను హరిణంబుఁ గొని తెమ్మటన్న కాంఁ
సగము సగమైన మై రామచంద్రునకును
తన సమస్తకామమ్మున కాస్థానభూమి
కనులయెదుటను వచ్చి సాక్షాత్కరించె. 120

ఉ. ఈయమ హేతువై వనుల నెల్లఁ జరించెను దా బికారిగా
నీయమ హేతువై జలధి కెంతొ శ్రమంపడి కట్టగట్టెఁ దా
నీయమ హేతువై గెలుచు టెంతొ శ్రమం బయి పోయె లంకలో
నాయమఁ జూచినంత హృదయంబునఁ బట్టగరాని కోపమై. 121

ఆ. అతఁడు రాక్షసుం డటంచు సౌమిత్రి వ
చించె సుంత వినదు చెలువ తాను
ననుభవించెఁ దాను ననుభవించితి మేము
నాడ దింత సేయు ననుచుఁ గలదె? 122

వ. ఇట్లూహించుచు రాముండు మనసులో నూరక కోపంబు పెంచు
కొంచుండగా. 123

చ. ఉవిదయుఁ జిక్కెనో బలిసెనో కపులున్ దితిజుల్ పురాధరా
భవఁ గని లేమిఁ దారెఱుఁగఁ బట్టరు, కన్నులముందుఁ జూడఁగా

నువిదయొ యింతలోన నయనోత్సవమై కనిపించు నేదియో
నన మయినట్టి తేజమొ జనంబులు నేరకు నూహచుండియున్. 12

మ. తెలియన్ రాకయ చూచు నేత్రములకున్ స్త్రీమూర్తి తానింతలో
పల నాగ్నేయశిఖాకృతిం బోలుచు, అప్పున్ వాల్చి తా మెత్తు లో
పల నేదో ఫణ మెత్తియాడు భుజగీభావంబు దీపించు, నీ
వల దైత్యాహృతయైన సీత నిలుచున్ భర్తన్ విలోకించుచున్.

వ. అంత బడబాగ్నిచేత నళపెళ గ్రాఁగి కళపెళలాడు సముద్రోపరి సముద్భూత బుద్బుదధ్వనులలోని కంఠరాన మొప్ప శ్రీరామచంద్రుం డిట్లనియె. 126

చ. దితిజుఁడు చేసె నా కపకృతిం బొనరించితి సర్వశక్తులన్
దితిజున కేను వందగఁ బ్రతిక్రియ దుర్లభమైన సాయమై,
దితిజుఁడు తెచ్చె నా కులసతిన్ గులమున్ హరియించినాఁడ నా
దితిజునకున్ మఱింత పగఁదీర్చితిఁ బొసుమదీప్తి కల్గఁగా. 127

ఉ. మచ్చ యెఱుంగనట్టిదగు మాచుకవంశమునందు దైత్యుఁడున్
మచ్చను దెచ్చి వేతొలఁచు మార్గము కానఁగరాని యట్టి దా
మచ్చను నింట నొంటఁ గులమానిని నవ్వఁడొ కొంచుఁబోయెఁ బా
టచ్చుచుఁ డన్నమాట యకటా! యినవంశమునందు లేదుగా. 128

మ. అమృతం బియ్యది నాకు గ్రాసె విధి నేనై యింత కోదండినై
జనకుం డాడనిమాట యాడినవిధిన్ సల్పంగనో తీవ్రవ
ర్తనుఁడై పూర్వపుకర్మ యెట్టిదియొ కాంతారత్నముం దొంగిలిం
చెను దైత్యేంద్రుఁడు జీవితం బఖిలముం జెందించి తత్కార్యముఁ

చ. చెడునిముసానఁ బాము కఱచెన్ భుజగమ్మును జంపినామ యె
క్కుడు విస మింత పాయునటె కోసికొనన్ వలెఁ గాక దష్టమా

నోడలున నా విసంబు మఱియుం దనువందునఁ ప్రాకకుండ దై
త్యుఁడు మడిసెన్ విసం బచటె యున్నది యెక్కక కట్టుగట్టగా.

ఉ. ఇంతకు నేమియైనయది, యెంతటితేజుగలాఁడు వాఁడు దు
ర్దాంతుని దైత్యరాజు బవరంబున ఘోరభుజంగ మట్లుగా
ద్వాంతరలైన ప్రాణములు తోడె నటం చను కీర్తి కీర్తియే,
కాంత నతండు తెచ్చె ననఁగా నపకీర్తియు దాని కద్దియే. 131

చ. అసురుఁడు కొంచుఁబోయెఁ దనయాలిని, నాతని యింట నుండె వె
క్కసముగ వత్సరం బతివ కాముకుఁడౌ రఘురాముఁ డంగనన్
గిసరని యెంచకే యెవరికిం దెలియంగను రాక తెచ్చి యో
యి! సదనమందు నుంచికొనియెన్ వినినావె, యటంద్రువో జనుల్

ఆ. రావణుండు వప్సరఃకాముకుండును
బరమధృష్టుఁ డుగ్రభావయుతుఁడు
లజ్జలేదు మఱి బలాత్కారకామాంధుఁ
డతివ వత్సరాంత మచట నుండె. 133

ఉ. ఇట్టు లనిశ్చితంబయిన యీ వ్యవహారమునందు రాఘవుం
డెట్టుల స్వీకరింపఁగలఁ డీ ధరణీసుత, నయ్యొ! సూర్యునిం
దొట్టి పవిత్రతేజములు తోఁగులువారిన యింట శీలముం
బట్టిన సంశయంబయిన భామినిఁగొంట యయోగ్యమై చనెన్. 134

ఉ. ఎవ్వఁడొ దుష్టుఁడౌ దనుజుఁ డెత్తుకపోయె నదేమి కర్మమో
జవ్వని దేమి తప్పనినఁ జక్కనిమాట యదే వచింతు నా
జవ్వని పూర్వకర్మమని, జవ్వనిభర్తది పూర్వకర్మ, మా
యెవ్వఁడొ కర్మ దీని రచియించెనొ వానిది దోసమంతయున్. 135

చ. చెడుస్థలమందు వానకురిసెన్ జలమయ్యది నేను గ్రామ్యోయిల్
కడుపున నున్న యప్పటి యకల్మమన్మత్తి గలట్టిదాన ని
ప్పుడు నన, నీవు పడ్డ పొలములబడి మాటితి వీవు, గంగలోఁ
బడిన జలంబునం గలుగు స్వచ్ఛత యేగతి నీకుఁ గల్గెడిన్. 136

గీ. ఇచటు దోసము పీనిదం జెవనినై నఁ
గాని పూని నిందింపఁగా రానిచోటు,
దోస మిచ్చటఁ గలదంచుఁ దోఁచి చూచి
నిక్కముగ నిశ్చయింపరాని దగు చోటు. 137

శా. నన్నుం జూడఁగఁ గోరినా వనుచుఁ గాంతా! నిన్ను రప్పించితిన్
నన్నుం జూడఁగ నేమియున్నయది? యైనన్ స్పష్టమై పొల్చెఁబో
ము న్నే భర్తను నీవు భార్యవును, నా పా ల్విప్డు లోపించె, నా
సన్నంబై యొక దైవ మున్న ముడి స్రంసం బందగాఁ జేయుచున్

ఉ. నాగతి యేమి కావలయునా నిఁక నీవు స్వతంత్రురాల వే
భోగము లీవు కోరెదవొ పూరుషు వానినిఁ గూర్పఁగల్గెడుం
జేగ గలాని జూచికొని చెందుము, లక్ష్మణుఁడో విభీషణుం
డో గణుతింప సూర్యసుతుఁడో మఱి నీదగు నిష్టమై చనన్. 139

మ. మఱియున్ నీకొకమాట చెప్పవలయున్ మారీచునిం జంపితిన్
హరిణం బయ్యది కాదు లక్ష్మణుఁడు యాథార్థ్యంబు వాచించె ని
ష్ఠురు లాయిద్దఱుఁ గూడఁబల్కికొని దక్షు ల్వచ్చి రచ్చోటి క
బ్బుర మా బంగరులేడిఁ గోరె దని నీవున్ వార లె ల్లించిరో ?

గీ. ఆంజనేయుండు లక్ష్మణుం డట్లు తాను
మాటలాడుచు నుండంగ మనసులందుఁ
బట్టరానంత దైన కోపంబు పూని
యుందు రని తెలియును రామచంద్రిరున్నకు. 141

క. ఎవ్వఁడో మంత్రించిన గతి
నవ్వురా కపిదానవాళి యది స్తంభించెన్
ధవిలెడు సముద్రఘోరా
రవమును వినరానిదైన రవణిక కలుగన్. 42

వ. అంతఁ బెద్దసేపు జానకీదేవి రామచంద్రునివంకఁ జూచుచు నట్లే
నిలుచుండి చివరకు లక్ష్మణునిం గాంచి యిట్లనియె. 143

శా. అంధోబంధము ప్రాణ మున్నపుడు పై నంత్యక్రియల్ సేయు సం
బంధం బుండును మానవావలికి నీ వైనావు నాకిప్డు కా
మాంధ న్నన్నుఁ బరిత్యజించెఁగద నీ యగ్రేసరుం డిట్లు నే
నుం ధాయ్యాదిక మాచరింపు మని నిన్నుం గోర లే దెవ్వడున్.

శా. నాకుం బిడ్డలు లేరు, బిడ్డవలె నున్నావు నీవు నిన్నాళ్లు, నా
కై కొంచెమ్మయినట్టి సాయమును జేయంజూడవే నీవు ల
చ్చీ! కాష్ఠంబులు తెచ్చి నాకయి చితిం జేర్పించు, నే నీ దరి
ద్రాకారంబునఁ జచ్చియుం బ్రదికి యేవారా! యొక్కరీతిం దగున్.

మ. తెఱవి మ్మన్న నొసంగు నాజనని ధాత్రీదేవి, సత్త్వ్రిమభా
సుర, పుట్టింటికిఁ బోవనేటికిఁ ద్రపాహోర్వ్యల్ పతిత్యక్తలై
తరుణుల్, వహ్నినిఁ జొత్తు నే, ననలుఁ డంతర్వీధి నన్నానఁగా
బరువం జెంచునె? సర్వలోకనిబిడజ్వాలామహోమూర్తియై. 146

క. మీయన్న నీవు నెఱుఁగుదు
వాయన మది నెంత తలఁచు నంతియ సందే
హాయత్తచిత్త మఱి నీ
వాఁచుత్తము చేయు మగ్ని నని యాడంగన్. 147

వ. లక్ష్మణుం డంతఁ దనయన్న వంక కనుఁజ్ఞార్థమ్ముగ చూడకయ చితా కల్పనంబుఁ జేసి యగ్ని ముట్టింప సాగరవీచీసముద్భూతానిలంబుల నయ్యగ్ని పురపురలాడుచు నంటుకొంచు ధ్వనిచేయుచున్నఁ దచ్చిఖానిస్వానంబులోఁ గలిపి శ్రీజానకీదేవి రామునితో నిట్లనియె. 148

శా. నే నొక్కించుక సేపులోనన మహాగ్నిం జొచ్చుచున్నాను స్వామీ! నీయాజ్ఞన్ వచియింతుఁ గొంచెము సమున్మీలద్యశోధామ! దైవానన్ వచ్చిన దోస మంతయును నావంకన్ నిరూపింతు, నీ వైనన్ దైవమ వండ్రు, నీకుఁ గృపలే దందున్ మఱల్లైనచో. 149

ఉ. మచ్చికఁ జెట్ట యర్థముల మాటల నంటివి నన్ను నీవనన్ వచ్చును నేను నైనఁ బడవచ్చును, బంగరులేడిఁ జూడఁగా విచ్చిన కంటితో నెడఁద విచ్చెను విచ్చినగుండెలోపలన్ జొచ్చిన వయ్య రామ! రిపుసూదన! సర్వఋషీంద్రవాంఛలున్.

చ. నలినదళాయతాక్షి హరిణంబును గోరెను గోరినందునన్ జలనిధి దాఁటినా వసురఁ జంపితి వింతటి కీర్తి వచ్చె నను జ్వలతరపౌరుషంబునకుఁ బట్టయినాఁడవు నీవు గుండెలోఁ గలఁకను మాని చూడు ముపకారము కాదట వే జగత్ప్రభూ! 151

ఉ. ఏ ఋషిభావనామహిమ యేర్పడ నాయెదలోనఁ జొచ్చి నన్ గోరఁగఁజేసె లేడి, నది కోమలనీలపయోదదేహ! నా కోరిక యిట్టులుండు ననుకొంటకు దానవులోన స్ఫూర్తి గా నేరను వచ్చు, నీ విదియు నేరవె? సర్వఋషీంద్రహృత్థితా! 152

చ. ఒకపని మంచిచెడ్డలు సముద్భవమా ఫలదృష్టి నిర్ణయం బు కలుగఁ జూతురు తమోహరణా! దయఁ జూచితేని కో

రికయును నాది నీకు నురరీకృతకీ ర్తిరమాఫలప్రదం
బకలుషగు ప్తశౌర్యబహిరాగతి దివ్యఫలంబు రాఘవా! 153

ఉ. ఆఁడది యింత సేయు నను టన్నది యున్నదె యంచు నన్ను నూ
టాడితి, కైక కోరక మహాప్రభు నీ వని రాక లేదు, నీ
యాడది సీత కోరక మహాసురసంహరణంబు లేద, యా
యాఁడది లేక లేద జగనుంచు, నిదంతయు నేన చేసితిఁ. 154

ఉ. ఈ పదునాల్గువత్సరము లీవు వనంబులయందు నుండి సీ
తాపతి! నీవు మారవుగదయ్య కిరాతుఁడొ బ్రాహ్మణుండొ కా,
నీ పదిరెండుమాసముల నేనును మారను లేద రాఘవ
శ్రీపదచింతనామృతవశీకృతచిత్త నమర్త్యబుద్ధినై. 155

చ. మిగిలిన నేమొ లోకమును మీ రఘువంశపుగౌరవంబు న
త్యగణిత విశ్లథీకృత నిరంతర భిన్న విచిత్ర చేతన
త్వగుణ కణానుగం బయి కృతాకృత మైన జగత్తు తమ్మిపూ
మొగుడుపు విచ్చి వచ్చిన ప్రభుండు విరించియుఁ జాలఁ డిచ్చటన్.

ఉ. ఈ కృతకంబులోకమున నెవ్వఁడు చాలును దానిఁగూర్చి నా
దాఁకను గూడ నెందులకుఁ? దత్త్వమహాపరిణామమూర్తి నీ
వేకృతి తప్పటంచు వచియింపను జాలదు? జాలు, స్వామి నన్
జేకొనకుండ నిశ్చయము చేసిన దెల్ల సమంజసంబగున్. 157

శా. మీ వంశంబును గూర్చి యిచ్చట ద్విధామిశ్రంబుగా నున్న ద
చ్ఛావిర్భూతికి లేదు సంశయము నా యంతఃపవిత్రత్వరే
ఖావైశద్యము నందు దేవతలు సాక్ష్యం బందు రో స్వామి! మీ
రీ వక్రంబగు లోకమందు ముడియై పృథ్వీపతుల్ రాఘవా! 153

చ. నిరతిశయంబుగాఁగఁ గరుణించిన కైకయి నీకు ధారుణీ
ధరునితనంబు మాన్పినది దానను వేకితనంబు పట్టి మీ
భరతుఁడు దాని నిల్పె నతిదారుణవృత్తము లోకభీతి ని
ర్భరముగఁ దప్ప దిప్పటికిఁ బద్మదళేక్షణా! నీకు రాజవై. 159

క. ఈ రెండుకారణంబుల
తీరిట్టిది పీన మొదటిది నిరాధారం
బౌరయ రెండవ దనఁగా
మీరాజూలె మెఱుఁగవలయు మీ లక్ష్యములన్. 16(

ఉ. చెట్టది కర్మ యంటి వతసీకుసుమాభశరీర! వేఱ తా
నెట్టిదొ నే నెఱుంగ నది యిట్లనరా దనకుండ నాడితిం
బట్టిని లక్ష్మణున్ దిరిగివచ్చిన దన్నది యింత గట్టిగాఁ
గొట్టు నటంచుఁ గర్మ యనుకో నయితిన్ జనకాత్మజాప్రభూ!

చ. ఒకటి వియోగబాధ, మఱియుం బెనుగొండల నిత్యవాసమున్
బ్రకటిత మైనయట్టి కులభావమునందున మచ్చయున్న దీ
వికృతియుఁ, వార్ధిఁ గట్టుటయు, వెక్కసమై చను దైత్యరాట్కదం
బకహారణంబు, డస్సితివి మద్ధృదయేశ్వర నీవు రాఘవా! 162

మ. ఇనవంశేందు! మనస్సు లోపల మనస్సే లేదు నీకందు, నీ
కొనరన్ నిక్కముగా మనస్సున మన స్సున్నన్ ధరాజాత నే
మనినా వెవ్వరినో వరింపుమనియా? యయ్యొయ్యొ! యా వేరి పే
ర్లనినా, వెవ్వరుగాని నవ్వరఁట వే, రామా! జగన్మోహనా! 163

చ. మనసున నింతె యుంచికొని మారుతితోడన యుంగరంబు పం
చినయది గుర్తు చిత్రము, రచించిన నీయెదలోని చాటుఱుం
గనియది, యిర్వదేండ్లు నినుఁ గాంతుని గాఁగను నమ్మి సంసృతిం
బొనరిచి నిన్ను నే నెఱుఁగఁబోవని నా తెలివిన్ హసించెదన్. 164

ఉ. నీ పొనరించుదాన నొక నీతియు నున్నది నేనెఱింగినన్
నీ పొనరింపఁబోవు పనినే మరణించియ యుందు దేనికై
యా పదిశీర్షముల్ కలిగినట్టి మహాసురు నీవు చంపనౌ
నీ పదిదిక్కులన్ యశ మదెట్టుల దక్కును నీకు మత్పతీ! 165

శా. ఆమిత్రాకృతి విచ్చిపోదు రసనూయాకంధకుల్ గాని లో
పాముద్రాపతిగాని నీ విటుల భూపాలా! గాదిన్ నమ్మవే
నీ, మోహాంధ పటంచు ధూర్జటి హిమానీశైలకన్యామణిం
దా మాటాడునె? నీవు పల్కెదవుపో ధాత్రీపతీకన్యకన్. 166

ఉ. అవ్వ డరుంధతీసతియు నంతిపురంబును నింకఁ ద్రొక్కనం
చొవ్వమి లేచిపోయె విపినోర్వికి నేనును వచ్చు టెంచుచున్
జెప్పకు మింటి కేగి యిది, సీతయు నగ్నిని జొచ్చె నేను బో
నప్పుడె యంచు జెప్పిన మహాప్రభు! దోసము మాసిపోయెడున్.

శా. ఆ యా పూనులయిండ్లకుం జనకు మయ్యా! నీ వయోధ్యం జనన్
ధ్యేయాకారలు వారిగేహినులు భక్తింబొల్చు నన్నిఁ గతిం
జేయన్ నీవును గోప మూనెదకుసూ! సేమంబు కాదద్ది నీ
వా యా పూనులయిండ్లకుం జనకుమయ్యా! నీ వయోధ్యం జనన్.

శా. ఆవేళన్ వనిఁ జేసునప్పుడు ప్రసంగానీతమై చెప్పఁగా
సావిత్రీకథ నేను నీ మరణవాంఛాబుద్ధి నైనట్లుగా
నీ వాడన్ ప్రభు నేన చత్తు నని యంటిన్ నిక్కమట్లయ్యె నీ
నీవే కారణ మాట దానికినిఁ బండెన్ మత్తపం బంతయున్, 169

ఉ. నావయి రామచంద్ర! రఘునాయక! మత్పతి! నీకు నెందుకో
కోపము వచ్చె నద్ది యిదిగో పది యల్లితి వంశగౌరవ
క్షేపముగాఁగ మచ్చ యని చెప్పితి వచ్చుట నింతకంటెఁ దీ
వ్రాపద యున్నదయ్య రఘువంశము నందునఁ గోప మేటికిన్. 170

శా. నన్నున్ వీడి మఱీవు వేఱయిన కాంతం బొంద వప్పున్ కులో
త్పన్నంబై చనుఁ గైకకంబెను భవత్సంపాదితంబై సమా
సన్నంబై చను పెద్దయొగ్గు రఘువంశంబందు లోకాగ్నికిన్
సాన్నాయ్యంబగు నూహ లెత్తెను భవిష్యత్కాలసంసూచిగా.

గీ. భరతుఁ డొసఁగిన ధర ధర్మపత్ని ప్రక్క
లేక యేలెడు నర్హత లేదు నీకు
నరపతివి కాక నన్నుఁ గొనంగవచ్చు
నుభయతో భ్రష్టతం బొందుచుంటి రామ! 172

మ. విమలోషర్బుధచండమూర్తికిని నైవేద్యంబు కాఁబోవు నే
నమరం జెప్పినఁ దప్పు లే దొక రహస్యం బద్ది మున్నన్న దీ
ప్తమతుల్ షరానులభార్య లాడినది యోపద్మాక్ష! నేన్ నీవు దీ
పము, నే వర్తిని నీవు వహ్ని నవినాభావంబు సంధిల్లగన్. 173

క. మన మిద్దఱమును నొక రొక
రిని విడి యుండగను వచ్చు శ్రీపతి! లోకం
బునకై యీ కలయిక నీ
వును లోకమునందుఁ గరుణ పూనవు స్వామీ! 174

గీ. అగ్ని మండుచు నున్నది యారిపోక
ముందు నే దానిలోనికిఁ బోవవలయుఁ
జివరి కొకమాట నీకును జెప్పవలయుఁ
దెలియఁజాలరు దీనిని దేవతలును. 175

క. ఇరువురము నొక్క వెలుఁగునఁ
జెఱిసగమును దీని నెఱుఁగు శివుఁ డొకరుండే
పురుషుఁడ వీ వైతివి నే
గరితనుగా నైతిఁ బ్రాణకాంతా! మఱియున్. 176

గీ. అచట చూచుచు నున్నట్టి యందఱకును
జెలువ యే మని చెప్పెనో తెలియలేద
చాది చూచిరి నట నుర్వీజాత నచటె
యుర్వీజాత యన్నట్లుగా నున్నదాని. 177

ఉ. మారుతి లక్ష్మణుండును క్షమాసుతఁ బూర్వము చూచినట్టివా
రా రుచిరాంగి చెప్పినది యంతయు నర్థము చేసికొన్న వా
రీ రచనంబు సర్వమును మహీయ మతీతమనస్కమై జనం
బేమను రామునందున వహింపరు తోఁ దలంచు దోసమున్. 178

వ. నిర్భీకవలె స్వాధీనపతికవలెఁ బురస్కారభావయుతవలె, మత్తగజ
మంథరసుందరగమనంబున నగ్నికడకు నడచి యగ్నిం బ్రవే
శించిన. 179

క. హాహాకారంబులతో
వైహాయసవీధి యెల్ల వనరెన్ దనరెన్
స్వాహాపతి యంతఁ ద్రిజగ
తీహితప్రౌఢుఁడై ధృతిక్లిష్టుండై. 180

ఉ. సీతయుఁ జెప్పుచుండ రఘుశేఖరుఁ డొక్కొకయప్డు దుఃఖమున్
బ్రీతియుఁ గోపమున్ మఱియుఁ బ్రేమయు నచ్చెరు వింతలోనఁ దా
నై తనుఁదా నెఱింగికొనునట్టుల విస్మృతి గాంచునట్టులన్
బ్రీతుఁడు పాల్చె లోనఁ బొలయించుచు నున్న సమాధి నందుచున్

ఉ. దేవతలై రమామదవతీవ్రతతీ మధుకృత్కుమారకా!
దైవతలోకకార్యచరితవ్రత! నిత్యదశావతారధా
రావిదితాఖిలోత్తమ పురాణకథాకమనీయమూర్తి. దే
వావలి కంటకాపనయనా! రఘువంశపయోధిచంద్రమా! 182

మధ్యాక్కఱలు

అన్నది యాలస్యముగను నవనిరాజ్యము వీడి యటవి
చన్నది తమ్మునితోడ జానకీసతితోడ నిడుమ
లన్నింటి గన్నది కడలియందున నడ్డకట్ట తగఁ
బన్ని రక్కసిఁ జంపినదియుఁ బరమపూ భవదీయకరుణ. 183

ముడి వస్తువు జగత్తు వేదములు యజ్ఞములు దేవతలును
కడువడిఁ గర్మలు ఫలముగా విరక్తమగు చిత్తమ్మ
ముడి విడి మూలపూ ద్రవ్యముగ నయి మోక్షమ్మ గనుట
తోడి నింత పన్నిన దొరవు దొరలకు దొరవు మాస్వామి! 184

నీ పన్నిన విధంబు తెలియ నీవుగా నేర్తువు గాని
యీ పన్నుగడలోని మాయ యందు మునాకడు దుర్ధిషణు
లే పెఱలకు నౌను దెలియ సృష్టించి తింద్రియావలిని
నా పైని మనసును నిన్ను నది చాలు ననవికి దింప. 185

కదలిక యఱు నొక్క తెలివికడలి సంకల్పంబు గాఁగఁ
గదలిక గలిగి హిరణ్యగర్భుండుగా రూపుఁ దాల్చి
కదలికలో శక్తి యనుచుఁ గలిమి నా కలిమితో సప్త
పది యయి సప్తజగత్ప్రభావిండంబనఁ దాల్చినావు. 186

సరసిజభవుఁ డిట్టు లనియెఁ జరణాంబుజమ్ములు వేంబు
మఱి నయనమ్ములు వేయి మహిమెల్ల మలఁగించుకొనుచుఁ
బరఁగ మిగిలి యంగుళములు పదిగ సర్వపురుషుఁ డౌచు
పరమపదం బైన నిన్నుఁ బ్రణతింతుఁ బ్రద్యుమ్నమూర్తి. 187

సిరియును బార్వతి వాణి సేవింప క్షితియెల్ల మన్నుచ
చరయ వికుంఠధామమున యందున ననపాయిని యగు

సిరితో వసించుచు మఱియు క్షితికి వేంచేసినయపుడు
సిరితోడ వచ్చి రక్కసుల సేన శిక్షింతువు నీవు. 188

చెలఁగి యింద్రుం డన సూక్ష్మచిదచిద్విశిష్ట వేషమున
నలువు నుపాదానకారణము సమానతము సంకల్ప
కలిత వేషమున నిమిత్తకారణఘనము కాలాది
చలిత మంతర్యామి మూర్తిఁ జనెదవు సహకారిగాఁగ 189

తగ గరుడానంత నవపతాకా వితానగోపురము
మిగిలి యైరమ్మదీయము నమృతసరో మృదుభూమి కెలన
నగపడునట్టి సోమసవనాశ్వత్థ మలరించు నీడ
నొగి నైదువందలమంది యొప్పఁ గొల్వుండి యచ్చరలు, 190

సితమణిమంటపపీఠిఁ జెలువొప్ప శేషపర్యంక
వితతమై విమలాదు లెల్ల వీవఁగా వింజామరములు
క్షితి రమా నీలలు కెలన సేవింప శ్రీశంఖచక్ర
ధృతి నుండు శ్రీహరి నిన్నుఁ దెలతు వర్ధితజగద్ధర్మ! 191

పువ్వుగా జాబిల్లి సిగను ముడ్చు ప్రభువు నిట్టు లనిత్యై
మువ్వాక లైన సంకల్పముగ శక్తి ముప్పేట యయిన
యివ్వసుధన్ నీవుగాఁ బ్రదయీరక్ష నెసఁగింతు రామ
క్రమవ్రతి ధర్మగుణంబు కోదండకోటి శ్రీరామ! 192

దశరథసుతుఁడవు నేటి తనువునఁ దరణివంశమున
శిశువవు మిథిలాన్వయమున శ్రీదేవి సీత జన్మించె
విశదమ్ము చేసితి వంశపీరత పృథివీతనూజ
విశదక్రియాశక్తి, లోకవిధముగా వెలయింపఁబోకు. 193

జనకుఁడు దశరథరాజు చలితపక్ష్మములుగాఁ జూచు
వినయవచ్ఛ్రీరామ నేత్రవీథిఁ గన్పించె దైవముగ
తనతొడ నెక్కించుకొనియెఁ దనయుని దశరథరాజు
తనబిడ్డయగుటకు స్వామి తనలోనఁ దాఁ బొంగు లగుచు. 194

శా. అంతన్ జూచు జనాక్షిగోళములయం దావిర్భవించెన్ శిఖా
వంతంబైన యుషర్బుధంబున మహాజ్వాలావిభక్తంబుగా
వింతై సీత ప్రవేశమందిన చితావీథ్యుద్గతిన్ రాఘవ
ప్రాంతంబందున రెండువహ్నులుగ సంభ్రాంతుల్ కపుల్ రాక్షసుల్.

వ. మఱియు నొక్కజ్వాల యరుణవర్ణుండు నరుణసటాకిరీటుండు నరుణాక్షుండునై పురుషాకృతి వహించి రెండవజ్వాల సముదయవసంత వేళాప్రముదిత నిరంతకిసలయసంధురిత నవారుణాంగకయైన జానకీదేవిగాఁ గనుపించి నంత, నగ్నిదేవుండు శ్రీరామచంద్రునితో నిట్లనియె. 196

ఉ. ప్రాణపతీ! యనింధనమహాగ్నివి నీవయి నీవ యాఱిపో
వేను జగత్త్రియానలము నేంధనవహ్నిన యాఱిపోదు నా
లోనన నీవు చొచ్చినను లోకము లెల్లఁ జెడున్ జగత్ప్రభూ!
నే నిట నాఱియుందు నవనీసుత నన్ గృప జూడకున్నచో. 197

శా. కొంపల్ కాల్చె మరుత్తనూభవుఁడు లాంగూలంబున న్నిప్పు ము
ట్టింపన్ రక్కసితేఁ డనుష్ణుఁడ నరేటిన్ సాము సామైతి ము
క్కింపై యీ యనలాజ్ఞ యిష్ట వనితాకృత్యుగ్రతన్ నన్ బ్రవే
శింపన్ జాలని బర్వు నెత్తక కటాక్షింపంగదే రాఘవా! 198

ఆ. నీసగమ్ము నేను నీకు నర్పించితి
నన్ క్షమింపుమయ్య నాథనాథ!
యనుచు నగ్నిదేవుఁ డంతర్హితుం డైన
యొకతె సీత నిలచియుండె నచట. 199

ఉ. వహ్నిని జొచ్చి యే కముకువాసన కల్గకయుండ మిట్టమ
ధ్యాహ్నపువేళ నాతపము లగ్నులః క్రమ్మెడు వేళ జ్వాలికా
వహ్నుతిగాఁగఁ గట్టిన సొబంగగు చీరసొబంగు మాయకన్
జాహ్నవికంటెఁ బావనత చాలిన పావనశీల కావలెన్. 200

శా. ఐనన్ రాముని మానసం బెఱుఁగ కా యల్లందఱున్ జూచువా
రై నిల్వన్ రఘువంశశేఖరుని యాస్యం బెల్లఁ బుష్పించి సీ
తానారిం గని నవ్వఁ దేనియలఁ గోదండంబు నందీయఁగా
దానిన్ గైకొనె సీత నవ్వకయ నేత్రప్రస్ఫురత్కోపయై. 201

గీ. జయజయనినాద బధిరితాశాచయంబు
గాఁగ సహజమూ నంధత క్రమ్ముకొనఁగ
వృద్ధుయ్యెను దివసంబు వెలుఁగుపిండు
మూసికొనివచ్చు తమసుచే ముడుతలు పడ. 202

సీ. మృతరాక్షసాధిప క్షతజవాహిను లెల్ల
వెసఁ బశ్చిమపుదెసఁ జేరుకొనియె
పదునాల్గునాళ్ళలోపల నూతనకులాయ
ములు కట్టికొన్న పక్షులును మలఁగె
యామినీముఖము భర్త్రాక్షేపమునఁ జేసి
కోపభావము నంది కోరగించె
నంతంతఁ జినుకుదు నన్నట్టి యొకచిన్ని
నల్లమబ్బు విలాసనాట్య మాడె

చీఁకటులు రాక మును వియత్సమయమందుఁ
దొందరగఁ దోఁచె నొకతార దూరమందు
కోటితారకల్ పొడిచెను క్షోణియందు
బ్రదికి యున్నట్టి వానరేశ్వరుల కనులు. 203

సీ. వియదగ్రవాహినీ వీచికాడిండీర
సంబాధక పృషత్కదంబకములు
రఘురామవిజయ సంరబ్ధనందనవనీ
పారిజాతకశిఖాకోరకములు
జానకీరఘురామ సంయోగపరితృప్త
నీచైఃపత ద్వయల్లోచనములు
ప్రభుమహావిజయ విశ్వత్రయీపాఠక
సందీపితబ్రహ్మబిందుకములు

నూత్నసౌజన్యకృద్ధరానుకృతినాట్య
పరమరేఖాచలద్విష్ణుపదవిలంబి
మాలికాక్లప్తకింకిణీజాలకములు
శారకాంతులు విరఁజిమ్మెఁ దారకములు. 204

సీ. నిర్ఘాతరాక్షసానేక కళేబర
ఖాది యాదోనాథగర్జనములు
దశకంధర ప్రయుక్త నిరస్త్రముసలగ
దాది బాధాలుఠద్రోదనములు
కపిచమూకంఠనిర్గత రవస్పర్ధాళు
దోధూయమానాంబు ధూననములు
జలజాప్తవంశ్య శితేషుమహానలభీతి
కలితవేలాతటాక్రందనములు

సర్వతఃప్రాపితోర్ధ్వప్రసారణములు
యామినీకామినీహారిణాంకకృతన
భోమిధోనర్మభాషణ ముర్మురములు
గునుఁగు లయి తోఁచెను సముద్రఘోషణములు. 205

సీ. సీత యెక్కిన మహాచితి కాష్ఠములు పండి
కుమిలి యంతంతఁ బొగ్గువడుచుండ
త్మ్నసుతారాఘవై కాంతభంగ మని కీ
శాధిపుల్ గుసగుస లాడుచుండ
ఉబుసుపోక లతాంగి నుడికించి యెడఁబాటు
గొని చక్రవాకంబు కూయుచుండ
దవ్వున రాక్షసాంతఃపురంబున నుండి
గానంబు లేమ్వలు కలసిరాఁగ

వెలిఁ గడలి గాలి యీలలు వేసికొంచు
ముసరి గుమ్మము దగ్గర మ్రోసికొంచు
జుణిఁగి పంచలయందున గొణిగికొనఁగ
మధురయామిని ప్రథమయామమ్ము కడచె. 206

మ. ధరణీజాతయు స్వామిమాటకు సమాధానంబు చెప్పన్ మనో
హరుఁడౌ స్వామి విభీషణార్పితమణివ్యాకీర్ణదీపాంశుసం
భరమై తన్నును గాంచుచుండె ననుచున్ వైదేహి కన్గ్రెనలం
దెఱుఁగున్ జూడదు స్వామివంక నయనవ్రీడాబాష్పసంబాధమై. 207

ఉ. అక్కఱలేనిదే యడుగు నయ్యది యియ్యది తేను రాముఁ డా
చక్కెరబోఁడి లేచి యవి స్వామికిఁ దెచ్చి యొసంగు, నిచ్చుచో
న కరమున్ స్పృశింపను బ్రయత్నము చేయును స్వామి సీతయున్
మిక్కిలి తాఁకకుండ విరమించి స్వశయ్యను జేరి వ్రాలెడున్. 208

శా. ఈమాత్రంబున కగ్ని దేవుఁడును దా నేలా నినుం దెచ్చి సం
ధ్యాముగ్ధాకృతి వేడికొంచు బలవంతం బొప్ప నిన్నిచ్చె నిం
దేమో కాగిన జున్నుపాలవలె నీ విట్లుంటి వన్నం ద్రపా
శ్రీమన్మోహనమూర్తి జానకి వచించెన్ సాశ్రుధారాప్లుతిన్. 209

మ. చెడి పుట్టింటికిఁ బోదురే యువతు లున్, జీత్యంబ నాకింత తా
విడు మన్నన్ దయ నిచ్చియుండును గదా! యేలంచు వహ్నింజొరం
బడఁగా, మీరును గూడఁబల్కికొని నావంకన్ విరోధించినా
రడఁగంగా నవమాననహ్నిఁ బడి, నే నా వహ్నిఁ జాకుండఁగన్ 210

మ. అనినన్ శ్రీరఘురామమూర్తి యనె బాలా! యగ్ని నిన్ దాకఁజా
లను లేదంచు నెడందలో నెఱుఁగ నేలా! వహ్నియున్ వాయుసూ
నుని పుచ్ఛంబున నంటుకోదనిన నేనుం దాని భావింప కీ
వును భావింపక యెట్లు చొప్పుడనె యో ఫుల్లాంబుజాతేక్షణా!

వ. అనిన సీతాదేవి. 212

చ. తరణికులంబు కోడ లవుదాని కయోగ్యను భామిణీశ్వరుల్
తరణికులంబు, మైథిలులు తత్త్వవిచారణ చేయు బ్రాహ్మణుల్
ధరణితనూజ కూఁతు రవుదానికి దోసము లే దటన్న ని
వ్వెఱవడి రామమూర్తి పృథివీసుత చేతులు పూనెఁ దప్పగా.

వ. అంత శ్రీరామచంద్రుండు జానకిం బ్రసన్నురాలిం జేసికొనవల
సిన స్థితినుండి పాసి యామెచే ననుగ్రహింపఁబడవలసిన స్థితికి
వచ్చి యొక రమణీయవేళావికసితాననుకూలతానుకూల హేలాకుం
డయిన స్వామితో సీత యిట్లనియె. 214

ఉ. మాండవి నాదు చెల్లెలు శ్రమంపకు చున్న దయోధ్యలోన నీ
తం డిటనుండె నూర్మిళయుఁ దా నట నుండెను మాన్పవందు సూ
ర్యుం డుదయింపఁ బోవునని యూఁచెను మిన్నున వేఁగుచుక్క ద
క్షుండవు దీక్షితుండవు విశుద్ధధరాఖిలధర్మవార్నిధీ! 215

మ. చలిగాలుల్ చనుదెంచె సాగరతటీసంచారడిండీగళీ
తలగోళంబులు బిళ్లగాఁ బగిలి సద్యస్స్వీకృతాకాశముల్

జలముల్ చల్లన చిమ్ము టబ్బురమె భాస్వత్సిక్తతీరావనీ
తలమే చల్లన లెల్లఁ బెల్లుమియఁ బ్రాతర్భాగవశ్యాయమై. 216

చ. ఫల మఱికి రెండి రెంటినిఁ బ్రజాపతి సృష్టినిఁ జేసెఁ బాములం
బులుఁగులఁ దొల్తఁ బాములవి భూమిని రంధ్రములందు దూరి జి
హ్వాలను వెలార్చెడున్ విసము, పక్షులు మిన్నున సంచరించుచున్
గలస్వనాదగానములుగా గగనంబున వేఁగు చెప్పెడున్. 217

చ. తొలి తెలిప్రొద్దు వేడిఁగొలఁదుల్ చిఱుకౌఁగిళు లూనఁగా ధరా
తలమున కైనఁ దొట్టతొలి తద్భవానుసూక్ష్మతరోష్ణరేఖికల్
తెలియునొ హేతువున్ ఫలము తీర్చినవో క్రమ మొప్పఁగా హఠా
ద్విలసన మొక్కఁడే తెలియు విస్ఫుటలింగగుణజ్ఞదృష్టికిన్. 218

చ. పసువడి నింద్రజిద్ధతుల వానరవీరుల నెల్ల నోషధీ
గిరి గొనితెచ్చి హన్మ బ్రదికించెన, యాపయి నెందఱో మహా
సురులను రావణుండు కపిశూరుల నెందఱ నైనఁగాని చం
పిరి శవరాజి యెల్లఁ బుడమిం బడియుండిన విన్నినాళ్ళుగా. 219

ఉ. ఏ యమృతంబు వాన కురియించెనొ యింద్రుఁడు రాత్రియందుఁ దా
మా యక్షులంబులౌ శవము లాస్యములందునఁ బెద్దనవ్వులుం
గాయములందుఁ బుష్టియును గల్గఁగ గంతులు వేయుచుండఁగాఁ
బ్రేయములైనవో పరుస పిల్పుల నందఱు కౌఁగిలించుచున్. 220

చ. తనదగు స్వప్నమందునను దైవతరాజును గానిపించి యి
చ్చిన వర మిట్లుగాఁగ దరిసించిన రాముఁడు సీతతోడఁ జె
ప్పెను పృథివీసుతాహృదయపీఠిక మాత్రము నొక్క మారుతిం
గనఁ గపిజాతి నందఱను గాంచినయట్లుగఁ దోచుచుండెడిన్. 221

వ. అంత విభీషణుండు నందకావదులతో వచ్చి వానిని దింపించి శ్రీరామచంద్రదర్శనంబు చేసి జయము చెప్పి యిట్లనియె. 222

క. నిన్నటి సాయంతనమున
కు న్నియమము చెల్లె నీకు క్షోణీతనయా
హృన్నలినపత్త్రపరిమళ
సన్నద్ధ దిశాంతచారి షట్పదనయనా! 223

శా. నానావస్త్రములున్ మణిప్రతతులున్ స్నానాంగరాగంబులున్
తేనై నీకయి వేచియున్నయవి నర్ధిష్ణ్వచ్ఛకీర్త్యంక! నే
మైనన్ మేడల చాలులం దునికి భోగాధీనమా మన్కి, నీ
వైనన్ మాదగు భోగహేతువవు కట్టా! గుల్మకోణంబులన్. 224

ఉ సీతయు రెండుస్నానములు చేసెను వారిమహానలంబులన్
గ్రీతుఁడ నీకు నాజ్ఞ పరికించెద, నాదగు నేలయందు సు
ప్రీతుఁడ వౌచు నీ వరుగఁ బ్రీతుల నూఁదురు సర్వదేవతా
వ్రాతము, సర్వదేవతలు రాక్షసునందునఁ బ్రీతు లొటయున్. 225

క. ఓవల్లభ! చిత్రముగా
నీ విచ్చిన యట్టిదాని నీ కిచ్చుట మ
త్సేవాదైన్యము కరుణా
భావంబునఁ జూడకున్నఁ బాటించునదే? 226

మ. అనినన్ రాముఁడు నవ్వి, మీ వినయభాగ్యం బెంతదో? మీరు సే
సిన నే లెప్పుడుఁ గొప్ప సెప్పెదరు నాసేఁతన్, మఱట్లయ్యు నే
నును నాదీక్ష యయోధ్య చేరు దనుకన్ నూలొక్లధు, సాకేతమం
దున దీక్షావిరమంబు చేసెదను నేనున్ దైత్యరాజ్యేశ్వరా! 227

శా. సుగ్రీవుండును నీవు నిద్దఱును నా సూరెల్ విడంబింపఁ గం
బుగ్రీవాజయమున్ గడించితిని వే పూజింపు నీమిత్రునిన్
సుగ్రీవున్ సతిఁ బాసియున్నతని నిచ్చోఁ దెచ్చి యున్నట్టి ద్ర
వ్యగ్రామంబున నంగరాగమణిమాల్యాదుల్ సమర్పించుచున్. 228

చ. భరతుఁడు నెత్తిపైఁ గొనిన పాదుక జోడును గావిగుడ్డలె
యరయఁగ మస్తకా ప్ర్వులిమిఁ జట్టె శిరోరుహావళిమై తనూ
భరముగఁ జేతులారఁ దనపట్టిన వ్రాత మైనవాఁడు వ
త్సరము తుదన్ నా యెదురు దారులు చూచుచునుండు నచ్చటన్

క. అతఁ డచట జటాధారియు
నితఁ డిట సుణ్యాంగరాగకృత్యతిభోగా
న్వితమతియు నయ్యో ! మిత్రమ !
కృతజ్ఞత యటన్న గుణము మృత్స్నామయమై. 230

శా. అయ్యో! రాక్షసరాజ! నాదగు నయోధ్యాసార్త చిత్తంబు, కై
కేయాజ్ఞాధృతి నేను వీడితిని సాకేతంబు, మా వెంబడిం
ద్రయ్యర్థ్యంబుగ వచ్చె లక్ష్మణుఁడు ముక్తాగ్రస్తమై ధాత్రి సం
దియ్యంజూడఁడు కైకయీసుతుఁడు నందిగ్రామ మందుండుచున్.

చ. ప్రిదిలినగుండెయై కదలి తెక్కలుకట్టుక యందుఁబోయి ప్రా
లుద మనునంత తొందరయు లోగొను, ద్రోనయు నే మెఱింగి న
ట్టిదియు, మునుల్ దయాత్ములు ఘటింపనుజాగు,నయోధ్య యెప్పుడు
చెద మనిపించుచున్నయది, చెప్పుడు సీతయు లక్ష్మణుండునున్. 232

చ. అనిన విభీషణుండును మహోన్నత మోహానచి త్తవృత్తి యా
మన సిటు లంచు నెట్లనఁగ, మానిసి యన్నను మానిసే మతిన్
దనుజవిరోధి యన్నయెడఁ దానదియే, రఘుమూర్తి, మీకుసుం
జనఁగ నయోధ్య యీ పవలె చాలు నటన్న యుపాయ మొప్పెడిన్

సీ. మును విశ్వకర్మ చేసినది కుబేరుని
వశమందు నున్నది వానిఁగెల్చి
దశకంధరుండు వంతమునఁ దెచ్చినయది
యెంద తెక్కినసైన నింక నొక్క

నికిఁ జోటు కలయది నింగిలో వాయువు
కంటె వేగముగఁ బోఁగలిగినదియు
ఘనకింకిణీవతాకావితానములతోఁ
దగలివచ్చెడు నింద్రుపురమువోని

దేడు నంతస్తు లున్నది యెచటి కచటి
కలరు సోపానములు కల్గినదియుఁ బుష్ప
కం బనువిమాన మున్నది కడు నయోధ్య
యొకదినములోన మిమ్ముఁ దీసికొనిపోవు. 234

ఉ. ఈ విధి దైత్యరాజు వచియింపఁగ రాఘవుఁ డాత్మలోపలన్
దేవతలున్ సురద్విషులు దివ్యము లిట్టివి చేసికొంద్రు లో
కావలిమీఁద బిట్టు నధికారముకై యని యెంచ దానిపైఁ
బోవుటకంటెఁ జూచుటకుఁ బుట్టెను తొందర భూమిజాతకున్. 235

వ. విభీషణుండు తెప్పింతు నన్న రాముండు మున్ను సుగ్రీవు నర్చింపు మన్న దైత్యరాజు వానరరాజు శ్రీరామచంద్రు నర్చించిన ట్లర్చించి స్వామి మఱియేమి చేయుదు నన, నీ వానరులంద ఱేమి కోరి న న్ని ట్లనుసరించి రన, విభీషణుండు. 236

ఉ. వేలుపువీండ్లు చూడఁగొని వెక్కసపాటున రావణుండు హే
మాలిని దెచ్చెఁ గోశముల యందున మూల్గుచు నున్నవాని దృ
ష్ట్రీలన మంతలో నపగమింపఁగ జేసెను వాని నన్నిటిన్
జ్వాలలు నాఁటినట్లు వసువం బఱి కాష్ఠము లెల్లఁ గాలినన్. 237

చ. మఱియు విభీషణుండు హనుమంతుని కొక్కని కీయలేద యం
దఱును విభూషితాంగులయి నాట్యముసేయ విభీషణుండునుం
గరువలిపట్టియున్ నిలువగాఁ గని రిద్దఱు సర్వసైన్యమున్
బరువడి మేఘనాదశరపాతితమై వడినట్టి సైన్యమున్. 238

మ. తగ వీరందఱుఁ గొండలందునను గాంతారమ్ములం దిట్టు లే
గఁగ నష్టాపదభూషితాంగులయి తత్కాంతారయాతు ల్జనల్
మొగి నాభూషణవాంఛ వీరిఁ జెనకంబో నేమి చూ నయ్యో! శౌ
ర్యగుణుల్ వీరలు ప్రాంతపట్టణ జనప్రాణాగ్ని రూపంబులై. 239

సీ. ఘనపతాకలతోడ గగనమ్ము తెరలుగాఁ
దెరలుగా గాలిలోఁ దీర్చికొంచు
కనకకింకిణులతో గగనమ్ము సిడులుగా
సిడులుగా సడులలోఁ జిమ్ముకొంచు
చనుదెంచి యంత భాస్వరముగా క్షితికిని
డిగె మింటియింటి మండిగమువోని
కడు వీపుపైఁ గాక కడుపులోపలికి నె
క్కంగ వీలయినట్టి గరుడివోని

బ్రహ్మరాణి మోజుపడి కట్టుకొన్నట్టి
బొమ్మరిల్లు వోని పుష్పకమ్ము
రజతకనకమయము గిజిగానిగూడున
మణులు పొదిగియున్న మాద్రిగాఁగ. 240

ఉ. బ్రాతిఁగ దైత్యరాజు కొనివచ్చినదిం దను దీనిమీఁదనా
సీతకు గుర్తుపట్టుటకుఁ జేతము చాలకపోయె నప్డు దుః
ఖాతిశయంబునం దెలియఁ దాయెన యిద్దియ యద్ది యైననున్
సీత కయోధ్య కేగుటకుఁ జేతము చెల్లునె దీని నెక్కఁగా. 241

వ. అంత శ్రీరామచంద్రుండు ప్రయాణోన్ముఖుండై యందఱకును వీడ్కోళ్ళు నెఱపుచుండగా నందఱు నవనతశిరస్కులై మాట పలుకు లేకయుండ. 242

గీ. సరయు వెట్టులుండు సాకేత మెట్లుండు
కడుపులందు వీరిఁ గన్నయట్టి
తల్లు లెట్టులుండ్రు తమ్ముఁ డెటులనుండు
నవని యింత నల దఁటన్న వాఁడు. 243

శా. నారల్ గట్టి జటల్ ధరించి నయనానందాభిరాముండు చూ
డా రారాజ దుదారకాంచనకిరీటం బంగదంబుల్ మణుల్
హారంబుల్ కనకాంబరంబు లయి యే యందంబు చిందించుఁ జ
త్పూరాజీవము లందు బ్రహ్మ యుదయించుం బో శతానందుఁడై.

ఆ. ప్రభువు రామమూర్తి పట్టాభిషేకం బ
యోధ్య లోన జరుగు చుండు నటవె
రెండుసార్లు చచ్చి రెండుసార్లు బ్రదికి
యేగకుండ బ్రదుకు టేల యనుచు. 245

చ. అమృతపువాన లెందులకు నౌషధపర్వతముల్ మఱేల స్వా
మి మఱి యయోధ్యఁ గొంచుఁ జన మేఁకొనకుండిన, నింద చచ్చిపో
దుము, తన చన్న యాపయిన దూఁకుదు మందఱ ముందు నబ్ధిలో,
నమృతపువాన లెందులకు నౌషధపర్వతముల్ మఱేటికిన్. 246

శా. గోలాంగూలపతుల్ విభీషణుఁడు తక్కుల్ శీర్షముల్ వాల్ప వీ
డ్కోలెవ్వారికిఁ జెప్పటో తెలియలేఁడున్ స్వామి తా నిట్లనెన్
మేలౌఁ బుష్పక మెక్కుఁ డట్లయినచో మీరందఱుం బుష్పకం
జాలే యొందఱనైనఁ బట్టుననఁగా యన్నం గపుల్ రాక్షసుల్.

వ. అంతఁ ద్రవ్విన గోడక్రింది చీమలపుట్ట బయలుదేరినట్లు వారం
దరు విమానం బెక్కినఁ బై యంతస్తున జానకీరాములును గ్రింది
యంతస్తున సుగ్రీవాంగద లక్ష్మణ విభీషణాంజనేయ జాంబవదాదు
లును గ్రిందియంతస్తులఁ దక్కిన వారందఱు నెక్కఁగా విమానం

చేటవాలుగా లేచి క్రిందిభూభాగము సగము నేలయు సగము
సాగర మైన మింట నిలువ, శ్రీరామచంద్రుండు జానకీదేవితో
నిట్లనియె. 248

గీ. నెలత! సృష్టికిఁ దొలుతన నేల సగము
నీగము సగమ్ముగా నయి నెగడినట్లు
పైని మన మిద్దఱము నున్న పగిదిగాఁగ
కానిపించుచు నున్నది కాదె యనుచు. 249

ఉ. పట్టణమందు నొక్కెడ నివాసము చేయుచు నాల్గువీథులం
జుట్టి చరించి యెల్లెడలఁ జూచిన చూపది వేఱు, గాలిలో
బుట్టను లేచి క్రింద నలుమూలలు చూచిన చూపు వేఱు, త్రో
పెట్టిన జీవుఁడున్ వదలిపెట్టిన దేహము చూచినట్లుగన్. 250

మ. ఉవిదా! వార్నిధి నీర మెఱ్ఱనడిన ట్లుండెం జుమీ సర్వదా
నవర క్తంబున మిశ్రితంబయి యుదస్వత్స్వామి మైచాయ పె
క్కువ యైనట్లుగ, నీ వటన్నను మహాగోదావరీదేవి మ
క్కువకుం దత్పతి మేని క్రొత్తజిగులై కూరెన్ ఫలం బన్నటుల్.

శా. నిన్నున్ మిక్కిలి గష్టపెట్టితిని దన్వీ! వహ్ని దూఁకించితిన్
నిన్నుం బ్రాణముకంటెఁ బ్రాణముగ మన్నింతున్ యథార్థంబుగా
నన్నా! యేగతి వీని దాఁటుటని నీకై వార్ధిఁ జాపాంతమం
దు న్నీరంధ్రముగాఁగఁ గొట్టితిని నేనుం బంధుతం జూడకన్ 252

వ. అప్పు డాయన పాపము మిక్కిలి డస్సిపోయి కావేరీ భాగీరథీ
సహితుం డయి వచ్చి చెప్పికొనియె, నపు డక్కగారు చాల నిష్ఠు
రముగా మాటాడినది సుమీ యనిన, సీతాదేవి యిట్లనియె. 253

మ. చనవున్ నిల్పునొ లేదొ మీఁకు వనవాసం బీగతిన్ నిస్తరిం
చిన నా దేవికి మ్రొక్కు కొంటిని గటాక్షింపంగ రెట్టింపు తీ
ర్చను నా నా, రఘురామమూర్తి మధుధారాస్విన్నపుష్పంధయా
ర్ద్రినతో ద్యద్గుసదంత మోహన లసద్రాజీవపుల్లేక్షణా! 254

క. నీ మనసు కష్టపెట్టితిఁ
జామా! యిప్పటికి నన్ను క్షమియించితినా
భూమీతనూజ సూచీ
సీమాంతముగాఁగఁ జూచె శ్రీరఘురామున్. 255

చ. మఱియును రామచంద్రుఁ డనె మానిని! రావణుశీర్షముల్ మఱిన్
మఱి మొలవంగఁ జొచ్చినవి, మానెను బాణము లేయ నాతఁ డ
బ్బురముగ వాని మేన బడిఁ బుట్టుచునుండె గదల్ మహాసులున్
బరశులు పట్టిసంబులును బాణము లాతఁడు పోవునంతకున్. 256

మ. తెలివా! రావణుఁగూర్చి ప్రశ్న లసమాధేయంబులై యున్న వ
బ్బురమై యప్పుడె బుశ్యమూక మిదియో పున్నాగవేణీ! సుబం
ధురమై శైలగుహాగ్రనీరజలబిందుల్ చేతులన్ నిప్పగాఁ
గురిసెన్ ద్వాద్విరహాగ్నితప్తునకు నాకు న్నమ్మెదో నమ్మనో. 257

గీ. అనిన జానకి స్వామి నీ కగ్ని కాని
దగ్ని యైంది, యచట నా కగ్నియైన
దగ్ని కాలేద, కిష్కింధయైన నిచట
నాగ కుండఁగ చనుట మర్యాదకాదు. 258

ఉ. తారనుగూర్చి చెప్పెదను ధారుణి నీతివిశారదత్వరే
ఖారమణీయబుద్ధి యని కంజదళేక్షణ యందకత్తె యం
చా రవిసూతి కెంతొ ప్రియురాలని చూడఁగ నింత స్నేహితుల్
మీరును మీరు, కావలదె మీ గృహిణుల్ సయితమ్ము మిత్రముల్

వ. అంత విమానంబు కిష్కింధలో దిగిన వానరు లందఱు దిగి సుగ్రీవాంగదులు రామునివంకఁ గృతజ్ఞదృష్టులు పఱపిన రాముండు సీతవంకఁ జేయి చూపించిన, వారు జానకీచరణాంబుజనిహితనేత్రులై, జానకీదేవి యంతిపురికి నడచిపోయి తారారుమలచేత సమస్కృతయై వారిం గౌఁగిలించికొని వారిని బయలుదేరఁదీసి పురవీథుల వెంట వానరవానరీశిశుచేష్టాదర్శనంబున నయనోత్సవవినోదంబుఁ గాంచుచు మఱలఁ బుష్పకం బెక్కి తారారుమలఁ దనవద్దనే యుండుఁ డని పోవుచుండగా. 260

ఉ. దేవిమహాత్త్వమే తెలియ ధీనిధులైన కపీంద్రజాతికిన్
దేవిదయావిశేషము నదీనతఁ గాంచిరి సర్వవానరుల్
దేవియు నుండె నింక నతిథిక్రియ లోపములే దయోధ్యలో
దేవి నిమేషమాత్ర రఘుదేవుని కన్నను మించిపోవఁగన్. 261

గీ. మొదటినుండియు నెడఁద నంగదున కుర్వి
గర్భ మనఁ బట్టరానంత గౌరవంబు
నిప్పు డాతనిగుండెలో నేమి సీత
యేమి సీత రాఘువుని పై యెత్తుమనిసి 262

వ. మఱి కొంతదవ్వు చనినంత శ్రీరామచంద్రుం డిట్లనియె. 263

చ. ఇచటఁ గబంధసాధు వుదయింపఁగఁ జేసెను గోస్తనీమలీ
మ్లుచమగు సూర్యసూతికథ లోచనసుందరమూర్తి వాయుసూ
తి చెలువు గూర్చెఁ జేసి యతిదివ్యము భోగినచోఽతిశాయి వా
గ్రచనము, పొల్చె నీస్థలము రాఘవజైత్రకథానిదానమై. 264

శా. అంతన్ వీచెడు గాలి మాఱినది దేహంబందున న్నిర్వృతి
ప్రాంతంబై చను స్పర్శ యౌచు పవనవ్యాపార మేపారఁగన్

కాంతల్ ముఖ్యాబ్జ పక్ష్మసంచలనసంకర్షంబుగా నొక్క దుః
ఖాంతంబొ ననుభూతి పొందఁ బతియి ట్లాడెన్ జలన్నేత్రుఁడై. 265

మ. ఇవి పంపాపవమానముల్ శిశిరసాహిత్యంబు లంభోజర
మ్యవనీమంజులవాసనాలహరికా మాలాపరిస్తీర్ణ సూ
త్క్మవిభాస్పర్శమనోహరంబులు మతంగర్షీంద్ర దీవ్యత్తప
స్సనిశాలంబులు సద్వియోగదహనక్షోదిష్ఠసంచారముల్. 266

ఉ. ఓసి మనోజ్ఞనీరదనసోదయకాలవియద్విలంబమా
నాసితవారివాహనివహానతకైశిక ! యింద సువ్వె పం
పాపరసీతటీ కుసుమవాటుల బోయతి వృద్ధురాలు నా
తో సరసంబు లాడినది తొయ్యలి! ని న్మది విస్మరింపఁగన్. 267

గీ. అనినఁ జేతులు జోడించి యవనిజాత
ధ్యానమీలితలోచన యయ్యె నటివ
రుమయుఁ దారయు నున్మనీవిమలభావ
పదము తెలియనిదాని సంస్పర్శ నంద. 268

మ. చినదూరంబున యందుఁ బంచవటి వచ్చెన్ బుష్పకం బంత డి
గ్గిన యమ్మున్వర నంగణమ్మునను దూఁగెన్ లక్ష్మణుం డంబుజే
క్షణ ధాత్రీసుతయుం బ్రదక్షిణముగా సంచారముం జేసి యే
గెను శాలాంతరభూమి కంతటన సాఁగెం బుష్పకవ్యోమస్థలిన్. 269

ఉ. లోనికిఁ జన్న పృథ్విజ విలోకనలోకజయప్రగల్భప్ర
జ్ఞానిధి, సింహయాన, వికసన్నవలోచనపుండరీక, ర
క్షోనివసంబునం దగడు సొచ్చిన శీర్ణతనూప్రబంధసం
ధ్యానవవహ్నికావిరచితాకృతి, యాకృతిమత్ప్రతిజ్ఞయున్. 270

చ. వెలికిని వచ్చు జానకియుఁ జిన్నవయస్సుది మందయాన మం
జులతరమూర్తియై యడవిఁ జొచ్చిన యంతిపురంబు కన్య దే
హలలిత సౌకుమార్యపరమావధి రాఘవబాహులగ్న య
ల్లలనయి వీచు గాలిఁ గదలాడెడు క్రొంజివురాకుఁబోడియున్. 271

క. ఆదట నివ్వెఱవోయిరి
యాదట నాశ్చర్యపడిరి యందఱు దుఃఖం
బందిరి రావణుఁ డెంతటి
చిందరపఱచెను లతాంగి చిత్తం బంచున్. 272

మ. పెఱఁగా నేగుచు నుండఁ బుష్పకము పృథ్వీజాత, యోస్వామి! య
య్యెడగా నున్నది యత్రియాశ్రమము నా నేమంచు, నం దేఁగఁగా
నడకున్ నీవయినట్టి చిత్త, మనసూయాదేవి నిన్ గాంచ నే
ర్పడు, నట్లే యనె స్వామి, పుష్పకము నర్వం బందునం జీలఁగన్.

చ. అది యొక పేదయాశ్రమము నచ్చటికిం డిగినారు కోట్లమం
ది దితిజులున్ గపుల్ మునియు నిర్భరవార్ధకమూర్తి మానిభా
ర్య దరనిమీలితాక్షి శిథిలాంగక రాముఁడు సీత వచ్చిరం
చుదితముదంబుధుల్ పొడిచి పుల్లలదూర్మినితాంతహస్తులై. 274

ఉ. రాముఁడు లక్ష్మణుండు మునిరాజును ముంగిటఁ గూడియుండఁగాఁ
గోమలి సీత దూరమునఁ గోమలమల్లిక లల్లుకొన్న యు
ద్దామకుడుంగధామునికిఁ దా ననసూయను గాంచుఁబోయి యే
వో మసలించి గౌరవమృదూక్తులు తచ్చరణంబు లొత్తుచున్ 275

ఉ. నీవు నొసంగినప్డు కరుణించితి నం చనిపించెఁ గాని త
ల్లీ వర మద్ది నీది మసలెం బరిణామవిషాదగాథగా
నావిభు కన్నుదోయికిని నాకసతీనిభమూర్తి నాటయే
యేవము కల్గఁజేసినది యేచిన యొక్క దురంతవేళకున్. 276

గీ. ఆ సముద్రంబు లోతల నసుర కలఁడు
రావణుం డని పదితలల్ రక్కసుండు
పదితలలుకావు వానికి వందతలలు
మఱియు నొకతల యున్నదే పరమజనని. 277

మ. కడు మారీచుఁడు వాని ప్రెగ్గడయు బంగారంపు లేడౌచు రాన్
వెడఁగై కోరితి రాక్షసాధముఁడు త్రవ్వెన్ గోయి యాగోతిలోఁ
బడితిన్ రజ్జులఁ దోడికొంచుఁ జనె నంబా! పంక్తికంఠుండు నన్
బిడియేన్గుం బలె దానితోడ మొదలుంబెట్టెన్ మదాపత్తతుల్.

మ. సరగన్ డిగ్గిరి వానరుల్ శతసహస్రంబుల్ విమానంబు వా
రరుదై సైన్యముగాఁగ వార్ధిఁ జని సంహారంబు గావించె నా
శరలోకేశుని, వానియింటను నివాసంబుంటి నేనంట వ
త్సర, మే మాడె నటంచుఁ జెప్పను? జుగుప్సావార్త లాడెంజుమీ.

చ. అన ననసూయ నేత్రముల నశ్రము వ్రాలిన తెప్ప లెత్తికొం
చును దన కాళ్ళ నొత్తికొనుచున్ ముడినారలు తూలిపోవుచున్
గునగున పోయి రాఘవునిఁ గోపమునం గనుచుండ రాముఁడున్
మనసున భీతిఁజెందె ఋషిమానిని యేమనునో యటం చెదన్. 280

చ. ఋషిసతియున్ మఱల్చుకొని యేగె గిరుక్కునఁ దిర్గి లోనికిన్
హృషితుఁడు పోని యిట్లనియె, వృద్ధత, వృద్ధత, రామచంద్ర! పౌ
రుషమును క్షత్రియావలి యెఱుంగును, స్త్రీలును నేర్తురే? ధురా
కషణముపొందు గుండియకుఁ గల్గునొకో వెనుముందు చూచుటల్

వ. అంత నందఱుం బోయి విమాన మెక్కి-న నది బయలుదేరఁబోవు
వేళ దూరాన ననసూయాదేవి నడచుచు వచ్చుచుంటఁ జూచి
శ్రీరామచంద్రుం డాపిన, నామె నడచివచ్చి శ్రమంపడుచు
మెట్లెక్కి రెండుఫలంబులు సీతచేతిలో నిడి దిగిపోవుచుండ సీత

యా ఫలంబులు రామునిచేతి కిచ్చి యామెను మెట్లు దించి తిరిగిరా
విమానంబు సాగి చనఁజొచ్చె. 282

ఉ. ఆవయి రామమూర్తి జనకాత్మజ మానసమందు బిట్టు సం
తాపము నంకుచుండె నని దాని నిరస్తము సేయు నూహలుం
బ్రోపుగఁ బుష్పకం బికుపుంతలఁ బర్వతసానుభూములం
దాపగలున్ మలంగునెడ లందున నంబుదగర్భపీఠులన్. 283

ఉ. చోపుచు నెత్తునుండి దిగుచుం గుదిలిం పగువేళ దీర్ఘబా
హాపరిరంభణంబుగ నగాగ్రము లెక్కుచు నేటవాలుగా
నై పయనించువేళ మృదుఃకాంపమునందున బాహుయష్టికా
వ్యాపృతిగాఁగ నొడ్డిగిల నానిన మై మెయిగాఁగ రాచుచున్. 284

క. తొడ తొడతో నొరయించుచు
నడచునఁ గాల్కాలు నెఱుఁగన ట్లమముచునున్
వడి గాలిఁ దొలఁగు పయ్యెద
నిడి సరిగా నెడఁద నేమి యెఱుఁగనియట్టుల్. 285

ఆ. భార్య కానువచ్చుఁ బసిబిడ్డ కావచ్చు
సహజమైన ప్రేమ సాగవచ్చు
కామభావ మైనఁ గడఁగి కానచ్చున
యిప్పు డిద్దియంచు నెఱుఁగరాక. 286

. హరిధనురంతరంబున రయంబున నేగుచునుండెఁ బుష్పకం
బరుణ పిశంగ పింజర సితాసిత శార మనోజ్ఞ దేహభా
స్వరముగఁ బొల్చు నీ మొగ ముమశ్చలదార్ద్రి మధుస్ఫురద్గను
ద్భర నవమట్పదీచరణ బంధురసుందరపంకజాననా! 287

ఉ. ఈకెలనన్ మహీధరము లెంతయొ యెత్తయి త్రాఁచు లేమొనా
దూఁకుచునుండెఁ గ్రిందికిని దోఁగులు రాచి విమాన మేగఁగా
శీకరపంక్తి లోపలికిఁ జిందెడు మబ్బులలోఁ బ్రయాణమై
యో కమనీయ వార్షుక నవోదధరోదర సార వేణికా! 288

ఉ. ఈ దెస నెల్ల మబ్బులయి యుయ్యెది ధారుణియంచు నెంచఁగా
వే దిగుచుండెఁ బుష్పకము విస్ఫుటమై చను లోయలో, విమా
నోదరపూర్ణమై సితకణోజ్జ్వలనేఘము కానిపింపకన్
బైదలి! యొక్కరొక్కరము వస్త్రములుం దడిముద్దలై చనన్. 289

చ. తనరఁగ నింతసైన్యమును దానురసేతుణ క్రీడగాఁగ మో
హనగతి యూఁచు రావణమహాజలరాశిని ముంచి లేవనె
త్తినగతిఁ జేసెఁ బుష్పకము తెమ్మెర లెండపొరల్ ఘటిల్లి యూ
రెను నలివంబు నీది కబరీఘటితా త్రిసతీకృతస్రజా! 290

చ. ఉరువడి మబ్బుజీబు లెడ మున్నది లేనిది యేర్పరింపమిన్
గిరికొనయందుఁ గట్టునని గీసుకపోయిన నిస్వనంబు ని
ర్భర కపిదైత్యయుద్ధమున వానరవీరుల సింహనాద మం
బరమును నేర్చికొనయిన మాదిరిఁ దోచె విభీతలోచనా! 291

మ. అచటన్ వానలు నెండ లిచ్చట సుదూరాయాతమై సుంతలోఁ
బ్రచల త్పుష్పక, మబ్జకేసరలసద్రజ్జాకృతాకేకరా!
రుచిమద్బాహువు వాయుసూతియు సమారోహించె దీనిన్ సదృ
గ్రచనాకౌశలుఁ డబ్బురం బగుఁగదా, ప్రాణప్రతానేశ్వరీ! 292

ఉ. మంజరితాతపంబులు విమానమునం జెరలాడు వస్త్రముల్
పింజెలయందు నారవు విభిన్ననవాంజనపక్ష్మలచ్ఛవీ!
సంజలయెఱ్ఱనల్ ముదిరి సంపుటితం బయినట్లు తోఁచెడిన్
మంజిడి కింశుకీవసుమాళి యసృగ్బలి మోయుచున్నటుల్. 293

ఉ. ఇక్కుటిలంపుచేర్పడకనే గుసతించుచుఁ బోవుఁ బుష్పకం
బక్కట త్రోవతప్పెను నటంచు భయంపడునేమొ? యేటి కి
ర్ప్రిక్కను సూదికొండలను రాచుక వ్రీలుదు నన్న భీతియో !
నిక్కము కంటి కింత కమనీయత చొప్పడు చోటు లొప్పనే. 294

చ. బయటికి నింతసేపటికిఁ బడ్డది పుష్పక మింతసూటిగా
రయ మిది యింతనాఁ బలుకరానివిధంబుగఁ బోవు గుండెలో
భయమగునట్లు కిన్నెలును బైసులు క్రమ్ముదునట్లు దేవతా
లయములఁ బట్టణంబులఁ బొలాలను ధారుణి వర్ణచిత్రమై, 295

శా. నా చిన్నప్పుడు గాధిసూతియుఁ బురాణంజా కథం జెప్పెనే
ప్రాచీనల్ కుశనాభుకూతులను గోపం బందుచున్ వాయువుం
గ్రాచెన్ వారి యొడళ్లు కుంచి కుఱుచల్గా నట్టులే యిప్పుడుం
దోఁచున్ బిట్టు కుదింపఁబడ్డ పురముల్ తోటల్ పొలాల్ చెఱ్వులున్

సీ. దూఁకి పుష్పకమును డుసికిలించుకపోయి
యలకోక మెరమెర లాడుకొంచు
ప్రతిబింబ మయి కాచఫలకంబులందున
నక్షుల మిరమిర లాడుకొంచు
వట్టి యాకాశనిర్భరమహోర్ణసముద్ర
మందున మిటమిట లాడుకొంచు
నాతపౌష్ణ్యము తొలియంతస్తునందు దే
హమ్మునఁ జిటచిటలాడుకొంచు

చిమ్మ కరగించుకొని రోదసీకటాహ
మునను బోసిన సీసమో యనఁగఁ బొలిచె
పలుచనివియుఁ జిక్కనివి యొండలు శ్రవోవి
టంకపరిలీనరత్నతాటంకయుగళ ! 297

ఉ. ఇచ్చట గాలిలేదు జనియించిన దింతటిగాలి యెట్టులో
యెచ్చట వేగసేకుకముసై జనియించున యచ్చటచ్చటే
కచ్చకొనంగ వేగమును గాలియు రెండును హేతుకార్యముల్
క్రచ్చర పీలుగాఁ గదలికం గన మి న్నొకఁ డుండఁగావలెన్. 298

సీ. దూరభూభ్రంబున నారగ్వధకుజాళిఁ
జివురాకులను గదల్చినది లేదు
అనుక రత్నగవాక్షంబునందు గూ
ర్చున్న నీనగు ముంగురుల్ కదల్చు
మొదలు తుదల్ లేని చదలున నెచ్చట
నెందుకు పుట్టునో యెఱుఁగరాదు
నీ ముంగురులయందు నెఱయునో పయ్యెద
కదలికనుండి నిర్గతము నగునో

ఈ మిలద్వాయువీచి తా నెచటఁ బుట్టు
క్రముపవమానచలితాలకా! ప్రకంపి
తానిలవిధూతచేలాంచలా! వియత్ప్రి
మాణకృతమధ్య! ప్రాణసంపన్నమూర్తి! 299

మ. అనినన్ జానకి చిత్రచిత్రముగ నేలా పిల్తు నన్ స్వామి, నే
నును నీపైఁ గినుకన్ వహించితినినా నూల్కొన్న భావంబునన్
మునికాంతానుణి యేమిగాఁ బలుకునాఁ బుట్టెన్ మదిం భీతి యా
ర్తుని నిన్నున్ ప్రభు! గోరుచుట్టుపయినన్ రోకంటిపోటన్నటుల్.

క. నిన్నన్నది గొుక్కటియును
నన్నన్నది వేఱొ రామనారాయణ! నీ
పన్నాలీకపు దాసిని
నన్నున్ మఱువకువె ప్రాణనాథా యనుచున్, 301

మ. అదిగో ఉల్ల కనంబడుంజుమి మహాన్యగ్రోధ మే మట్టికిన్
బదునాలేదులు దీని వీఁగి బయటం బడ్డన్ బలుల్ ప్రొక్కితిన్
మదిరల్ పా ల్పలలంబులున్ యమునకున్ మందాకినీ దేవి కి
చ్చెద నంటిన్ రఘురామచంద్ర! కరుణం జెల్లింపవే ప్రొక్కులన్

ఉ. ఓ నటరాజ! నీకరుణ యున్నది రాముఁడు నేను లక్ష్మణుం
డీ విలయంబు నిఁత తరియించితి మింక నయోధ్య కేగినం
దా వసుధేశుఁ డౌనుజుమి తామరసాక్షుఁడు రామమూ ర్తి స
ద్విధి రెండురెట్లుగను దీర్చెద ప్రొక్కు లనుగ్రహింపవే. 303

ఉ. నీవును సృష్టి కాదివి మునిప్రచయాధికపుణ్యమూ ర్తి ! యే
జీవున కన్ననున్ మొదటిజీవివి నీవు మహావటేంద్ర ! వృ
ద్ధావలి సేవకన్నఁ గలదయ్య మహాసుకృతంబు, దీర్ఘ శా
ఖావిలసచ్ఛిఖావియదఖండధరాపరిషంగతాకృతీ! 304

ఉ. ఓ జగదేకకార్ముకకళో గ్ర మహావటమూ ర్తి! రామచం
ద్రా ! జగతీనిరంతనవధర్మపరిస్ఫురితాకృతీ ! భర
ద్వాజమునీంద్రు నాశ్రమము తావిది, యిందు నివేమి సౌధముల్
గాజరలున్ లతాతరులు కంటికిఁ గన్పడరావు రాఘవా! 305

మ. అనినన్ రాఘవుఁ డిట్లు పల్కె నవముగ్ధా! యస్మహాపర్ణాని నీ
వును నేనుం జనుదెంచు చుంటి మనుచుం బొల్పించె నీ సౌధముల్
మునిపాదాంబుజకర్ణికాకృతిగ సంయోజింతు నస్మజటన్
వనితా! నీవును సంఘటింపు మధుకృత్పక్షౌఘమా కైశికన్. 306

మ. మనయాతిథ్యము కోసమై ముని మహామంత్రావిరారూఢి కో
ట్లను మించన్ మన మింతమందిమిని బాలా! యింతసౌధాళి తీ
ర్చెనుసూ! పుష్పకమున్ డిగందొడఁగెఁ బాడీస్వచ్ఛధారావినూ
తనహీరాంచిత హారసంచితగళాధస్సంచరల్లోచనా ! 307

చ. ఒక దినమల్లఁ బట్టినది యొక్కఁడు నొక్కఁడు నేగి పూనినా
యకచరణాంబుజాతముల యందున మ్రొక్కుచు రాఁగ నేరి యే
రికి నెదియెద్ది సౌధ మనురించెనొ వారును వారు దానిదా
నికిఁ జన నాంజనేయుఁడు మునింగన నేగి నమస్కరించినన్. 308

మ. మునియున్ మారుతిఁ గౌఁగిలించికొని సమ్మోదంబునం బల్కె నం
తన, యబ్ధిన్ విపదబ్ధి దాఁటితివినిన్ దాటించి తన్నున్ మహా
ముని! యప్పుడు మీరు మీమ్మనులు సంభోయానపాత్రీకృతా
త్మనితాంతోగ్రతపశ్ఛటావితతిఁ బంపన్ నేను గుర్తించితిన్. 309

సీ. క్షితిజాతకును బ్రతీచీదేవి కేలుదో
యిం దీసి పోసిన యొజ్జనీళ్ళ
చనుదెంచు స్వామికి స్వాగతి నెఱప స
త్సతి పూనినట్టి మందారమాల
రామార్థకృత ప్రతీక్షాముగ్ధ భరతత
పస్తీవ్రవహ్ని సంబంధదీప్తి
ఉగ్రరక్షః ప్రేతకోపశమార్థ సం
పన్నాసృగార్ద్ర మహాస్త్రరాశి

గతమహాహవ దైతేయకపిజగద్వి
నిర్గత మహాక్రుధా సమానీతపిండ
మనఁగ సాయంప్రకాశసంధ్యారుణిమము
లరుగుదెంచెను మున్యాశ్రమాంతరంబు. 310

గీ. నిశి చనె నుషస్సు వచ్చెఁ బండినది మొక్క
జొన్నచేను విధానఁ బీచులును బొట్ట
లాకులును రేకులుగను బ్రాచ్యమగు పొలము
బిలబిలని వచ్చెఁ బక్షుల కలకలములు. 311

శా. శ్రీరాముంగని మౌని యిట్లనెఁ దపోదృష్టిన్ భవత్సర్వకాం
తారావాసకథాప్రపంచమును సందర్శించితిన్ రాఘవా!
నీరాకన్ మదిఁ గోరుచున్ భరతుఁడున్ నిర్వ్యాజదీవ్యత్తపో
ధారాశ్యామలపద్మకోరకతనుత్వంబై ప్రతీక్షించెడున్. 312

వ. అనిన శ్రీరామచంద్రుండు మారుతిం బిలిచి యిట్లనియె. 313

శా. వ్యగ్రాత్ముండయి కైకయీసుతుఁ డయోధ్యాపూస్సమీపస్థనం
దిగ్రామంబునఁ గావిగుడ్డలు జటల్ దీపింప నన్ వేచు, దూ
తాగ్రేయుండవు పోయి చూడఁగదవయ్యా! చెప్పు నా రాకయున్
సుగ్రీవాదుల రాక వానికి మరుత్సూతీ! నుతవ్యాహృతీ. 314

మ. పదునాల్గేడులు పూర్తియైన దినముల్ పాలింతు నీ కోసమై
యది నీధారుణి వచ్చి కైకొను మయోధ్యానాథ! నేఁ బోనిచో
నది తానే పతియై వహించు నని లో నాలోచనం జేయరా
నిదిసూ, నాదగు ధర్మచింతన, మహాగ్నిం జొత్తు నిక్కంబుగా. 315

వ. అనినాఁ డాతడు నీవుపోయి నారాక చెప్పిరమ్మనా నాంజ
నేయుండు పంచజనబ్రాహ్మణరూపంబున నేగి తత్రత్యాతర్వాళా
వియన్న్యాతనాతిథిభూత బాలనీలాంబుదంబుల నీడలయందు నీలాం
బరముల పూలు పూచిన పూఁదోటవోనిది, తేఁతగులాబిచీర లారఁ
బట్టినది వెలుంగు చూచి, యట కేగి, జటాభిరాముండు వల్కల
ధారి యొకండు రాజపురుషవేషధారులచేఁ బరివేష్టింపఁబడి యగ్ని
ప్రవేశంబు సేయఁ బోవుటఁ గని. 316

ఆ. ధరణిదేవికన్య దశరథసూనుండు
రామమూర్తి యనలరాశిఁ ద్రోచె
దానికిన్ ఫలంబు తానే మహాగ్నిలో
నుఱుకుచుండె నన్న యూహ తోఁచి 317

గీ. రూపసంవాదమున కచ్చెరువడి యుల్ల
మిన్నుడిగి యిట్టు లనె సమున్నీల దమృత
సారణీ ధోరణీ పరిస్ఫార విమల
మధురవాణీధునీ కాశమానఫణితి. 318

క. కరుణాభరణాయితధీ
పరముఁడు శ్రీరామమూర్తి వనవాసంబుం
జరిపి పదునాల్గేఁడులు
మరలి భరద్వాజు నాశ్రమంబున వచ్చెన్. 319

ఉ. పంపెను నన్ను వేగఁ జని వహ్నినిఁ జొచ్చెడు నట్టివాని వా
రింపు మటంచు నన్ బలికి శ్రీరఘురాముఁడు జాటజూటినై
లింపధునీ సరోజవిమలీకృత మాధురఝరీ నిపానపా
రంపరిఁ జొక్కు షట్పదధురామృదురావము లేచు మాటలన్.

చ. మతి నవపారిజాతసుకుమారుఁడు సువ్రతమూర్తి కైకయీ
సుతుఁడును నాకునై యెదురు చూచుచునుండును బోయి నాదు నా
నతి గొని తన్మనఃకమలనాళము నిక్కిన నేత్రవారిజో
ద్గతమధుబిందుపానచరితార్థత నా ప్రతిగాఁగఁ బొందుమీ! 321

చ. అయయొ! యదెప్పుడేన్ ప్రణిధి నంపను పిల్పడనంత దవ్వు సం
దియమును దీరి నే బయలుదేరి సమాగతుఁ డౌదు నన్నదిన్
నయముగ రెండుమూఁడగు దినాలకుఁ బూర్వము నిశ్చితంబుగా
నయినది నీవు పోయి విరహాతురు నాతని సేద దేర్పుమా! 322

చ. అతనికి ధారుణీవహన మక్కఱ లేదు, మఱిన్ హుతాశనా
ర్పితముగఁ జేయు దేహము, భరింపక పోయిన నేను ధాత్రి, నీ
తెఱియును నేను బూను టది, సేగి వహించిన యేని వాఁ డసం
గతమగు, నట్టు లెన్నడును గా, దతనిం గని చెప్పు మం చనెన్.

చ. శ్రవణసుఖంబుగా జరుగు సామనినాదము వాయుపీచికా
భవమగు దవ్వు నచ్చరలు పాడిన గీతివిరావమో పురా
భవమున విన్న పావనప్రబంధకథాంశ మొకండు సంస్మృతిం
దవులుచు నున్నదో యనిన జానిని సుస్వరరమ్యశారదన్. 324

శా. వించుం గైకయిబిడ్డ దీప్తనయనావిర్భూత బాష్పచ్ఛటా
సంచారమ్ములు దోసిటం గొనిన పుష్పశ్రేణిలోఁ దేనెలై
పంచారించిన కంఠశంఖమున నిస్వానంబు రాన్ జైత్రయా
త్రాంచచ్ఛ్రీమధుసూదనాస్య పవమానాపూర్ణ మైనట్టులన్. 325

క. వందేంద్రకైన జీవుఁడు
పొందున్ సుఖలేశ మన్న పోల్కి వినఁబడున్
సందీప్త మధురహృదయ
స్పందన కారణ కథాప్రపంచము చెవుల్. 326

ఉ. ఇంతటి పాండితీమహిమ యింతటి సుస్వరకంఠనిస్వనం
బింతటిభావవిస్ఫుటమహీయము వాణియుఁ జారితార్థ్యవృ
త్త్యాంతము దాత్యమందున మహాత్ముఁడ వెవ్వఁడ వీవు నీదు దై
త్యాంతకుడైన యాతని సమాగమ మెట్టులఁ గల్గెం జెప్పుమీ!

మ. అన నిట్లాడఁ దొడంగె మారుతి విదేహాధీశపుత్రీవియు
క్తుని శ్రీరాముని దవ్వునం దటవులన్ గోదండతాళోగ్రచం
డుని సుగ్రీవుఁడు మిత్త్రభుంను కని చండుండైన యా వాలి పం
చెనొ యేమో కని రమ్మటంచు ననుఁబంచెన్ రామునిన్ లక్ష్మణున్

గీ. వాలి తమ్ముని సుగ్రీవుఁ బాఱఁదోలె
నతని భార్యామణిన్ రుమ నపహరించి
ద్రోహి మాగీచు హేమమృగాకరించి
రావణుఁడు దొంగిలించె ధరాతనూజ. 329

క. ఇద్దఱు వియుక్తరాజ్యులు
నిద్దఱు భార్యావియుక్తు లిద్దఱు సఖులై
నద్దరి వాలియుఁ జచ్చిన
నిద్దరి రావణుఁడుఁ జచ్చె హ్రీపరిహీణుల్. 330

మ. ఎచటం జానకి డాఁచెనో తెలియదాయెన్ రావణుం డబ్ధులున్
నిచయంబై చను ధాత్రియెల్ల వెదకించెన్ స్వామి సుగ్రీవుఁ డు
గ్రచమూయుక్తుఁడు వానరుల్ దశదిశల్ గాలింపగా నంగదుం
డు చనెన్ వాలిసుతుండు దక్షిణము నేనుం గొందఱున్ వెంటఁబో,

శా. నేనున్ దూఁకితి వందవారినిధిఁ గంటిన్ జానకిన్ లంకలోఁ
గానన్ రాని మహాస్నుఁ గోపమున లంకన్ నిప్పు ముట్టించితిన్
నేనన్నన్ రఘురామమూర్తి దయపూనెన్ నేటి కద్దాన సీ
తానాథుండును బంపె నీకడకు వార్తాసారణీధోరణిన్. 332

మ. అనినం గైకయిబిడ్డ వానరుఁడవా? యన్న న్మరుత్సూతి యం
జనియ న్నచర వానరాంగనయుఁగా జన్మించె నే నామెనం
దనుఁడన్ వాయుసుతుండ నొజ్జయగు మార్తాండుండు నాకుం, దివిం
జని నే నాయనతోఁ బఠించితిని శాస్త్రంబుల్ చతుర్వేదముల్.

చ. భరతుఁడు లోచనాంతపరిపాండురకాంతుల నాంజనేయు పిం
జరతనుయష్టిఁ గౌఁగిలినిఁ జాదినయట్లుగఁ జూచి నీవు ని
ర్భయుఁడవు నాయెదం గలవు వందలు ప్రశ్నలు కాని రామచం
ద్రరుచిరపాదవారిరుహదర్శనవాంఛ యతిక్రమించెడున్. 334

ఉ. నీవు బుజాన నెత్తికొని నిర్భరవానరసేన నక్కటా
యా విలయాంబురాశిపయి నట్టిటు మోసితివో మహాత్ముఁడై
యో వినతానూజపరమోజ్జ్వలవేగ కపిప్రభాకరా !
నీ వొకరుండు కల్గినది నీరజనేత్రుని గెల్పు హేతువై. 335

వ. అనిన నాంజనేయుం డట్లుకాదయ్యా ! నలుం డను మహాకపి పిత్ర
దత్తవరంబున నీళ్ళపై రాళ్ళు తేలింపఁ గలవాఁడు సాగరంబున
సేతువు నిర్మించె, దానిపై నందఱ మేగితిమి, రావణవధానంతరము
నతని యపరసంస్కారములు పూర్తియైన తరువాత మూన్నాళ్ళ
క్రింద బయలుదేరి వచ్చితి మన భరతుండు.

శా. మూన్నాళ్లైన దటయ్య వచ్చుటకహో మూన్నాళ్ళమాత్రం బదే
లన్నా! నీబుజమెక్కి ముప్వురును రా నన్నన్ మరుత్సూతి, మీ
యన్నన్ నీవు నెఱుంగు దాయనయు నీవై యీపనిం జేయుమం
చు న్నోరెత్తి మ తెప్పుడే నడుగునా శూరాగ్రణీ! వేనినేన్ 337

ఉ. రాజు విభీషణుం డిపుడు రావణుతమ్ముఁడు దైత్యధాత్రికిన్
రాజయి రావణుండు సమరంబున గెల్చి కుబేరు దివ్యశం
పాజరమైన పుష్పకవిమానము గైకొనె దానిఁ దెచ్చినన్
రాజు విభీషణుండు రఘురాముఁడు వచ్చెను సర్వసేనతో. 338

ఉ. అన్నకుఁ జెప్పఁగా ఫలితమన్నది లేక విభీషణుండు వ
చ్చె న్నలినాక్షుఁడైన రఘుశేఖరు పాదసరోరుహంబు చే
ర న్నలినాక్షుఁ డయ్యసురరాజ్యము వాని కొసంగె, నాతఁ డా
సన్నము చేసెఁ బుష్పకము స్వామి ప్రయాణము చేసె దానిపై.

వ. ఇపుడు లక్ష్మణవిభీషణులును రామసుగ్రీవులును మైమై నుందురు.

ఉ. నే నొకరుండ సీత పదనీరజసంతతభావనామతిన్
దానవు నింట నుండెనని తామరసేక్షణ యొక్కఁ డేఁడు ప్ర
జ్ఞానిధి రామచంద్రుఁడును సాధ్వని వహ్నిని జొన్పె వహ్నియున్
జానకివహ్నిఁ దట్టుకొనఁజాలక యామెను నిర్వామించెనాన్. 341

చ. భరతుఁడు లోచనస్ఫురితబాష్పనవాంబుకణాభిరాముఁడై
పరమకపీ! హృదంతరవిభాసితకోమలభావ మొందు నీ
గురుకరుణావిశేషమునఁ గోరిన రూపము దాల్చె, ధాత్రియున్
ధరణిజఁ గన్నదో మఱియు ధాత్రితనూజయె ధాత్రిఁ గన్నదో. 342

శా. కైకేయీసముపజ్ఞ మియ్యది జగత్కల్యాణగాథాప్రవా
హాకారంబయి పొల్చు రామకథ యీహో నీవు నీవంచు ని
ర్భీకుల్ వారలు వారలంచును నిరూపింపఁబడెన్ ధాత్రికిన్
కాకన్ గోసలరాజులన్ మిగులు నొక్కండై జగన్నాథుఁడున్. 343

గీ. జీవలోక మ్మొకింకఁ బుష్పించె ననుము
ధ్యేయమూర్తులుగా మీకు తీర్చినాకు
ముప్పురును బ్రహ్మచైతన్య పూర్ణమధువు
లవతరింప నై రమ్మదీయహ్రాదాళి. 344

చ. మది రఘురామచంద్రునకు క్ష్మాసుత యగ్నినిఁ జొచ్చునన్న భీ
యొదవదు నేను జొత్తునని యుల్లమునందున భీతి గల్గె నే
ర్చెదవును రెండు దూత్యములు చేసినవాఁడవు నీవు భేదమున్
విదితముగాఁగ నల్ల రఘువీరుని లోయెదలో రహస్యమున్. 345

ఉ. రాముఁడు జ్యేష్ఠుఁ డే నతని రాజ్యము దొంగిలరా దటన్న భీ
నామది నుండె శాకికము న్యాయ్యము కాదనుభీతి, యిప్పు డే
దో మహితానుభావ మొకఁ డూగుచునున్నది యాత్మలోన నా
రాముఁడుకాఁడు నిక్కముగ రాముఁడు, సీతయు కాదు సీతయున్

గీ. అంత మంత్రులు వెంటరా ననిలసూతి
పరమసఖుఁ డయి తోడన బయలుదేర
వేగరుల నయోధ్యకును బంపించి తాను
భరతుఁడు ఋషీంద్రువాటికి బయలుదేరె. 3

సీ. తర్పణవేళ శ్రుతంబైనఁ బితృదేవతా
దర్శనమున నుద్భ్రాంతి కలిగె
వినినంతలో బుద్ధి విమలమై యేపారె
సన్న్యస్తశస్త్రాస్త్రసంచయమున
నొగి హతాచ్ఛ్రితమైన నుబుకుగుండియను నం
గడిలోన జారెఁ దక్కెడయుఁ జేత
నెవ్వరో చెప్పిన నెత్తిన కళయుగా
సారథి చిత్రభాస్వరతఁ గాంచె

మిలదమృతవాక్యధోరణి మేఁతమాని
విశదముగ వినుచుండెను బసుగణంబు
రాఘవుఁడు భరద్వాజునాశ్రమము తిరిగి
వచ్చె నన్న దయోధ్యలోఁ జొచ్చినంత. 348

ఉ. మువ్వురాణులుం గనుల బోరన నీరము జార నేడ్వఁగా
దవ్వున నున్న సేవకుని దండము హస్తమునుండి జారఁగా
నవ్వడి యింతలేక పరిచారిక బొమ్మవలెన్ నిలంబడన్
మవ్వపువార్త యంతిపురిమధ్యమునం బ్రసరించె మంత్రమై. 349

క. ఊరెల్లను గదలి బయ
ల్దేరె భరద్వాజు నుటజదేశము శబ్దాం
భోరాశి యైనది యయో
ధ్యారాజితగగనపథ మతంద్రాళువుగా. 350

ఉ. కోసలముల్ రఘూత్తముని కోసముగా శివరాత్రులున్న వా
యాసముమాని సంజ దివిజాలయ మేగెడునట్లుగా నయో
ధ్యాసముపాత్తమై వెడలె నచ్చట, నచ్చటఁ జేరి తీర్థయా
త్రాసముపేత భక్తజనతామయ శైవలినీప్రవాహమై. 351

సీ. కనకాంబరములు స్రుగ్గమయూఖ మణిభూష
ణమ్ములుఁ జూడ వానరచయంబు
ఘోరాననమ్ములు కుటిలదంతంబులు
నరయ మర్యాదాక్రియాచరణము
సింహనాదంబు లాశ్రితరామనామముల్
చన రౌద్రశాంత రసాశ్రయములు
గగనపుష్పములు శాఖాచంక్రమణములు
ప్రస్తుతార్థాక్షేపభావఫణితి

యలభరద్వాజమునితపఃప్రాప్తమైన
ఫలసమృద్ధి రాఘవవనీవాసజాత
ఫలసమృద్ధి వృక్షంబులపంట యగుచు
నందె నానంద మయ్యయోధ్యాజనంబు. 352

చ. భరతుఁడు మారుతిం గలసి వచ్చుచునుండినఁ జూచి సర్వవా
నరులును రాముఁ డంచును మనంబున నెంచుచు శీఘ్ర వృత్తముల్
మరియుఁ బునఃపునఃకృతనమస్కృతు లౌచును దవ్వునన్ ధనుః
పరముని రాముఁ గాంచి కడు భ్రాంతి వహింతురు చిత్రవృత్తులై.

చ. మఱియును రామభక్తులయి మానవ దానవ వానరావళుల్
మఱియును నొక్క రొక్కరిని మన్నన చేయుచుఁ బల్కరించుచున్
మఱియును బండ్లొసంగుచును మాటల నాడుచుఁ జెల్మి సేయుచున్
మఱచిరి జాతి భేదములు మానవ దానవ వానరావళుల్. 354

గీ. హరులు దోశ్శాలు లని యయోధ్యాప్రజలకుఁ
గడు మనస్సుల లోపల గౌరవంబు
నల యయోధ్యాప్రజలు నయోధ్యాప్రజ లని
కపులకును నాత్మలందున గౌరవంబు. 355

చ. హరి కథితోగ్ర రాఘవ మహాసుర యుద్ధవిచిత్రఘట్ట సుం
దరకథనంబు లట్టులె వినం బ్రియ మెంతురు కోసలప్రజల్
మరి కథనాభిలాష మెద మానఁగఁజాలరు వానరేశ్వరుల్
పరమసఖుల్ విభిన్నరసభావ సమాకలితార్ద్రమానసుల్. 356

గీ. అన్న పాదాభివందనం బాచరింప
భరతుఁడును వానిఁ గౌఁగిలింపంగ నన్న
రొయొండొరుల మేనులుం జేతు లొరసికొంచుఁ
గ్రమసంవాహనామనోజ్ఞత వహించె. 357

గీ. తొలి సముద్వేగసంయోగములును గడచి
పైన సంయోగశాంతభావములు మసల
నమృతనిష్యంద మందహాసాననముల
నొక్క రొక రభిషేకించు చున్న వేళ. 358

శా. సీతారాముల పాదపద్మములను జేర్పన్ దలన్ గైకయీ
సూతిన్ శ్రీరఘురామచంద్రుఁడును భిక్షూ! సేమమా? యన్న నా
నీతంబా మృదుహాస మాననమునన్ స్నిగ్ధాభిరామంబుగా
సీతాదేవియుఁ బ్రేమ నాతని తలం జేర్చెం గరాంభోజమున్. 359

చ. భరతుఁడు లక్ష్మణుండు మతిభాసి పరస్పరగౌరవంబునన్
పరమసహోదరత్వ పరిపాలితభావనఁ గౌఁగిలింప న
బ్బురముగఁజూచుచుం గపిసమూహము నన్నయుఁ దమ్ములిట్లు ము
వ్వురు వనవాసముం జరుపఁ బోయిరొ! ముప్పురు తిర్గివచ్చిరో? 360

న. అంత శత్రుఘ్నుండు ముప్పురన్నలకు వదినెగారికిఁ గ్రమముగా నమస్కరించుచుండ సౌమిత్రి తమ్ముని చిబుకంబు నంట నతండు తలయెత్తి యన్నవంకఁ జూడ సౌమిత్రి తననేత్రాంతరసుదర్శనాంశువులు తమ్మునియాత్మలో నిక్షేపించె. 361

ఉ. అంతట దాశరాజు గుహుఁ డాతనివెంబడి నొక్క సేవకుం
డంతట నంతటన్ భయమునందుచు రా బిడియంపుమూర్తియై
యంతికదేశముం దరియ నంబుజనేత్రుఁడు రమ్మటంచు నే
త్రాంతరవారిజాహిత సితాసితదీప్తుల వెల్లఁ జెల్మియై. 362

మ. గుహా! నీ దారుచయంబు ధూర్జటిజటాకోటీరశైవాలినీ
వహమై ధూర్వహ పూచుచున్నదియె నా, స్వామీ! భవద్దృగ్జలే
రుహాబంధూష్ణకరాభిమర్శముగ నేఁటున్ మోయుచుండంగ ధూ
ర్వహమై సాగునటన్న స్వామి యితఁ డెవ్వాఁ డన్న వైదేహియున్

ఆ. పురమునందుఁ బసుపుముద్ద యటంచును
నన్నుఁ బాతిపోయినాఁడు వీఁడ
నంగ రామమూర్తి నాకంటెఁ దెలివిగ
లాఁడు వీఁడటంచు గోడియాడె. 364

వ. అంత భరతుని కనుసన్న నర్థమంత్రి యా ధీవరునకుఁ బైడిముద్ద యీయఁబోఁగా, వాఁడు లజ్జవడిన, గుహుండు భయంబు లేదు, రాజానుగ్రహము స్వీకరింపు మన, నతండు దానిని స్వీకరించె. 365

సీ. రవిబింబములయంచు రహీంమించు నిరుదెసల్
చెలఁగ హేమాంబరోష్ణీష మొప్ప
నడుమునఁ గూర్పాస మిడియ బిగించి క
ట్టినయట్టి పట్టుధట్టీ సెలంగ
జమిరెడు తెల్లమీసాల బక్క కపోల
మున వెంద్రుకలు పొడిపొడిగ నెగురఁ
దెల్లని కనుబొమల్ దీధితి వియ్యమం
దిన దీప్తనేత్రకాంతియు నెసంగ

కనకవలయంబు తుది మణికట్టునందు
జాఱ కూర్పాసమునయందు జఱుగుచుండ
నల్లనల్లన యేతెంచు నట్టి మంత్రి
శేఖరుం గాంచుచున్ రఘుశేఖరుండు.

. లేచి యెదురుపోయి లీలామనోజ్ఞహా
సంబుగాఁగ నగ్నిసాత్కృతుఁడవు
కావు నీవు కానఁగడచి వచ్చితి నేను
నాకు నింక బండి నడపు మీవు. 367

ఉ. తా రమణీయవాక్యముగఁ దాత! సుమంత్ర! నిజంబు నీవు నా
సారథివంచుఁ జెప్పెదరు స్వర్గమునందునఁ గూడ, దైత్యసం
హారము వేళ నారథము మాతలి తోలె, నతండు చెప్పె, నీ
కోరిక యద్ది, నాదయిన కోరికయున్ మఱి యద్దియే సుమీ.

వ. అనుచుండ సుమంత్రుని నేత్రంబులు జలాపూర్ణంబు లగుచుండ
రాముం డాయనం గౌఁగిలించి కొనిపోయి తనవద్దఁ గూర్చుండం
బెట్టికొనఁ దక్కినమంత్రు లెల్లరుఁ గ్రమముగా వచ్చి నమస్కరింప
రాముం డందఱను కుశలప్రశ్న లడుగుచుండ. 369

ఉ. కర్శనకాల మెల్ల వెనుకం బడినట్లు ద్విధా త్రిమార్గగా
దర్శన మయ్యె రామునకుఁ దల్లులు ముగ్గురు గంగయొడ్డునన్
దర్శనమీయ వారి పదతామరసంబుల జూటజూటికా
మర్శనమొప్ప మ్రొక్కె రట తస్మసుత రాముఁడు లక్ష్మణుండునున్

శా. ఆ కన్నీళ్ళులు కౌఁగిలింతలును మూర్ధాఘ్రాణముల్ దేహామ
ర్శా కంపాంగుళిహస్తపద్మములు ప్రీతాలాపముల్ పూర్వక్ష్ణ
ష్టాకోభద్రము గాఁగ నున్నదియొ లేదో వస్తు వన్నట్లుగా
నైకైఁ దాఁకుట లొప్పెఁ దల్లులు విచిత్రానందపాత్రంబులై. 371

చ. పుణికిన చెక్కిళుల్ వ్రతము పూరితిచేసిన మోదలోచనాం
గణ ఘృణిరంగవల్లులుగఁ గౌఁగిటఁబూని మఱింగుమారు ల
క్ష్మణుని సుమిత్ర మైఁదడవి, కైఁగని, దండను రంగనాథు తో
రణ మది భద్రమై యునికి రంజితతృప్తమనస్క చూచునున్. 372

ఉ. కైకయి సీతఁ గౌఁగిటికిఁ గైకొని యోసి యనుంగ! నీవుగాఁ
గైకొని యీవనీచయనికామనివాసభరం బిదెల్లనున్
లోకము నన్నుఁ దిట్టుటఁ దలోదరి! మార్చితి, కైక పంపెనే
కాక దశాననాదివధ కల్గునె యన్న ప్రశంసలోనికిన్. 373

వ. అంత మైథిలీకైకేయుల యన్యోన్యతయుఁ బరస్పరానురాగంబును
గలసి చరించుటయుఁ జూచి జనంబు నివ్వెఱవోవుచుండ. 374

క. ధరణీసుతఁ గన్గొనఁగా
నరుంధతియు వచ్చుచుండె ననువార్తయు రా
శరవేగచలితవక్త్రక
సరోజనయనుండు రామచంద్రుం డనియెన్. 375

మ. మిథిలానాథకుమారి! నీకరుణ యున్మీలింపవే, తత్తపః
పృథుతేజఃఖనితో వచింపకువె తచ్ఛ్రేయోనిధానంబుతో,
నధరంబుం గదలింప కేగె ననసూయాదేవి, యీదేవి స్వా
ర్జధువౌ సర్వపతివ్రతానిలయతేజస్స్ఫురవార్వాహమై. 376

గీ. అనిన జానకి పతివామహస్త మూని
మృదులసంవాహనము చేసె హృదయమధుర
యంతలోన నరుంధతి యరుగుదెంచె
నందఱును నామె చరణంబులందు వ్రాల. 377

ఉ. శీలవతీజగత్పరమ శేఖరితో గ్రతపోనిధానమా !
పాలితవాక్యతం దిరిగి వచ్చితి నున్ను మహాసురో గ్రజం
బాలనదుల్ తరించి పరిపాలితభక్తజనా! సనాతనీ !
వ్రాలితి నీపదాబ్జములపైని తపో ఽగ్ని నన్నుం గ్రహింపవే. 378

ఆ. కోర్కె కొలందిది మీకుఁ గోడంట్రికము సేయఁ
దిరిగివచ్చినాను దేవతాకృ
తీ! తపోఽగ్ని! మీరు గృపచేతఁ బాలింపుఁ
డమ్మ నన్ను సత్కృపాబ్ధు లగుచు. 379

వ. చరణంబుల వ్రాలిన జానకీదేవి నరుంధతి లేవనెత్తి, తపోఽగ్నియు నింధనాగ్నియు లోకాగ్నియు నని యుత్తమమధ్యమాధమమ్ములు మూఁడగ్ను, లధమాగ్ని కధికారిలేఁడు, నీవు సర్వలోకరక్ష యగుఁ గాక యని ప్రత్యవాయభీతిఁ దిరిగి చనిన, నందఱుఁ బుష్పకంబుపై నయోధ్యకు బయలుదేరిన. 380

సీ. ఏయూరిజనముల నాయూర దిగుఁడన్న
దిగ రయోధ్యకును నే తెంతు మంచు
నంద ఱయోధ్యలో నవతరించినయంత
నలుబదియేండ్ల క్రిందట మహాశ్వ
మేధంబునంబోలె వీధులన్నియును జ
నాళితోఁ గిటకిట లాడిపోయె
నొక మహానంద మహోదధి వోలిక
కెరటమ్ము లట్టు లూగిరి జనంబు
మూఁడు పట్టణములు ముప్పదివేల గ్రా
మములు సేతుశీతమహీధరాంత
శైలకాననములు సాకేతమునయందు
నిఱుకుకొనుచునుండి యిఱుకుపడరు. 381

శా. చెల్లెంద్రుస్ ధరణీకుమారికను దర్శింపంగ నేతెంచుచున్
జెల్లింపం దొలిగౌరవమ్ములను దాక్షిణ్యైకవారాశి సం
ఫుల్లాబ్జేక్షణ సీత కౌగిళులలోఁ బూనెన్ బరిప్రశ్నలన్
దల్లితండ్రుల వార్తలం దెలిసి మోదంబందె లోనెంతయున్. 382

క. అనసూయ క్రుప్పి యిచ్చిన
ననదండలు వారి కిచ్చి ననబోడి ధరా
తనయ కనకంపుహారిణము
కొనితెచ్చిన మణులు పుడికికొని యిచ్చినటుల్. 383

గీ. ఊర్మిళాసౌధములయందు నొక్కనాఁడు
సరసపంగీతనాట్యనిస్వనము లొలసె
నలగవాక్షంబులందుండి యసుగుదెంచెఁ
గడు నవాగురుధూపరేఖలును బోలె. 384

ఉ. రాజిత పద్మబంధుకుల రాజకుమార మనోజ్ఞవేషుఁడై
భ్రాజితమూర్తి మత్తగజరాజు విధంబున గాలిచేతఁ జూ
డాజట లెంత శైలపుఁగడంకకు లొంగక రేగుచుండ హే
లాజితమన్మథుం డగుచు లక్ష్మణుఁ డేగెఁ దదీయసౌధముల్. 385

ఉ. ఊర్మిళ వాడు మోహ మను నూర్మి నొసంగెదు నెందుగుండెలోఁ
గూర్మి సృజించుచుంటి వనఁ గోనులి యిట్లనె, నంతయన్నకే
కూర్మి సృజింపఁగాఁ బడిన కొండికవారికిఁ గల్గు టబ్రమా!
ధర్మముగాక మీయెడలఁ దాల్తురె కూర్ములు మీపు రాఘవుల్.

శా. చానా! యీ పదునాలుగేండ్లును బ్రతీక్షాయోగముం బూనఁగా
నై నేనుంటి ననంగ లక్ష్మణుఁడు, హేమాంభోజపత్రాక్షి స్వా
మీ! నీకోసము నేను నాకొఱకు నీ విట్లుంటి మానందవా
ర్లీనాకారము రామచంద్రపదనాళీకాంతభృంగంబులై. 387

క. అన నొక్కరొకరు కౌఁగిలఁ
గొని పరిమళగానమధునికుంజములన్ ని
స్వనరహితభృంగభృంగీ
సునిహితమూర్తుల విధానఁ జొక్కిరి యెదలన్. 388

గీ. పాదుకాదేవతాపూజఁ బ్రత్యహంబు
సలుపుచుండఁగఁ బతి దానిసాధనను ల
మర్చుచుండుటయే నియమంబుగాఁగ
నడచె మాండవి యీ పదునాలుగేండ్లు. 389

గీ. భరతుఁ డగ్నిప్రవేశసంభరితభావుఁ
డైన నాతనితోఁ దాను నగ్గిఁజొఱఁగఁ
గడఁగు నామెను బిట్టు ప్రెగ్గడలు నంత
గడపినా రయోధ్యకు నత్తగార్లకడకు. 390

శా. వచ్చెన్ రాముఁడు, వచ్చి రాముఁడు భరద్వాజాశ్రమం బందునన్
బుచ్చెన్ వార్తయయోధ్యయెల్లఁగదలెన్ బూఁబోండ్లుకోడండ్రు తా
రచ్చో నేగఁగ నత్త లీయఁగను లే దంగీకృతిన్ మూఁపు రు
ద్యచ్చాంపేయ పిశంగలోచన లయోధ్యాకాశముం జూచుచో. 391

గీ. పొలిచె నేన్గ తమ్మిమొగ్గ మిన్నునయందు
నేల కొరిగి రేకపాళి విచ్చి
పచ్చబంభరములు పదికోట్లు సాకేత
మందు జుమ్ము జుమ్మమంచుఁ దిరుగ. 392

క. నిక్కు నవాగురుశేఖల
నక్కలసౌధములు మల్లియల గ్రొంబొదలై
పొక్కెడు కన్నుల మాండవి
స్రుక్కిన యెదతోడ గడపఁ జూచుచు నుండెన్. 393

శా. లజ్జాముగ్ధముఖారవిందుఁ డయి హేలామోహనాకారుఁడై
హృజ్జాతాభినవాసమేషుశరవర్షిణ్ భావనారూపసం
పజ్జీమూతము నత్తుకొన్న కనుబొమ్మల్ గాగనై నిల్చి మై
యుజ్జీవింపఁగఁ గైకయీసుతుఁడు నోహో మాండవీదేహళిన్. 394

గీ. అరయ దేశాంతరం బేగి యరుగుదెంచె
నరయ లోకాంతరం బేగి యరుగుదెంచె
నట్టి పతికౌఁగిటన్ సుఖమందె మాఁడు
రెట్లుగా దేశ లోకాల మెట్లు దిగుచు 395

వ. అంత శ్రీరామచంద్రునిచేత సమభ్యనుజ్ఞాతం బైన భరతుని ప్రార్థ
నంబు పొంటె శ్రీరామచంద్రపట్టాభిషేకంబు నిర్ణయింపఁబడఁగా.

సీ. పనియున్నవారికిఁ బనియుండె లేనివా
రికి లేదు లేనివారికినిఁ బెద్ద
పనియున్న యట్టులఁ జనుచుందు రిట్టట్టు
తమతోన జరుగు సర్వ మనినట్టు
లశ్వమేధంబు పట్టాభిషేకంబును
నవ్వ డన్నము కోరి రఖిలజనులు
నిపుడు ఫలాకాంక్ష నెసఁగు సర్వజనంబు
రామమహోవృక్ష రాజఫలము

చివురు లెండనీడ లవిసిన మొయిళులు
నొండు విరుగు శ్యామలోదకంబు
మంచు దమ్ము దినుసు మాఁగును జలికిని
నెసఁగు నలుపు సర్వఋతుఫలంబు. 397

గీ. వడి సముద్రాల నెగిరిరి కడలు చూచి
రఖిలసాగరనదుల నీ రాహరింప

లెక్కయే కీశవీరావళికి రఘుకుల
కైరవాప్తు పట్టాభిషేకంబువేళ. 398

ఉ. కోరి వశిష్ఠహస్తగతకుంభసముద్రనదీసుహాంబువుల్
ధారగ రామమూర్ధకలితాల్పజటాగుహాలన్ స్రవింపఁ జూ
డారతి నీలలోహిత జటావనులందునఁ జొచ్చుచున్న భా
గీరథినాఁ జనెన్ గృతయుగీనము ధర్మము వాస్స్వరూపమై. 399

సీ. అబ్జబాంధవ మండలాంతరంబున నుండి
దిగివచ్చినది కరండిత మహస్సు
తొలి విరించి వినిర్మిత లసత్కిరీటాది
మహితానుభావుఁడో మనువు తోఁచె
తొలిజీవులు సనాతనులు విభీషణముఖ్యు
లతితరధ్యేయగూపాది యయ్యె
నయన మార్గాంత దృశ్యాసితసౌదామ
నీమయహ్రాదమధ్యనీరజంబు

పరమ మాణిక్య కేయూరవంతుఁ డగుచు
మకరకుండల మణిమయమకుటుఁ డగుచు
లలితవక్షస్థ్సలీ వినీలమణి యగుచు
శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁ డయ్యె. 400

సీ. పుడమియనుఁగుకన్య తొడమీఁదఁ గూర్చుండఁ
గరమునఁ గ్రొందమ్మివిరి గ్రహించి
తమ్ములు నల్వు రిద్దరి నద్దరిన్ గొల్వ
వెండికజ్జలును సీవికులు పూని

ముకుళితహస్తపద్ముండు కూర్చుండఁగా
నంజనీసూతి పాదాంతికమునఁ

బంచాయతన ముండి ప్రభు వంజనీసూతి
తనలోన సంలీనతను భజింప

శ్రీ వశిష్ఠాదు లెల్ల విచ్చిన విలోచ
నములఁ బరిచితధ్యానసంతతి వహించి
నలినహితునాటి సింహాసనంబునందు
శ్రీరఘుస్వామి పట్టాభిషిక్తుఁడయ్యె. 401

వ. అంత జానకీదేవి కెలనఁ గూర్చుండ లక్ష్మణ భరత శత్రుఘ్నులు సముచితాసనంబుల నుండ శ్రీరామచంద్రుండు జాంబవత్సుగ్రీవాంగద విభీషణ నల నీల మైంద ద్వివిద సుషేణ దధిముఖాదుల కెల్లరకుఁ గనకాంబరమ్ములు మణిభూషణంబులు ముక్తాహారంబులాది నాతృప్తి నొసంగి రాజ్యంబు నందలి వృద్ధులకు నధికారులకుఁ బ్రకృతులకు ననేక బహుమానంబు లిచ్చి వేదపఠన వీణాగాన నాట్యములచేత సంతోషించి. 402

చ. కనిన మరుత్తనూజునకు కానుక లీయనె లేదటన్న ల
క్ష్మణునకు నీయ లేదనిన స్వామికిఁ దమ్ముఁ డతం డటన్న నీ
యనయును దమ్ముఁడే యనిన యట్టుల స్వామియుఁ జూచు నన్నఁ ద
మ్మునివలె నేల, తానువలెఁ బొల్పును జూచు నటన్న మాటలై.

క. తనర సభ పూర్తి యైనను
జనములు కదలరు మఱింత జానకి సితలో
చన శితయోజన నుతిభా
జన మారుతివంకఁ గంచు స్వామిం గంచున్. 404

క. తన మెడలోపలి హారం
బును గొని మారుతిఁ గాంచె రాముమూర్తిం గాంచెన్
వనజనయను నయనవనజ
మినకరసంస్పర్శఁ బోలె నెసకము గాంచెన్. 405

సీ. జనకభూమిపతి దశరథభూమిపతియుఁ
గలసి చేయించిన కనకమయము
మువ్వురు రాణులు మూఁడు మూళ్లుగ గూళ్లు
మలయించి చేసిన మణిమయమ్ము
చెల్లెండ్రు మువ్వురు జిగినీల రాళ్ళిచ్చి
నెఱి మధ్యఁ బొదుగు మాణిక్యమయము.
రాముండు కొక్కెముల్ రా జాలరుగ వ్రేల
కోమలింపించు ముక్తామయంబు

అసుర కొనిపోయి నప్పుడునైన గళము
నందు నెడపని ప్రేమమయంబు హార
మాంజనేయుని కంఠము నందు నుంచె
జానకీదేవి పరమవాత్సల్యమూర్తి. 406

వ. అంత సభయంతయు జయజయ మరుత్తనూజ జయజయ విదేహరాజతనూజ జయజయ దశరథరాట్తనూజ యంచు నఱచుచు సభనుండి లేచి నిష్క్రమించిన జనులకు నాంజనేయుఁ డన్నచోఁ గల గౌరవాభిమానములకు సీతా రామ లక్ష్మణు లెంతయో సంతసించిరి. తరువాత నెల తిరుగక మున్న సీత గంగా యమునా న్యగ్రోధమ్ముల మ్రొక్కులు సెల్లించె. నెలనాళ్ళు మహోత్సవంబులు జరిగె, నంత శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునకు యావరాజ్యమిత్తు నన నతఁ డంగీకరింపమి భరతుని యువరాజుం జేసి శత్రుఘ్నుని సర్వసేనాపతిఁ జేసె. మఱియు సుగ్రీవవిభీషణులకును జాంబవదంగదాది సర్వసేనాపతులకుఁ గానుక లిచ్చి నూత్నాంబరము

లిచ్చి కోరిన వన్నియు నిచ్చి వేరిని వారి యిండ్లకుం బంపె, నంత సీతారాముల జీవిత మను సంవత్సరకాలంబున శరత్కాలంబు ప్రాపించి. 407

సీ. జనములయొక్క రతిసాధువు లెడంద
లందు లేయెండలు కందళింప
సీతామహాదేవి చేతోవియద్వీథి
నమృతమధుజ్యోత్స్న లందగింప
ధర్మాభిరతులైన ధారుణీప్రజలందు
ననఘసస్యంబులు నవఘళింప
నన్యోన్యగౌరవాభ్యర్చనారూపమై
ధగ సన్నగాలులు తుఱగలింప

నౌరయు నాపద లను నొండు విరిగిపోయి
సారమతిప లూహావాహినుల్ తేరుకొనఁగ
మొగి శరద్వేళ శాశ్వతమ్ముగను నిల్చె
రామచంద్ర మహాస్వామి రాజ్యమందు. 408

ఉ. ఈగతి రామచంద్రుఁడు మహీతలముం బదివేలయేండ్లు ల
ద్ధాగతి నేలుచుండఁగను ధారుణియందున రామరాజ్య మం
చాగతి సర్వకాలమున యందుఁ బ్రశస్తి సముద్భవించెఁ గా
లాగురుధూమరేఖ సితమై దెసలందున వ్యాప్తి గన్నటుల్. 409

ఉ. ధాత్రిజనుల్ ధరాపతిని దైవముగాఁ గనుచుండ్రు రిక్థచా
రిత్రు లయోధ్యలోఁ బ్రజలు శ్రీపతి రాముని బ్రహ్మవస్తువున్
ధాత్రిపతిం బురాత్తసుకృతంబునఁ బొంది సధర్ములై యిహా
ముత్రఫలంబులం గనిరి పున్నముగానివథం బెఱుంగకన్. 410

వ. ఇట్లు విశ్వనాథవంశ్యుండు శ్రీపార్వతీశోభనాద్రిగర్భంబు సత్య నారాయణనామధేయుండు జగదనిత్యత్వభావనానిరతుండు విరం

తరద్దైవచింతనాపరుండు, శ్రీరామాయణకల్పవృక్ష మను నిమ్మహా
కావ్యంబు యుద్ధకాండంబు పూర్తిచేసి. 411

శా. సద్యోనిర్గత మైన సర్వకవితాసంభారమున్ నీకు నై
వేద్యం బిచ్చితి రామచంద్ర! ప్రభువా! విశ్వాసముం బూనవే,
యాద్యంబై చను జీవలక్షణము సంహారంబు గావింపవే
హృద్యంబై చను నీదుతేజము ను సారింపంగదే గుండియన్. 412

వ. ఇది శివాంకితం బని తెలిసి తమపే గ్రంథమున నుండవలయునని
తనతండ్రి దీనికి శ్రోతగా రచియించి పెట్టు మని శ్రీచిఱుమామిళ్ళ
శివరామకృష్ణప్రసాదుచే నడిగించిన ముక్త్యాలరాజు శ్రీరాజారామ
గోపాలకృష్ణమహేశ్వరప్రసాదు తండ్రి. 413

శా. తానే యెన్నియొ చంద్రమౌళిపతి సత్కార్యంబులం జేసెఁ బ్ర
జ్ఞానీరేజభవుండు యోగివలె దీక్షంబూనె వాక్సంయముం
డై నిత్యంబును దైవచింతనపరుండై యీ కృతిశ్రోతృతా
ధీనిత్యుం డగు నా ధరాపతికి సంధింపంగదే శ్రేయమున్. 414

క. తన చేసిన సత్కృతులం
దున నెగడిన పున్నెమునకుఁ దో డీకావ్యం
బును విన్న పున్నెముగ నే
చిన కృపఁ బొందింపు మతని శివలోకంబుల్. 415

క. వాని కులంబును సుగుణా
స్థానంబుగఁ జేయవే వృథాహంకార
స్థానముగఁ జేయకే శివ!
నానాదైవంబుబున్ మన స్సాదునటుల్. 416

. నీలగళా! రఘూత్తముఁడు నీవును నిద్దఱు కానియట్లుగా
నోలి భజించితిన్ మఱియు నున్న దినంబులు నటు చేసెదన్

ప్రాలెడుమేను దాఁక నభవా! బ్రదుకైన వికారభావనా
జాలము తప్పకున్నఁ దుదిజన్మగఁ జేయుము దీని ధూర్జటీ! 417

గీ. లేని కోపంబు వీరికై పూనుచుండి
లేని కామమ్ము వీరికై పూనుచుండి
కృతక మయ్యెన యీబ్రదుకెల్ల వల్ల
రీమనోజ్ఞజటాశశిభృచ్ఛలాటు! 418

చ. కల వొక కొన్ని వేళలు నికామభవత్పదచింతనానలో
జ్జ్వలితశిఖాసనాథములు స్వామి! ననున్ మృతిఁబొంద నీవె యు
జ్జ్వల మగు తన్నిమేషమున జన్మ యికొక్కఁడు లేకయుండ వి
హ్వాల కరణాభిశప్త మయినట్టి జనుస్సులు చాలు ధూర్జటీ! 419

పృథ్వి

నిరుద్ధ జగదర్ణవోన్మథన నిర్గతోగ్రానల
ప్రరూఢ పరితశ్శిఖావలయ బద్ధకంఠస్థలీ!
సరోజశరదుష్క్రియా దమనజాత రోషోజ్జ్వల
న్నిరూఢ పరితశ్శిఖావలయనేత్ర ఫాలస్థలీ! 420

మంగళమహాశ్రీ

చిత్తజతనూభసిత శేఖరిత రేణుపరి
శీర్ణ నిచయ స్నపితభావా!
మత్తగజదైత్యగళమంథరనవాసృగతి
మంజులతనూకలితచేలా!
వృత్తదళముక్తితరు విస్ఫుటితభక్తిఫల
విద్యుతిత మోదరసరూపా!
ప్రాప్తనిజధర్మచయరక్తజనతాకృతిప
రంపరిత మంగళమహాశ్రీ. 421